అలాగే నాల్గవ అధ్యాయానికి జ్ఞానయోగ మని, అవతార యోగమని, కర్మబ్రహ్మార్పణ యోగమని - ఇలా ఎన్నో యోగ నామాలు ఇవ్వబడ్డాయి. వీటిని చూచి నపుడు వీటికి నామకరణం అనేక మంది చేసి ఉంటారు అనిపిస్తుంది. కాదు, చేశారనే వాస్తవం తెలుస్తుంది.

**అసలు సంగతి**

'సఙ్గతి' అనే అర్థమే ఇక్కడ యోగ శబ్దార్థము. ఏ అధ్యాయాన్ని ఏ పేరుతో పిలిచినా నష్టం లేదు కాని యోగ శబ్దార్థమును సంగతిగా నిర్ణయించాలి. ఇదే అసలు సంగతి. సంగతి అంటే ఇక్కడ సంబంధము. సంబంధము అంటే విషయ సంబంధము; లేక విషయంతో సంబంధము.

ఆరవ అధ్యాయాన్ని ధ్యానయోగము అన్నా రనుకోండి. దాని అర్థ మేమిటి? ఆరవ అధ్యాయంలో ధ్యానమే విషయము అని అర్థము. అదే సంగతి. అంతే గాని ధ్యానాభ్యాసమునకు సంబంధించినది అని కాదు. అలా చూచి నపుడు, కర్మయోగము అంటే కర్మకు సంబంధించిన విషయం, భక్తి యోగము అంటే భక్తికి సంబంధించిన విషయం. అంతేగాని, భక్తి ఒక యోగమని, ధ్యానం ఒక యోగమని, విభూతి ఒక యోగమని, అనేక యోగాలను సృష్టించి, అవన్నీ అభ్యాస యుక్తము లని అర్థం చెప్పకూడదు. అలా చెబితే, ఏమవుతుంది? ఏమవుతుందా! గీత పద్దెనిమిది యోగాలను బోధించినట్లు అవుతుంది *( వాస్తవానికి గీత బోధించింది రెండు యోగాలే ).* ఆ పద్దెనిమిది యోగాలను మనం అభ్యసించాలి అనే భాష్యాలు కూడా వినిపిస్తాయి. వినడానికి బాగానే ఉంటాయి. ఆచరణ వద్దకు వచ్చినపుడే గొంతులో వెలగపండు పడేది.

ఉదాహరణకి అర్జున విషాద యోగం అనే ఈ మొదటి అధ్యాయాన్ని ఎలా అర్థం చేసుకోవాలి? యోగ శబ్దాన్ని యోగ విశేషంగా గ్రహిస్తే, ధ్యానయోగ మంటే ధ్యానాభ్యాస మని, విషాదయోగ మంటే, విషాదాభ్యాసము అని అర్థం వస్తుంది. విషాదాన్ని అభ్యసించేది ఎలా? అంటే, విషాదానికి మనం ప్రయత్నించాలా? లేని విషాదాన్ని కొని తెచ్చుకోవాలా? అలాగే చెబుతున్నారు చాలా మంది. ఏడుపు లేనిదే వేడుక లేదని ప్రాసలు వేసి మరీ యతు లవుతున్నారు.

అర్జున విషాద యోగము అంటే అర్జున విషాదము అనే విషయమును వర్ణించుట అని భావము. అంతే. అంతకు మించి తీగ లాగ నవసరం లేదు. అన్ని అధ్యాయాలను కూడా ఇలాగే అర్థం చేసుకోవాలి.

**అధ్యాయము**

*అధ్యాయః* అంటే, అధ్యయనము, పాఠము, వేదాధ్యయనము, గ్రంథ భాగము అనే అర్థాలు ఉన్నాయి. ప్రథమోఽధ్యాయః అంటే ప్రథమ పాఠము అని గ్రహించ వచ్చు. గ్రంథములో ప్రథమ భాగము అని అర్థం చేసుకోవచ్చు.

అధ్యాయము అంటే, చదవడం అని, చదవ బడేది అని కూడా స్థూలంగా చెబుతారు. అంటే, ఒక అధ్యాయం తరువాత మరొక అధ్యాయాన్ని వరుసక్రమం లోనే చదవాలి అని కూడా తెలుస్తోంది. భగవద్గీతను అక్కడక్కడ, అలా అలా చదివే వారికి అంతంతే తెలుస్తూ ఉంటుంది. కొంత కొంతే అర్థ మవుతూ ఉంటుంది. గీతా శాస్త్రము పూర్ణ శాస్త్రము. కనుక గీతను పూర్ణం గానే అధ్యయనం చేయాలి. పద్దెనిమిది అధ్యాయాలను పూర్ణంగా అధ్యయనం చేసి నపుడే గీతాహృదయం సుస్పష్ట మౌతుంది. అధ్యయన ఫలం సిద్ధిస్తుంది.

ఓం



# చైతన్య భగవద్గీత

## అథ ద్వితీయోఽధ్యాయః - రెండవ అధ్యాయము

## సాంఖ్యయోగః - సాంఖ్యయోగము

**ఇదేమిటి?**

మనకు ఎన్నో అర్థమవుతూ ఉంటాయి. ఎన్నిటినో మనం అర్థం చేసుకొంటూ ఉంటాము. అయితే, వాటన్నిటి వెనుక ఉండేది జ్ఞానమే అని చెప్పలేము. అంత తెలిసిన వాడు ఇలా అయ్యా డేమిటి? అని కొన్ని సందర్భాలలో కొందరి విషయంలో మనమే వ్యాఖ్యానిస్తూ ఉంటాము. అదేదో అనూహ్యమైన పరిణామం అని భావించి అలా వ్యాఖ్యానిస్తామే గాని, అది వాస్తవాన్ని అర్థం చేసుకోలేని మన బుద్ధి లోపమే అని గ్రహించము.

ఇది నాకు ఇష్టము, అది అయిష్టము. ఇత నంటే నాకు ఇష్టము, అత నంటే అయిష్టము. ఇష్టాలైతే మనకు ఉన్నాయి. అవి ఎందుకు ఇష్టమో మనకు స్పష్టంగా తెలియదు. అలాగే, మనకు అయిష్టాలు కూడా చాలా ఉన్నాయి. అవి ఎందుకు అలా అయిష్టంగా మారాయో సహేతుకంగా మనం వివరించ లేము. అంతే కాదు. నేడు అయిష్టంగా ఉన్నవి నిన్న ఎందుకు ఇష్ట మయ్యాయో తెలియదు. నేడు ఇష్ట మైనవి రేపు ఎందుకు అయిష్టంగా మారుతాయో కూడా అర్థం కాదు.

ఇవన్నీ మన మనస్సులలో ఏర్పడిన తాత్కాలికమైన నిర్ణయాలు. ఈ నిర్ణయాల వెనుక ఎవరో లేరు. మన భావాలే ఉన్నాయి. మన అభిప్రాయాలే ఉన్నాయి. రాగాలే ఉన్నాయి. ద్వేషాలే ఉన్నాయి. కాని, విశాలమైన ఈ ప్రపంచం మన అభిప్రాయాలకు, మన భావాలకు అనుగుణంగా నడవదు. ధర్మచోదిత మైన ఈ విశ్వము మన రాగద్వేష సంగీతానికి అనువుగా గజ్జె కట్టి నాట్యం చెయ్యదు.

**ఆంతర్యాలు - అలజడులు**

మనకు తెలియకుండా మనలో ఏవేవో సమస్యలు ఉంటాయి. మనకు అర్థం కాకుండా మనలో ఎన్నో సంఘర్షణలు అవ్యక్తంగా ఉంటాయి. అదొక పూడిక తెలియని అగాధం. ఆ పూడికను మనం తీయలేము. అక్కడికి మనం ప్రయత్నించినా వెళ్ళలేము. అంత లోతుగా మనలో మనమే ఎలా త్రవ్వకున్నామో, ఎంత బయట పడేసినా అర్థం కాదు. అవన్నీ అగాధాలు. అగోచరాలు. ఉన్నట్లు తెలియకుండా ఉంటాయి. లేనట్లే ఉంటాయి.

ఆంతర్యం ఎవరి దైనా ఇలాగే ఉంటుంది. విశ్లేషించినా అంతు చిక్కదు. విస్మరించినా దూరం కాదు. ఆంతర్యంలో సమస్య లన్నీ అవ్యక్తం గానే ఉంటాయి. అలా ఉండి మనలో భయాలను కదలిస్తూ ఉంటాయి. బాధల్ని సృష్టిస్తూ ఉంటాయి. మన ఆంతర్యం మనదే. మన తోనే ఉంటుంది. మన తోనే కలసి పుట్టింది. మనల్ని నేడున్న పరిస్థితికి తెచ్చింది అదే.

ఎంత తెలిసినా మనిషి సంతోషంగా ఉండలేక పోతున్నాడు అంటే, ఆ తెలిసింది ఏదో, అది అతడు సుఖపడటానికి సరిపోవడం లేదు అని అర్థము. అదంతా కూడా జ్ఞానమే. కాని, సమ్యక్ జ్ఞానం కాదు. పూర్ణజ్ఞానం కాదు. పూర్ణ జ్ఞానమే అయితే, మనిషికి ఆనందం దూరం కాకూడదు.

జీవితం లోని వాస్తవాలకు, మనం వాటిని అర్థం చేసుకొనే విధానానికి మధ్య ఏదో అంతరం ఉంది.

అంతు చిక్కని అగాధం ఉంది. ఇలాంటి చోటే మనస్సులో ఘర్షణ ఏర్పడుతుంది. అవగాహన స్పష్టంగా లేనపుడే మనిషిలో సంఘర్షణ ప్రారంభ మవుతుంది.

**మనిషి - మనసు**

మంచో, చెడో, ఏ పనైనా మనిషే చేయాలి. ఏ పని చేయాలి, ఏది చేయకూడదు అనేది కూడా మనిషే నిర్ణయించు కోవాలి. ఈ నిర్ణయాలు మనసు లోనే జరగాలి. అలా నిర్ణయాలు జరగడానికి ఆలవాలమైన మనస్సు, ఆలోచనలకు నిలయమైన మనస్సు ప్రశాంతంగా ఉండాలి. అలజడి లేకుండా ఉండాలి. ఘర్షణలు తలెత్తకుండా ఉండాలి.

ఘర్షణ పడే చిత్తము వివేకంతో చిగురించదు. వివేకం లోపించడం వల్లే ఘర్షణ మొదలవుతుంది. ఆంతర్యంలో ఘర్షణలు విజృంభించి నపుడు అవ్యక్తంగా ఉన్న వన్నీ బుసలు కొడుతూ పైకి లేస్తాయి. అగాధంలో కూరుకు పోయిన సమస్య లన్నీ ఉపరితలం చేరుతాయి. అవ్యక్తంగా నిద్రపోతున్న భయాలు, సమస్యలు మేలుకుంటాయి. బ్రతుకులో బాధలకు, దుఃఖాలకు తెర తీస్తాయి. క్షణాల్లో పరిస్థితుల్ని తారుమారు చేస్తాయి. నిముషాల్లో తుఫానును సృష్టిస్తాయి.

**సమరంలో సవ్యసాచి**

అర్జునుడు యుద్ధభూమిలో ఉన్నాడు. కురుక్షేత్రంలో ఉన్నాడు. నేడు అతడు కదన రంగంలో ఉండటానికి వెనుక ఎంతో కథ నడచింది. అన్నీ వింతలే. విచిత్రాలే. వికృతాలే. విడ్డూరాలే. వినాశానికి దారి తీసే విషయాలే.

యుద్ధం ఉన్నపళంగా వచ్చింది కాదు. క్షణంలో ఊడి పడింది కాదు. పిడుగుపాటే అయినా పిడుగులా పడింది మాత్రం కాదు. నేడు ఆశనిపాతము అనిపించినా, ఏనాడూ శకుని పాత్ర లేకుండా సాగింది కాదు.

బాల్యం నుండి మాత్సర్యాలే. ఈర్ష్యలే. అసూయా పాచికలే. విషాన్ని జీర్ణించుకోవలసి వచ్చింది. మంటల నుండి బయటపడవలసి వచ్చింది. నీళ్ళల్లో తల దాచుకో వలసి వచ్చింది. నిండు సభలో మహిళ మానమే ప్రశ్నార్థకంగా మారి నపుడు తలలు దించుకో వలసి వచ్చింది.

కందమూలాలు తిని కాలాన్ని నెట్టుకొంటూ వచ్చారు. వనంలో వాసము - రణం తోనే నివాసము. మృగాలతో పోరాటము - మృగాల వంటి మనుష్యుల మధ్య ఆరాటము, విరాటుని కొలువులో అజ్ఞాతము - అజ్ఞాతంలో అతివకు అవమానము, ఎన్ని బాధలు? అన్నీ బాధలే. అన్నీ వ్రణాలే. అన్నీ రణాలే. చివరికి ఏదీ కుదరక, ఎద బాధతో మహారణం. కురుక్షేత్ర కదన రంగంలో ధర్మసంగ్రామం.

**సన్నాహాలు - సాయుధాలు**

అర్జునుడు దశాబ్దాలు నిరీక్షించింది ఈ సంగ్రామం కొరకే. కఠోర తపస్సులతో సురుల హృదయాలను దోచుకొని, అద్భుత శస్త్రాస్త్రాలను సమకూర్చు కున్నది ఈ సమరం కొరకే. పశుపతితో పోరాడి పాశుపతాస్త్రాన్ని పార్థుడు సాధించింది ఈ పోరాటం కొరకే.

మనిషి ధనాన్ని సంపాదించు కొనేది అవసరాలు తీర్చుకోవ డానికి, అనుభవించడానికి. వీరుడు ఆయుధాలను సమకూర్చు కొనేది సమర రంగంలో ప్రయోగించడానికి. అవసరాలకు ఉపయోగపడని ధనం ఉండి ఏమి ప్రయోజనం? అవసర సమయంలో సమరంలో సంధించుటకు ఉపకరించని ఆయుధాలు ఉండి ఏమి ఉపయోగం?

క్షత్రియుడు ధర్మం కోసం యుద్ధం చెయ్యాలి. తనది ధర్మం. అధర్మపరుడైన దుర్యోధనుని సంహరించి,





ప్రజా క్షేమాన్ని రక్షించ వలసిన ధర్మం ధనంజయునికి ఉంది. అది పాండవుల కర్తవ్యం. ఆ కర్తవ్యాన్ని నెరవేర్చే సమయం కొరకే ఇంత వరకు పాండవులు నిరీక్షించారు. సమయం ఆసన్న మైంది. సమరం ఆరంభం కాబోతోంది. రథాన్ని ఉభయసేనల మధ్య ఉంచమన్నాడు పార్థుడు. అలాగే ఉంచాడు పార్థసారథి.

**అవ్యక్తాలు వ్యక్త మయ్యాయి**

యుద్ధరంగంలో ఇరుపక్షాల లోని యోధుల్ని పరిశీలించి చూశాడు పార్థుడు. పరీక్షించి మరీ చూశాడు. పరితాపంతో చలించి పోయాడు. విషణ్ణు డయ్యాడు. దేహం విశీర్ణ మైంది. మనసు విచలిత మైంది.

అంతా అయిపోయింది. ఏం మిగిలింది? దుఃఖమే మిగిలింది. తనపై తనకు పట్టు లేకుండా పోయింది. మనస్సును నియంత్రించే స్థితిలో లేడు. దేహం కూడా నీరసించి పోయింది. ధనుర్బాణాలు పడేశాడు. ఉత్సాహాన్ని పడేశాడు. ఆసక్తిని దూరం చేసుకున్నాడు. అర్థం గాక ధర్మాన్నే పడేశాడు.

ఇదంతా విజయాన్ని సాధించలే మేమో అనే భయంతో కాదు. శత్రు సైన్యాన్ని చూచి భీతి చెంది అసలే కాదు. అంటే, ఏ భయమూ లేదని కాదు. యుద్ధ భయము లేదు అంటున్నాను. అంతే.

అంటే, మరేదో భయం ఉందనే కదా? అవును. ఉంది. అది మరేదో భయం కాదు. మహాభయం. అర్జునుని ఆంతర్యంలో అర్థం కాకుండా, అవ్యక్తంగా ఉండి, సమర రంగంలో ఒక్కసారిగా బహిర్గతమై, అర్జును డంతటి వీరుణ్ణి భీరుడుగా మార్చేసిన మహాభయం. మమకారం సృష్టించిన మారణహోమం.

చరణము : **సమర నదిలో మమకార జలము**
**ఎవరి నైనా ముంచుట తథ్యము**
**ఎంత ఈదినా తెలియదు తీరము**
**ముందు వెనుక గాఢాంధకారము**

పల్లవి : **సంసారమె సంగ్రామము**
**తెగిన ప్రేగు అనుబంధము**
**జీవుల ఆరాటము**
**జీవన పోరాటము ॥ సంసారమె ॥**

ఇది చైతన్య గీతం. గీతలో ప్రతిబింబిస్తున్న అర్జునుని మమకారానికి ఊతం.

మమకారం సృష్టించిన మహాభయంతో అర్జునుడు చలించి పోయాడు. ఎవరు లేకపోతే తాను సుఖంగా జీవించలేడో, ఎవరిని విడిచి తాను బ్రతకలేడో, వాళ్ళనే లేకుండా, శాశ్వతంగా లేకుండా చేయవలసి వస్తోంది అనే భయం. విజయ పతాకాన్ని రెపరెప లాడించాలంటే, తన వాళ్ళను పిట్టల్ని రాల్చినట్లు రాల్చేయాలి. ధనుర్బాణాలను చేత బట్టి దారుణంగా కూల్చేయాలి. అదంతా తలచుకొంటూ ఉంటే అర్జునుడి గుండె ముక్కలై పోతోంది. అందుకే ధనుర్బాణాలు పడేశాడు. రథంలో క్రింది వైపున కూర్చుండి పోయాడు ( **రథోపస్థే ఉపావిశత్** ).

**అర్జునుడు - అందరికీ ప్రతినిధి**

సవ్యసాచికి సమరం సమస్యగా మారింది. మహా పరాక్రమవంతు డైన పాండవ మధ్యముని మూర్తిమత్వాన్నే మార్చేసింది. ఇతడు అర్జునుడేనా? అనే సంశయం అందరికీ కలుగుతోంది. పూర్వం ఉన్న పార్థుడేనా? అనే సందేహం కలుగుతూ ఉంది. మార్పు అలాగే ఉంటుంది. క్షణాల్లో అన్నీ తారుమా రవుతాయి.

సమస్య అర్జునునిది అని మనకు అనిపిస్తోంది. వాస్తవానికి ఇది అందరి సమస్య. అన్ని దేశాలకు సంబంధించిన సమస్య. అన్ని కాలాలకు సంబంధించిన సమస్య. అందరు వ్యక్తులకు సంబంధించిన సమస్య.

అర్జునునిలో అవ్యక్తంగా, అగాధంగా ఉన్న భయాలే మమకార రూపంలో బహిర్గతమై, సమర రంగంలో సమస్యని సృష్టించాయి. అవి మన లోనూ ఉన్నాయి. కాకపోతే, అర్జునుని ఆంతర్యం లోని అవ్యక్తాలు బాహ్యం లోకి తొంగి చూశాయి. మనలో అవ్యక్తాలు ఇంకా నిద్ర పోతున్నాయి. అంతే తేడా.

ఎవరు ఎప్పుడు నిద్ర లేస్తారో ఎవరికి తెలుసు? అవ్యక్తాలు కూడా అంతే. అర్జునునికి మమకార రూపంలో నిద్ర లేచాయి. మరొకరికి మరో విధంగా బహిర్గతం కావచ్చు. ఇంటిలో చేరిన పాము ఎప్పుడైనా ప్రమాదమే. ఏ ఇంటిలో అయినా ప్రమాదమే. ఒంటిలో చేరిన మహాభయం, ఉల్లమును గుల్ల చేసే మహాభయం ఎప్పుడైనా ప్రమాదమే. ఎవరి కైనా ప్రమాదమే.

కనుక అర్జునుడు అందరికీ ప్రతినిధి. సర్వ మానవాళికి ప్రతినిధి. అర్జునుని బాధలో అందరి బాధలూ ఉన్నాయి. అర్జునుని శోకంలో అందరి శోకాలూ ఉన్నాయి. అర్జునుని సమస్య అందరి సమస్యగా ఉంది. అందుకనే, అర్జునుని ఆధారం చేసుకొని, నరుని నిమిత్తం చేసుకొని (*అర్జున నిమిత్తీ కృత్య*), నరజాతి కంతా జీవిత పరిష్కారాన్ని అందిస్తున్నాడు శ్రీకృష్ణ పరమాత్మ.

**సంజయ ఉవాచ :**

తం తథా కృప యాఽఽ విష్ట మశ్రుపూర్ణాకులేక్షణమ్ ।
విషీదన్త మిదం వాక్య మువాచ మధుసూదనః ॥ 1

***తం-తథా-కృపయా-ఆవిష్టం-అశ్రుపూర్ణాకులేక్షణం***
***విషీదంతం-ఇదం-వాక్యం-ఉవాచ-మధుసూదనః***

| | | | |
|---|---|---|---|
| తథా | = ఆ విధముగా | తం | = ఆ అర్జునుని |
| కృపయా | = కరుణచే | మధుసూదనః | = శ్రీకృష్ణుడు |
| ఆవిష్టం | = నిండియున్న వాడు | ఇదం | = ఈ |
| అశ్రుపూర్ణాకులేక్షణం | = కన్నీరు నిండిన వ్యాకులమైన నేత్రములు గలవాడు | వాక్యం | = వచనమును |
| విషీదంతం | = శోకిస్తున్న వాడు | ఉవాచ | = పలికాడు |

**సంజయుడు చెబుతున్నాడు :**

**మహారాజా! ఆ విధంగా అర్జునుడు కరుణార్ద్ర హృదయు డయ్యాడు. కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. చూపులు కలత చెందాయి. దుఃఖిస్తున్న అర్జునుని చూచి మధుసూదనుడు నోరు విప్పాడు.**

**వ్యాఖ్య**

**అధ్యాయ విభాగము**

అర్జునుని విషాదం తోనే మొదటి అధ్యాయము పూర్తి అయింది. వాస్తవానికి రెండవ అధ్యాయం మొదటి పది శ్లోకాల వరకు అర్జునుని విషాదమే కొనసాగు తుంది. ఉభయసేనల మధ్య దుఃఖిస్తున్న (*ఉభయోః సేనయోః మధ్యే విషీదంతం*) అర్జునునితో శ్రీకృష్ణుడు మాట్లాడు తున్నాడు అని సంజయుడు చెబుతాడు. పదకొండవ శ్లోకం నుండి పరమేశ్వరుడు పరమ పవిత్రమైన గీతాశాస్త్రాన్ని వినిపిస్తాడు.





మొదటి అధ్యాయము సంజయుని శ్లోకంతో సమాప్త మవుతుంది. రెండవ అధ్యాయము మళ్ళీ సంజయుని శ్లోకం తోనే ప్రారంభ మవుతుంది. ఈ రెండు శ్లోకాల లోనూ అర్జునుని విషాదాన్నే వర్ణించాడు సంజయుడు.

వక్తలో మార్పు లేదు. విషయంలో మార్పు లేదు. అలాంటప్పుడు సంజయుడు పలికిన రెండు శ్లోకాలను వేరు చేసి అధ్యాయాలను విభజించడానికి కారణ మేమిటి? సాంఖ్య యోగాన్ని 'సంజయ ఉవాచ' అని కాకుండా 'శ్రీ భగవానువాచ' తో ప్రారంభించి ఉంటే సరిపోయేది కదా! అర్జున విషాద యోగాన్ని నలభై ఏడు కాకుండా నలభై ఎనిమిది శ్లోకాలతో నింపి, 'సంజయ ఉవాచ' తో ముగించి ఉంటే బాగుండేది కదా అని కొందరికి అనిపిస్తూ ఉంటుంది.

అలా కాకుండా, అర్జునుని విషాద మంతా ప్రథమ అధ్యాయం లోనే ఉండాలి అని అభిప్రాయపడి, సాంఖ్య యోగము లోని మొదటి పది శ్లోకాలను కూడా అర్జున విషాద యోగం లోనే చేర్చి, ***అశోచ్యా నన్వశోచస్త్వం*** అనే భగవానుని శ్లోకంతో రెండవ అధ్యాయాన్ని ప్రారంభించి ఉంటే బాగుండేది అని మరి కొందరు భావిస్తూ ఉంటారు.

ఏది ఎక్కడ మొదలెట్టాలి, ఎక్కడ ముగించాలి అనే విషయంలో వేదము యొక్క ఆద్యంతాలు తెలిసిన వేదవ్యాసునికి మనం సలహాలివ్వ నవసరం లేదు. అద్భుతమైన వ్యాస భగవానుని అమోఘ సంకల్పాలను అర్థం చేసుకో గలిగితే చాలు.

**గుణత్రయ ప్రభావము**

సత్త్వరజ స్తమోగుణాలు అనే త్రిగుణాలు ప్రకృతి సంభవాలు. ప్రకృతిలో ఈ మూడు గుణాలు సమంగా ఉంటాయి. కాని, వ్యక్తిలో అవే విషమంగా ఉంటాయి. గుణ ప్రభావంతో వ్యక్తులు విభిన్నంగా ప్రవర్తిస్తూ ఉంటారు.

తమోగుణములో అజ్ఞానమే ప్రధానంగా ఉంటుంది. ఉద్యమ స్థితి పూర్ణంగా ఆగి పోతుంది. ఉద్యోగ సద్యోగాలను విరమించి మనస్సు నిరుద్యోగంలో పడుతుంది. నిర్వేదంలో ఉంటుంది. నిరాశతో ఉంటుంది.

రజోగుణము రాగాత్మకంగా ఉంటుంది. రంజన స్వభావంతో ఉంటుంది. తమోగుణం లాగా పడి ఉండటానికి అంగీకరించదు. మూల పడినా బయటికి ఈడ్చి, దృశ్య విషయాలతో మనస్సును సంగమింప చేస్తుంది. క్రియాశీలంగా ఉంటుంది. రాగద్వేషాలే రజోగుణంలో ప్రధాన పాత్రను పోషిస్తూ ఉంటాయి.

సత్త్వగుణము ప్రసన్నంగా ఉంటుంది. విశుద్ధంగా ఉంటుంది. వినిర్మలంగా ఉంటుంది కనుక దర్పణము వస్తువును ప్రతిబింబించి నట్లు సత్త్వగుణము చైతన్యాన్ని ప్రతిఫలింప చేస్తుంది. సత్త్వగుణ ప్రధానులైన వారే ఆత్మజ్ఞానాన్ని శ్రవణం చేయడానికి అర్హులు.

ధనుర్బాణాలను పడేసి, క్రియాశూన్యుడై, ఎప్పుడైతే రథోపస్థ ప్రదేశంలో అర్జునుడు కూర్చుండి పోయాడో, అప్పటికి అతని తమోగుణం చరమ స్థాయికి చేరింది. ఈ విషయాన్ని నిర్ధారణ చేయడానికే సంజయుని రెండు శ్లోకాలను వేరు చేసి, అధ్యాయ విభజనకు సంకల్పించాడు వేదవ్యాసుడు.

రెండవ అధ్యాయం రెండు, మూడు శ్లోకాలలో అర్జునుని మందలిస్తాడు మధుసూదనుడు. నిర్దాక్షిణ్యంగా ఛీకొట్టి తమోగుణ చీకటి నుండి లాగి బయట పడేస్తాడు. అక్కడి నుండి అర్జునుని రాగాత్మక ప్రవృత్తిని చూస్తాము. మమకార వృత్తిని చూస్తాం. రజోగుణ విన్యాసాన్ని చూస్తాం.

రజోగుణ రాగాలాపన చేస్తూ, చేస్తూ అర్జునుని అంతఃకరణము సత్త్వగుణాన్ని అభివ్యంజనం చేస్తుంది.

ఈ స్థితి లోనే అర్జునుడు ధర్మ సమ్మూఢ చేతస్కుడ నయ్యాను అని అంగీకరిస్తాడు. ఏది శ్రేయస్సో నిర్ణయించి చెప్పమంటాడు. అంతటితో ఆగ లేదు. శిష్యరికం ప్రదర్శించాడు. శాసించ మని ప్రార్థించాడు. సత్త్వగుణ ప్రధాను డయ్యాడు. ఆత్మబోధను ఆలకించ డానికి అర్హుడయ్యాడు. అధికారి అయ్యాడు. అది జరిగిన తరువాతే గీతా శాస్త్రాన్ని ప్రారంభించాడు అచ్యుతుడు.

తమోగుణం చరమ స్థాయికి చేరగానే, చేష్ట లుడిగిన అర్జునుని చూపుతూ మొదటి అధ్యాయం సమాప్త మవుతుంది. రెండవ అధ్యాయం ప్రారంభం లోనే తమోగుణం నుండి రజోగుణానికి చేరుతుంది పార్థుని చిత్తము. రజస్తమస్సులు ప్రధానంగా ఉన్నప్పుడు మనస్సుకు జ్ఞానం పట్టదు. అందుచేత సత్త్వగుణము వచ్చే వరకు నిరీక్షించి, ఆ తరువాత సాంఖ్యాన్ని ప్రారంభించాడు భగవానుడు.

**అర్జునుని ఆకృతి**

అర్జునుని దైన్యాన్ని వర్ణిస్తున్నాడు సంజయుడు. జాలి కలవా డయ్యాడట (**కృపయావిష్టం**). కన్నీళ్ళ పర్యంత మయ్యాడట (**అశ్రుపూర్ణాకులేక్షణమ్**). పైగా ఏడుస్తున్నాడట (**విషీదన్తం**). అది చూచి, మాట పడేశాడట మధుసూదనుడు. ఇది సంజయుని సంక్షిప్త సంకలిత సంభాషణము.

**కృపావిష్టుడు**

అర్జునుడు దయార్ద్ర హృదయు డయ్యాడు. జాలిగుండె కలవా డయ్యాడు. ఆయన బుద్ధిని కృప ఆవరించింది. యుద్ధ విముఖతకు కారణమైంది. మరి, ఆ రథం లోనే శ్రీకృష్ణ పరమాత్మ కూడా ఉన్నాడు కదా! ఆయన ఎందుకని కృపావిష్టుడు కాలేదు? శ్రీకృష్ణుడు కరుణ లేని వాడా? కృప చూపలేని వాడా? కృపానిధి అని ముల్లోకాలు కీర్తించింది ఆయననే కదా! ఇది కూడా ఆలోచించాలి.

కౌంతేయుడు కరుణామయుడే. యుద్ధానికి రాక ముందు కూడా కృప గలవాడే. అయినా యుద్ధం చేయాలనే వచ్చాడు. యుద్ధానికి వెళ్ళకు అని అడ్డు చెప్పని కృప, యుద్ధం చేయకు అని సమరభూమిలో అడ్డు పడుతూ ఉంది. అంటే ఇక్కడ కృప ఒక్కటే కాదు. ఇంకా ఏదో ఉంది.

ఈ ఘర్షణ అంతా ఇతరుల వల్ల ఏర్పడింది కాదు. తన మనస్సు లోనే తయారైంది. ఆలోచనా విధానంలో ఏవో ఏవో తయారయ్యాయి. యుద్ధం చేయక పోతే ధర్మం తప్పిన వాడ నౌతానేమో అనే భయం కూడా అర్జునునిలో ఉంది. పోనీ చేద్దామా అంటే, స్వజనుల్ని, గురువుల్ని చంపాలి. అందుకు మనస్సు సిద్ధంగా లేదు.

ధర్మాన్ని విస్మరించి సుఖపడ లేడు. స్వజనుల్ని చంపి బ్రతక లేడు. ధర్మానికి, వ్యక్తిగత మమకారాలకు మధ్య ఘర్షణ ఏర్పడింది. ఎటైనా దెబ్బ తగిలేది తనకే. ఇక కృప ఎవరి మీద? నిజం చెప్పాలంటే తన మీదే. తన వాళ్ళను పోగొట్టుకొని సుఖంగా బ్రతకలేని తనపై తనకు కృప ఉంది కనుకనే తన వాళ్ళపై కృప కలిగింది. ఇదంతా మమకారము. అహంకారము సృష్టించిన మాయాజాలము. అందుకే అచ్యుతుడు దీనిని అంగీకరించ లేదు. బలహీనతగా కొట్టి పారేశాడు. కృప అనే ముసుగులో అహంకారం దూరి అర్జునుని బుద్ధిని కబళించి వేసిందని శ్రీకృష్ణుడు గుర్తించాడు.

**అశ్రుపూర్ణాకులేక్షణుడు**

కళ్ళల్లో నీళ్ళు తిరుగు తున్నాయి కనుక చూపులు కూడా కలత చెందాయి. దేహ స్థాయిలో కూడా అర్జునుడు బలహీన పడ్డాడని స్పష్టంగా తెలిసి పోతోంది. కృప ముసుగులో బుద్ధిని కబళించిన మమకారం శరీరాన్ని కృంగ తీయడమే గాక మనస్సును కూడా తీవ్రంగా కలత పెట్టేసింది.





**విషణ్ణుడు**

మనస్సు విషాదంతో నిండి పోయింది. బాధతో బరు వెక్కింది. ఇదంతా అహంకారము సృష్టించిన మమకారము ఆడే నాటకమే నని గుర్తించిన శ్రీకృష్ణుడు ఈ మమకార పిశాచాన్ని, మోహ జాడ్యాన్ని తుద ముట్టించుటకు సిద్ధ పడ్డాడు. కనుకనే శ్రీకృష్ణుని ఈ సందర్భములో మధుసూదనునిగా వర్ణించాడు సంజయుడు.

***సర్వేషాం దేహే మధువత్ ఇష్టత్వాత్ మధుః అహంకారః***
***తం ఆత్మ ప్రకాశనేన సూదయతి నాశయతీతి మధుసూదనః***

సర్వ మానవుల దేహాలలో తేనె లాగా ఇష్ట మైనది, తియ్య నైనది అహంకారము. అట్టి అహంకారమును ఆత్మజ్ఞాన ప్రకాశము చేత నశింప చేయువాడు కనుక శ్రీకృష్ణుడు మధుసూదను డయ్యాడు.

అర్జున విషాద యోగంలో ముప్పై అయిదవ శ్లోకంలో శ్రీకృష్ణుని మధుసూదనా! అని అర్జునుడు సంబోధించాడు. మధువనే రాక్షసుని సంహరించడం వల్ల శ్రీకృష్ణుడు మధుసూదను డయ్యాడు. ప్రస్తుత శ్లోకంలో మధువు అంటే అహంకారము అని అర్థం చెప్పుకున్నాం. అహంకారాన్ని నశింప చేసేవాడు కనుక శ్రీకృష్ణుడు మధుసూదన శబ్దవాచ్యు డయ్యాడు.

దీనిని బట్టి చూచి నపుడు అహంకారము కూడా రాక్షసి లాంటి దని అర్థమవుతూ ఉంది. అదొక భూత మని, పిశాచ మని తెలుస్తూ ఉంది. భూతం మనిషిని ఆవేశించినట్లు, అహంకార భూతం కృపా ముసుగులో అర్జునుని మనస్సును ఆవేశించింది. ఏ భూతం పడితే మాత్రం ఏమవుతుంది? సర్వభూతనాథుడు రథం లోనే ఉన్నాడు కదా! మోహ పిశాచాన్ని, అహంకార భూతాన్ని అర్జునుని మనస్సు నుండి తరిమే ప్రయత్నంలో కొరడా ఝుళిపించినట్లు మధుసూదనుడు తీక్షణ మైన పదజాలంతో పార్థుని యుద్ధానికి ప్రేరేపిస్తున్నాడు.

**శ్రీ భగవానువాచ :**

కుతస్త్వా కశ్మల మిదం విషమే సముపస్థితమ్ ।
అనార్యజుష్ట మస్వర్గ్య మకీర్తికర మర్జున ॥ 2

***కుతః-త్వా-కశ్మలం-ఇదం-విషమే-సముపస్థితం***
***అనార్యజుష్టం-అస్వర్గ్యం-అకీర్తికరం-అర్జున***

| | | | |
|---|---|---|---|
| అర్జున | = హే అర్జునా! | కశ్మలం | = మాలిన్యము |
| అనార్యజుష్టం | = అనార్యులు పొందేది | విషమే | = విషమ సమయములో |
| అస్వర్గ్యం | = స్వర్గానికి పనికి రానిది | త్వా | = నిన్ను |
| అకీర్తికరం | = అపకీర్తిని కలిగించేది | కుతః | = ఎక్కడి నుండి |
| ఇదం | = ఈ | సముపస్థితం | = ఆవరించింది? |

**శ్రీ భగవానుడు చెబుతున్నాడు :**

**అర్జునా! సంక్లిష్టమైన సమయంలో ఈ మనోవ్యథ నీకు ఎలా దాపురించింది? ఇది ఆర్యులకు తగనిది. స్వర్గానికి పనికి రానిది. పైగా, అపకీర్తిని కలిగించేది.**

**వ్యాఖ్య**

**విషమ సమయంలో వింత ప్రవర్తన**

శత్రువులతో పోరాడాలని పోరుభూమిలో పాదం పెట్టిన పార్థుడు, విరోధులను వధించడం కన్నా వారి

చేతిలో మరణించడమే మంచిది అనే వింత వాదాన్ని వినిపించాడు. యుద్ధం వల్ల కలిగే ఉపద్రవాలు తెలుస్తూ ఉండే టప్పుడు యుద్ధాన్ని ఎందుకు విరమించ కూడదు? అని ప్రశ్నిస్తూ, ధనుర్బాణాలను క్రింద పడేశాడు ధనంజయుడు.

అర్జునునిలో గోచరించిన ఈ అమూహ్య పరిణామానికి అచ్యుతుడు ఆశ్చర్య పోయాడు. యుద్ధభూమికి వచ్చి యుద్ధాన్ని విరమించాలని గోల పెట్టడం కన్నా అసలు యుద్ధానికి రాకుండా ఉంటే సరిపోయేది కదా! రణరంగానికి ఎందు కొచ్చినట్లు? ఇదొక ఆకస్మిక పరిణామం. వింత ప్రవర్తన.

**ఏది వస్తుందో తెలియదు**

జీవితం చాలా విచిత్ర మైంది. జీవుల ప్రవర్తన అంతకన్నా విచిత్ర మైంది. ఎవరు ఎప్పుడు ఎలా ఉంటారో తెలియదు. ఎవరు ఎప్పుడు ఎలా ప్రవర్తిస్తారో అర్థం కాదు. అన్నీ వింతలే. అన్నీ విడ్డూరాలే.

అర్జునుడు అచ్యుతునికి క్రొత్తవాడు కాడు. బాగా తెలిసిన వాడే. బంధువు. సఖుడు. అన్నీను. అలాంటి వ్యక్తిలో మనో వ్యాకులత, మనోవ్యథ, మనో మాలిన్యం ***(కశ్మలమ్)*** ఈ స్థాయిలో గతంలో ఎప్పుడూ చూడలేదు శ్రీకృష్ణుడు. అందుకే ఆశ్చర్య పోతున్నాడు. ఈ అవివేకం నీకు ఎక్కడి నుండి వచ్చింది? ***(కుతః)*** అని సూటిగా ప్రశ్నిస్తున్నాడు శ్రీకృష్ణుడు.

**ఉన్నదే వస్తుంది**

ఈ కశ్మలము ఎక్కడి నుండి వచ్చింది? అని ప్రశ్నించాడు గోవిందుడు. ఎక్కడి నుండి వచ్చింది? అంటే, మునుపు తన వద్ద ఉన్నది కాదు అని అర్థము. అర్ధ శతాబ్దము పైగా పరిచయం ఉన్నా, ఈ విధమైన వింత ప్రవర్తన తానెప్పుడూ అర్జునునిలో చూడ లేదు. ఇది సహజ స్వభావమే అయితే, ఎప్పుడో ఒకప్పుడు కంట బడేదే. అలా ఎప్పుడూ కనలేదు. వినలేదు. ఇప్పుడే, ఇక్కడే, కురుక్షేత్రం లోనే ప్రత్యక్షమైంది.

ఇంతవరకు అర్జునుని విషయంలో తన కంట పడిన వన్నీ సాహసాలే. విజయాలే. వీరత్వాలే. అర్జునుడు అంటేనే ధైర్యవంతుడు, వివేకవంతుడని పేరు. పిరికితనము, అవివేకము, మనోమాలిన్యము లాంటివి అర్జునునిలో అనూహ్య మైనవి. అయితే, ఇప్పుడు ఎలా వచ్చాయి? ఎక్కడి నుండి వచ్చాయి? ఉన్నవే అయితే, ఇంతకాలం కంట బడకుండా ఎలా ఉన్నాయి? ఎక్కడ దాచాడు? ఎలా దాచాడు?

**ఉన్న వన్నీ తెలియవు**

ఏవి తెలిసినా ఉన్నవే తెలుస్తాయి. అలాగని ఉన్న వన్నీ తెలుస్తాయని చెప్పలేము. ఇంట్లో ఉన్నవి ఇంటి లోని వారి కందరికీ తెలుస్తాయి. బ్యాంకులో దాచినవి ఆ దాచిన వ్యక్తికి మాత్రమే తెలుస్తాయి. కాని, మనస్సులో ఉన్న వన్నీ మనిషికి తెలియాలి అనే నియమం లేదు. మనిషి కొన్ని విషయాలను ప్రయత్నంతో, మరి కొన్ని విషయాలను అప్రయత్నంగా మనస్సులో దాచు కుంటాడు. కొన్ని విషయాలైతే మనిషికి సంబంధం లేకుండానే మనస్సులో చేరి పోతాయి. అశేష అనుభవ పరంపరలలో కొన్ని జారి మనస్సు లోతుల్లో పడి ఉంటాయి. అవన్నీ అలా ఉంటాయే కాని, ఉన్నట్లు తెలియవు.

జలాశయాల్లో పూడికలో ఏర్పడిన చలనం వల్ల ఉపరితలాన జలాలు కదులుతూ ఉండటం, బుడగలు వస్తూ ఉండటం మనం చూస్తూ ఉంటాము. అలాగే మనస్సు లోతులలో జరిగే కంపనం వల్ల అవ్యక్తంగా అంతర్యంలో దాగి ఉన్నవి బాహ్యంలో వ్యక్త మవుతూ ఉంటాయి.

అంతర్యంలో ఏ కంపనం ఎలాంటిదో, తత్సంబంధ మైన పోకడలే బాహ్యంలో గోచరిస్తూ ఉంటాయి.





కానీ, అంతర్యంలో ఎప్పుడు ఎలాంటి చలనం జరుగుతుందో తెలియదు. ఏది జరిగినా, దాని ప్రతిరూపమే, ప్రతిబింబమే బాహ్యంలో ప్రతిఫలిస్తూ ఉంటుంది కనుక, బాహ్యం లోని ప్రవర్తన కూడా అర్థం కాదు. వింత గానే ఉంటుంది. విచిత్రం గానే ఉంటుంది.

ఎప్పుడు ఏది వస్తుందో తెలియదు. ఏది వచ్చినా ఉన్నది వస్తుందే గాని లేనిది రాదు. అయితే ఆ వచ్చిన దేదో అది అలా ఉన్నట్లు ముందు తెలియదు కనుక ఇప్పుడు వింతగానే కనిపిస్తుంది. నిగూఢ మైనవి, నిమగ్న మైనవి వెలుగు చూచే టప్పుడు అనుభవం విచిత్రం గానే ఉంటుంది.

ఒక అద్భుతమైన రచన చేసి నప్పుడు, లేదా విస్మయాన్ని కలిగించే విషయాన్ని ప్రసంగించి నపుడు వ్యక్తి తనలో తానే ఒక వింతను, విచిత్రాన్ని దర్శిస్తూ ఉంటాడు. ఈ భావం నాలో ఎలా కదిలింది? ఈ ఆలోచన నాకు ఎక్కడి నుండి వచ్చింది? అని విస్తుపోతూ ఉంటాడు. ఎక్కడి నుండి వస్తాయి? తన నుండే వస్తాయి. తనకు తెలియకుండా తనలో ఉన్నవే తన ద్వారా వెలుగు చూసి నపుడు తనకే వింతగా ఉంటుంది. ఇక ఇతరులకు వింతగా ఉంటుందని ప్రత్యేకంగా చెప్పే దేముంది? అందుకే ఆశ్చర్యపోతూ, ఈ మనోవ్యథ నీకు ఎలా దాపురించింది? ***(కుతస్త్వా కశ్మలమిదం)*** అని ప్రశ్నించాడు శ్రీకృష్ణుడు.

**సమయాలు - సందర్భాలు**

ఒక వ్యక్తి ఎప్పుడు తింటాడో చెప్పగలం. ఎప్పుడు త్రేపుతాడో ఎలా చెప్పగలం? తినడానికి సమయా లున్నాయి. సందర్భాలూ ఉంటాయి. త్రేపడానికి ఏది సమయమో, ఏది సందర్భమో ఎలా చెప్పగలం? తినిన ప్రతి వ్యక్తి త్రేపుతాడని చెప్పలేము. అలాంటప్పుడు ఎవరు త్రేపుతారో, ఎప్పుడు త్రేపుతారో, ఎక్కడ త్రేపుతారో చెప్పగలమా?

ఒక వ్యక్తి త్రేపి నపుడు, ఈ త్రేపు ఎలా వచ్చింది? ఎందు కొచ్చింది? ఈ సమయం లోనే ఎందు కొచ్చింది? అంటే సమాధానం ఏమి చెప్పాలి? త్రేపు వచ్చేది త్రేపే వాడికే తెలియదు. అందుకే కదా కొందరు ధ్యానంలో, మరి కొందరు శ్రవణంలో, ఇంక కొందరు నిద్రలో కూడా త్రేపుతూ ఉంటారు!

తినిన వాడే త్రేపుతాడు. త్రేపడానికి కూడా సమయం ఉంది. త్రేపే సమయం లోనే మనిషి త్రేపుతాడు. ఆ త్రేపే సమయం ఏదో తెలియదు కనుక, ఇలాంటి సమయంలో త్రేపుతా వేమిటి అని ప్రక్క వ్యక్తి ప్రశ్నిస్తే, నిజమే కదా! ఇప్పుడు ఎందుకు త్రేపాను అని త్రేపిన వ్యక్తి తికమక పడుతూ ఉంటాడు. త్రేపిన సమయము సరి యైనదే. ఆ సమయం తెలియక పోవడం చేత, ఆ కాలం అకాలంగా, ఆ కార్యం అకార్యంగా తెలుస్తూ ఉంటాయి. అచ్యుతుడికి అన్నీ తెలిసినా, అర్జునునికి తెలియ జేయాలని ఈ విషమ సమయంలో ***(విషమే సముపస్థితం)*** నీకు ఈ అవివేకం ఎక్కడి నుండి వచ్చింది? అని ప్రశ్నించాడు.

**అర్జునునిలో అంతర్యుద్ధము**

సంక్లిష్ట మైన సమయంలో ధర్మాధర్మాల మధ్య సదవగాహన లోపించి నపుడు సత్పురుషుడు సంఘర్షణకు లోనవుతాడు. దేహాన్ని వ్యాధులు పట్టి పీడించినట్లు, మనస్సును వ్యథలు ఆక్రమించి భయాలతో బీభత్సం చేస్తాయి. పాపభీతితో కుదిపేస్తాయి. పార్థుని విషయంలో అదే జరిగింది. అర్జునుని బుద్ధి భయనిలయ మైంది. ధర్మాత్ము డైన ధనంజయుని మూడు భయాలు విపరీతంగా బాధిస్తున్నాయి.

(1) ఇప్పుడు నేను చేయబోయే సంగ్రామము సరియైన దేనా? నేను చేయ దగిన దేనా? ఆర్యసంతతిలో ఆవిర్భవించిన వాణ్ణి. ఆర్షసంస్కృతిలో పెరిగిన వాణ్ణి.

**ఆరాత్ పాపకర్మభ్యో యాతి ఇతి ఆర్యః**

పాప కార్యాలకు దూరంగా పోవు వాడు ఆర్యుడు. మరి, తాను చేసే యుద్ధము పాపకర్మ అయితే తనకు తీరని కళంకాన్ని తెచ్చి పెడుతుందేమో అని భీతి చెందుతున్నాడు అర్జునుడు.

(2) ఈ రణరంగంలో పోరాడటం నైతికమా? అనైతికమా? ధర్మమా? అధర్మమా? అనే మీమాంస మరొక వైపు అర్జునుని మనస్సును కుదిపేస్తోంది. ధర్మాచరణమునకు ఫలంగా స్వర్గం ప్రాప్తిస్తే, అధర్మాచరణము నకు ప్రతిఫలం నరకమే కదా! ఈ కురుక్షేత్ర పోరాటము తనకు నరక ద్వారాలను తెరుస్తుందేమో అనే నరక భయం కూడా నరుని హృదయాన్ని పిండుతూ ఉంది.

పైగా, ధార్తరాష్ట్రులు దురాత్ములు. పాపుల్ని చంపితే, మమ్మల్ని కూడా పాపమే చుట్టు కుంటుంది ***(పాపమే వాశ్రయే దస్మాన్ హత్వైతా నాత తాయినః)*** అని మొదటి అధ్యాయం ముప్పై ఆరవ శ్లోకంలో అర్జునుడు అనేశాడు కూడా. కనుక, ఈ యుద్ధం నరక హేతువు అవుతుందేమో అనే పాపభీతి, పరలోక భయం కూడా పార్థుని పట్టుకుని ఉన్నట్లు తెలుస్తోంది.

(3) పరలోకం మాట పరమేశ్వరు డెరుగు. ఇహలోకంలో తల దించుకోవలసి వస్తుందేమో! పవిత్రంగా, ప్రసిద్ధంగా జీవించి పది పేర్లు సాధించు కున్నాడు. ఆశించకుండానే దశవిధ నామాలు అందుకున్నాడు. ఈ పోరాటంలో బీభత్సాన్ని సృష్టించి, పది కాదు కదా, ఒక్కటి కూడా నిలబెట్టుకోలేక పోతాడేమో! పేరు పోగొట్టుకొని ఎలా బ్రతకాలి? ఇన్నాళ్ళు సన్మానాల మధ్య బ్రతికాడు. ఇప్పుడు అవమానాలను భరిస్తూ బ్రతకడం సాధ్య పడుతుందా? ఇలా అర్జునునిలో అంతర్యుద్ధం నడుస్తూ ఉంది. ఆంతర్యం కల్లోలంగా మారింది. మనసు నీరసించి పోయింది. శరీరం నిర్వీర్య మైంది. గాండీవం చేజారి పోయింది. విజయుడు విషణ్ణ డయ్యాడు.

**వజ్రం వజ్రేన భిద్యతే**

వజ్రాన్ని వజ్రం తోనే కోయాలి. భయాన్ని భయం తోనే పోగొట్టాలి. ఇదొక అద్భుతమైన శిక్షణ ప్రక్రియ. అసమానమైన రక్షణ ప్రక్రియ. శ్రీకృష్ణుని అమోఘ బోధనా పటిమ ఆరంభ శ్లోకం లోనే అందల మెక్కింది.

భయాలలో, బాధలలో పడి అర్జునుని మనస్సు మునిగి పోతూఉంది. కర్మాచరణం నుండి విడిపడి మగత లోకి జారి పోతూఉంది. దానిని ఎలాగైనా పైకి లేపాలి. నూతనోత్తేజాన్ని కలిగించాలి. ఉత్సాహాన్ని నింపాలి.

పట్టు తప్పి ఒక వ్యక్తి శరీరం కూలబడుతూ ఉంటే, మరొక వ్యక్తి తన దేహశక్తితో సాయం చేసి నిలబెడతాడు. అలాగే, భయంతో, అధైర్యంతో ఒక వ్యక్తి మనసు బలహీనమై, నీరసించి నపుడు, బుద్ధి బలం గల మరొక వ్యక్తి తన ధీశక్తితో అభయ ప్రదానం చేసి, అవగాహనను కల్పించి, పతన మౌతున్న మనస్సును ప్రగతి బాటలో నడిపిస్తాడు. శ్రీకృష్ణుడు తన ప్రారంభ శ్లోకంలో అదే చేస్తున్నాడు. అదే చెబుతున్నాడు.

భయాలు రెండు విధాలుగా ఉంటాయి. (1) విధాయక భయాలు (2) విధ్వంసక భయాలు. విధాయక భయాలు ఆలోచనల్ని పెంచి, అవగాహనను దించి, అంతరాయాలను అదృశ్యం చేసి, అంతరంగాన్ని ఉద్యుక్తం చేస్తాయి. ఉద్యమ స్ఫూర్తిని కలిగిస్తాయి. విధ్వంసక భయాలు ఆలోచనల్ని కుదించి, అవగాహనను దారి మళ్ళించి, అంతరాలను ఆవిష్కరించి, ఆంతర్యాన్ని కల్లోల పరుస్తాయి. కలవర పెడతాయి.

అర్జునునిలో విధ్వంసక భయం చోటు చేసుకుంది. దాని వలన వ్యక్తిత్వమే అస్తవ్యస్త మైంది. విధ్వంసక భయం ఎప్పుడైనా, ఎవరి కైనా ఆత్మహత్యా సదృశమే. శ్రీకృష్ణుడు కూడా పరోక్షంగా అర్జునుని భయ పెడుతూనే మందలించాడు. కాకపోతే అది విధాయక భయం. భయాన్ని పోగొట్టే భయం. నూతన తేజాన్ని నింపే దైవబలం.





వజ్రాన్ని వజ్రం తోనే ముక్కలు చేయాలి. అలాగే భయాన్ని భయం తోనే పోగొట్టాలి అనే బౌద్ధిక పరివర్తనకు, సాంస్కృతిక పునర్జీవనానికి శ్రీకారం చుట్టాడు శ్రీకృష్ణుడు. అర్జునునిలో మూడు భయాలు ఎలా చోటు చేసుకున్నాయో ఇప్పటికే మనం చూశాం. శ్రీకృష్ణుడు మరో మూడు భయాల్ని ప్రవేశ పెట్టి ముచ్చటిస్తున్నాడు. కాకపోతే, మూలిగే నక్క మీద తాటిపండు పడ్డట్లు కాకుండా, ఆకలితో గతించే వానికి అమృతాన్ని అందించినట్లు భాషించాడు. తమోగుణ ప్రభావంతో కూలబడిన అర్జునునిలో రాజసిక ప్రవృత్తిని కలిగించి తన కాళ్ళ మీద తాను నిలబడేటట్లు చేశాడు.

**భయాలే అభయాలు**

యుద్ధం ప్రస్తుత పరిస్థితుల్లో తాను చేయదగిన దేనా? అనేది అర్జునుని మొదటి భయం. కురుక్షేత్ర సంగ్రామంలో పోరాడటం పుణ్యమా? పాపమా? అనేది అర్జునుని రెండవ భయం. ఈ విధమైన యుద్ధము చేయడం వల్ల తనకు అపకీర్తి సంభవిస్తుందేమో! అనేది అర్జునుని మూడవ భయం. తాను ఏది ఆచరించడం వల్ల ఉపద్రవాలు సంభవిస్తాయని ఊహించుకొని అర్జునుడు భీతి చెందు తున్నాడో, దానిని ఆచరించక పోవడం వల్లనే తన ఊహల లోని ఉపద్రవాలు సంక్రమిస్తాయని శ్రీకృష్ణుడు అర్జునుని ఆంతర్యంలో నిగూఢంగా ఉన్న మూడు భయాలనే ప్రస్తావిస్తూ ప్రవచిస్తున్నాడు.

**(1) అనార్య జుష్టం**

ఆర్యులు ఆచరించ దగినదా, కాదా? అనేది అర్జునుని సంశయం. ఆచరిస్తేనే ఆర్యుడు. ఆచరించకుండా ఉండటం ఆర్యునికి తగినది కాదు; అనార్యులకు తగినది ***(అనార్య జుష్టం)*** అని మొదటి భయాన్ని నివారించే ప్రయత్నంలో అద్భుతంగా ప్రవచించాడు అచ్యుతుడు. ***జుష్టం*** అంటే ఆచరించ దగినది అని అర్థం. ***అనార్య జుష్టం*** అంటే ఆర్యులు కాని వారు ఆచరించేది అంటూ మరీ దారుణ మైన భయాన్ని అర్జునుని బుద్ధికి పట్టించాడు భగవానుడు.

***అర్తుం యోగ్యః ఆర్యః.*** ఆర్యుడు అంటే సేవింప దగిన వాడు, లేదా పూజింప దగిన వాడు అని అర్థము. ఆర్యుడు ఎందుకని పూజింప దగిన వాడు? ధర్మాన్ని ఆచరించాలని కోరుకొనే వాడు, అధర్మాన్ని ఆచరించ కూడదని అభిప్రాయపడే వాడు కనుక ఆర్యుడు పూజార్హుడు ***(కర్తవ్యం ఆచరన్ కామం అకర్తవ్యం అనాచరన్)***. ఆర్యుడు ఆచరణీయుడు. అనుష్ఠానపరుడు.

సకాలంలో సత్కర్మలు చేసే సత్పురుషులు ఆర్యులు. ఆతతాయు లైన దుర్యోధనాదుల వల్ల ధర్మ హాని ఏర్పడింది. క్షత్రియునికి ధర్మం ప్రాణవాయువు వంటిది. కురుక్షేత్రంలో జరిగేది ధర్మయుద్ధము. వ్యక్తిగత బాంధవ్యాలకు సంబంధించింది కాదు. క్షత్రియ జాతిలో జన్మించిన ఆర్య పురుషుడు ధర్మరక్షణ కొరకు యుద్ధం చేయాలి. అలా చేయక పోతే, అధర్మం వ్యాప్తి చెందుతుంది. క్షత్రియుడు ధర్మాన్ని విస్మరించి యుద్ధం చేయక పోవడం చేతనే ధర్మానికి హాని ఏర్పడుతుంది కనుక, అట్టి ధర్మ గ్లానికి కారణమైన క్షత్రియుడు అనార్యుడని పిలువ బడతాడు. అధర్మ వ్యాప్తికి కారణ మైనందున నరకంలో ప్రవేశిస్తాడు.

**(౨) అస్వర్గ్యం**

యుద్ధం చేస్తే పాపం వస్తుందేమో, పాప ఫలంగా నరకం సంభవిస్తుం దేమో అనేది మూడవ వాని రెండవ భయం. ఇది గుఱ్ఱం ముందు బండిని ఉంచడమే అవుతుందని శ్రీకృష్ణుడు కనువిప్పు కలిగించాడు.

యుద్ధం చేయక పోతేనే నరకం ప్రాప్తిస్తుంది, స్వర్గం చేజారి పోతుంది అని భగవానుడు సహేతుకంగా

వివరించాడు. ధర్మహాని కలిగే టప్పుడు ధర్మాన్ని రక్షించడానికి క్షత్రియుడు యుద్ధం చేయాలి. అది క్షత్రియ ధర్మం. ధర్మ రక్షణ చేయకుండా, కర్తవ్యం నుండి జారిపోయిన క్షత్రియుడు నరకాన్ని పొందుతాడు.

ధర్మ రక్షణకై యుద్ధం చేసి యుద్ధభూమిలో మరణించిన వీరుడు స్వర్గాన్ని పొందుతాడు అని ధర్మ శాస్త్రాలు చెబుతున్నాయి. వాటిని అనుసరిస్తూ ఆచరించే వారు ఆర్యులు. స్వర్గప్రాప్తికి అర్హులు. ధర్మయుద్ధం నుండి పారి పోయేవారు అనార్య లవుతారు. స్వర్గ ద్వారాలు వారికి మూత పడతాయి.

**(3) అకీర్తికరం**

యుద్ధం చేస్తే అపఖ్యాతి పాలవుతా నేమో అనేది అర్జునుని మూడవ భయం. ఆ అపఖ్యాతి ఏదో యుద్ధం చేయక పోవడం వల్ల వస్తుందే గాని చేయడం వల్ల కాదు అనేది అచ్యుతుని ఆక్షేపము.

యుద్ధాన్ని విరమించి, అర్జునుడు వెను దిరిగితే, కిరీటి కీర్తి కిరీటంలో మరో మణిపూస చేరుతుందా? ధనంజయుడు దయామయుడు అని ప్రజలు కీర్తిస్తారా? పోరాడి గెలిస్తే కీర్తి వస్తుంది గాని పారిపోయి ఓడిపోతే యశస్సు పెరుగుతుందా?

యుద్ధం చేస్తే అపకీర్తి వస్తుంది అనేది అర్జునుని భయం. యుద్ధాన్ని విరమిస్తేనే అపఖ్యాతి అనేది శ్రీకృష్ణుని వాదన.

అర్జునా! కీర్తి, అపకీర్తి అనేవి ఎక్కడ నుండి వస్తాయి? ఎవరి నుండి వస్తాయి? ప్రజల నుండి రావాలి. ప్రజలు ఎవరిని కీర్తిస్తారు? ఎవరిని నిందిస్తారు? ప్రజలు ధర్మాభిలాషులు. ధర్మ రక్షణ చేసే వారిని కీర్తిస్తారు. ధర్మహాని కలిగించే వారిని నిందిస్తారు. దూషిస్తారు.

దుర్యోధనుడు అధర్మపరుడు. నీవు రణరంగం నుండి పారిపోతే, ఆ తరువాత దుర్యోధనునిదే ప్రభుత్వము. అతని దుష్ట పరిపాలనలో ప్రజలు దుర్గతి పాలవుతారు. ఇదంతా నీ నిర్వాకమే నని నిన్ను ఎత్తి పొడుస్తూ ఉంటారు. అర్జునుని పిరికితనం వల్లే మనకు ఈ దుర్గతి ప్రాప్తించింది అని నిన్ను నిందిస్తారు. ఇదంతా కీర్తి క్రిందికే వస్తుందా అర్జునా?

ప్రజలు ఎప్పుడైనా గెలిచిన వారికే పూలదండలు వేస్తారు. పార్థా! పారిపోయిన వారికి పసుపు కుంకాలను పంపడం చూశాము గాని నీరాజనాలు పట్టడం చూడ లేదు. అది కూడా కీర్తే నని నీవు భావిస్తే, నా కేమీ అభ్యంతరం లేదు.

రాజుగా దుర్యోధనుడు ఏ చెడు కార్యం చేసినా, ప్రజలు ముందుగా నిందించేది నిన్నే. ధర్మయుద్ధంలో పాల్గొని, అధర్మపరులను హతమార్చి, వీర క్షత్రియుడిగా ప్రజల మన్నన లందుకొని, ధర్మయుత మైన పాలనను అందిస్తే కీర్తి వస్తుంది గాని, పారిపోతే పేరు వస్తుందా? ఏమో వస్తే రావచ్చు. పేడివాడు అనే పేరు రావచ్చు. పనికి రానివాడు అనే ఖ్యాతి మిగలొచ్చు. అర్జునా! ఆలోచించుకో. పేరు తెచ్చుకోమని, ఖ్యాతి పెంచుకోమని తల్లిదండ్రులు పేరు పెడతారు గాని, పేరును పోగొట్టుకోమని పేరు పెట్టరు. అయినా, నీ పేరు అర్జునుడు కదా! ఈ కశ్మలం ఈ విషమ సమయంలో నీ కెక్కడి నుండి దాపురించింది? అని లేని భయాలను, రాని భయాలను గుండెలో నింపుతూ భాషించాడు భగవంతుడు.

**అర్థం కాలేదా అర్జునయ్యా!**

చూడు మిత్రమా! నీవు కీర్తిని సంపాదిస్తా వనే మా అత్తమామలు నీకు అర్జునుడు అని పేరు పెట్టి ఉంటారు. పేరుకు ప్రాకులాడ వలసింది పోయి నీలో కశ్మలం పేరుకుపోయిం దేమిటి?





***అర్జ్యత ఇతి అర్జునః. అర్జ ఆర్జనే*** - నీ వల్ల పేరు ప్రఖ్యాతులు ఆర్జింప బడుతాయి అనే కదా నీకు అర్జును డని పేరు పెట్టింది?

***శుక్ల శుభ్ర శుచి శ్వేత విశద శ్వేత పాణ్డరాః***
***అవదాత స్సితో గౌరో వలక్షో ధవళో౽ ర్జునః ॥***

ఈ అర్థాలన్నీ నీవే కదా! శ్వేతవర్ణంతో శోభిస్తూ ఉంటావు. పవిత్రమైన వాడివి. శుద్ధమైన వాడివి. అందుకే కీర్తిమంతుడివి.

***ధవళః ధావతి శుద్ధ్యతి ఇతి ధవళః అర్జునః.*** అర్జున అంటేనే ధవళ వర్ణము. శుద్ధిరూపము. మరి, ఈ అశుద్ధము నిన్ను ఎలా ఆవరించింది? ఈ కశ్మలము ఎక్కడి నుండి వచ్చి నిన్ను పట్టుకొంది? ***(కుతస్త్వా కశ్మల మిదం).***

అర్జునా! తెలుపు వస్త్రానికి మురికి అంటుకోవచ్చు. కాని, ఆ మాలిన్యము తెలుపు వస్త్రానిది కాదు. ఎక్కడి నుండో వచ్చి వస్త్రానికి అంటుకొని ఉంటుంది. శుద్ధి చేస్తే మురికి పోతుంది. వస్త్రం తెల్లగా శోభిస్తుంది ***(శ్వేతతే శ్వేతమ్).***

పార్థా! నీవు కూడా శుద్ధమైన వాడివి. అర్జునుడివి. ప్రస్తుతము నిన్ను ఆవరించిన మనోమాలిన్యము నీ స్వభావము కాదు. ఆగంతుకము. రాసుకుంటే ఉంటుంది. రాల్చేస్తే పోతుంది. తగిలించుకుంటే ఉంటుంది. తొలగించుకుంటే పోతుంది.

మధ్యలో వచ్చినవి మధ్య లోనే పోతాయి. అర్జునా! ఇంతెందుకు? మీరు అజ్ఞాతవాసం చేసి నపుడు విరాట నగరంలో నువ్వు అదోలా ఉన్నావు కదా! ఇప్పుడలా ఉన్నావా? లేవు కదా! అంతే. ఒకవేళ, అలాగే ఉన్నట్లు అనిపిస్తోందా? అలాంటి దేమీ లేదు. భ్రమపడకు. అలాంటి ఆలోచనల్ని రానివ్వకు. వచ్చినా ఉండ నివ్వకు. విడిచేయ్! అది నీకు తగదు.

క్లైబ్యం మాస్మగమః పార్థ నైత త్త్వ య్యుపపద్యతే ।
క్షుద్రం హృదయదౌర్బల్యం త్య క్త్వోత్తిష్ఠ పరంతప ॥ 3

***క్లైబ్యం-మా స్మ గమః-పార్థ-న-ఏతత్-త్వయి-ఉపపద్యతే***
***క్షుద్రం-హృదయ దౌర్బల్యం-త్యక్త్వా-ఉత్తిష్ఠ-పరంతప***

| | | | | | |
|---|---|---|---|---|---|
| పార్థ | = | హే అర్జునా! | పరంతప | = | హే పరంతపా! |
| క్లైబ్యం | = | అధైర్యమును | క్షుద్రం | = | నీచమైన |
| మాస్మగమః | = | పొందకు | హృదయదౌర్బల్యం | = | హృదయ దుర్బలత్వమును |
| ఏతత్ | = | ఇది | త్యక్త్వా | = | విడిచి |
| త్వయి | = | నీ విషయమున | ఉత్తిష్ఠ | = | లెమ్ము! |
| న ఉపపద్యతే | = | తగదు | | | |

**పార్థా! అధైర్య పడకు. అది నీకు తగింది కాదు. నువ్వు శత్రువులను పీడించే వాడివి కదా! లే! నీచమైన హృదయ దౌర్బల్యాన్ని విడిచేయి.**

**వ్యాఖ్య**

**అధైర్యమే అవరోధము**

అధైర్యము అవాంఛనీయము. అసంగతము. సదోగ్య స్ఫూర్తికి ప్రతిబంధక మైన అధైర్యము

అసమంజసము అని శ్రీకృష్ణుని అభిప్రాయం. అందుకే అధైర్యాన్ని పొందకు. అశక్తతను దగ్గరకు రానివ్వకు అని సవ్యసాచికి సలహా ఇస్తున్నాడు (***క్లైబ్యం మాస్మగమః***).

'క్లైబ్యం' అంటే అధైర్యము అని ఒక అర్థము. నపుంసకత్వము అని మరొక అర్థము. ఈ రెండింటిలో ఏదీ యుద్ధభూమికి అర్హ మైనది కాదు. అధైర్యపరుడు యుద్ధం చేసే దేముంటుంది? ఇక నపుంసకుని విషయం ప్రత్యేకంగా చెప్పే దేముంది?

పురుషుడైన వాడు రణరంగంలో ఎదజూపి, ఎదురొడ్డి పోరాడుతాడు. స్త్రీ ఇంటి లోనే ఉంటుంది. సమర రంగానికి రాదు కనుక ఆమె పోరాడే ప్రసక్తే లేదు. నపుంసకుని విషయమే విచిత్రంగా ఉంటుంది. నపుంసక జీవి స్త్రీ కాదు కనుక ఇంటిలో ఉండటం జరగదు. పురుషుడు కానందున యుద్ధంలో ప్రవేశించడం జరగదు.

స్త్రీ కానందున యుద్ధం చేయకుండా ఇంట్లో ఉండేది లేదు. పురుషుడు కానందున రణరంగంలో ఉండటమే గాని పోరాడేది ఉండదు. మరి, యుద్ధభూమిలో చేసే దేమిటి? ఏముంది? పోరాడే వాళ్ళ మధ్య తారొపిల్లి, తారాడుతూ, తచ్చాడుతూ తటస్థంగా ఉండటమే.

అర్జునుడు స్వభావత: అధైర్యవంతుడు కాడు. నపుంసకుడు అసలే కాడు. గతంలో ఎందరితో యుద్ధం చెయ్యలేదు? ఇంతెందుకు? ఉత్తర గోగ్రహణంలో కౌరవసేన నంతా గడగడ లాడించిన గడుసరి గాండీవి కాడా? సాక్షాత్తు పరమేశ్వరునితో పోరాడి పాశుపతాస్త్రమును పొందిన వాడు ధైర్యము లేనివాడా? అర్జునుడు కురువీరుడు. రణధీరుడు. అందుకే, ఈ సందర్భంలో అర్జునుని పార్థా! అని సంబోధించాడు భగవంతుడు.

పృథాదేవి ఉత్తమ క్షత్రియ స్త్రీ. ఆమె కుమారుడివి. ఉత్తమ క్షత్రియ ధర్మాలతో శోభించ వలసిన వాడివే గాని అధైర్యంతో వెన్ను చూపే వాడివి కావు. కాకూడదు. అది పురుష లక్షణం కాదు. నపుంసక లక్షణం (***క్లీబత్వం - క్లైబ్యం***). నీ విషయంలో అది తగదు. అర్జునా! ఏదో శాపవశాత్తు గతంలో బృహన్నలగా కులికింది వాస్తవమే అయినా, అదేదో పోయింది కదా! ఇప్పుడు లేదు కదా! కనుక ఎటు చూచినా, ఏ అర్థాన్ని ఆశ్రయించినా, క్లైబ్యం నీకు తగింది కాదు.

**నీవు తగవు - నీకు తగవే**

అర్జునా! ఇది నీకు తగదు (***త్వయి ఏతత్ న ఉపపద్యతే***). అధైర్యము నీకు సంబంధించింది కాదు. తగవు లాడే స్వభావం గల క్షత్రియుడవే గాని పిరికితనాన్ని, పేడితనాన్ని ప్రదర్శించుటకు నీవు తగవు. ఈ విధమైన ప్రవర్తన నీకు తగదు.

బుద్ధి బలహీనపడి నపుడు, హృదయం విషాదభరిత మైనపుడు, మనస్సును నియంత్రించే శక్తిని మనిషి కోల్పోయి నపుడు, ఈ విపత్కర పరిస్థితి నుండి బయట పడటానికి తన శక్తి సరిపో నపుడు మరొక చోట నుండి సహాయం అవసరమై ఉంటుంది. ఆ సహాయంతో తన అశక్తత నుండి బయటపడి మనిషి శక్తివంతు డవుతాడు.

మరొక చోట నుండి సహాయం అందటం అంటే, అది వ్యక్తి నుండి కావచ్చు. గ్రంథం నుండి రావచ్చు. లేదా దృఢమైన లక్ష్యం నుండి కావచ్చు. ఒక సన్నివేశం కూడా సరిపోవచ్చు. ఏదైనా సరే, అలాంటి పరిస్థితిలో ఆ సహాయం ఏదో అది శక్తి ఉత్పాదక యంత్రంగా పని చేయాలి.

ప్రతి మనిషిలో నిగూఢ మైన శక్తి ఉంది. అలాగే కొంత అశక్తత కూడా ఉంటుంది. బలాబలాలు ఉన్నవాడే మనిషి. వ్యక్తిలో రెండూ ఉండొచ్చు. కాని, ఒకే సమయంలో రెండిటిని ప్రదర్శించడం సాధ్యం కాదు.





ఏదో ఒకటే బయట పడుతూ ఉంటుంది. కొన్ని సందర్భాలలో ధైర్యం ఉండొచ్చు. కొన్ని పరిస్థితులలో అధైర్యమే అందలం ఎక్కవచ్చు. ఎప్పుడు ఏది వస్తుందో, ఏ స్థాయిలో ఉంటుందో చెప్పలేము.

బలం బలమే కనుక బాధ లేదు. బలహీనత ఆక్రమిస్తేనే దానిని నివారించుకొనే ప్రయత్నం చేయాలి. అది కూడా, మనకు సాధ్యం కాకపోతే, మరొకరి సహాయం సలహా రూపంలో సహకరించ వచ్చు. ఉపకరించ వచ్చు. కాని, ఆ సలహాలు సౌజన్యాలుగా ఉండాలే గాని దౌర్జన్యాలుగా ఉండ కూడదు. సముచితాలుగా ఉండాలే గాని, అనుచితాలు కాకూడదు. విధాయకాలై ఉండాలే కాని, విధ్వంసకాలు కాకూడదు.

సలహాలు ఎవ్వరైనా ఇవ్వగలరు. అదొక పెట్టుబడి లేని వ్యాపారం. కొందరికి అనవసర మైన వ్యాపకం కూడా. కాని ఆ సలహాలు సముచితాలు కాకపోతే మాత్రం ఆ తరువాత అంతా అనుచితమే. అనాదరమే. అహితమే. అందుచేతనే, సర్వజ్ఞుడైన శ్రీకృష్ణుడు ఈ సందర్భంలో అనితర సాధ్యంగా, అసమాన వైభవంతో అభిభాషించాడు. పార్థా! అధైర్యము నీకు తగదు. క్షత్రియ వీరా! అధైర్యానికి నీవు తగవు (***నైతత్త్వయ్యుపపద్యతే***). తగవు లాడటమే నీకు తగును అంటున్నాడు అర్జున సఖుడు.

**ఆకాశం లోనే ఎండ-వాన**

ప్రభాకరుడు పలికినా, జాబిల్లి నవ్వినా ఆకాశంలో ప్రకాశం తాండవిస్తుంది. ఆ ఇరువురూ తెరమరుగైతే గగనాన్ని చీకటి కప్పేస్తుంది. ఆకాశం లోనే చీకటి వెలుగులు. ఆకాశం నుండే తిమిర తేజాలు. ఎండైనా, వానైనా ఆకాశం నుండే. ఏది ఎలా వస్తే ఆకాశం అలా అగుపిస్తుంది.

వ్యోమంలో వెలుగునీడలు తారాడినట్లు, శీతోష్ణాలు పచార్లు చేసినట్లు, బలాబలాలు బుద్ధిలో ఉంటాయి. బుద్ధి నుండే బహిర్గత మవుతాయి. బుద్ధి లోనే బలం ఉంటుంది. బుద్ధి లోనే బలహీనత ఉంటుంది. ఏది బుద్ధిలో ఉంటే అదే బ్రతుకులో తచ్చాడుతుంది. అందుకే, మనసే మనిషి అంటుంటారు మనస్తత్త్వ శాస్త్రవేత్తలు.

ఇటుకలు, సున్నము బలంగా ఉంటే గోడ బలంగా ఉంటుంది. ఆలోచనలు, భావాలు తేజోవంతంగా ఉంటే, బ్రతుకు తేజరిల్లుతుంది. ఆ పని ఎవరికి వారు చేసుకోవాలి. అలా చేసుకోవడం సాధ్యపడ నపుడు మరొకరి చేయూత అవసరం అవుతుంది. అలా చేయూత నిచ్చే వ్యక్తి ఆచార్యుడే అయితే చిత్తము చిగురిస్తుంది. బ్రతుకు పరిమళిస్తుంది. అర్జునునికి కురుక్షేత్రంలో అలాంటి సహాయమే అవసర మైంది. అదృష్టం తోడై అచ్యుతుని అండ లభించింది.

నీరసించిన అర్జునుని మనస్సును శక్తివంతం చేసే ప్రయత్నంలో శ్రీకృష్ణుడు బలమైన రసాయనాన్ని ఈ శ్లోకంలో నూరి పోశాడు. వండి వడ్డించాడు. పనిగట్టుకొని త్రాగించాడు. పనితన మేమిటో ప్రదర్శించి చూపాడు. నిద్రించిన ఆకాశాన్ని సూర్యుడు వెలుగులతో తట్టి లేపినట్లు, నిర్వీర్యమై కూల బడిన అర్జునుని అంత:కరణములో వివేక దీపాన్ని వెలిగించాడు అనంతుడు.

**బలవంతుడివి - బలహీన పడకు**

అర్జునా! దారుణమైన ఈ విషమ సమయంలో ఈ అవివేకము నిన్నెలా ఆవేశించింది? ఈ మనో వ్యాకులత నీకు ఎలా దాపరించింది? ఇది నీకు తగింది కాదు. నీవు వీరుడివి. శూరుడివి. బలవంతుడివి. నీ చరిత్రలో ఇప్పటి వరకు పుటలన్నీ ఇలాగే ఉన్నాయి. ఇప్పుడే ప్రథమంగా నీలో ఈ కశ్మలాన్ని చూస్తున్నాను. ఇది నీకు తగింది కాదు (***నైతత్త్వ య్యుపపద్యతే***) అంటూ అమోఘంగా భాషించాడు అనంతుడు.

ఈ సందర్భములో పైపైన చూచే వారికి శ్రీకృష్ణుడు అర్జునుని అశక్తతపై స్వారి చేసినట్లు కనిపిస్తుంది. కాని, వివేకంతో విశ్లేషించుకొని, ఆంతరంగిక ఔన్నత్యాన్ని అర్థం చేసుకోగలిగే వారికి, శ్రీకృష్ణుడు అర్జునుని ఆత్మగౌరవాన్ని కాపాడుతూ, పతన మౌతున్న మనస్సును పదిలంగా నిలిపి, పవిత్రంగా నడిపించినట్లు అర్థ మవుతుంది.

'ఇది నీలో ఉంది' అని దోషాన్ని ఎత్తి చూపడం వేరు. అదే విషయాన్ని 'ఇది నీలో ఉండ తగింది కాదు' అని చెప్పడం వేరు. మొదటి వాక్యం పతనానికి శ్రీకారం చుడుతుంది. రెండవ వాక్యం ప్రగతికి ద్వారం తెరుస్తుంది. మొదటిది నిరాశా నిస్పృహలను, లేదా కోపతాపాలను కలిగించ వచ్చు. కాని, రెండవది మాత్రం ఆశాకిరణాల్ని విరజిమ్ముతూ క్రియాశీలత్వాన్ని ప్రసాదిస్తుంది. దౌర్జన్యాలు ఫలించవు. సౌజన్యాలు నిష్ఫలం కావు.

ఆత్మగౌరవం దెబ్బ తింటే మాత్రం, ఆ వ్యక్తిలో అభివృద్ధి అగుపించదు. మనిషికి పశువుకు తేడా ఇక్కడే. గొడ్డును దుడ్డుకర్రతో బాదినా, మరుక్షణమే గడ్డి పడేస్తే చాలు. గుట్టుగా తిని త్రేపుతుంది. కాని, మనిషిని కొట్ట నవసరం లేదు. తిట్టినా చాలు. మనసు గాయ పడుతుంది, మనిషి తిండి మానేస్తాడు. పశువుకు ఆకలి తీరితే చాలు. కాని, ఆకలి కన్నా, ఆత్మగౌరవానికే మనిషి ప్రాధాన్యత నిస్తాడు.

మనిషి ఆత్మగౌరవాన్ని దెబ్బ తీస్తూ సలహా లివ్వ కూడదు. అలా ఇవ్వడం ఆత్మ వినాశానికి దారి తీస్తుంది. పడిపోయిన వ్యక్తిని లేపి కూర్చోబెట్టాలి. ఆ తరువాత, కూర్చున్న వ్యక్తిని ప్రయత్నంతో నిలబెట్టాలి. నిలబడ్డాడా, ఆ తరువాత మెల్లగా నడిపించాలి. ఇది విధాయక పద్ధతి. ఇక్కడే సౌజన్యంలో సౌరభం.

అర్జునా! ఇది నీకు తగింది కాదు అని అర్జునుని వ్యక్తిత్వాన్ని ఆకాశానికి ఎత్తేశాడు శ్రీకృష్ణుడు. తనలో తాను ఆలోచించుకొనే శక్తిని అర్జునునికి ప్రసాదించాడు. వలచిన పేడితనాన్ని చెదర గొడుతూ, మరచిన పురుష వైభవాన్ని తిరిగి ఆవిష్కరిస్తూ అభిభాషించాడు.

ఇది మామూలు విషయం కాదు. మనిషిని మనీషిగా, మనీషిని మహర్షిగా, మహర్షిని మాధవునిగా మలచే మహోత్కృష్టమైన బోధనా విధానం. మనస్సుల్ని మలచి, మనుషులను తీర్చిదిద్దే కార్యంలో మహాశిల్పి మధుసూదనుడు ప్రదర్శించిన అసమాన బోధనా కౌశలాన్ని బిడ్డల విషయంలో తల్లిదండ్రులు, విద్యార్థుల విషయంలో ఉపాధ్యాయులు, భార్యల విషయంలో భర్తలు, ఉద్యోగుల విషయంలో అధికారులు అనుసరించి ఆచరించ గలిగితే, ఆ తరువాత సమాజంలో కనిపించేది ఏదో కాదు, అభ్యుదయమే. ఆదర్శమే. ఆనందమే.

**క్లైబ్యం మాస్మగమః** అన్నప్పుడు, శ్రీకృష్ణుడు అర్జుని మనస్సును పేల్చేశాడు అనిపిస్తుంది. **నైతత్త్వ య్యుపపద్యతే** అన్నప్పుడు అవగాహనను నింపి, ఆశాజ్యోతిని వెలిగించాడని తెలుస్తుంది.

### జ్యోతి ప్రజ్వలనం

సూర్యుడు ఉదయిస్తాడు. విశ్వం వెలుగులతో నిండుతుంది. ఆ వెలుగులో జనులు పయనిస్తారు. పనులు చేసుకుంటారు. ఎవరు ఏ దారిలో పోవాలో, ఎవరు ఏయే పనులు చేయాలో సూర్యుడు నిర్ణయించడు. ఎవరికి వారే నిర్ణయించు కుంటారు. అదంతా వారి వారి స్వభావం మీద, అవసరం మీద ఆధారపడి ఉంటుంది.

అంతే కాదు. సూర్యుడు వెలుగులను విరజిమ్ముతూ ప్రకాశిస్తున్నా, మనం క్రియాశూన్యంగా పడి ఉంటే, నువ్వు ఎందుకని అలా ఉన్నావు? కర్మలు చేయ వెందుకని? అని సూర్యుడు ప్రశ్నించడు. తాను ప్రకాశించే వాడే గాని, నీకు పని కల్పించే వాడు కాదు. నిన్ను పనికి పురికొలిపే వాడు కాడు. ఆ పని అంతా మనదే. మనమే చూసుకోవాలి. మనమే చేసుకోవాలి. మన కొరకే చేసుకోవాలి.





భగవద్గీత జ్ఞానస్వరూపం. గీతాచార్యుడు జ్ఞానరూపుడు. మన హృదయాలలో జ్ఞానప్రదీపాన్ని గీత వెలిగిస్తుంది. ఆ వెలుగులో ఎవరి కార్యాలు వారు పూర్తి చేసుకోవాలి. ఎవరి సమస్యల్ని వారు పరిష్కరించు కోవాలి. సత్యాన్ని అన్వేషించి పట్టుకోవాలి. అసత్యాన్ని విస్మరించి ఆనందంగా జీవించాలి.

శ్రీకృష్ణుడు ఈ రెండు ప్రారంభ శ్లోకాలలో అందించిన సందేశము దీప ప్రజ్వలనమే. సూర్యుడు ఏ ఒక్క వ్యక్తి కోసమో ఉదయించడం లేదు. ఆయన ప్రకాశం అందరి కొరకై ఉంది. భగవద్గీతలో శ్రీకృష్ణుడు అందించిన సందేశము ఒక్క అర్జునుని కొరకే కాదు. వినింది అర్జునుడే అయినా, వినిపించింది మాత్రం యావ ద్విశ్వానికే గాని ఏ ఒక్క వ్యక్తి కోసమో కాదు. విశ్వం లోని వ్యక్తులలో ఒక కాలంలో, ఒక దేశంలో ఉన్న వ్యక్తి అర్జునుడు.

గీత అర్జునుని కొరకే అయితే, అతనికే ఉపయోగ పడాలి. లేదా, ఆ కాలము వారికే ఉపయోగ పడాలి. అర్జునునికి శ్రీకృష్ణుడు బోధించిన విషయములో విశ్వసందేశ ముంది. అందుకే విశ్వ మంతటికీ గీత శిరోధార్య మైంది. అన్ని కాలాలకు, అన్ని దేశాలకు, అందరు వ్యక్తులకు సూర్యప్రకాశం లాగా ప్రమాణ ప్రకాశ మైంది. ప్రమను ఆరబోస్తూ భ్రమను అదృశ్యం చేస్తోంది. ఐదు వేల సంవత్సరాలు గడచినా నేటికీ నిత్య నూతనంగా మానవాళిపై తన ప్రభావాన్ని చూపుతోంది. జ్ఞాన ప్రభంజనమై అంతటా వీస్తూ ఉంది.

### పిరికితనం పనికిరాదు

చీకటిలో ఏది ఎక్కడుందో, ఎవరు ఎక్కడున్నారో తెలియదు. అందుచేత, ధీరుడు కూడా చీకటిలో భీరు డవుతాడు. కాని, ఒక వైపు వెలుగులు విరజిమ్ముతున్నా విలవిల లాడే వ్యక్తి పిరికివాడు. అతని మనసులో పిరికితనం ఉంది. గుండెలో గుబులు ఉంది. అదే దుర్బలత్వము. మనోదౌర్బల్యము. హృదయ దౌర్బల్యము. అదే మనిషికి అభద్రం. క్షుద్రం. నీచం. దీపమున్నా దిగులు తప్పని దౌర్బల్యం.

కృష్ణుడు కొరడా ఝుళిపించాడు. అర్జునునిలో చలనం మొదలైంది. మగతను విడిచాడు (**క్షుద్రం హృదయ దౌర్బల్యం**). తమోగుణం నుండి తమాయించు కున్నాడు. రజోగుణం రాజిత మైంది. తమోగుణ ప్రేరితుడై యుద్ధం చేయలేను అనే సంకేతా న్నిస్తూ ధనుర్బాణాలు పడేసిన సవ్యసాచి, భగవంతుని సందేశముతో కనువిప్పు కలిగి, రజోగుణము చేత ప్రభావితుడై, యుద్ధం ఎలా చేసేది? అంటూ భాషిస్తున్నాడు.

వేలాది సంవత్సరాలుగా అంతటా గీతాప్రదీపం వెలుగుతూనే ఉంది. కానీ, దేదీప్యమానంగా గీతాజ్యోతి వెలుగుతున్నా భయం చీకటిలో బిక్కుబిక్కు మంటూ బ్రతికే వారే ఎక్కువగా కనిపిస్తూ ఉంటారు. ఈ భయాలే మహాజాడ్యాలు. మరణాలు. మారణహోమాలు.

కళ్ళు మూసుకుంటే వెలుగు లుండి ఏమి లాభం? వినియోగము తెలియాలి. వినియోగము అంటే వినింది ఆచరణలో పెట్టడ మని అర్థము. అది చేయలేని దోషం వల్ల గీత మన వద్దే ఉన్నా, రాత మారడం లేదు.

శ్రీకృష్ణుని పలుకులు పార్థునికి ప్రాణవాయువును అందించాయి. ఆశల్ని చిగురింప చేశాయి. కదలిక ప్రారంభ మైంది. ఏ దౌర్బల్యమో ఏమో, అదేదో తన మనసు లోనే ఉండి కలత పెడుతూ ఉంది అనేది అర్జునునికి అర్థమై పోయింది. అది గమనించిన గోవిందుడు, 'లే, వదిలేయ్!' (**త్యక్త్వా + ఉత్తిష్ఠ**) అని ఆజ్ఞాపించాడు.

మనల్ని ఎవ్వరూ కట్టి పడేయ లేదు. మనమే అనవసరంగా భయాన్ని పట్టుకున్నాం. ధైర్యాన్ని పోగొట్టు కున్నాం. పట్టుకున్న దానిని విడిచి పెడితే చాలు. ఆ తరువాత, పట్టు లేని భయాలు వాటంతటవే పారిపోతాయి.

అందుకే, బలహీనతల్ని విడిచేయ్! బలంగా లేచి నిలబడు అని హుంకరించాడు హృషీకేశుడు.

దౌర్బల్యముతో స్నేహం మంచిది కాదు. పిరికితనము శత్రువే గాని నేస్తం కాదు. శత్రువును ఉపేక్షించ కూడదు. శత్రు శేషాన్ని ఉంచకూడదు అంటారు పెద్దలు. అర్జునా! శత్రుతాపనా! లే! నిలబడు అన్నాడు పరమేశ్వరుడు.

**పరంతపా! పని సాగనీ**

పార్థునికి పరంతపుడు అని పేరు. అంటే శత్రువును పీడించే వాడు అని అర్థము. ఆ పని జరగాలి. అప్పుడే పార్థుడు పరంతపుడు. శత్రువు బయట ఉన్నాడు. పోరాడటానికి ఎదురుగా నిలబడి ఉన్నాడు. అతణ్ణి పీడించాలి. ఎందుకో, అది జరగడం లేదు. బాహ్యం లోని శత్రువును పీడించ వద్దంటూ, లోపల ఎవరో మరొక శత్రువు పార్థుణ్ణి పీడిస్తున్నాడు. ఆ శత్రువే అవివేకము. అదే హృదయ దౌర్బల్యం. ముందుగా అంత శ్శత్రువును మట్టు పెట్టాలి. ఆ తరువాత బాహ్య శత్రువును వధించ డానికి అవరోధా లుండవు. అందుకనే, 'అర్జునా! లే. నిలబడు' అన్నాడు శ్రీకృష్ణుడు.

**అర్జున ఉవాచ :**

**కథం భీష్మ మహం సంఖ్యే ద్రోణం చ మధుసూదన ।**
**ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హా వరిసూదన ॥** 4

*కథం-భీష్మం-అహం-సంఖ్యే-ద్రోణం-చ-మధుసూదన*
*ఇషుభిః-ప్రతియోత్స్యామి-పూజార్హౌ-అరిసూదన*

| | | | |
|---|---|---|---|
| మధుసూదన | = హే కృష్ణా! | సంఖ్యే | = యుద్ధము నందు |
| అహం | = నేను | అరిసూదన | = శ్రీకృష్ణా! |
| పూజార్హౌ | = పూజింప దగిన | ఇషుభిః | = బాణాలతో |
| భీష్మం | = భీష్ముని | కథం | = ఏ విధముగా |
| ద్రోణంచ | = ద్రోణుని | ప్రతియోత్స్యామి | = ఎదిరించి పోరాడ గలను? |

**అర్జునుడు అడుగుతున్నాడు :**

**మధుసూదనా! భీష్మద్రోణులు పూజార్హులు. వాళ్ళను నేను ఎలా ఎదిరించేది? అరిసూదనా! యుద్ధంలో వాళ్ళపై బాణాలు ఎలా వేసేది?**

**వ్యాఖ్య**

శ్రీకృష్ణుని మాటలు అర్జునునిలో ఏదో కొంత మార్పును కలిగించినట్లు కనిపిస్తోంది. కలత చెందిన మనస్సు కొద్దిగా కుదుట పడినట్లు అగుపిస్తోంది. ఆవేశము అదుపులో ఉంది. కన్నీళ్ళు లేకుండా చూస్తున్నాడు. ఆవేశం లేని ఆలోచనతో పలుకు తున్నాడు. సరళమైన భాషలో, మృదువైన పలుకులతో, సున్నితంగా భాషిస్తూ తన సంశయాలను శ్రీకృష్ణునికి వినిపిస్తున్నాడు.

**అవగుణము కాదు - అప్రియము**

ఈ అవివేకము నీకు ఎక్కడి నుండి వచ్చింది? భయాన్ని విడిచి పెట్టు. ఇది నీకు తగింది కాదు. మనో దౌర్బల్యము నీచ మైనది. శ్రీకృష్ణుడు పలికిన ఈ మాటల్ని అర్జునుడు జీర్ణించుకోలేక పోతున్నాడు.





కృష్ణా! నేను యుద్ధం చేసే స్థితిలో లేను అనేది వాస్తవమే. దానికి కారణం ఏమిటి? నేను భయపడి యుద్ధం చేయడం లేదని నీవు అభిప్రాయ పడినట్లు నీ మాటల్లో తెలుస్తూ ఉంది. నేను భయపడి యుద్ధం విరమించడం లేదు. పిరికితనంతో పారిపోవడం లేదు. నా యుద్ధ విముఖతకు, నాకు సరిపడని ఈ విధమైన కారణాలను ఆపాదించడం నన్ను బాధిస్తోంది. పుండుపై కారం చల్లినట్లు ఉంది. కాకిని కూర్చో బెట్టినట్లు ఉంది.

అయిష్టులను వధించడం సాధ్యమే. ఇష్టమైన వారిని ఎలా చంపాలి? శత్రువులను చంపగలం. మిత్రుల్ని చంపే దెలా? బంధువుల్ని చంపే దెలా? అని మథన పడుతున్నాను. కృష్ణా! నువ్వు నన్ను అడుగుతా వేమో, దుష్టులైన దుర్యోధనాదులు కూడా బంధువు లేనా? అని. అచ్యుతా! దుర్యోధన, దుశ్శాసనాదుల్ని చంపడానికి నేను వెనుకాడటం లేదు. ఎటొచ్చి, భీష్మ ద్రోణాదుల విషయం లోనే కలత పడుతున్నాను. వారిపై బాణాలను ఎక్కుపెట్టడాన్ని ఊహించు కోలేక పోతున్నాను.

భీష్మ డెవరు? ద్రోణు డెవరు? భీష్ముడు కులవృద్ధుడు. పైగా గుణవృద్ధుడు. పెంచి పోషించిన వాడు. వందనీయుడు. ద్రోణుడు ఆచార్యుడు. విద్య నేర్పిన వాడు. విజయానికి బాట వేసిన వాడు. కన్నబిడ్డ కన్నా నన్నే మిన్నగా భావించాడు. ప్రాణ సమానంగా ప్రేమించాడు. ఇలాంటి వారిని ఎలా చంపేది? నాకు చేతు లున్నది వాళ్ళను పూజించుటకే గాని వధించుటకు కాదు. వాళ్ళకు నమస్కరించ వలసిన చేతులు వాళ్ళను ఎలా నాశనం చేస్తాయి?

అచ్యుతా! ఇలా ఆలోచించడం దుర్బలత్వమా? ఇది నాకు తగనిదా? వీరుడు ఇలా ఆలోచించ కూడదా? ధనుర్బాణాలు పట్టగానే దయ దూరం కావాలా? కవచం ధరించ గానే కరుణను వదిలేయాలా? వీరుడు అంటే కఠినుడా? వీరుడికి ప్రేమలు పనికి రావా? మమతలు మంచివి కావా? అస్త్రశస్త్రాలే కాని అనుబంధాలు, అనురాగాలు ఉండ కూడదా?

పూజార్హు లైన పెద్దలను, గురువులను వధించుటకు వెనుకాడటం అవగుణమా? కృష్ణా! అధైర్య మనే అవగుణంతో నేను యుద్ధాన్ని విరమించడం లేదు. అప్రియమైన కార్యాన్ని ఆచరించలేక పోతున్నాను. అధర్మ కార్యాన్ని చూచి భీతి చెందుతున్నా. అంతే.

**చెప్పేవాళ్ళు - చేసేవాళ్ళు**

మాధవా! కడుపులో చల్ల కదలకుండా కబుర్లు చెప్పేవాళ్ళు చాలా మంది ఉంటారు. చెప్పేవాళ్ళు ఎన్నైనా చెబుతారు. చేసే వాళ్ళదే గదా కష్ట మంతా? చెప్పడం తేలికే. కాని, చంపడం అంత తేలిక కాదు. ఎవరైనా, ఎన్నైనా చెప్పగలరు. అలాగని, అందరూ అందరినీ చంపలేరు. అంతమాత్రాన కశ్మల మంటూ కషాయాన్ని త్రాగించే ప్రయత్నం చేయడం సముచిత మేనా?

ఏమిటి, నువ్వేనా చంపేది? మేము చంపలేదా? అంటావేమో! అందుకే నిన్ను మధుసూదనా! అని పిలుస్తున్నా! నువ్వు చంప లేదని నేను అనడం లేదు. నువ్వు చంపింది ఎవరిని? రాక్షసుల్ని చంపావు. మధువనే రాక్షసుని వధించావు. అందుకని మధుసూదనుడ వయ్యావు.

అయ్యా! నేను చంప వలసింది ఎవరిని? రాక్షసుల్ని కాదు. మహాత్ముల్ని. రాక్షసుని వధించావు కనుక అది నీకు బిరుదుగా మారింది. మధుసూదన నామం మారుమ్రోగింది. నేను భీష్ముణ్ణి వధిస్తే నన్ను జనం కీర్తిస్తారా? భీష్మారీ! అని శ్లాఘిస్తారా? ఈ కార్యము నాకు తగినదా? ఇది స్వర్గహేతువా? ఇది కీర్తికరమా? కృష్ణా! అందుకే అంటున్నాను. ఇది నాకు తగినది కాదు ***(ఏతత్ మయి న ఉపపద్యతే)***. ఆచార్యులను చంపడం ఆర్యుల లక్షణం

కాదు (*అనార్యజుష్టం*). ఈ అమంగళం నన్ను స్వర్గానికి అనుమతించదు (*అస్వర్గ్యం*). ప్రపంచంలో శిష్ట గర్హిత మైన కార్యాన్ని ఆచరించిన వ్యక్తిగా నన్ను చూస్తారు. ఇది అవమానం (*అకీర్తికరం*).

ఏ మూడు భయాలు తన అంతర్యంలో బీభత్సాన్ని సృష్టించి యుద్ధ వైముఖ్యానికి కారణ మయ్యాయో, వాటిని ఈ దశలో కూడా పార్థుడు పట్టుకునే పలుకు తున్నాడు.

మధుసూదనా! నా చేతల్ని చూచి చీదరించుకోకు. నా మనసును కూడా చూడు. నా మాటలు నా మనస్సును ఆవిష్కరించలేక పోతున్నా యేమో! సున్నితమైన నా మనసును చూడు. సుహృద్భావంతో కొట్టుకుంటున్న నా హృదయాన్ని చూడు.

ప్రాణం తీయడం ఎవరైనా చేయ గలరు. అలా తీసిన వాళ్ళెవరైనా తిరిగి ప్రాణం పోయ గలరా? నువ్వు ఎందరినో చంపావు. నేను కూడా చంపాను. ప్రస్తుతం చంపలేక పోతున్నా నంటే చంపడం తెలియకనా? చంపడానికి ధైర్యం లేకనా? ఇలాంటి మాటలు మరొకరు అంటే బాధ ఉండదు. అన్నీ తెలిసిన నువ్వు అంటున్నావే, అక్కడే నేను ఏదో అవుతున్నాను.

అర్జునా! మన శరీరం లోని అవయవమే అయినా, పాడై పోయిన దుష్టాంగాన్ని శస్త్ర చికిత్స చేసి దూరం చేసుకోవడం లేదా? బంధువులే కావచ్చు. అలాగని, దురాత్ములు, అధర్మపరులు, దుష్టులైన బంధువులను వధించక పోతే ఎలా? నన్ను చూసి నేర్చుకో. కంసు డెవరు? స్వయాన నాకు మేనమామ. అలాగని మమకారంతో చెట్టెక్కి కూర్చున్నానా? మెడ వంచి, తలను త్రుంచేశాను. నువ్వు అలా ఎందుకు చేయవు? అని నన్ను ప్రశ్నిస్తా వేమో కృష్ణా!

చూడు. బంధువైన కంస భూపతిని నీవు వధించింది నిజమే. ఆ పని చేయడానికి నేనూ సిద్ధమే. బంధువు, సోదరుడైన దుర్యోధన భూపతిని చంపడానికి నా కేమీ అభ్యంతరం లేదు. బంధువులుగా పుట్టినా వీళ్ళందరూ శత్రువులుగా పెరిగిన వాళ్ళే. వాళ్ళు మనకు శత్రువులే. వాళ్ళను చంపడం దోషం కాదు. అందుకే కదా, నిన్ను అరిసూదనా! అని పిలిచాను.

కృష్ణా! నువ్వు చంపిన వాళ్ళందరూ రాక్షసులు. శత్రువులు. అందుకే నువ్వు మధుసూదనుడివి. అరిసూదనుడివి. ఇక నా విషయం అంటావా? నేను కూడా అలా ఎందరినో చంపాను. కాని, గురువును చంపడం అనేది ఇప్పటి వరకు నువ్వు చెయ్యలేదు. నేనూ చెయ్యలేదు. కాకపోతే, అలాంటి సంక్లిష్టమైన సమస్య ఎదురైన సమయంలో నువ్వు చెప్పేవాడి వయ్యావు. నేను చేసేవాడి నయ్యాను. అసలు తంతు ఇక్కడే ఉంది.

శత్రువుల్ని వధించి 'అరిసూదనా!' అని పిలిపించు కున్నావు. ఇప్పుడు గురువును వధించి, 'ఆచార్య సూదనా' అని నన్ను తిట్టించుకో మంటావా? కృష్ణా! ఇదీ నా బాధ. నా మనసు లోని వ్యథ. అందుకే చంపలేక పోతున్నాను. చంప వలసి వస్తుందని యుద్ధం చేయలేక పోతున్నాను. బలహీనుణ్ణి కాను. బలమైన కారణాలతో సతమత మవుతున్న వాణ్ణి అని తన విషాదం వెనుక దాగి యున్న కారణాలను బైట పెట్టాడు అర్జునుడు.

బావుంది. మరి, యుద్ధాన్ని విరమించి ఏమి చేయాలి? యుద్ధాన్ని విరమిస్తాడు కనుక రాజ్యం రాదు. రాజ్య సుఖాలూ ఉండవు. అవి లేకపోయినా ఫరవాలేదు అనుకుందాం. కనీసం బ్రతకడానికి మార్గమంటూ ఉండాలి కదా! అయిదు గ్రామాలు ఇవ్వడానికి కూడా అంగీకరించని దుర్యోధనుడు రేపు తన రాజ్యంలో కనీసం అద్దె ఇంట్లో బ్రతకడాని కైనా పాండవులకు అవకాశం ఇస్తాడా? దుర్యోధనుని రాజ్యంలో పాండవులకు అద్దెకు ఇల్లు ఇచ్చేవారు ఉంటారా? మరి ఎలా బ్రతకాలి? అది కూడా చెప్పేస్తున్నాడు అర్జునుడు.





**గురూ నహత్వా హి మహానుభావాన్ శ్రేయో భోక్తుం భైక్ష్య మపీహలోకే ।**
**హ త్వార్థకామాంస్తు గురూ నిహైవ భుఞ్జీయ భోగా న్రుధిరప్రదిగ్ధాన్ ॥** 5

**గురూన్-అహత్వా-హి-మహానుభావాన్-శ్రేయః-భోక్తుం-భైక్ష్యం-అపి-ఇహలోకే**
**హత్వా-అర్థకామాన్-తు-గురూన్-ఇహ-ఏవ-భుంజీయ-భోగాన్-రుధిరప్రదిగ్ధాన్**

| | | | | | |
|---|---|---|---|---|---|
| మహానుభావాన్ | = | మహానుభావులైన | గురూన్ | = | గురువులను |
| గురూన్ | = | గురువులను | హత్వా తు | = | చంపి |
| అహత్వా | = | చంపక | ఇహ ఏవ | = | ఈ లోకము నందే |
| ఇహలోకే | = | ఈ లోకమున | రుధిర ప్రదిగ్ధాన్ | = | రక్తసిక్త మైన |
| భైక్ష్యమపి | = | భిక్షాన్న మైనను | అర్థకామాన్ | = | అర్థకామాలైన |
| భోక్తుం | = | భుజించుట | భోగాన్ | = | భోగాలను |
| శ్రేయః హి | = | శ్రేయస్కరము కదా! | భుంజీయ | = | అనుభవిస్తాను |

**కృష్ణా! గురువులు మహానుభావులు. వాళ్ళను బలి చేసి, నెత్తురు కూడు తిని బ్రతకడం కన్నా వాళ్ళను చంపడం మానేసి ఈ లోకంలో భిక్ష మెత్తుకొని జీవించడం శ్రేయస్కరము కదా!**

**వ్యాఖ్య**

**శాంతి జీవనం**

రణరంగంలో శత్రు పక్షాన ముందు వరుసలో ఉన్న సేనాధిపతులు భీష్మద్రోణులు. ఇంతవరకు ఆచార్య స్థానాన్ని అలంకరించిన వాళ్ళు. సమున్నతులు. పూజార్హులు. వాళ్ళనే ముందుగా వధించాలి. లేదా వాళ్ళ చేత వధింప బడాలి. ఇది అర్జునుని సమస్య. ఎటు ఆలోచించినా మిగిలేది అశాంతే.

అలా ఎందుకు అనుకోవాలి? విజయాన్ని సాధించి, రాజ్యభోగాలను అనుభవిస్తూ, ఆనందంగా శాంతి జీవనాన్ని సాగించ వచ్చు కదా! అలా జీవించే అవకాశం ఉంటే అర్జునుడు యుద్ధానికి వెనుకాడే వాడు కాదు. అలా జీవించడం సాధ్యం కాదు అని అర్జునుని అంతర్యం ఘోషిస్తూ ఉంది.

విజయాన్ని సాధిస్తే, రాజ్యం లభిస్తుంది. రాజ్యభోగాలు ప్రాప్తిస్తాయి. అవన్నీ అర్థకామాలే. వాటి వల్ల సుఖాలు ప్రాప్తించవు. ఒకవేళ ప్రాప్తించినా అవి నైమిత్తిక సుఖాలే గాని నిత్యసుఖం కాలేవు.

అర్థ మనే పురుషార్థం భద్రతకు సంబంధించింది కాగా, కామ మనే పురుషార్థం సుఖానికి సంబంధించింది. రాజ్యం లభిస్తే తద్వారా వాంఛింప దగినవి ప్రధానంగా ఈ రెండే.

భద్రత అనేది కేవలం ధనం వల్ల రాదు. నిజం చెప్పాలంటే అర్థం వల్లే అభద్రత పెరుగుతుంది. రాజ్యాలు, భోగాలు లభించిన వారు తృప్తి చెందిన దాఖలాలు ఈ ప్రపంచంలో ఎంత అన్వేషించినా అగుపించవు (***న హి లోకే విత్తలాభః కస్యచిత్ తృప్తి కరోద్రష్టః***).

ఇక సుఖాలు అంటావా? వాటిలో కూడా తృప్తి లేదు. ఏది ఎవరికి ఎప్పుడు ఇష్టమో, ఎప్పుడు అయిష్టమో చెప్పలేము. ఇష్టాయిష్టాలు మారుతూ ఉంటాయి. వాటితో పాటు సుఖాలు పారిపోతూ ఉంటాయి. ఇక కామం అనే పురుషార్థం వల్ల ప్రాప్తించే దేముంటుంది?

నిస్సారమైన ఈ అర్థకామాల కొరకు మహానుభావులైన గురువుల్ని వధించాలా? అలా వధించి సాధించే దేముంటుంది? అంతా అశాంతే. అభద్రతే. ఇక శాంతి ఎక్కడ? ఎప్పుడు?

**గెలిచినా శాంతి రాదు**

**ఓడితే శాంతి లేదు**

అనిత్యము లైన అర్థకామాలను కొంత కాలం అనుభవించ డానికి మహానుభావు లైన గురువులను వధించడమా? దారుణమైన ఈ పాప కార్యానికి ఫలం రాజ్యసుఖమా? ఎక్కడుంది సుఖం? అంతా దుఃఖమే. నరకమే. పశ్చాత్తాప జీవనమే.

ప్రతి సుఖానుభవంలో దుఃఖమే తొంగి చూస్తూ ఉంటుంది. రమణీయ భోగాలన్నీ గురువుల్ని, పెద్దల్ని రాల్చేసుకొని సాధించినవే గదా? అని అంతర్యం నిలదీస్తూనే ఉంటుంది. కమనీయమైన సుఖాలు, కమ్మని రుచికరమైన పదార్థాలు ఒక వైపు నోరూరిస్తున్నా, మరో వైపు అవి రక్తసిక్తంగా కళ్ళకు కనిపిస్తూనే ఉంటాయి. ఇక భోగా లేవి? సుఖా లెక్కడ? అంతా దుఃఖమే. అంతా నరకమే.

బ్రతికినంత కాలము భోగానుభవంలో కూడా నరకమే దర్శనీయంగా ఉంటుంది. మరణించిన తరువాత ఈ ఘోర పాప ఫలితంగా నరకము లోనే జీవించ వలసి వస్తుంది. గెలిచినా ఇహపర లోకాలలో నరకానుభవమే కనుక శాంతి అనేది కుందేటి కొమ్మే అవుతుంది. ఒకవేళ ఓటమిని చవి చూస్తే, ప్రత్యేకించి చెప్పే దేముంటుంది? ఆ ఆలోచన వస్తే చాలు, నరకంలో ఉన్నట్లే ఉంటుంది. కనుక, ఎలా చూచినా యుద్ధము అవాంఛనీయమే. ఇలాగే చూస్తూ ఉంది అర్జునుని మనస్సు.

**బ్రతుకు తెరువు**

యుద్ధాన్ని విరమించి, రాజ్యాన్ని పోగొట్టుకొని ఆ తరువాత ఎలా బ్రతకాలి? ఎలాగైనా బ్రతకవచ్చు. బ్రతికే వాళ్ళందరూ యుద్ధాలు చేసే బ్రతుకు తున్నారా? జీవించే వాళ్ళందరూ రాజ్యాలు ఏలుతూనే జీవిస్తున్నారా? ఇంతకాలం పాండవులు ఏ రాజ్యాలు ఉండి జీవించారు? బ్రతక డానికి రాజ్యాలు అవసరమా? రాజ్యాలు ఉన్నంత మాత్రాన సుఖంగా బ్రతక గలరా? రాజ్యం దుర్యోధనుడికి కూడా ఉంది. సుఖ మెక్కడుంది? శాంతి ఎక్కడుంది? అనుక్షణం ఘర్షణే. బ్రతుకంతా సంఘర్షణే. రాజ్యమూ ఘర్షణే. రాజ్యము కొరకు సాగించే సమరమూ సంఘర్షణే.

అది సరే. మరి, ప్రాణాన్ని నిలుపు కోవాలి అంటే, దేహాన్ని రక్షించు కోవాలి కదా! రిక్త హస్తాలతో పూట గడిచే దెలా? ఆకలి కడుపుతో కంటిపై రెప్ప వాలే దెలా? ఏముంది? కోరుకొనే స్వభావం గల వారికి ఎన్నున్నా తృప్తి ఉండదు. కోరికలను ప్రక్కన పెట్ట గలిగితే, ఉన్నది ఏదైనా తృప్తినే ఇస్తుంది.

కృష్ణా! మహాత్ముల్ని, గురువుల్ని చంపి, రక్తంతో తడిసిన భోగాలను అనుభవించడం కన్నా, ఈ లోకంలో బిచ్చ మెత్తుకొని తృప్తిగా జీవించడమే యుక్త మని భావిస్తున్నా. మాకు రాజ్యం లేక పోవచ్చు. మేము రాజ్యం లోనే ఉంటాము. రాజులు మమ్మల్ని పట్టించుకోక పోవచ్చు. ప్రజలు పట్టెడన్నము పెట్టక పోరు. నాలుగిళ్ళ ముందు నిలబడి, ఒక చెట్టు క్రింద కూర్చుంటే చాలు. కాలం గడుస్తుంది. బ్రతుకు నడుస్తుంది. జీవన యాత్రలో బ్రతుకు బండి నడవ టానికి ఇంధనాన్ని పుణ్యాత్ములు సమకూర్చుతూనే ఉంటారు. చాలు. కావలసింది ఇంధనమే గాని ధనం కాదు కదా?

యుద్ధం చేసి రాజ్యాన్ని చేజిక్కించు కోవచ్చు. దాని వల్ల ఒరిగే దేమిటి? రక్తసిక్త మైన ఆహారాన్ని భుజిస్తూ, బాధాతప్త మైన స్మృతులతో బ్రతికినంత కాలం నరకాన్ని అనుభవిస్తూ బ్రతకాలి. దారుణ మైన రణం వల్ల సంక్రమించిన మహా పాపఋణాన్ని తీర్చడానికి మరణించిన తరువాత నరకం లోనే మకాం పెట్టాలి.





అలా కాకుండా, యుద్ధాన్ని విరమించి, బిచ్చ మెత్తుకొని జీవిస్తే బ్రతికినంత కాలం తృప్తిగా జీవించ వచ్చు. మరణించిన తరువాత, పాప ఋణం లేదు కనుక పాప ఫలితాన్ని అనుభవించ డానికి నరకానికి వెళ్ళ నవసరం లేదు. దోష రహితమైన బ్రతుకు తెరువు ఫలితంగా స్వర్గాన్ని పొందవచ్చు. కనుక, మరణ సదృశ మైన రణం కన్నా, అమృత తుల్యమైన రణ విరమణమే శ్రేష్ఠంగా కనిపిస్తోంది.

**అర్హత ఉందా?**

భిక్షాన్నము భుజించి బ్రతుకు తెరువు చూసుకోవాలి అనుకోవడం బాగానే ఉంది. అర్జునా! నువ్వు భిక్షార్హుడి వేనా? భిక్ష మెత్తే అర్హత నీకు ఉందా? అదేమిటి? రాజ్యాధికారం చెలాయించడానికి అర్హత ఉండాలి. అడుక్కు తినడానికి కూడా అర్హత కావాలా? నాలుగిళ్ళ ముందుకు నడిచి పోవడానికి రెండు కాళ్ళు ఉంటే చాలు. రెండు మాటలతో అర్థించడానికి ఒక్క నోరుంటే చాలు. పెట్టింది పట్టడానికి రెండు చేతులు చాలు. ఇంకేమి అర్హత కావాలి?

అర్జునా! నీ లాగే అందరూ జోలె పట్టుకుంటే, ఆ తరువాత పెట్టే వాళ్ళు ఎవరుంటారు? అర్జును డంతటి వాడే జోలె ఆనంద మని భావించాడు కదా అని అందరూ జోలె కుట్టించుకొని భుజానికి తగిలించుకుంటే ఏమవుతుంది? దేశం బిచ్చగాళ్ళ రాజ్యంగా మారి పోదా? రాజ్యంలో అందరూ బిచ్చగాళ్ళైతే, రాజు పెద్ద బిచ్చగాడు కాకుండా పోతాడా? దుర్యోధన మహారాజుని యుద్ధం చేయకుండానే బిచ్చగాణ్ణి చేయడానికి ఈ ప్రణాళికను రూపొందించావా అర్జునా?

**అర్హు లెవరు? అర్జునుడు అర్హుడేనా?**

భిక్ష మెత్తుకొని జీవించడానికి అర్హత అవసరమా? అవును. అవసరమే. లేకపోతే, సోమరితనమే అర్హతగా మారి, దేశం దిక్కుమాలిన దవుతుంది. మరో విధంగా జీవించ డానికి అవకాశం లేనివాళ్ళే భిక్ష మెత్తుకొని బ్రతకాలి. అదే అర్హత.

ఎవరూ లేని, ఏ దిక్కూ లేని వారు భిక్షార్హులు. అర్జునుడికి అన్నదమ్ము లున్నారు. ఆత్మీయు లున్నారు. అత్తమామ లున్నారు. కొడుకులు, కోడళ్ళు ఉన్నారు. దేహాంగాలన్నీ సౌష్ఠవంతో శోభిస్తున్నాయి. అలాంటి వాడు భిక్షార్హు డెలా అవుతాడు?

ఇకపోతే రెండవ తెగకు సంబంధించిన వాళ్ళు బ్రహ్మచారులు. గురువు వద్ద శుశ్రూష చేస్తూ విద్య నార్జించే బ్రహ్మచారులు భిక్ష మడగ టానికి అర్హులు. సంపాదన లేకుండా జ్ఞాన సముపార్జనే సంపాదనగా జీవిస్తూ ఉంటారు కనుక, అలాంటి వటువులు భిక్షాటన చేసి, గురువును పోషిస్తూ, తమను పోషించుకుంటూ విద్యార్థి దశను పూర్తి చేసుకుంటారు. కనుక బ్రహ్మచారులు భిక్షార్హులు. అలా చూసినా అర్జునుడు అర్హుడేనా? అర్జునుడు బ్రహ్మచారి ఎలా అవుతాడు? అభిమన్యుడు అంగీకరిస్తాడా? సుభద్ర సుముఖ మేనా?

భిక్షాటన చేయడానికి అర్హులు అనాథులు, బ్రహ్మచారులే గాక, మరో తెగ వారు కూడా ఉన్నారు. వారే సన్యాసులు. సర్వసంగ పరిత్యాగులు. సమస్తాన్ని త్యజించి, జ్ఞానాభ్యాసమే ప్రధానంగా కలిగి ఉన్నారు కనుక, శాస్త్రజ్ఞుల్ని ప్రభుత్వం పోషించినట్లు, సన్యాసుల్ని సమాజం ఆదుకుంటుంది. శాస్త్రజ్ఞుల ప్రయోగ జనిత ఫలితాలు ప్రజలకు అందుతాయి కనుక ప్రభుత్వం వారిని పోషిస్తుంది. సాధు పురుషుల జ్ఞానం సమాజ కళ్యాణానికి దోహద పడుతుంది కనుక సమాజం సాధువుల్ని పోషిస్తుంది.

అలా చూచినా కూడా అర్జునుడు భిక్షాటనకు అర్హుడు కాడు. అర్జునుడు గృహస్థుడు. సన్యాసులను

పోషించ వలసిన వాడే గాని, సన్యాసి లాగా పోషింప దగిన వాడు కాడు. కనుక భిక్షార్హత అర్జునునికి లేదు. ఆ మాట కొస్తే, నేను సన్యాసినే కదా! అంటాడేమో అర్జునుడు.

సుభద్రా పరిణయం ఎలా జరిగింది? సన్యాసి వేషం లోనే కదా సాంగోపాంగంగా సర్వమూ సాగి పోయింది. కనుక, ఎప్పుడో విద్యాభ్యాసం చేసి పట్టభద్రుడైన వాడు నేడు ఉద్యోగాన్ని సంపాదించు కున్నట్లు, పూర్వం వేసిన సన్యాసి వేషం నేడు భిక్షాటనకు అర్హతను కల్పించదా?

అయ్యా! సుభద్రాపతీ! వేషాలు మోసాలు చేయడానికి పనికొస్తాయి. బ్రతుకును మోయడానికి పనికి రావు. సన్యాసులు భిక్షార్హులని శాస్త్రం చెప్పిందే గాని, 'ఆహా నా పెళ్ళంట' అని లోలోన మురిసిపోతూ, పై పైన మంత్రాలు పలికి మాయలు చేసే కుహనా సన్యాసులు భిక్షార్హులని శాస్త్రం ఎక్కడా చెప్పలేదు.

**అర్జునుని ఆంతర్యం**

భిక్ష మెత్తుకొని జీవించడానికే సవ్యసాచి అంతర్యం సిద్ధపడి పోయింది. వికలాంగుడిగా తనకు అర్హత లేదు. బ్రహ్మచారి కాలేడు. ఇక మిగిలింది సన్యాస మొక్కటే. ప్రస్తుతం అర్జునుడు సన్యాసి కాడు. గృహస్థుడు. గృహస్థుడు బ్రహ్మచారి కాలేడు. కాని, సన్యాసి కాగలడు. అదే జరిగితే, భిక్షాటనకు అర్హత లభించినట్లే. అదే అర్జునుని అంతర్యం.

గురువులు *( గురూన్ )*, మహానుభావులు *( మహానుభావాన్ )*, పూజార్హులు *( పూజార్హౌ )*, శ్రేయస్సు *(శ్రేయః)* అంటూ అర్జునుని శ్లోకాలలో, మొక్కల్లో పువ్వు ల్లాగా పరిమళిస్తూ ప్రకాశిస్తున్న పదాలన్నీ అర్జునుని అంతర్యానికి అద్దం పడుతున్నాయి. సన్యాసానికి ఉద్యుక్త మయ్యే హృదయాన్ని ప్రదర్శిస్తున్నాయి. కర్మల కన్నా, కర్మసన్యాసము వైపే మొగ్గు చూపుతున్న పార్థుని బుద్ధికి సాక్షిగా నిలుస్తున్నాయి.

మమకారం ఒక వైపు మనస్సును మెలి పెడుతోంది. మమకారాన్ని త్యజించడం సాధ్యం కాక, మమకారానికి కారణమైన అహంకారాన్నే త్యజించాలని అస్పష్టంగా ఆలోచిస్తున్నాడు అర్జునుడు. అది దుస్సాధ్య మని, అసాధ్య మని కర్మయోగ విశ్లేషణలో అర్జునునితో పాటు ముమ్ముందు మనమూ అర్థం చేసుకుంటాము. కాని, అవగాహన కొరవడిన ఈ దశలో అసాధ్యాలు సుసాధ్యాలుగా అగుపించడం దుస్సాహసమే అయినా దుస్సాధ్యం మాత్రం కాదు. ఆ కోణం లోనే మమకారాన్ని భుజాని కెత్తుకుంటూ ప్రసంగాన్ని తరువాత శ్లోకంలో కూడా కొనసాగిస్తున్నాడు కౌంతేయుడు.

**న చైత ద్విద్మః కతరన్నో గరీయో యద్వా జయేమ యది వా నో జయేయుః ।**
**యానేవ హత్వా న జిజీవిషామ స్తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః ॥ 6**

*న-చ-ఏతత్-విద్మః-కతరత్-నః-గరీయః-యత్-వా-జయేమ-యది-వా-నః-జయేయుః*
*యాన్-ఏవ-హత్వా-న-జిజీవిషామః-తే-అవస్థితాః-ప్రముఖే-ధార్తరాష్ట్రాః*

| | | | |
|---|---|---|---|
| యాన్ | = ఎవరిని | నః | = మమ్మల్ని |
| హత్వా | = చంపి | జయేయుఃయది వా | = వాళ్ళే జయిస్తారో |
| న జిజీవిషామః | = జీవించుటకు ఇష్టపడమో | నః | = మాకు |
| తే | = అట్టి | కతరత్ | = ఏది |
| ధార్తరాష్ట్రాః | = ధృతరాష్ట్ర సంబంధులు | గరీయః | = శ్రేష్ఠమో |
| ప్రముఖే | = ఎదురుగా | ఏతత్ చ | = ఈ విషయమును కూడా |
| అవస్థితాః ఏవ | = నిలబడ్డారు కదా! | న విద్మః | = ఎరుగము |
| జయేమ యద్వా | = మనము జయిస్తామో | | |





**కృష్ణా! యుద్ధ రంగంలో మనం ఉన్నాం. మనం జయిస్తామో, వాళ్ళు గెలుస్తారో తెలియదు. మనతో పోరాడటానికి ధృతరాష్ట్రునికి సంబంధించిన వాళ్ళు ఎదురుగా నిలబడ్డారు. వాళ్ళను చంపి మనం బ్రతక గలమా?**

**వ్యాఖ్య**

**జయాపజయాలు**

యుద్ధం చేయడానికి రెండు పక్షాలు ఉండాలి. కాని, గెలిచేది మాత్రం ఒక పక్షమే. విజయము ఒక్కరిదే. ఆ ఒక్కరు ఎవరు? ఏ పక్షము వారు? ఎవరు గెలిస్తే మంచిది? కౌరవులా? పాండవులా? అది కూడా సవ్యసాచికి సందిగ్ధం గానే ఉంది.

యుద్ధ మంటూ జరిగిన తరువాత ఎవరో ఒకరు జయించక తప్పదు. ఎవరి విజయము తనకు శ్రేయస్కరము అనేది అర్జునునికి అర్థం కావడం లేదు. ఇంతకీ గెలిచే దెవరు? ఏమో! జయాపజయాలు దైవాధీనాలు. ఎవరైనా జయించ వచ్చు. గెలిచేది తామే నని ఎవరికి వారు భావిస్తూ ఉంటారు. ఎవరి అంచనాలు వారికి ఉంటాయి. కాని, తారుమా రయ్యేవి అంచనాలే కదా! పోరాటంలో అంచనాలు ముందు ఉంటాయి. విజయానికి వచ్చే సరికి అంచనాలే ముంచుతూ ఉంటాయి.

**ఏది తెలుసు? ఏదీ తెలియదు**

యుద్ధములో గెలుపు ఎవరిదో తెలియదు. ఎవరు గెలిస్తే మంచిదో అది కూడా అర్థం కాదు. అందుకే భిక్షాటన శ్రేయస్కరముగా కనిపించింది. అది కూడా స్థిరంగా లేదు. యుద్ధమా? భిక్షాటనమా? ఈ రెండిటిలో ఏది మంచిది? అనేది కూడా తేలడం లేదు. రెండూ మంచి గానే కనిపిస్తున్నాయి. రెండూ చెడు గానే అగుపిస్తున్నాయి. రెండిటిలో మంచిచెడు లున్నాయి.

యుద్ధం స్వధర్మము. స్వధర్మాన్ని ఆచరించడము శ్రేయస్కరము. స్వధర్మాన్ని త్యజిస్తే పాపం వస్తుంది. కనుక యుద్ధము యుక్తమే గాని అయుక్తము కాదు. అనుచితమూ కాదు. అలా చూచి నపుడు యుద్ధము మంచిదే.

మరో విధంగా చూస్తే, యుద్ధంలో హింస ఉంది. కులక్షయం జరుగుతుంది. స్వజన నాశము తప్పదు. గురువధ అనివార్యం. ఇలా ఆలోచించి నపుడు యుద్ధం శ్రేయస్కరము కాదు అనిపిస్తూ ఉంది.

ఇకపోతే, మిగిలింది భిక్షాటనము. అందులో హింస లేదు. కులక్షయము, స్వజన నాశము లాంటి దోషాలు లేవు. కాని, అది స్వధర్మము కాదు. పరధర్మము. పరధర్మము ఎప్పుడూ మేలు చేయదు. ఈ విధంగా భిక్షాటనములో కూడా మంచిచెడులు ఉన్నాయి. ఏది శ్రేయస్కరమో *( కతరత్ గరీయః )* అది గ్రహించలేక పోతున్నాను *(న విద్మః)* అంటున్నాడు అర్జునుడు. ఎటూ తేల్చుకోలేక తికమక పడుతున్నాడు. ఎందుకని?

**ఏదైనా ఎదబాధే**

ఎవరు జయిస్తారు? ఎవరు జయించలేరు? అనేది ప్రధాన విషయంగా లేదు. ఎవరు జయిస్తారు అనేది విజయునికి సమస్య కాదు. ఎవరు జయించినా సమస్యే అనేది అర్జునుని సమస్య.

ఓటమిలో మరణమే సంభవించ వచ్చు. అది చాలా బాధాకరం. ఇక గెలుపు విషయాని కొస్తే, అది మరీ బాధాకరంగా ఉంది. దారుణంగా ఉంది. ఓటమిలో మరణమే ఉపద్రవం. కాని, గెలుపు మరణం కన్నా భయంకరంగా ఉంది.

కృష్ణా! ఎవరిని వధించిన తరువాత *(యాన్ హత్వా)* మేము జీవించలేమో *(న జిజీవిషామః)*, అట్టి ధృతరాష్ట్రునికి సంబంధించిన భీష్మాదులు *(తే ధార్తరాష్ట్రాః)* ఎదురుగా యుద్ధం చేయడానికి సిద్ధంగా నిలబడ్డారు *(ప్రముఖే అవస్థితాః)*.

ఓడితే ఎలాగూ ప్రాణాలు మిగలవు. గెలిచినా, అయిన వాళ్ళను పోగొట్టుకొని బ్రతకలేము కనుక ప్రాణాలు నిలవవు. ఏది జరిగినా ఎదబాధ తప్పేటట్టు లేదు.

కృష్ణా! గెలుపు వారిదే అనుకుందాం. ఒకవేళ ఓటమి మనదే అయితే, ప్రాణాలు పోకుండా మనం జీవించి ఉంటే, అప్పుడు ఏమి చేయాలి? అప్పుడైనా భిక్షాటన చేసి జీవించక తప్పదు కదా! అదేదో ఇప్పుడే ప్రారంభిస్తే ఏమైంది? అంటూ ఎదబాధతో ఎదురీద లేక ఏదేదో మాట్లాడు తున్నాడు అర్జునుడు. అంతా ధర్మమీమాంసే. కాని, ఏది ధర్మమో, ఏది అధర్మమో అర్థం చేసుకోలేక ఆందోళనలో నలిగి పోతున్నాడు. ఆ విషయాన్ని తానే అంగీకరిస్తున్నాడు.

**కార్పణ్య దోషోపహత స్వభావః పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢ చేతాః ।**
**యచ్ఛ్రేయః స్యా న్నిశ్చితం బ్రూహి తన్మే శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్ ॥ 7**

***కార్పణ్య దోషోపహత స్వభావః-పృచ్ఛామి-త్వాం-ధర్మసమ్మూఢ చేతాః***
***యత్-శ్రేయః-స్యాత్-నిశ్చితం-బ్రూహి-తత్-మే-శిష్యః-తే-అహం-శాధి-మాం-త్వాం-ప్రపన్నం***

| | | | |
|---|---|---|---|
| కార్పణ్య | = కృపణత్వ మనే | స్యాత్ | = అగునో |
| దోష | = దోషము చేత | తత్ | = దానిని |
| ఉపహత | = కొట్టబడిన | మే | = నాకు |
| స్వభావః | = ప్రకృతి గలవాడనై | బ్రూహి | = చెప్పు |
| ధర్మ సమ్మూఢచేతాః | = ధర్మం విషయంలో మోహానికి గురైన మనస్సు కలవాడనై | అహం | = నేను |
| | | తే | = నీకు |
| త్వాం | = నిన్ను | శిష్యః | = శిష్యుడను |
| పృచ్ఛామి | = అడుగు తున్నాను | త్వాం | = నిన్ను |
| యత్ | = ఏది | ప్రపన్నం | = శరణు జొచ్చిన |
| శ్రేయః | = శ్రేయస్సుగా | మాం | = నన్ను |
| నిశ్చితం | = నిర్ణయింప బడినది | శాధి | = శాసింపుము |

**నా మనస్సును దైన్యం ఆవరించింది. నా స్వభావమే చెడి పోయింది. ధర్మ నిర్ణయం చేసే శక్తిని నా మనస్సు కోల్పోయింది. అందుకే నిన్ను అడుగుతున్నాను. నాకు కావలసింది శ్రేయస్సు. అది ఎలా సాధ్యమో నీవే ఖచ్చితంగా చెప్పాలి. కృష్ణా! నేను నీ శిష్యుణ్ణి. నీవే నాకు శరణ్యము. నన్ను శాసించు.**

### వ్యాఖ్య

### ప్రయాణాలు - ప్రమాదాలు

జీవితము ఒక సుదీర్ఘ ప్రయాణము. అడుగులు వేస్తూనే పోవాలి. ఎక్కడ మడుగులు ఎదురవుతాయో ఊహించడం ఎవ్వరికీ సాధ్యం కాదు. ప్రయాణం చేస్తేనే ముందుకు సాగుతాము. ప్రమాదాలు వాటిల్లేది ప్రయాణం లోనే.





ప్రయాణం దారి లోనే. ప్రమాదమూ దారి లోనే. ఎప్పుడు ఏ సమస్య తలెత్తుతుందో తెలియదు. సాధారణ సమస్యల్ని సానుకూల దృక్పథంతో పరిష్కరించు కోవచ్చు. విషమ పరిస్థితులు ఎదురై నపుడు, లేదా సామాన్య మనుకున్న సమస్యలు విషమంగా పరిణమించి నపుడు, కర్తవ్యం అర్థం కానపుడు, అర్థమైనవి సందేహాలను సృష్టించి నపుడు ఎవరైనా వివేకాన్ని కోల్పోతారు. కలత పడతారు. కలతపడే మనస్సు విచక్షణతో విశ్లేషించ లేదు. అక్కడ మరొకరి సహాయం అవసర మవుతుంది. అర్జునుని పరిస్థితి ప్రస్తుతం అదే.

### తప్పు తెలిసింది

మనస్సుకు సర్వజ్ఞత్వం లేదు. మనస్సుకు అన్నీ తెలియవు. మనస్సు చేసే ఆలోచనలే మనకు తెలుస్తాయి. మనస్సు చేసే నిర్ణయాలే మనకు మంచివిగా తోస్తాయి. మనస్సు సదా ఋజుమార్గం లోనే ఆలోచిస్తుందని చెప్పలేము. అందుచేత, మనస్సు చేసే నిర్ణయాలు సరియైనవి కాకపోయే అవకాశం కూడా ఉంది. నిజం చెప్పాలంటే, మనస్సును ఎక్కువ శాతం అవాస్తవాలే ఆక్రమించుకొని అధికారం చెలాయిస్తూ ఉంటాయి.

అందరికీ మనస్సు లున్నాయి. అందరూ దారి తప్పే అవకాశ ముంది. దారి తప్పేవాళ్ళే అందరూ. కాని, అలా తాము దారి తప్పినట్లు తెలుసుకో గలిగే వారెందరు? తెలిసినా, అంగీకరించే పెద్ద మనస్సు గలవారు ఎందరుంటారు? ఎందరైనా ఉండనీ. వారే నిజమైన మనుషులు. మనీషులయ్యే అవకాశానికి నోచుకున్నవారు.

తన దోషాన్ని తాను తెలుసు కోవడం మానవత్వం. తెలుసుకున్నట్లు అంగీకరించడం దైవగుణం. తప్పును ఒప్పుగా కప్పిపుచ్చుకొనేందుకు చేసే ప్రయత్నం అమానుషం. అసుర స్వభావం.

ఇంతవరకు అర్జునుడు ఎంతగానో మాట్లాడాడు. తనకు తెలిసిన ధర్మాలన్నీ ప్రవాహ రూపంలో ప్రసంగించాడు. ఇప్పుడే, ఇక్కడే తన మాటల్లో ఏదో తప్పు ఉందని ప్రథమంగా గుర్తిస్తున్నాడు. తన ఆలోచనల్లో ఏదో దోషం ఉందని బహిరంగంగా భగవంతునికి విన్నవిస్తున్నాడు. ఇంతకీ ఏమిటి ఆ దోషం?

### కార్పణ్యం

కార్పణ్య దోషము చేత తన స్వభావం దెబ్బ తినింది అంటున్నాడు అర్జునుడు. కృపణత్వ దోషము చేత స్వభావమే పాడై పోయిందట. దైన్యం ఆవరించిందట. మనస్సు విచలిత మైందట. వివేకం లోపించిందట. అందుచేత ఏది ధర్మమో, ఏది అధర్మమో నిర్ణయించలేక పోతున్నాను అని చెబుతున్నాడు కౌంతేయుడు.

కార్పణ్య దోషము అనే సమాసంలో 'కార్పణ్యము' అనేది ఏదయితే ఉందో, అదే స్వభావంగా మారిపోయిందని అర్థము. స్వభావం స్థాయికి చేరి పోయింది. స్వభావమై కూర్చుంది అని భావం. ఇంతకీ అర్జునుని అంతగా చెదర గొట్టిన ఆ కార్పణ్యం ఏమిటి?

### పిసినారి పీఠమా?

కృపణుని స్వభావము కార్పణ్యము **(కృపణస్య స్వభావః కార్పణ్యం)**. కృపణుడు అంటే లోభి మహాశయుడు. లేనివాడు కాడు. ఉన్నా లేనివాడు. చేతులు నిండినా చిత్తము నిండని వాడు. తనకు, పరులకు ఉపకరించని కలిమికి కాపలాదారుడు. ధనక్షయము ఏ కొద్దిగా జరిగినా, జరుగు తుందని ఊహించినా, హోరుగాలికి ఊగిపోయే చెట్టు లాంటి 'తనదైన' చిత్తము గల అరుదైన వ్యక్తి.

అర్జునుని పీడిస్తున్న కృపణత్వం ఇదేనా? ఎందుకంటే, తన దైనది ఏదో అది దూరమైతే తట్టుకోలేని వాడు లోభి. కృపణుడు. 'నాది' లేనపుడు 'నేను' ఎందుకు అనుకునేవాడు. ఇదంతా మమకారమే. లోభత్వము యొక్క ఫలరూపమే మమకారము కనుక, 'నా వాళ్ళు - నా బంధువులు' అంటూ విలపిస్తున్న అర్జునుడు ఇలాంటి కృపణుడి క్రిందికి వస్తాడేమో! అనేది కొందరి సంశయము.

మహాభారతంలో అర్జునుని పాత్రను అధ్యయనం చేసిన వారు ఎవ్వరూ ఈ సంశయాన్ని సమర్థించరు. ఆయన ధనంజయుడు. త్యాగమయుడు. రాజ్య మెందుకు? రాజ్య సుఖా లెందుకు? ***(కింనో రాజ్యేన గోవింద, కింభోగైః)*** అని ప్రశ్నిస్తున్న వివేకవంతుడు. ఇహపర సుఖాలను తుచ్ఛంగా భావించిన వైరాగ్యమూర్తి. మరి, ఈ కార్పణ్య మేమిటి?

**ఇంద్రియ దాస్యమా?**

కృపణుడు అంటే అజితేంద్రియుడు అని కూడా అర్థము. అంటే ఇంద్రియములను జయించలేని వాడు ***(కృపణః అజితేంద్రియః)***. ఇది అర్జునునికి వర్తిస్తుందా? కఠోర నియమ నిష్ఠలతో తపస్సు చేసి, పశుపతిని మెప్పించి, పాశుపతాస్త్రమును పొందిన పార్థుడు ఇంద్రియాలను జయించలేని వాడా?

సుందర సుషమాన్విత మందస్మిత వదనంతో, అలౌకిక సౌందర్యంతో, శృంగారానికి నాంది పలుకుతూ, దేవేంద్రుని అనుమతితో రంగ ప్రవేశం చేసిన అసమాన సౌందర్యవతి ఊర్వశి, మంద గమనంతో శయ్యా మందిరానికి అరుదెంచి నపుడు, అమ్మా! క్షమించు. నీకు బిడ్డగా నమస్కరిస్తున్నాను. నీవు నాకు తల్లివి. కుంతి, మాద్రి, శచీదేవి లాగా నీవూ నాకు పూజనీయురాలివి. నన్ను నీ బిడ్డగా స్వీకరించు అని పలికి, తత్ఫలితంగా శాపగ్రస్తుడై, నపుంసకుడై, నాట్యాచారుడిగా ఒక్క సంవత్సరం కులికిన మహానుభావుడు అర్జునుడు అజితేంద్రియుడా? కానే కాడు. మరి ఈ కార్పణ్యానికి అర్థ మేమిటి?

**అజ్ఞానమే అసలైన అర్థం**

కృపణత్వము అంటే అజ్ఞానము అని, కృపణుడు అంటే అజ్ఞాని అని ఒక అద్భుతమైన విషయాన్ని వినిపించింది ఉపనిషత్తు.

**యో వా ఏతదక్షరం గార్గ్యవిదిత్వా స్మాల్లోకా త్ప్రైతి స కృపణః**

'గార్గీ! అక్షర స్వరూపమైన పరబ్రహ్మమును తెలుసుకోకుండా, ఈ ప్రపంచం నుండి ఎవ్వడైతే నిష్క్రమిస్తున్నాడో వాడే కృపణుడు' అని యాజ్ఞవల్క్య మహర్షి సాధ్వీమాత గార్గికి బోధించాడు.

ఇదే, ఈ అజ్ఞానమే అర్జునుని లోని కృపణత్వ దోషం. అజ్ఞానం ఆవరించి నపుడు ఏది ధర్మమో, ఏది అధర్మమో అర్థం కాదు. ఏది సత్యమో, ఏది అసత్యమో తెలిసి రాదు. అందుచేతనే తాను ధర్మం విషయంలో సంశయాల మధ్య నలిగి పోతున్నట్లు అర్జునుడు అంగీకరిస్తున్నాడు ***(ధర్మ సమ్మూఢ చేతాః)***.

**అన్నీ సందేహాలే**

యుద్ధం చెయ్యాలా, వద్దా? యుద్ధం విరమిస్తే ఏం చెయ్యాలి? భిక్షాటనమే కదా? అది యుక్తమా? అయుక్తమా? స్వధర్మం కనుక యుద్ధాన్ని ఆచరించక తప్పదు. బాగానే ఉంది. స్వధర్మము హింసతో కూడుకొని ఉంది కదా! అయినా ఆచరించక తప్పదా? ఇంతకీ, సమరమా? భిక్షాటనమా? ఏది ఉచితం? ఏది అనుచితం?

అర్జునా! ఈ ధర్మాలన్నీ గతంలో నువ్వు విన లేదా? విద్యాభ్యాసం చేసి నపుడు ధర్మబోధలో ఈ సత్యాలను గురువు నీకు బోధించ లేదా?

గురుబోధలో ఇవన్నీ నేను ఆలకించాను. నేను శ్రద్ధతో ధర్మశాస్త్రాల్ని పఠించాను. కాని, ప్రస్తుతం ధర్మ నిర్ణయం చేయలేని స్థితిలో ఉన్నాను. ధర్మం విషయంలో నా మనస్సు నిండా సందేహాలే చేరిపోయాయి ***(ధర్మ సమ్మూఢ చేతాః)***. ఇదంతా కార్పణ్యదోషము యొక్క ప్రభావమే. కృపణత్వ దోషం చేత నా స్వభావమే చెడిపోయింది ***(కార్పణ్య దోషోప హత స్వభావః)***.





కౌరవుల మనస్సులను లోభం దెబ్బ కొట్టిందని మొదటి అధ్యాయం ముప్పై ఎనిమిదవ శ్లోకంలో చెప్పాడు అర్జునుడు ***(లోభోపహత చేతసః)***. తానేమో కార్పణ్య దోషము చేత దెబ్బ తిన్నానని చెబుతున్నాడు. కౌరవులది లోభము, తనది కార్పణ్య మని అర్జునుడు అంగీకరిస్తున్నాడు. తనలో ఏ కృప ప్రస్తుతం వ్యక్త మౌతూ ఉందో అది కార్పణ్య దోష ప్రభావమే నని అభిప్రాయ పడుతున్నాడు.

అర్జునుని కృపను ఇప్పటికే రెండు చోట్ల సంజయుడు ఉదహరించాడు కూడా. అర్జునుడు కృపతో కూడుకొని ఉన్నాడు ***(కృపయా உ విష్టమ్)*** అని మొదటి అధ్యాయం ఇరవై ఏడవ శ్లోకం లోను, రెండవ అధ్యాయం ప్రథమ శ్లోకం లోను సంజయుడు ప్రత్యేకించి ప్రస్తావించాడు.

విషమ సమయాల్లో ధర్మాధర్మాల మధ్య సంఘర్షణ తలెత్తి నపుడు, వివేకవంతుడు శ్రేయస్సు వైపే మొగ్గు చూపాలి. తాత్కాలిక సుఖాలకు తల వంచి వినాశాన్ని వరించ కుండా, శాశ్వత మైన శ్రేయస్సు వైపే మరలాలి. అర్జునుడు అదే చేశాడు.

చెడిన మనస్సుకు చెడు అర్థం కాదు. కలత చెందిన చిత్తము మంచిని వరించ లేదు. ఇలాంటి చోట మరొకరి సహాయం మనకు అవసరం. అర్జునునికి కూడా అదే ప్రస్తుతం అవసరమై ఉంది. కాకపోతే, అర్జునుడు పుణ్యాత్ముడు కనుక, ధర్మ జీవనం గడిపిన వాడు కనుక ఆయన అదృష్టం కొద్ది సహకరించ డానికి సాక్షాత్తు శ్రీకృష్ణ భగవానుడే లభించాడు.

**జ్ఞాన పిపాస**

తృప్తి లేకుండా మనిషి జీవించ లేడు. ఈ ప్రపంచంలో తృప్తి తెలియని వారు లేరు. తృప్తి చెందని వారు లేరు. తిరిగి అసంతృప్తిని పొందని వారూ లేరు. ఏ తృప్తి అయినా తాత్కాలికమే. నిత్య తృప్తి అనేది ఈ ప్రపంచంలో కుందేటి కొమ్ము లాగే ఉంది.

దాహం వేస్తే మనిషి నీటిని పానం చేస్తాడు. తృప్తి కలుగుతుంది. అంత మాత్రాన దప్పిక శాశ్వతంగా దూరం కాలేదు. ఆకలికి మనిషి ఆహారాన్ని భుజిస్తాడు. తృప్తిగా భోంచేస్తాడు. అంతమాత్రాన ఆకలికి పూర్తిగా దూరం కాలేడు. తృప్తి విషయంలో అనుభవాలన్నీ ఇలాగే ఉంటాయి. నొప్పి తెలియకుండా ఉండేందుకు స్వీకరించే ఔషధాలు రోగ నివారకాలు కావు. ఆరోగ్య ప్రదాయకాలూ కావు. ఏ తృప్తి అయినా ఈ ప్రపంచంలో తాత్కాలికంగా అసంతృప్తిని దూరం చేసేదే కాని నిత్యతృప్తిగా మాత్రం ఉండ లేదు.

ఏది పొందినా ***(ప్రవృత్తి)***, ఏది పోగొట్టుకున్నా ***(నివృత్తి)***. లాభనష్టాల ఊబిలో దిగడం జరుగుతుందే గాని నిత్యతృప్తిని పొందడం జరగదు. అసంతృప్తి నుండి శాశ్వతంగా విడి పడటమూ జరగదు. అర్జునుడికి తన దుఃఖము దూరమయ్యే లాగా కనిపించడం లేదు. పొంది సాధించేది లేనపుడు, అర్థం చేసుకోవడం ఒక్కటే మార్గం. జ్ఞానమే శరణ్యం. జ్ఞానమే సాధనం ***(జ్ఞాన మేవ సాధనం)***.

నిత్యతృప్తి అనేది నిత్యవస్తువు లోనే ఉంటుంది. నిత్యవస్తువు అంటే అబాధితం అని అర్థము. లేనిదిగా ఎప్పుడూ కాలేనిది నిత్యవస్తువు. సదా ఉన్నదే. అట్టి అనంతమైన వస్తువును కర్మల ద్వారా ఎలా పొందగలం? కనుక ఉన్న దానిని ఉన్నట్లుగా తెలుసు కోవాలి. అదే జ్ఞానం. నిత్యజ్ఞానం. నిత్యవస్తువుకు సంబంధించిన జ్ఞానమే నిత్యజ్ఞానం. అది కూడా ఉన్నదే. కాకపోతే అజ్ఞానం వల్ల ఉన్నది ఉన్నట్లు తెలియకుండా ఉంది. అంతేకాదు. లేదేమో! అనే సందేహాన్ని కూడా కలిగిస్తూ ఉంది. ఇదే మోహము ***(అజ్ఞానే నావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః)***.

అర్జునుడు ఆశించేది నిత్యతృప్తి. అందుకే జ్ఞానదాహంతో తపించి పోతున్నాడు. అట్టి జ్ఞానాన్ని నిశ్చయించి చెప్పమని శ్రీకృష్ణుని అర్థిస్తున్నాడు. దానినే శ్రేయస్సు అంటున్నాడు ***( యచ్ఛ్రేయస్యాత్ నిశ్చితం బ్రూహి ).*** తనకు శ్రేయస్సే కావాలి. ప్రేయస్సు అవసరం లేదు.

**శ్రేయస్సు - ప్రేయస్సు**

ప్రియమును తాత్కాలికంగా కలిగించేది ప్రేయస్సు. శుభమును శాశ్వతంగా అందించేది శ్రేయస్సు. తాత్కాలిక సుఖాల వైపే మానవులు పరుగులు పెడుతూ అలసిపోతూ ఉంటారు. ఇదే ప్రేయస్సు. దీని నుండి విడిపడి అసంతృప్తి తెలియని ఆనంద స్వరూపాన్ని పొందటమే శ్రేయస్సు.

శ్రేయస్సు ప్రేయస్సు లనే ఈ రెండూ మనిషిని చుట్టుముట్టి ఉంటాయి ***( శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్యం ఏతః ).*** వివేకము కలిగిన ధీర పురుషుడు ***( ధీరః ),*** ఆ రెండిటిని పరిశీలించి ***( తౌ సంపరీత్య ),*** వేరు వేరుగా తెలుసుకొంటున్నాడు ***( వివినక్తి ).*** అలా విడమరచి తెలుసు కొనిన ధీర పురుషుడు ***( సః ధీరః ),*** ప్రేయస్సు కన్నా వేరైన శ్రేయస్సునే ***( ప్రేయసః శ్రేయః హి )*** వరించి వాంఛిస్తున్నాడు ***( అభివృణీతే ).*** అట్టివాడు నిత్యతృప్తిని పొందుతున్నాడు. అదే మోక్షము. అర్జునుడు ప్రస్తుతం వాంఛించేది శ్రేయస్సునే గాని ప్రేయస్సును కాదు.

అర్జునుడు ఇంతవరకు ధర్మప్రసంగమే చేశాడు. కాని, ధర్మము విషయంలో తాను స్పష్టతను కోల్పోయినట్లు ఈ శ్లోకం లోనే ప్రథమంగా చెబుతున్నాడు ***( ధర్మ సమ్మూఢ చేతాః ).*** అలాంటప్పుడు ధర్మ వివేచనం చేసి నిర్ణయిస్తే సరిపోతుంది. ధర్మ మీమాంసను లేవనెత్తి, అర్జునునికి ధర్మం విషయంలో ఉన్న సంశయాన్ని శ్రీకృష్ణుడు నివారిస్తే సరిపోతుంది. కాని, అంతటితో అర్జునుడు సరిపెట్టుకొనే లాగా లేడు. వాస్తవం చెప్పాలంటే, ప్రస్తుత తరుణంలో అర్జునుడు ధర్మాధర్మాల నుండి విడిపడి ఆలోచిస్తున్నాడు.

ధర్మము యొక్క ఫలం పుణ్యం. పుణ్య మనేది సుఖానికి సంబంధించింది. పరిమిత మైన ఆనందాన్నిచ్చేది. దానిని అర్జునుడు అర్థించడం లేదు. తనకు శ్రేయస్సు కావాలి అంటున్నాడు. అదేదో నిశ్చయించి చెప్పమని శ్రీకృష్ణుని అభ్యర్థిస్తున్నాడు ***( యచ్ఛ్రేయస్యాన్నిశ్చితం బ్రూహి ).*** సుఖదుఃఖాలను అధిగమించిన ఆనందాన్ని అభిలషిస్తున్నాడు. ధర్మాధర్మాలను దాటిన పరంధామాన్ని కోరుకుంటున్నాడు. ప్రియాప్రియముల నుండి విడిపడిన నిత్య సుఖాంబోధిలో ఓలలాడాలని పరితపిస్తున్నాడు. బ్రహ్మవిదుడు కావాలని, బ్రహ్మమునే పొందాలనే ఏకైక వాంఛతో ఉన్నాడు. బ్రహ్మవిదుని ప్రయాణాన్ని ఉపనిషత్తు కూడా ఇలాగే వర్ణించింది.

**స ఏష విసుకృతో విదుష్కృతో బ్రహ్మ విద్వాన్ బ్రహ్మైవాభిప్రైతి**

ఆ బ్రహ్మవిదుడు ***( స ఏష బ్రహ్మ విద్వాన్ )*** పుణ్యము నుండి విడిపడి ***( విసుకృతః ),*** పాపమును అంటక ***( విదుష్కృతః ),*** బ్రహ్మమునే ***( బ్రహ్మైవ )*** పొందుచున్నాడు ***( అభిప్రైతి )*** అని కౌషీతకీ బ్రాహ్మణోపనిషత్తు ప్రవచించింది.

**ఎందుకు చెప్పాలి?**

కృష్ణా! నాకు ఏది శ్రేయస్సో దానిని నువ్వే నిర్ణయించి చెప్పు. నా మనస్సు ధర్మనిర్ణయం చేసే స్థితిలో లేదు అన్నాడు అర్జునుడు.

అర్జునుడు అడిగినంత మాత్రాన శ్రీకృష్ణుడు చెప్పాలని ఎక్కడుంది? ఎందుకు చెప్పాలి? అర్జునుడి రథాన్ని తోలడానికి అచ్యుతుడు అంగీకరించాడు. బోధిస్తా నని చెప్పలేదు.





అర్జునుడు అడుగు తున్నాడు కనుక చెప్పవచ్చు కదా అంటారా! అడిగినంత మాత్రాన చెప్పాలని కూడా లేదు. అడిగిన వాళ్ళందరికీ ఎందుకు చెప్పాలి? అర్జునుడు ఒక్కడే కాదు, శ్రీకృష్ణుడు చెబితే వినడానికి ప్రపంచ మంతా నిరీక్షిస్తూ ఉంది. వెలుగు కోసం విశ్వమంతా సూర్యుని వైపు చూచినట్లు, జ్ఞానం కోసం ప్రపంచ మంతా పరమేశ్వరు డైన శ్రీకృష్ణుని వైపు చూస్తూ ఉంది. దేవగణము, మహర్షి సమూహము సైతం ఆ దివ్యాత్ముని బోధామృతాన్ని గ్రోలాలనే అర్రులు చాస్తోంది. ఈ సత్యాన్ని మహాభారతం - అరణ్యపర్వంలో మహాత్ముడైన మార్కండేయ మహర్షి స్వయంగా ధర్మరాజుకు చెప్పాడు కూడా.

ధర్మరాజా! ఈ ప్రపంచము ప్రళయజలాలలో మునిగి నపుడు, నైరాశ్యంతో నేను కలత చెందిన సమయంలో, ఏ దివ్యాత్ముని ఉదరంలో ఈ సమస్త బ్రహ్మాండాన్ని దర్శించానో, ఆ పరంధాముడు ఎవరో కాదు. ఈ పురాణ పురుషుడే. వార్ష్ణేయుడే. శ్రీకృష్ణుడే.

***యస్స దేవో మయా దృష్టః పురా పద్మాయ తేక్షణః***
***స ఏవ పురుష వ్యాఘ్రః సంబంధీ తే జనార్దనః ॥***

ధర్మరాజా! పూర్వము ప్రళయ సమయంలో పద్మనేత్రుడైన ఏ భగవంతుని నేను దర్శించానో, అతడే ప్రస్తుతం నీకు బంధువైన శ్రీకృష్ణుడు అన్నాడు మార్కండేయుడు.

అలాంటి జగన్నాథుడైన శ్రీకృష్ణుని అర్జునుడు ఆశ్రయించడంలో, అడగటంలో ఆశ్చర్య మేముంది? అలాగని, అడిగిన వాళ్ళందరికీ చెబుతారా? అడిగిన వాడు అర్హత లేనివాడైతే, బోధించిన దంతా బూడిదలో పోసిన పన్నీరు కాదా? అడిగిన వాడు అర్హత లేనివా డైతే బోధించ కూడదు అనేది శాస్త్రవిధి.

**నియమాలు ఉన్నాయి**

జ్ఞానము పవిత్ర మైనది. ప్రసాదం వంటిది. అర్హులకే అనుగ్రహించాలి. పాడు చేసుకొనే స్వభావం కల వారికి ఆస్తులనే పంచరు కదా! అమృత స్వరూపమైన ఆత్మజ్ఞానాన్ని ఎవరు పంచుతారు?

**న అపుత్రాయ అశిష్యాయ ప్రబ్రూయాత్**

పుత్రుడు కాని వానికి, శిష్యుడు కాని వానికి చెప్పకూడదు అన్నది శాస్త్రం. బిడ్డకు తండ్రిపై ప్రేమ ఉంటుంది. అలాగే శిష్యునికి గురువుపై ప్రేమ ఉండాలి. ప్రేమ లేని వానికి బోధిస్తే బోధ ఫలించదు.

బిడ్డకు తండ్రి విషయంలో ప్రేమే కాదు, చనువు కూడా ఉంటుంది. అలాంటి చనువును గురువు విషయంలో శిష్యుడు ప్రదర్శించ కూడదు. హద్దు లెరిగి ప్రవర్తించాలి. బుద్ధి కలిగి ప్రసంగించాలి. అందుచేత శిష్యుడు అని చెప్పడం జరిగింది. పుత్రుని ప్రేమ, శిష్యుని భక్తి రెండూ కలిగిన వాడే శిక్షణ యోగ్యుడు. అట్టి వానికే బోధించాలని శాస్త్రం శాసించింది.

వినయ విధేయతలు కలిగిన శిక్షణ యోగ్యుడే ఉంటాడు. కాని, బోధించ మని అర్థించడు. అలాంటి వానికి బోధించ వచ్చా? బోధించ కూడదు. అర్హు డైనప్పటికీ అర్థిస్తేనే బోధించాలి.

**న అపృష్టః కస్యచిత్ బ్రూయాత్**

జిజ్ఞాసతో వచ్చి అడగని ముముక్షువునకు బోధించ కూడదు అని కూడా చెప్పింది శాస్త్రం. శిష్యునికి జ్ఞానాభిలాష ఉండొచ్చు. కాని, గురువును అడగాలి. అభ్యర్థించాలి. ప్రార్థించాలి.

శిష్యుడే కదా! అడగక పోయినా బోధిస్తే ఏమవుతుంది? ఏదైనా కావచ్చు. ఏమీ కాకపోవచ్చు కూడా. రెండూ ప్రమాదాలే. శాస్త్రం ప్రమాణము. జ్ఞానమును ప్రసాదించేది కనుక ప్రమాణము ***( ప్రమాకరణం***

***ప్రమాణం).*** ప్రమాణము ఫలిస్తే జ్ఞానము శోభించాలి. అంతేగాని ఏదో కావడము, ఏదీ కాకపోవడము - ఈ రెండూ జరగ కూడదు.

అడగని వానికి ప్రేమతో గురువు బోధించాడనే అనుకుందాం. శిష్యుడు వివేక శూన్యుడైతే, 'నీకై నీవే బోధించావు. నేను అడిగానా?' అని గురువుకు ఎదురు ప్రశ్న వస్తే ఏమవుతుంది? జ్ఞాన స్వరూపుడైన గురువుకు ఏమీ కాదు. పరమ పవిత్రమైన సంప్రదాయానికే ఎద పగుల్తుంది. బోధ ఎంత ముఖ్యమో, సంప్రదాయ రక్షణ అంత ముఖ్యం. సంప్రదాయ రక్షణ లోనే జ్ఞానము పండుతుంది. పరిఢవిల్లు తుంది.

**అర్హత పొందిన అర్జునుడు**

కృష్ణా! శ్రేయస్సు ఏదో నాకు బోధించు అని అడిగాడు అర్జునుడు. ఈ వాక్యాన్ని ఈ సందర్భం లోనే వింటున్నాం. శ్రీకృష్ణార్జునుల మైత్రి ఈనాటిది కాదు. వాళ్ళ మైత్రిలో దశాబ్దాలే దొర్లిపోయాయి.

కలిసి తిరిగారు. కలబడి భుజించారు. కష్టాలు పంచుకున్నారు. కలతలలో పరస్పరము కాచుకున్నారు. కాని, ఎప్పుడు కూడా నాకు శ్రేయస్సును బోధించు అని అర్జునుడు శ్రీకృష్ణుని అడగ లేదు. ఇప్పుడే, ఇక్కడే, కురుక్షేత్రం లోనే ప్రథమంగా అడుగు తున్నాడు పార్థుడు.

ఏ సన్నివేశంలో విషాదానికి, దైన్యానికి అవకాశం లేదో, అలాంటి యుద్ధ సన్నివేశంలో పార్థుడు విషణ్ణుడయ్యాడు. కలత చెందాడు. దీను డయ్యాడు. ఉపదేశాన్ని గ్రహించ డానికి సిద్ధ మయ్యాడు. అర్హతను ప్రదర్శించాడు. శ్రద్ధను ప్రకటించు కున్నాడు. బోధించ మని అర్థించాడు. నేను నీ శిష్యుణ్ణి ***(శిష్యస్తేఽహం).*** నన్ను శాసించు ***(శాధిమాం)*** అని అభ్యర్థించాడు. ప్రార్థించాడు. శిష్యుడుగా శరణాగతు డయ్యాడు ***(ప్రపన్నమ్).***

జ్ఞానాన్ని శిష్య లందరికీ సమానంగా పంచుతాడు గురువు. కాని, వ్యక్తిగతంగా వారిని తీర్చిదిద్దే ప్రక్రియలో విభిన్నంగా గోచరిస్తూ ఉంటాడు. ఈ తరతమ భావము గురువు స్వభావానికి సంబంధించింది కాదు. శిష్యుల ప్రవర్తనకు సంబంధించింది.

కొందరు శిష్యులు గురువు హృదయాన్ని గ్రహిస్తూ ప్రవర్తిస్తూ ఉంటారు. కొందరు శిష్యులు తమ బుద్ధిని పట్టించుకొంటూ గురుబోధను ప్రతిచర్యలతో గ్రహిస్తూ ఉంటారు. మొదటి వారికి గురువు చెప్పింది ఏదైనా ప్రసాదమే. రెండవ తెగ వారికి తమకు అనుకూలంగా ఉంటే ప్రసాదము. అనుకూలం కాకపోతే ప్రమాదము.

జ్ఞానం వంటబట్టే వరకు అన్నీ ప్రమాదాలే. అదంతా గురువుకు తెలుసు. కనుకనే, ప్రతిచర్యలు లేకుండా ప్రసన్నంగా జీవించే శిష్యులకు అవసర మైతే ఆజ్ఞాపించి కూడా చెబుతాడు గురువు. ముట్టుకుంటే మునిగిపోయే మనస్సులు గల శిష్యులకు ఉపదేశిస్తాడే గాని వారిని ఆజ్ఞాపించడు.

అర్జునుడు ఈ శ్లోకంలో గురుదేవుడైన గోవిందుని ఆశ్రయించడమే గాక నన్ను శాసించు, ఆజ్ఞాపించు ***(శాధిమాం)*** అని విన్నవించు కొంటున్నాడు. తన విషయంలో సంశయించ వద్దని తనను తాను గురువుకు సమర్పించు కొంటున్నాడు. అంతేకాదు, ప్రియతమ మైన వారినే ప్రేమతో ఆజ్ఞాపిస్తారు కనుక, తాను ప్రియతమ శిష్యుడ నని చెప్పకనే చెప్పాడు పార్థుడు.

శిష్యుడుగా అర్జునుడు అర్హతను పొందాడు. బోధను గ్రహించ డానికి అధికారి అయ్యాడు. శిష్యుడయ్యాడు. శిక్షణయోగ్యు డని ప్రకటించు కున్నాడు. కాని, ఇక్కడ అర్జునుని వాక్యాన్ని జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి. నేను శిష్యుణ్ణి ***(అహం శిష్యః)*** అనలేదు. నేను నీ శిష్యుణ్ణి ***(అహం తే శిష్యః)*** అన్నాడు. శిష్యుడైన వాడు శిక్షణ యోగ్యుడు కనుక ఏ గురువైనా బోధిస్తాడు. కాని, అర్జునునికి మాత్రం శ్రీకృష్ణుడే బోధించాలి.





ఎందుకని? నేను నీకు శిష్యుణ్ణి అన్నాడు అర్జునుడు. అంటే, తన గురువుగా శ్రీకృష్ణుణ్ణే ఎంచుకున్నాడు పార్థుడు.

**గురువు లఘువు కాదు**

గురుత్వము గౌరవప్రద మైనది. గణనీయ మైనది. ఘనమైనది. ఘనకీర్తి గలది. లఘుత్వము కానిది. లక్షణ మైనది.

ఎందరైనా బోధించ వచ్చు. బోధించేవా రందరూ గురువులు కాలేరు. జ్ఞానగంధము లేకపోయినా జ్ఞానుల మని విర్రవీగే వారు, అహంకారముతో ఊగిపోయే వారు గురువులు కాలేరు. అలాంటి వారిని అనుసరించే మూఢ శిష్యులు గ్రుడ్డి వానిని అనుసరించే గ్రుడ్డివారి లాగా పతన మౌతారు అన్నది ఉపనిషత్తు.

*' అవిద్యాయా మన్తరే వర్తమానాః*
*స్వయం ధీరాః పండితం మన్యమానాః*
*దంద్రమ్యమాణాః పరియన్తి మూఢాః*
*అంధేనైవ నీయమానా యథాంధాః ॥*

అజ్ఞానంలో అలమటించే మూఢులు తామే గొప్ప పండితుల మని, వివేకుల మని గర్వంతో ఊగిపోతూ, 'గ్రుడ్డి వానిని అనుసరించే మరొక గ్రుడ్డివాని' లాగా పరిభ్రమిస్తూ ఉంటారు అన్నది కఠోపనిషత్తు.*

అర్జునుడు జ్ఞానసాగరు డైన అచ్యుతుని గురువుగా ఎన్నుకున్నాడు. దాని ఫలితంగా మోహనాశము - స్మృతిలాభము జరిగిందని చివరగా అర్జునుడే చెబుతాడు.

**గురు-శిష్య వైభవము**

ఆత్మజ్ఞానమును బోధించు ఆచార్యుడు అరుదుగా ఉంటాడు. అందుకే గురువు వైభవోపేతుడు. అట్టి ఆత్మజ్ఞానమును అందుకొనే నిపుణుడైన శిష్యుడు కూడా అరుదు గానే ఉంటాడు. కనుక శిష్యుడు కూడా వైభవంతో ఉన్నవాడే. ఇలాంటి గురుశిష్యులు ఏకమైన చోట ఉన్నదంతా జ్ఞానమే. జ్ఞానామృతమే. జ్ఞాన వైభవమే.

*ఆశ్చర్యో వక్తా కుశలోఽస్య లబ్ధా*
*ఆశ్చర్యో జ్ఞాతా కుశలాఽను శిష్టః*

ఈ జ్ఞానమును గూర్చి చర్చించ గల వక్త చాలా అరుదు. నిపుణుడైన ఆచార్యుడు చర్చించే ఈ తత్త్వమును అందుకొనే శ్రోత కూడా నిపుణుడే. అరుదైన వాడే. ఇలాంటి గురుశిష్యులు ఒక్కటైన చోట రెండు గాని, కాలేని, అద్వితీయ జ్ఞాన మొక్కటే శోభిస్తుంది.

అలాంటి గురుశిష్యులే శ్రీకృష్ణార్జునులు. కనుకనే, వీరి మధ్య పదిహేడు అధ్యాయాలతో జ్ఞానం వరద లాగా పారింది. అద్భుతమైన గురువు, అద్భుతమైన శిష్యుడు కురుక్షేత్రంలో ఒక్కచోట చేరారు. సంవాద రూపంలో తత్త్వాన్ని చర్చింప బోతున్నారు. అమృతమయ మైన ధర్మబోధ అంద బోతోంది. దివ్యమైన జ్ఞానామృతము వితరణకు సిద్ధం కాబోతోంది.

అర్జునుడు ఆత్రుతతో నిరీక్షిస్తున్నాడు. సంజయుడు ఆసక్తితో ఎదురు చూస్తున్నాడు. మీరూ, నేను కూడా శ్రద్ధతో చేతులు జోడిస్తున్నాం. మారలేక పోయినా, విని ఆనందించ డానికి ధృతరాష్ట్రుడు కూడా సిద్ధపడు తున్నాడు.





* కఠోపనిషత్తు పై పూజ్య స్వామీజీ ప్రవచనముల వి.సి.డి.లు ఆశ్రమంలో లభ్యం.

**శరణాగతి**

యుద్ధభూమిలో ప్రవేశించి నపుడు అర్జునునిలో కేవలం శత్రుభావనే ఉండింది. సమర సంకల్పమే ఉండింది. ద్వేషవృత్తి ఒక్కటే మనస్సును అంటి పెట్టుకొని ఉండింది.

రణరంగంలో భీష్మాదుల్ని చూచిన తరువాత శత్రు భావన మెల్లమెల్లగా పలుచ బడింది. దాని స్థానంలో మమకార భావన మొల కెత్తింది. ఒక దశలో మనసంతా మమకార వృత్తి పెనవేసుకు పోయింది.

మమకారం అర్జునుని కుదిపేసింది. అంతటితో ఆగలేదు. ఒక సాధారణ సమస్యను పారమార్థిక సమస్యగా మార్చేసింది. ప్రేయస్సును పేలవంగా తేల్చేసింది. శ్రేయస్సునే ప్రధానంగా ముందుకు తెచ్చింది.

మమకార వృత్తి స్థానంలో శరణాగత వృత్తి శోభించింది. జ్ఞానాభిలాష బుద్ధిలో పల్లవించింది. వీరుడిగా కురుక్షేత్రంలో అడుగు పెట్టిన అర్జునుని శిష్యునిగా రూపు దిద్దింది.

అర్జునుడు శరణాగతు డయ్యాడు. ఇక్కడ అర్జునుడు శరణాగతు డయింది వ్యక్తికి అని అనిపిస్తున్నా, కనిపిస్తున్నా, వాస్తవానికి అతడు శరణాగతుడైంది జ్ఞానానికి. వాసుదేవుని లోని అమృతమయమైన జ్ఞానానికి. జ్ఞాని వైభవము అంటే జ్ఞాన వైభవమే. జ్ఞానము యొక్క వైభవమే.

**జ్ఞాన ద్వారము**

భగవద్గీత రెండవ అధ్యాయం - సాంఖ్య యోగము ఏడవ శ్లోకంలో అర్జునుడు ఏడుపు మానేసి ప్రసన్నంగా శరణాగతు డయ్యాడు. గీతాజ్ఞాన సాధానికి ఈ శ్లోకం ముఖద్వారము అనిపిస్తోంది. ఈ శ్లోకం లేనట్లయితే గీతాభవనం లోకి ప్రవేశమే దక్కేది కాదు. ఈ శ్లోకం శ్రీకృష్ణుని చెవిలో పడకుండా ఉంటే, అర్జునునికి గీతామృతాన్ని శ్రీకృష్ణుడు పంచేవాడు కాడు. అందుకనే, శాస్త్రారంభానికి అవసరమైన అనుబంధ చతుష్టయం ఈ శ్లోకం లోనే పులకిస్తూ పుష్పితమై, పుష్కలంగా పురస్కారము నందుకొంది.

విషయము, ప్రయోజనము, అధికారి, సంబంధము - ఈ నాలుగు అనుబంధ చతుష్టయము. శాస్త్రారంభానికి మూలము.

**(1) విషయము :** జ్ఞానము. ఆత్మజ్ఞానము. శ్రేయస్సును బోధించమని అర్జునుడు ప్రశ్నించాడు. శ్రేయస్సు అంటే మోక్షము. మోక్షము జ్ఞానరూపంలో ఉంది కనుక జ్ఞానమే ఇక్కడ కేంద్ర విషయము.

**(2) ప్రయోజనము :** పరమ పురుషార్థమైన మోక్షమే ప్రయోజనము.

**(3) అధికారి :** అర్జునుడు అధికారి. వివేక, వైరాగ్య, శమాది షట్క, సంపత్తి, ముముక్షుత్వము అనే సాధన చతుష్టయ సంపద గల అర్జునుడు అధికారి.

**(4) సంబంధము :** గీతలో జ్ఞానమే ప్రధానమై నందున, భగవంతుడు, భగవంతుని జ్ఞానము (గీత) వేరు కానందున గ్రంథ విషయము, గ్రంథ నామమునకు సంబంధము ఉంది. అంతేకాదు. శిష్టాచార సంప్రదాయంలో బోధ విషయంలో ప్రముఖంగా ఉండ వలసిన గురుశిష్య సంబంధము కూడా ఇక్కడే శోభించింది.

ఇక జ్ఞానబోధ ప్రారంభం కావాలి. అర్జునుడు తన చివరి మాటను పలికి విరమిస్తున్నాడు.

**న హి ప్రపశ్యామి మ మాపనుద్యా ద్యచ్ఛోక ముచ్ఛోషణ మిన్ద్రియాణామ్ ।**
**అవాప్య భూమా వసపత్న మృద్ధం రాజ్యం సురాణా మపి చాధిపత్యమ్ ॥** 8





న-హి-ప్రపశ్యామి-మమ-అపనుద్యాత్-యత్-శోకం-ఉచ్ఛోషణం-ఇన్ద్రియాణాం
అవాప్య-భూమౌ-అసపత్నం-ఋద్ధం-రాజ్యం-సురాణాం-అపి-చ-ఆధిపత్యం

| | | | | | |
|---|---|---|---|---|---|
| భూమౌ | = | భూమండలమున | ఇంద్రియాణాం | = | ఇంద్రియాలకు |
| అసపత్నం | = | శత్రువులు లేని | ఉచ్ఛోషణం | = | మిక్కిలి తాపమును కలిగించే |
| ఋద్ధం | = | సమృద్ధ మైన | మమ | = | నా యొక్క |
| రాజ్యం | = | రాజ్యమును గాని | శోకం | = | దుఃఖమును |
| సురాణాం | = | దేవతల | యత్ | = | ఏది |
| ఆధిపత్యం చ అపి | = | ఆధిపత్యమును కూడా | అపనుద్యాత్ | = | పోగొట్టునో |
| అవాప్య | = | పొందినా | న ప్రపశ్యామి హి | = | చూడలేక పోతున్నాను |

**కృష్ణా! సర్వేంద్రియ తాపంతో, శోకంతో కుమిలి పోతున్నాను. ఎలా తొలగించుకోవాలో తెలియడం లేదు. ఈ లోకంలో శత్రు శేషం లేని, సకలైశ్వర్య సంపన్నమైన రాజ్యం లభించినా, నా శోక తాపాలు తీరేలా లేవు. స్వర్గాధిపత్యం కూడా అలాంటిదే ననిపిస్తోంది. నాకు మరొక మార్గం కనిపించడం లేదు.**

**వ్యాఖ్య**

యుద్ధం చెయ్యాలని అర్జునుడు కురుక్షేత్రంలో ప్రవేశించాడు. పోట్లాడటం మాని మాట్లాడటం ఆరంభించాడు. మాటలన్నీ ఖర్చయి పోయాయి. బుద్ధిలో బాధలు అలాగే ఉన్నాయి. ఏమి చెయ్యడానికి మనస్సు ఇష్టపడటం లేదు. ఏది చేసినా చేతులు కాలుతాయి - చిత్తము పేలుతుంది అనే భావం బుద్ధిలో స్థిరపడి పోయింది.

**ఏమి చేయాలి? - ఏది పొందాలి?**

యుద్ధం చెయ్యాలి. గెలిస్తే రాజ్యం. ఓడితే స్వర్గం. యుద్ధం స్వధర్మం కనుక ఆచరించక తప్పదు. చేసి సాధించే దేముంది? శ్రేయస్సు లభిస్తుందా? అని అర్జునుని ఆంతర్యం ప్రశ్నిస్తోంది.

యుద్ధంలో విజయాన్ని సాధిస్తే రాజ్యం లభిస్తుంది. రాజ్యం రావచ్చు. దుఃఖం పోతుందా? పైరుకు తెగులు - ప్రభువుకు వైరులు అనివార్యాలు. దోమలు, నల్లులు నిండిన ప్రదేశంలో పట్టుపాన్పులు ఏమి సుఖాన్నిస్తాయి? ప్రభువుకు శత్రువులు ఉంటారు. ప్రతికూల పరిస్థితులూ ఉంటాయి. కనుక దుఃఖం తప్పదు. కాని, ఇక్కడ అర్జునుడు ప్రస్తావిస్తున్నది సామాన్యమైన రాజ్యం కాదు. అఖండ భూమండలాధిపత్యము. శత్రువులు లేని రాజ్యము (*అసపత్నం - ఋద్ధం - రాజ్యం*).

కృష్ణా! మనం వాళ్ళను జయిస్తామో, లేక వాళ్ళే మనల్ని జయిస్తారో కూడా తెలియదు. ఏది మనకు శ్రేయస్కరమో కూడా తెలియడం లేదు అని ఆరవ శ్లోకంలో అన్నాడు అర్జునుడు. ఎవరు గెలిచినా సాధించేది ఏమీ లేదని ఇప్పుడు అంటున్నాడు.

తామే గెలిస్తే రాజ్యం వస్తుంది. రాజ్యం క్రొత్తది. దేహం మాత్రం పాతదే. రాజ్యం ఉండినా దేహం ఉండదు. దేహం కూడా కర్మఫలమే. గతంలో ఆచరించిన కర్మల ఫలితంగా దేహం ప్రాప్తించింది. కర్మఫలం ఏదైనా నశించేదే. అర్జునుడు సాధారణమైన వ్యక్తి కాదు. శాస్త్ర విషయాలు వినిన వాడే. అనివార్యాలను జీవితంలో చూసిన వాడే. అదంతా వృథా కాలేదు. తన సమస్యను తీవ్రతరం చేస్తూనే ఉంది. అనిత్యాలను ఆరబోస్తూనే ఉంది.

కుండను చేయడం కర్మ. వస్త్రాన్ని నేయడం కర్మ. కర్మ యొక్క ఫలంగా ఒక కాలంలో ప్రాప్తించిన కుండ మరొక కాలంలో పగిలి పోతుంది. కర్మఫలంగా ఒక కాలంలో లభించిన వస్త్రము మరొక కాలంలో చిరిగి పోతుంది. దేహం కూడా కర్మఫలమే. ఏది పొందినా మరొక నాడు దానిని పోగొట్టుకో వలసిందే. దేహమే నిత్యం కాదు. ఇక రాజ్యం నిత్యమా? ప్రభువై సాధించే దేముంద? పరితపిస్తూనే బ్రతకాలి. అసంతృప్తి తోనే జీవించాలి.

ఒకవేళ యుద్ధంలో అపజయమే ఎదురైతే, మరణమే ప్రాప్తిస్తే, అప్పుడేం జరుగుతుంది? స్వర్గం ప్రాప్తిస్తుంది. ఇక్కడ కేవలం స్వర్గమే కాదు, స్వర్గలోకాధిపత్యం లభించినా తన దుఃఖం ఉపశమించే లాగా లేదు అని స్పష్టంగా చెబుతున్నాడు అర్జునుడు.

రోగి ఒక గ్రామాన్ని విడిచి మరొక గ్రామానికి పోయినంత మాత్రాన రోగం పోతుందా? ఇంటి లోని కష్టాలను మనస్సులో పెట్టుకొని కార్యాలయానికి వెళ్ళిన ఉద్యోగి, కాగితాలలో తల దూర్చినంత మాత్రాన అతని తల నుండి కష్టాలు తప్పు కుంటాయా? అసంతృప్తితో బ్రతికే వ్యక్తి స్వర్గాన్ని చేరి మాత్రం ఏం పొందుతాడు? భోగాలు అనుభవిస్తున్నా, అవి అనిత్య మనే సత్యాన్ని అవలోకిస్తూనే ఉంటాడు. భూమండలాధిపత్యాన్ని అనుభవించినా దానిని త్యజించక తప్పదు. స్వర్గలోకాధిపత్యము కూడా అంతే కదా! అదీ కర్మఫలమే. ఈ లోకంలో కర్మఫలంగా లభించింది ఎలా అంతమవుతూ ఉందో, అలాగే పుణ్యకర్మ ఫలంగా స్వర్గలోకంలో లభించేది కూడా అంతమయ్యేదే నని విస్పష్టం చేసింది ఛాందోగ్య శ్రుతి ***( తద్యథేహ కర్మచితో లోకః క్షీయతే, ఏవ మేవ అముత్ర పుణ్యచితో లోకః క్షీయతే).*** తృప్తి అనేది ప్రదేశంపై, కాలంపై ఆధారపడి ఉన్నది కాదు. వ్యక్తిపై కేంద్రీకరింపబడి ఉన్నది. ఈ లోకంలో తృప్తి లేనివాడు మరో లోకంలో కూడా తృప్తిగా ఉండ లేడు.

**పరిధి దాటిన పరితాపము**

రాజ్యం రావచ్చు. స్వర్గం రావచ్చు. దుఃఖం పోయే లాగా లేదు. దేహం లోపల ఏర్పడిన వ్రణాన్ని నిర్మూలించకుండా, దేహంపై మందు రాస్తే బాధ తగ్గుతుందా? తొలగుతుందా? ఆంతర్యం లోని అసంతృప్తిని అదృశ్యం చేసుకోకుండా బాహ్యంలో పొందే భోగాలన్నీ రోగాలే నని పార్థునికి తెలిసి పోయింది. భూమండలాది స్వర్గ పర్యంతం భోగ్య వస్తువుల యందు జిహాసా బుద్ధి ఏర్పడింది.

అర్జునుడు నిలకడగా నిలబడలేక పోయాడు. గాండీవాన్ని పట్టుకొనే శక్తి కూడా చేతులకు లేకుండా పోయింది. అర్జునుని లోని శక్తి నంతా దుఃఖం పీల్చేసింది. శోకాగ్నిలో కుమిలి పార్థుని పటుత్వము ఆవిరై పోయింది. ఇంతటి దుఃఖాన్ని పోగొట్టే శక్తి రాజ్యం వల్ల గాని, స్వర్గం వల్ల గాని వచ్చే ప్రసక్తే లేదని అర్జునునికి అర్థమై పోయింది.

**వైరాగ్యం పరమం ధనం**

జ్ఞానసౌధానికి వైరాగ్యం పటిష్ఠ మైన పునాది వంటిది. వైరాగ్యం లేని జ్ఞానం స్థిరంగా నిలబడదు. అర్జునునిలో వైరాగ్యం తీవ్రస్థాయికి చేరింది. ఇదంతా వివేకం వల్ల ఏర్పడిందే గాని మతాబుల కాంతి వంటిది కాదు. వివేకంతో సాగించిన విశ్లేషణ విజయునిలో వైరాగ్యాన్ని పుష్కలంగా దించింది.

పరిస్థితులు విషమించి నపుడు, అన్ని వైపుల నుండి నిరాశా గాలులు వీచి వ్యక్తి మూర్తిమత్వము నీరసించి నపుడు ఎవరైనా వైరాగ్యాన్ని పొందే అవకాశం ఉంటుంది. కాని, అది తాత్కాలికంగా ఉంటుందే గాని శాశ్వతంగా నిలవదు. అర్జునుడు దారుణమైన పరిస్థితిని వివేకంతో విశ్లేషించుకొని, తన సమస్య ఏమిటో కనుగొన్నాడు.





తనలో అలుముకున్న నిరాశా చీకట్లను తొలగించుకొనే ప్రయత్నంలో అచ్యుతుడనే ఆశాదీపాన్ని, అక్షయ దీపాన్ని ఆశ్రయించాడు. వైరాగ్యంతో వాసుదేవుణ్ణే శరణు బొందాడు. వైరాగ్యము లేని శ్రవణము ఫలప్రదం కాదు.

కొందరికి తత్త్వజ్ఞానము కూడా కాలక్షేపంగా ఉంటుంది. దానినొక వినోదంగా భావిస్తూ, విచిత్రంగా భాషిస్తూ ఉంటారు. అలాంటి వారిలో తత్త్వం పట్ల నిబద్ధత ఉండదు. తీవ్రత ఉండదు. అలాంటి వారు గీతా జ్ఞానగంగలో మునక వేయలేరు.

వివేక వైరాగ్యాలు ఎంత ఉన్నతంగా ఉంటే, అంత మహోన్నతంగా తత్త్వం పంట పడుతుంది. అర్జునుని విషయంలో వైరాగ్యం తీవ్రస్థాయికి చేరింది. ఇహపర లోక భోగాలన్నీ తుచ్ఛంగా కనిపించాయి ఆ పుణ్యాత్మునికి. తత్ఫలితంగా శ్రీకృష్ణ భగవానుడు గీతను బోధించుటకు సిద్ధ పడ్డాడు. ఈ విషయాన్నే సంజయుడు ధృతరాష్ట్రునికి చెబుతున్నాడు.

**సంజయ ఉవాచ :**

ఏవముక్త్వా హృషీకేశం గుడాకేశః పరంతపః ।
న యోత్స్య ఇతి గోవిన్ద ముక్త్వా తూష్ణీం బభూవ హ ॥ 9

*ఏవం-ఉక్త్వా-హృషీకేశం-గుడాకేశః-పరంతపః*
*న-యోత్స్యే-ఇతి-గోవిందం-ఉక్త్వా-తూష్ణీం-బభూవ-హ*

| | | | | | |
|---|---|---|---|---|---|
| పరంతపః | = | శతృవులను తపింపజేసే | ఉక్త్వా | = | పలికి |
| గుడాకేశః | = | అర్జునుడు | న యోత్స్యే | = | యుద్ధము చేయను |
| హృషీకేశం | = | హృషీకేశుడైన | ఇతి | = | అని |
| గోవిందం | = | గోవిందునితో | ఉక్త్వా | = | పలికి |
| ఏవం | = | ఈ విధముగా | తూష్ణీం బభూవ హ | = | మౌనంగా ఉండి పోయాడు |

**సంజయుడు చెబుతున్నాడు :**

**ధృతరాష్ట్ర మహారాజా! శత్రువులను తపింప చేసే అర్జునుడు హృషీకేశుడైన గోవిందునితో ఈ విధంగా పలికి, నేను యుద్ధం చెయ్యలేను అని చెప్పేశాడు.**

**వ్యాఖ్య**

సంజయుడు ఈ శ్లోకంలో అర్జునుని 'గుడాకేశుడు', 'పరంతపుడు' అంటూ, శ్రీకృష్ణుని 'హృషీకేశుడు' అని పేర్కొంటున్నాడు.

అర్జునుడు పరంతపుడు. అంటే, శత్రువులను తపింప చేయువాడు అని అర్థము. శత్రు సంతాపకరు డైన అర్జునుడు ఎదురుగా శత్రువులను పెట్టుకొని కూడా యుద్ధం చెయ్యనని చెప్పి మౌనం వహించాడు.

పరంతపుడైన అర్జునుని గుడాకేశుడని కూడా చెబుతున్నాడు. ఈ పద ప్రయోగం మొదటి అధ్యాయం ఇరవై నాల్గవ శ్లోకంలో కూడా జరిగింది. 'గుడాక' మంటే నిద్ర. నిద్రను జయించిన వాడు కనుక అర్జునుడు గుడాకేశుడు.

నిద్ర తమోగుణాన్ని సూచిస్తుంది. తమోగుణాన్ని జయించిన వాడు కనుక అర్జునుడు గుడాకేశుడు.

తమోగుణం నుండి బయట పడ్డట్లే అజ్ఞాన నిద్ర నుండి కూడా మేల్కొనే సమర్థుడు అనేది అంతర్భావము.

పరంతప: అంటే అర్జునుడు అని తెలుసుకున్నాం. 'పరంతప:' అనే పదానికి 'పరంతప' అనే పాఠాంతరము కూడా ఉంది. 'పరంతప:' అని విసర్గ యుక్తంగా ఉంటే, 'పరంతప' శబ్దం అర్జునునికి సంబంధించి ఉంటుంది. అలా కాకుండా, విసర్గం లోపించి కేవలం 'పరంతప' అని ఉంటే, సంజయుడు ధృతరాష్ట్రుని పరంతపా! అని సంబోధించినట్లు అవుతుంది. ధృతరాష్ట్రుడు అంధుడు. కనుక శత్రువులను తపింప చేయువాడు అనే అర్థాన్నిచ్చే పదం ధృతరాష్ట్రుని కన్నా అర్జునునికే చక్కగా సరిపోతుంది.

శ్రీకృష్ణుని హృషీకేశుడు అంటున్నాడు. ఈ పదం ఇప్పటికే రెండుసార్లు వచ్చింది. మొదటి అధ్యాయం పదైదవ శ్లోకం లోను, అలాగే ఇరవై నాల్గవ శ్లోకంలో కూడా శ్రీకృష్ణుని హృషీకేశుడు అనడం జరిగింది.

'హృషీకములు' అంటే ఇంద్రియాలు. వాటిని ప్రేరేపించే చైతన్యరూపుడు కనుక శ్రీకృష్ణుడు హృషీకేశుడు. నేను యుద్ధము చెయ్యను అని పలికి అర్జునుడు మౌనం వహించినా, హృషీకేశుడు ప్రక్కనే ఉన్నాడు కనుక, ఎలాగైనా ప్రేరేపించి యుద్ధాన్ని జరిపిస్తాడనే భావము తోనే హృషీకేశుడు అనడం జరిగింది.

హృషీకేశుడైన శ్రీకృష్ణుని 'గోవిందం' అని పేర్కొనడంలో కూడా విశేషమైన భావం ఉంది. అర్జునునికి శ్రేయస్సును అనుగ్రహించే వేదాంత జ్ఞానాన్ని శ్రీకృష్ణుడు బోధించ డానికి ఉపక్రమిస్తున్నాడు. కనుక గోవింద నామము చక్కగా సరిపోయింది.

**గోభిర్వేదాంత వాక్యైరేవ వింద్యతే లభ్యత ఇతి గోవిందః**

వేదాంత వాక్యాల ద్వారా వ్యక్తమయ్యే వాడు కనుక శ్రీకృష్ణుడు 'గోవింద' శబ్దవాచ్యుడు. అర్జునుని సమస్యను జ్ఞానము ద్వారా పరిష్కరించు వాడు గోవిందుడు.

'గోవింద' శబ్దార్థము గురుదేవుని యొక్క సర్వజ్ఞత్వమును సూచిస్తూ ఉంది అని అభిప్రాయ పడ్డారు గీతాభాష్యంలో శ్రీ మధుసూదన సరస్వతి ***(గో వేద లక్షాణాం వాణీం విన్దతీతి వ్యుత్పత్త్యా సర్వ వేద ఉపాదానత్వేన సర్వజ్ఞమ్ ).*** వేదరూపమైన వాక్కును ***(గో)*** పొందువాడు ***(విన్దమ్)*** అను వ్యుత్పత్తి చేత సమస్త వేదములకు ***(సర్వవేద)*** కారణమైన వాడు అగుట చేత ***(ఉపాదానత్వేన)*** శ్రీకృష్ణుడు 'గోవింద' శబ్దవాచ్యుడుగా సర్వజ్ఞుడు ***(సర్వజ్ఞమ్ ).***

అర్జునుడు శ్రీకృష్ణునితో చెప్పవలసిం దంతా చెప్పి, నేను యుద్ధము చెయ్యను ***(న యోత్స్య)*** అని పలికి, మరో మాట లేకుండా, ఊరక ***(తూష్ణీం)*** ఉండి పోయాడు ***(బభూవ).*** మౌనంగా ఉండి పోయాడు.

సర్వజ్ఞుడైన జగద్గురువు శ్రీకృష్ణ భగవానుడు మాట్లాడబో తున్నాడు. గురుబోధను ఆలకించాలంటే శిష్యుడు నిశ్శబ్దం గానే ఉండాలి. గురు వచనముల యందే మనస్సును నిలిపి, మరో ఆలోచన లేకుండా, ఆలాపన లేకుండా ఊరుకోవాలి. శ్రవణం చేసే వాడు సమస్తాన్ని త్యజించి, సర్వాన్ని మరచి వినాలి అనేది కూడా శాస్త్రోక్తం ***( సంన్యస్య శ్రవణం కుర్యాత్ ).***

**తమువాచ హృషీకేశః ప్రహసన్నివ భారత ।**
**సేనయో రుభయోర్మధ్యే విషీదన్త మిదం వచః ॥** 10

***తం-ఉవాచ-హృషీకేశః-ప్రహసన్-ఇవ-భారత***
***సేనయోః-ఉభయోః-మధ్యే-విషీదంతం-ఇదం-వచః***





| | | | | | |
|---|---|---|---|---|---|
| భారత | = | ఓ ధృతరాష్ట్రా! | తం | = | ఆ అర్జునుని |
| ఉభయోః | = | రెండైన | హృషీకేశః | = | శ్రీకృష్ణుడు |
| సేనయోః | = | సేనల యొక్క | ప్రహసన్ ఇవ | = | నవ్వుచున్న వాని వలె |
| మధ్యే | = | నడుమ | ఇదం వచః | = | ఈ వాక్యమును |
| విషీదంతం | = | దుఃఖిస్తున్న | ఉవాచ | = | పలికెను |

**మహారాజా! ఉభయ సేనల నడుమ దిగులుతో దుఃఖమగ్నుడై ఉన్నాడు అర్జునుడు. శ్రీకృష్ణుడు మందహాసాన్ని చిందిస్తూ మాట కదిపాడు.**

**వ్యాఖ్య**

**ఉభయసేనల మధ్య**

**పాండవ మధ్యముడు**

మిశ్రమ భావాల మధ్య ఎటూ తేల్చుకోలేక నలిగి పోతున్నాడు పాండవ మధ్యముడైన పార్థుడు. ఏదేదో చేసేయాలని యుద్ధభూమిలో అడుగు పెట్టిన అర్జునుడు ఏదీ చేయలేని స్థితికి చేరి, చివరగా యుద్ధ విరమణకు సిద్ధపడ్డాడు. సంక్లిష్టమైన సమయంలో, వీరోచిత పోరాటానికి నడుము బిగించిన తరుణంలో, ఎక్కడో గుండె లోతుల్లో అవ్యక్తంగా దాగియున్న సంశయాలు, భయాలు, ఆందోళనలు ఒక్కసారి పెల్లుబికి చుట్టు ముట్టాయి. విజయుడు విషాదంతో విలపిస్తున్నాడు.

ఉద్యోగ నిమిత్తము ఎంపిక చేసే సమావేశానికి హాజరై నపుడు, దరఖాస్తు పెట్టిన వ్యక్తే దయనీయంగా దిగాలు పడి ఉండటం చూస్తుంటాము. పెళ్ళిచూపులకు ప్రథమంగా వెళ్ళిన వరుడు వధువు గృహంలో అదోలా మెలికలు తిరగడం ఎవరికి తెలియదు? క్రొత్తగా పాఠశాలలో ప్రవేశించి నపుడు, బాల్యం వల్ల భయమో, బిడియమో ఉండింది అంటే అర్థం చేసుకోవచ్చు. నూతనంగా ఉద్యోగ నిర్వహణకు కార్యాలయంలో కాలు పెట్టేటప్పుడు కూడా అలాంటిదే ఏదో ఉంది అంటే దానిని ఎలా అర్థం చేసుకోవాలి?

మనకు ప్రాణతుల్యమైన వారి ఆరోగ్యం ఆందోళనకరంగా ఉందని తెలియగానే మనస్సు ఎందుకు పట్టు తప్పుతుంది? కాళ్ళు ఎందుకు వణకుతాయి? చెమటలు ఎందుకు పోస్తాయి? మాట లెందుకు తడబడతాయి? వరదలు పొంగి వచ్చినపుడు, సునామీ ముంచుకొచ్చి నపుడు, ప్రాణాలు కోల్పోయిన విగత జీవుల దీన గాథల్ని పత్రికలలో చదివి నపుడు, మన గుండెలు ఎందుకు గోల చేస్తున్నాయి? కళ్ళు ఎందుకు చెమ్మగిల్లు తున్నాయి? అలా జరగడం అసమంజసమా? ఆ మాత్రం చలనాలు మనుషుల్లో లేకపోతే, రాళ్ళల్లో ఉంటాయా? రప్పల్లో కనిపిస్తాయా?

అర్జునుడు దుఃఖిస్తున్నాడు అనేది అందరికీ తెలుసు. ఆ సన్నివేశంలో దుఃఖం రావడం ఆశ్చర్యమా? కళ్ళ ముందే, క్షణాల్లో, అయిన వాళ్ళు ఎవరుంటారో, ఎవరు ఉండరో అనే ఆలోచన ఆవేదనా పూరిత మైనది కాదా? చిన్న చిన్న కారణాలకే మనుషులు పెద్దపెద్దగా రోదిస్తూ ఉంటారు. అర్జునుడు కూడా నరుడే కదా! మానవుడే కదా! మనస్సున్న వాడే కదా! మమతలు తెలిసిన వాడే కదా! అలాంటి వాడు కలత చెందడం అసహజమా?

అందరి లాగే అర్జునుడు కూడా ఆవేదనకు గురి అయ్యాడు. విషాదానికి లోనయ్యాడు. అలాగని, అర్జునుణ్ణి అందరితో పోల్చడం సబబు కాదు. భయంకర పరిస్థితులు తలెత్తి నపుడు అందరి లాగే అర్జునుని

కళ్ళు కూడా వర్షించి ఉండొచ్చు. అంతమాత్రాన అందరి లాగా అర్జునుడు కాళ్ళకు బుద్ధి చెప్పలేదు. పలాయనం చిత్తగించ లేదు. సమస్యను విస్మరించ లేదు. దానికి మూల మేమిటో తెలుసుకొనే ప్రయత్నం చేశాడు. కార్యంతో కలత పడినా, కారణాన్ని సమూలంగా నిర్మూలించే కార్యక్రమానికి నడుం బిగించాడు. ఆ ప్రయత్నము యొక్క ఫలితమే గీతాశాస్త్రము. ఉపనిషత్సార సందేశము.

**జనన మరణాల మధ్య**

**జీవుల బ్రతుకులు**

వచ్చేవారు లేనివారే. ఉన్నవారు లేకుండా పోయేవారే. ఆయువును పోసుకొని జన్మకు వస్తారు. ఆయువును క్రుమ్మరించి మృత్యువులో వాలి పోతారు. ఈ జనన మరణా లనే రెండు గట్ల మధ్య సాగేదే జీవన ప్రవాహము. జీవి ప్రయాణము. మునిగినా తేలినా ప్రవాహం లోనే. గట్ల మధ్యనే. తరించినా అంతరించినా ఉభయ తీరాల మధ్యనే.

ఏది జరుగుతుందో, ఎలా జరుగుతుందో ఎవరికి తెలుసు? అందుకే మధ్యలో ఉన్న వాళ్ళందరూ ఏడ్చేవాళ్ళే. దుఃఖించే వాళ్ళే. విషాదంతో విలవిల లాడే వాళ్ళే.

నరు లందరి పరిస్థితి ఇదే. అందుకనే నరు లందరి పక్షాన ప్రతినిధిగా ఒక్క నరుడు దుఃఖించాడు. ఆ నరుడే అర్జునుడు. సర్వ జీవుల ప్రతిరూపంగా కురుక్షేత్రంలో నిలిచాడు. మధ్యలోనే ఉన్నాడు. ఉభయసేనల మధ్యలోనే ఉన్నాడు.

నరుడు మధ్యముడే. ఇద్దరు అన్నలకు, ఇద్దరు తమ్ముళ్ళకు మధ్యలో అర్జునుడు. పాండవ మధ్యముడు. నరు డెవడైనా మధ్యముడే. ఉత్తములైన దేవతలకు, అధమమైన జంతుజాలానికి మధ్యలో నరజన్మ. మానవ జన్మ. మాధవు డయ్యేందుకు అనువైన జన్మ. అందుకే నరుడు మధ్యముడు.

జీవన పోరాటంలో కూడా నరుడు మధ్యముడే. ఉభయసేనల మధ్య అర్జునుడు. జనన మరణాల మధ్య మానవుడు. ఎదబాధతో ప్రవాహంలో ఎదురీదిన వాడు. మాధవుని ఆశ్రయించిన వాడు. దయ చూపి ఎదబాధను తొలగించమని యదునందనుని యాచించిన వాడు. ప్రార్థించిన వాడు. శాసించి రక్షించమని వేడుకొన్న వాడు. నీ కృప లేనిదే కడతేరలే నని కన్నీటితో శరణుజొచ్చిన వాడు.

*పల్లవి :* **వసంతం విరబూసిన గాని**
**చిగురించవు మోడు తరువులు**
*అనుపల్లవి :* **నీ దయ మా యెద తాకిన గాని**
**విరబూయవు మా బ్రతుకులు** *॥ వసంతం ॥*
*చరణము :* **ఉన్నది చెప్పకనే పోతూ ఉంది**
**రానున్నది తానే రాబోతుంది**
**పోయింది ఆయువు వచ్చేది మృత్యువు**
**నిలవని కాయము చావుకు తాయము** *॥ వసంతం ॥*

ఇదే జీవ చైతన్యం. చైతన్య జీవన ఆలాపం. జీవుల విలాపం.

అర్జునుని విషాదాన్ని శ్రీకృష్ణుడు చూశాడు. అతని విలాపాన్ని, విషాదానికి కారణాన్ని అతని మాటల లోనే విన్నాడు. మందహాసంతో తన మాటను వినిపించ డానికి ఉద్యుక్తు డయ్యాడు.

విషాదంతో అర్జునుడు క్రుంగిపోతున్న సమయంలో శ్రీకృష్ణుడు నవ్వడ మేమిటి? ఎలా నవ్వ గలిగాడు?





ఎందుకు నవ్వాడు? మసక చీకటిలో స్థాణువును (కొమ్మలు లేని చెట్టును) చూచి అది చోరుడని భావించి కేక వేసిన వ్యక్తిని చూచి, అది మోడు అని తెలిసిన వాడు నవ్వడా? ఇదీ అంతే.

అర్జునుని దుఃఖానికి కారణమే లేదు అని అచ్యుతునికి తెలుసు. విషాద సన్నివేశంలో ఎవ్వరూ నవ్వలేరు. నిజమే. కాని, అక్కడ విషాదానికి హేతువే లేదని భగవంతునికి తెలుసు. కేవలం అజ్ఞానం వల్ల ఏర్పడిన శోక మోహాలతో అర్జునుడు కలత చెంది కన్నీళ్ళు పెడుతున్నాడని మధుసూదనునికి తెలుసు. అందుకే నవ్వుతూ కనిపిస్తున్నాడు. అది పరిహసించడం కాదు. సానుభూతితో, ప్రేమతో పరామర్శించడం. అది విస్మృతపు నవ్వు కాదు. సమ్యక్ జ్ఞానం వల్ల ఏర్పడిన చిద్విలాసంలో చిందిన చిరునవ్వు. సర్వ భయాలు, సమస్త శోకాలు జ్ఞానోదయంతో అదృశ్యమయ్యే సమయం ఆసన్న మైందని సూచించే పువ్వు వంటి నవ్వు. పుష్పహాసుని పూర్ణజ్ఞానం విరజిమ్మిన వెలుగుల కిరణం. పూర్ణజ్ఞానం వల్ల కలిగిన మంజుల మనోజ్ఞ ప్రశాంత మందహాసం.

***సంసార బీజ భూతౌ శోకమోహౌ , తయోశ్చ సర్వకర్మ సంన్యాస పూర్వకాత్ ఆత్మజ్ఞానాత్ న అన్యతః నివృత్తిః ఇతి తత్ ఉపదిదిక్షుః సర్వలోకానుగ్రహార్థమ్ అర్జునం నిమిత్తీకృత్య ఆహ భగవాన్ వాసుదేవః అశోచ్యా నిత్యాది ।***

శోకమోహాలు సంసారానికి బీజాలు. సర్వ కర్మ సన్యాస పూర్వకమైన ఆత్మజ్ఞానం వల్లనే అవి తొలగాలి గాని, అన్య సాధనల వల్ల నివర్తింప బడవు. ఈ విషయాన్ని ఉపదేశించాలని భావించిన శ్రీకృష్ణ భగవానుడు అర్జునుని నిమిత్తంగా చేసికొని, సర్వ లోకాన్ని అనుగ్రహించడం కోసం గీతోపదేశాన్ని ప్రారంభించాడు (***అశోచ్యాన్ అన్వశోచః*** - దుఃఖింప దగని వాళ్ళను గూర్చి దుఃఖిస్తున్నావు).

**మువ్వల వాని నవ్వు**

అర్జునాచ్యుతులు కురుక్షేత్రంలో ఒకే చోట ఉన్నారు. ఒకే సన్నివేశాన్ని వీక్షిస్తున్నారు. ఒకే పరిస్థితిని ఎదుర్కొంటున్నారు. అర్జునుని ముఖంలో విషాదం అలుముకొని ఉంది. అచ్యుతుని ముఖంలో ఆనందం తాండవిస్తూ ఉంది. ఏడుపుతో నరుడు. వేడుకతో నారాయణుడు.

ఏడ్చేవాడు జీవుడు, నవ్వేవాడు దేవుడు. ఏడ్చేవాడు అజ్ఞాని, నవ్వేవాడు జ్ఞాని. ఏడ్చేవాడు మానవుడు, నవ్వేవాడు మాధవుడు. ఏడ్చేవాడు రోగి, నవ్వేవాడు వైద్యుడు. వైద్యుడు నారాయణుడే అనేది లోకోక్తి. అర్జునుని పుణ్యఫలంగా, నారాయణుడే వైద్యుడిగా వచ్చి పార్థుని భవరోగాన్ని రూపుమాపిన అపూర్వ అద్భుత సన్నివేశ మది. భేషజము, భిషక్ రెండూ తానే అయిన జగద్గురువు భవరోగ చికిత్సను నవ్వుతూ ఆరంభించాడు.

**నాణ్యమైన నవ్వు నాల్గు విధాలు**

**(1)** అర్జునుడు శ్రీకృష్ణునికి శరణాగతు డయ్యాడు. శ్రేయస్సును నిశ్చయించి చెప్పమన్నాడు. చెయ్యడానికి శిష్యుడుగా తాను సిద్ధమన్నాడు. శాసించి మరీ చెప్పమన్నాడు (***శాధి మాం***). కానీ, శ్రీకృష్ణుడు గురువుగా ఏమి చెబుతాడో వినకుండానే నేను యుద్ధం చెయ్యను (***న యోత్స్యే***) అనేశాడు. ఒక వైపు చెప్పమంటాడు, మరో వైపు చెయ్యనంటాడు. ఈ విరుద్ధ భాషణం వాసుదేవునికి నవ్వు తెప్పించిందేమో!

**(2)** ఉభయసేనల మధ్య చేరి విలపిస్తున్నాడు విజయుడు ( ***సేనయో రుభయో ర్మధ్యే విషీదన్తం*** ). ఏడవడం తప్పు కాదు. ఎవరి స్వేచ్ఛ వారిది. ఎవరు ఎలాగైనా ఏడ్చుకోవచ్చు ఈ ప్రపంచంలో. కాకపోతే, ఆ ఏడ్చే దేదో యుద్ధానికి రాక ముందే ఇంట్లో ఏడిస్తే బాగుండేది కదా! ఉభయసేనల మధ్య ఏడవడ మెందుకు? అదేమన్నా పది మంది చూచి ఆనందించ దగిన అద్భుతమైన వినోద ప్రదర్శనమా? అని నవ్వుకుంటున్నా డేమో!

**(3)** ఈ మాత్రం ఏడ్చే కార్యక్రమానికి నీవు ఒక్కడివే వచ్చి ఉంటే సరిపోయేది కదా! బండి తోలమని నన్నెందుకు పిలిచావు? నువ్వేదో విరగ దీస్తావని, అరగ దీస్తావని నేనొస్తే, నువ్వేమో రథం వెనుక అరుగు మీద కూర్చొని తీరిగ్గా ఏడుస్తావా? ఇక నేనెందుకు వచ్చినట్లు? ఏడిస్తే అర్జునుడు ఎలా ఉంటాడో చూడటానికి వచ్చానా? లేక నేను పని లేనివాణ్ణి అని భావించి పని కల్పించావా? అని నవ్వాడేమో!

**(4)** అర్జునా! నీ ఏడుపు ఏదైనా గానీ. అందరి ఏడుపులను రూపుమాపే వేడుకను ఆవిష్కరించే మంగళ గడియలు అరుదెంచాయి అనే ఆనందంలో మాధవుడు మందహాసం చిందించాడేమో!

మువ్వలవాడు నవ్వాడు. ముజ్జగాలను నవ్వించే ప్రయత్నంలో చిదానంద స్వరూపుడు చిద్విలాసంతో చిరునవ్వులు చిందించాడు. ఏడుపుకు వీడుకోలు పలక మన్నాడు. ఆ మార్గం లోనే వేడుకోలు వినిపిస్తూ గీతా భవనం లోకి ప్రవేశిద్దాం!

*పల్లవి :* **మువ్వల గోపాల**
**చిరునవ్వుల గోపాల**
*అనుపల్లవి :* **ఏటికి మాటను - గాలికి పాటను**
**ఓర్పుతో నేర్పిన భక్త మందార!** ॥ **మువ్వల గోపాల** ॥
*చరణము :* **విజయుని రథమును కదిపి నడిపి**
**రాతను తుడిపే గీతను తెలిపిన**
**నంద గోపాలా!**
**ఆనంద గోపాలా!** ॥ **మువ్వల గోపాల** ॥

అని ఊహాలలో ఊరేగింది చైతన్య గీతిక.

*ఓం నమో భగవతే వాసుదేవాయ*

**శ్రీ భగవానువాచ :**

అశోచ్యా నన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే ।
గతాసూ నగతాసూంశ్చ నానుశోచన్తి పణ్డితాః ॥ 11

***అశోచ్యాన్-అన్వశోచః-త్వం-ప్రజ్ఞావాదాన్-చ-భాషసే***
***గతాసూన్-అగతాసూన్-చ-న-అనుశోచంతి-పండితాః***

| | | | | | |
|---|---|---|---|---|---|
| త్వం | = | నీవు | పండితాః | = | పండితులు |
| అశోచ్యాన్ | = | శోకింప దగని వారిని గూర్చి | గతాసూన్ | = | మరణించిన వారిని గూర్చి గాని |
| అన్వశోచః | = | దుఃఖిస్తున్నావు | అగతాసూన్ చ | = | బ్రతికియున్న వారిని గూర్చి గాని |
| ప్రజ్ఞా వాదాన్ చ | = | పండిత వచనములను కూడా | న అనుశోచంతి | = | దుఃఖించరు. |
| భాషసే | = | పలుకు తున్నావు | | | |

**శ్రీ భగవానుడు బోధిస్తున్నాడు :**

**అర్జునా! ఏడవ కూడని వాళ్ళ కోసం ఏడుస్తున్నావు. పండితుల వాక్యాలు పలుకు తున్నావు. పండితులు పోయిన వాళ్ళ కోసం విలపించరు. ఉన్నవాళ్ళ కోసం దుఃఖించరు.**





**వ్యాఖ్య**

**శోక మోహాలు**

ధర్మం విషయంలో తన మనస్సు మోహంలో చిక్కుకున్న దని అర్జునుడే చెప్పాడు (***ధర్మ సమ్మూఢ చేతాః***). మోహం అంటే ఉన్నది లేనట్లుగా, లేనిది ఉన్నట్లుగా చూడటం. ఇది అజ్ఞానం వల్ల సంభవిస్తుంది. అజ్ఞానం ఏదో కాదు. జ్ఞానం లేకపోవడమే అజ్ఞానం.

ఉన్నది ఉన్నట్లు తెలియడం జ్ఞానం. ఉన్నది ఉన్నట్లు తెలియక పోవడం అజ్ఞానం. అజ్ఞాన దశలో లేనిది ఉన్నట్లు తెలిసే ప్రమాదం ఉంది. ఆ ప్రమాదమే మోహము. జను లందరూ మోహవలయం లోనే పరిభ్రమిస్తూ ఉంటారు. వారిలో అర్జునుడు ఒకడు.

**అజ్ఞానే నావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః**

అజ్ఞానము జ్ఞానమును కప్పేసింది. అందుచేత జనులు మోహానికి గురి అవుతున్నారు. తాను ఏమిటో తనకు తెలియదు. ఇది అజ్ఞానము. అజ్ఞాని తాను కాని దానిని తాననుకొని మోహానికి లోనవుతూ ఉంటాడు. ఇది అందరికీ సంబంధించింది కనుక దీనిని సాధారణమోహం అంటారు. ఈ మోహంలో పడ్డవాడు తాను దేహమని భావిస్తూ ఉంటాడు. తన దేహము ఎవరితో సంబంధం కలిగి ఉందో, తాను వారికి సంబంధించిన వాడుగా ఉంటాడు. అలాగే వాళ్ళు తనకు సంబంధించిన వారుగా భావిస్తూ ఉంటాడు. దీనినే భ్రాంతి, లేదా మోహము అంటారు.

నేను వీళ్ళకు సంబంధించిన వాణ్ణి (***అహమ్ ఏషామ్***). అలాగే వీళ్ళు నాకు సంబంధించిన వాళ్ళు (***మమ ఏతే***). ఈ విధమైన మోహం వల్ల, తన వాళ్ళు చనిపోతారేమో, ఈ సంబంధాలు తెగిపోతాయేమో అనే భయం చేత మనిషికి దుఃఖం పొరలి వస్తుంది. అర్జునుడికి అదే జరిగింది. ఆ విషయం దాచుకోకుండా తానే చెప్పేశాడు కూడా. స్వజనులైన బంధువులను మేము చంపలేము. స్వజనుల్ని చంపుకొని సుఖ పడగలమా? *(1 వ అ - 37 వ శ్లో)* అని ప్రశ్నించాడు కూడా. అందుకే, భీష్మద్రోణాదుల్ని ఎలా చంపాలి? (***కథం భీష్మ మహం సంఖ్యే***) అని కృష్ణుణ్ణి నిలదీసి అడిగాడు.

దేహమే తాను అనే మోహం వల్ల కలిగినదే ఈ శోకము. ఇది అందరికీ ఉంది. కనుకనే దీనిని సాధారణ మోహం అన్నారు. ఇది కాకుండా, అర్జునునికి ప్రత్యేకంగా మరొక మోహం తాత్కాలికంగా వచ్చి తగులుకొంది. స్వధర్మమైన యుద్ధము అధర్మంగా కనిపించింది. ఇది అసాధారణ మోహం. ఈ రెండు మోహాలు కుదిపి వేయడం చేతనే కౌంతేయుడు కలత చెంది కన్నీళ్ళు పెట్టుకున్నాడు. అదే శోకం. మోహం వల్ల సంభవించింది. ఇవే శోకమోహాలు. సంసారానికి బీజాలు (***సంసార బీజ భూతౌ శోకమోహౌ***). తానెవరో, ఏమిటో తెలిస్తే గాని ఈ శోకమోహాల నుండి విడి పడటం జరగదు. సంసార సాగరము నుండి బయట పడటం సాధ్యం కాదు. దీనికి ఆత్మజ్ఞానమే ఏకైక మార్గము. మరొక ఉపాయమే లేదు కనుక ఆత్మజ్ఞానాన్ని ఉపదేశించ డానికి భగవానుడు పూనుకున్నాడు. ***అశోచ్యాన్*** అంటూ అర్జునుణ్ణి ఆత్మజ్ఞాన మార్గం లోకి దించు తున్నాడు. (***తత్ర ఏవం ధర్మ సమ్మూఢ చేతసః మహతి శోక సాగరే నిమగ్నస్య అర్జునస్య అన్యత్ర ఆత్మజ్ఞానాత్ ఉద్ధరణమ్ అపశ్యన్ భగవాన్ వాసుదేవః తతః అర్జునమ్ ఉద్ధి ధారయిషుః ఆత్మజ్ఞానాయ అవతారయన్ ఆహ!***).

యుద్ధం విషయంలో కలిగిన అసాధారణ మోహాన్ని తొలగించడం శ్రీకృష్ణునికి పెద్ద సమస్యేమీ కాదు. ఒకవేళ దానిని తొలగించినా, అలాంటిదే మరొక అసాధారణ మోహం పునః ఏర్పడదు అని చెప్పలేము.

సాధారణ మోహం నిర్మూలించ బడితేనే అసాధారణ మోహాలు అదృశ్య మవుతాయి. కనుక, ఆత్మజ్ఞానోప దేశము అనివార్యమైంది.

**శోకం ఎవరి కోసం?**

ఉభయసేనల మధ్య దుఃఖిస్తున్నాడు అర్జునుడు. శ్రీకృష్ణుడు చూశాడు. ఏడవకు అర్జునా! అని చెప్పలేదు. ఎందుకు ఏడుస్తున్నావు? అని అడగలేదు. ఏడుపు నీకు తగిన దేనా? అని అడుగుతున్నాడు. దుఃఖింప దగిన వాళ్ళ కోసమే దుఃఖిస్తున్నావా? అని ప్రశ్నిస్తున్నాడు. దుఃఖానికి కారణం ఉందా? అని సూటిగా నిలదీస్తున్నాడు.

***శోచ్యాః*** అంటే శోచ్యులు. శోచ్యులు అంటే దుఃఖింప దగిన వారు. అలాగే దుఃఖింప దగని వారు కూడా ఉంటారు. వాళ్ళు ***అశోచ్యాః*** అంటే, అశోచ్యులు ***(న శోచ్యాః అశోచ్యాః).*** ఈ ప్రపంచంలో ఏవేవో నష్టాలు వాటిల్లుతూ ఉంటాయి. వాటన్నిటికీ మనం దుఃఖించము. అవి మనకు సంబంధించినవి అయితే మాత్రం తప్పక బాధ పడతాము. ఈ విధంగా బాధపడ దగినవి, బాధపడ దగనివి అని రెండు విధాల బాధలు ఈ ప్రపంచంలో తెలుస్తున్నాయి.

'చనిపోయాడండీ' అని ఎవరైనా కేక వేస్తే, అది విన్న వెంటనే మనం ఏడుస్తామా? 'ఎవరండి చని పోయింది?' అని ప్రశ్నిస్తాము. ఆ చనిపోయిన వ్యక్తి ఎవరో అయితే, 'కారణ మేమిటట?' అని అడుగుతాము. అదే ఆ చనిపోయిన వ్యక్తి మనకు సంబంధించిన వాడు అయితే కారణం తెలియకుండానే ఏడుస్తాము. ఇది తగిన దేనా? అని భగవానుడు ప్రశ్నిస్తున్నాడు.

దుఃఖించకు అని శ్రీకృష్ణుడు చెప్పడం లేదు. దుఃఖించడానికి కారణం ఉందా? అని అడుగు తున్నాడు. ఏడవకు అని చెప్పినంత మాత్రాన మనుషులు ఏడవకుండా ఉంటారా? ఎప్పటి నుండో ఏడుస్తున్నారు. ఇప్పుడు వద్దంటే ఆపుతారా? ఎవరి ఏడుపు వాళ్ళు ఏడ్చుకోవచ్చు. కాకపోతే, ఏడవ టానికి కారణం కనిపించడం లేదు అంటున్నాడు గీతాచార్యుడు.

**తగని వారి కొరకు తాపమా?**

అర్జునా! దుఃఖింప దగని వాళ్ళ కొరకు ***(అశోచ్యాన్)*** దుఃఖిస్తున్నావు అంటూ శ్రీకృష్ణుడు గీతాబోధను ఆరంభించాడు. భీష్మాదుల కొరకు అర్జునుడు విలపిస్తున్నాడు. భీష్మద్రోణులు కూడా దుఃఖింప దగినవారు కారు. శోచ్యులు కారు. అశోచ్యులు అనేది అచ్యుతుని అభిమతం.

ఒక వ్యక్తిని గూర్చి దుఃఖించాలి అంటే ప్రముఖంగా రెండే కారణాలు ఉండాలి. ఒకటి, అతడు దురాచార వంతుడై ఉండాలి. లేదా, నశిస్తూ అయినా ఉండాలి. భీష్మద్రోణాదులలో ఈ రెండు కారణాలూ కనిపించవు.

భీష్మద్రోణులు సదాచారవంతులు. సత్ప్రవర్తన కలవారు. సజ్జనులు ***(భీష్మద్రోణాదయః సద్వృత్తత్వాత్).*** వారు మహానుభావులని అర్జునుడే అన్నాడు కదా! అలాంటి వారి ప్రవర్తనలో దుఃఖానికి అవకాశం లేదు.

ఇకపోతే, రెండవది. వాళ్ళు నశిస్తారు అని దుఃఖించాలి. ఇది వాస్తవమా? నశించే దెవరు? దేహాలు నశిస్తాయి. మానవదేహం సామాన్య మైనది కాదు. అది ధర్మసాధనము. అందుకే అది దుర్లభము. దుర్లభమే అయినా దూరం కాకుండా ఉండ లేదు.

**దుర్లభో మానుషో దేహో దేహినాం క్షణభంగురః**

మానవదేహము దుర్లభమే అయినా అది క్షణభంగురము. క్షణంలో పతనమై పారి పోతుంది. ఎవరి





దేహమైనా నిలవదు. అలాగే భీష్మద్రోణుల దేహాలు కూడా నిలవవు. అలాంటప్పుడు వారి దేహాల విషయంలో దుఃఖము తగిన దేనా?

అదలా ఉంచితే, దేహాలు ఉండటానికి ఆధార మైనది ఆత్మ. ఆత్మకు చావు లేదు. అది నిత్య మైనది. ఇంతకీ భీష్ముడు దేహమా? ఆత్మా? మనము దుఃఖించేది దేహం కోసమా? ఆత్మ కోసమా? దేహము ఎలాగూ నశించేదే కనుక దానిని గూర్చి దుఃఖించ నవసరం లేదు. ఆత్మ నశించేది కాదు కనుక ఆత్మను గూర్చి శోకించ పనిలేదు. ఇక ఎవరి కోసం ఈ దుఃఖం?

భీష్మద్రోణాదులు సత్ప్రవర్తన కలవారు కనుక దుఃఖింప దగినవారు కారు ***(అశోచ్యాః).*** వాస్తవానికి వారు ఆత్మ స్వరూపులే కనుక శోకింప దగిన వారు కారు ***(అశోచ్యాః నిత్యత్వాత్).*** ఇక వాళ్ళు ఎలాగూ దేహాలు కారు కనుక అవి నశిస్తా యని దుఃఖింప నవసరం లేదు. ఇక దుఃఖ మేమిటి? ఎవరి కోసం? దుఃఖింప దగని వాళ్ళ కోసం దుఃఖిస్తున్నాడు అర్జునుడు. అర్జునుడే కాదు. అందరూ అలాగే దుఃఖిస్తున్నారు. దేహాలే ఆత్మ యని భావించి ఆవేదన చెందుతున్నారు. ఈ వాస్తవం అర్థమైతే ఎవరూ, ఎవరి కొరకు దుఃఖింప నవసరం లేదు.

**బాధపడి బావుకొనే దేమిటి?**

ఈ ప్రపంచంలో మనం బ్రతక డానికి ఉన్నామా? బాధ పడటానికి ఉన్నామా? ఉన్న మనం ఎంత కాలం ఉంటాము? ఎవరైనా అంతేకదా? చూచేందుకు కళ్ళున్నాయి. వాటెందుకు రెప్ప లున్నాయి. రెప్పలు వాలితే కళ్ళు మూస్తాము. రెప్పలు లేస్తే కళ్ళు తెరిచి చూస్తాము. ఇంతవరకు ఎన్నిసార్లు కళ్ళు తెరిచాము? ఎన్నిసార్లు కళ్ళు మూశాము? రెప్పపాటు ఆగకుండా జరుగుతూనే ఉంది. ఒకనాడు ఏదో ఒక్క రెప్పపాటుతో ఆ ఆట కాస్తా ఆగి పోతుంది. అదే చివరి రెప్పపాటు. అదే చావు.

ఇంతకీ, చివరి రెప్పపాటు ఏదో ఎవరికి తెలుసు? తెలియనంత మాత్రాన చావు నుండి ఎవరు తప్పించు కుంటారు? ఏ రెప్పపాటు చివరిదో తెలియదు. అందుకే జీవితం రెప్పపాటు అంటారు. వాలేది రెప్ప. మునిగేది తెప్ప. అర్థమైతే, ముప్పుతిప్ప లెక్కడుంటాయి? ఎవరు ఏడవాలి? ఎవరి కొరకు ఏడవాలి? పోయిన వాళ్ళ కొరకు ఏడవాలి. ఎవరు ఏడవాలి? ఉన్నవాళ్ళే ఏడవాలి. మరి, ఉన్నవాళ్ళు పోకుండా ఉంటారా? అందరూ పోయేవాళ్ళే అయి నపుడు ఏడ్చి సాధించే దేముంటుంది? మనం కూడా పోయే వాళ్ళమే కనుక ఇతరుల కోసం ఏడవడం కన్నా, మన కోసమే మనం ఏడ్చుకుంటే మంచిది కదా! అలాంటప్పుడు ఎంతకాలం ఏడవాలి? పోయే వరకు ఏడుస్తూనే ఉండాలి. ఇక బ్రతుకంతా ఇలా ఏడుపు తోనే సరిపెట్టుకొంటే, బ్రతుకులో వేడుక ఎప్పుడు? పోయిన తరువాతేనా? పోయిన తరువాత వేడుక ఉంటే ఉండొచ్చు. ఊరేగింపు సాగవచ్చు. దానిని చూడటానికి మన మెక్కడ ఉంటాం? మనం లేకుండా జరిగే మన చివరి ఉత్సవమే కదా చావు. మనం వినకుండా మన ప్రక్కన నడిచేదే కదా చావు మేళం. ఎందుకొచ్చిన బాధ? చావు బాధ.

**చావు తెలిసే దెవరికి? తెలియని దెప్పుడు?**

ఎవరు ఎప్పుడు చస్తారో ఎవరికి తెలుసు? తెలిస్తే, ఆ ఏడ్చేది ఏదో ముందే ఏడవ వచ్చు. చచ్చిన వాడు ఏడవ లేడు. ఏడ్చేవాడు చావకుండా ఉండలేడు. అయినా, ఎప్పుడొస్తుంది చావు? ఏమో, ఎవరికి తెలుసు! ఎందుకు తెలియదు? చావు రాని దెప్పుడు? లేని దెప్పుడు? దానిని తెలుసు కోవాలి. అంతే. తెలియనంత మాత్రాన ఉన్నది లేకుండా పోతుందా?

చావు అంటే ఏమిటి? చచ్చే దెవరు? ఉన్నది పోవడమే మృత్యువా? నశించడమే మృత్యువా? నశింపు

ఏమిటి? మార్పే కదా! అలా చూచి నపుడు మనం ఎప్పుడు మరణిస్తున్నాము? ఎప్పుడూ మరణిస్తూనే ఉన్నాము.

దేహం రాలి పోవడమే మరణమా? అదే నిజమైతే, దేహము ఒకేసారి రాలిపోతుందా? వెంట్రుకలు రాలుతూ ఉంటాయి. పళ్ళు రాలుతూ ఉంటాయి. చూపు తగ్గి కళ్ళు వాలుతూ ఉంటాయి. మన్నును మూజాడాలని వెన్నుపాము వంగుతూ ఉంటుంది. ఇవన్నీ జరిగి నపుడు దుఃఖించని మనం చావుకే ఎందుకు భయపడుతున్నాం? మరణం విషయం లోనే ఎందుకు దుఃఖిస్తున్నాం? గడియారంలో క్షణాల ముల్లు తిరిగి నపుడు పట్టించుకోని మనం గంటల ముల్లు తిరిగి నపుడే ఎందుకు పట్టించు కుంటున్నాం? ఇది జరగ కుండానే అది జరుగుతుందా?

దేహంలో ఉన్నవి, దేహంగా ఉన్నవి ఒకొక్కటి పోతున్నా పెద్దగా రోదించని మనం, మరణానికే ఎందుకు దారుణంగా విలపిస్తున్నాము? ఎందుకో తెలుసా? మరణం తరువాత మనిషి రూపం ఉండదు కనుక. కళ్ళు దేహానివే అయినా, కళ్ళు పోయినా దేహం ఉంటుంది. పళ్ళు దేహానివే అయినా, పళ్ళు రాలినా దేహం ఉంటుంది. కాని దేహం రాలితే, ఆ తరువాత ఏదీ ఉండదు. అందుకే మరణబాధ దారుణంగా ఉంటుంది.

**విలాపానికి ఫలం నిష్ఫలం**

కర్మ అంటూ జరిగితే ఫలితం ఉండాలి. ఫలితం లేని కార్యం ఉండదు. అలాగే కారణం లేని కార్యమూ ఉండదు. కాని, మరణ బాధకు ఏ ఫలమూ ఉండదు. కారణమూ ఉండదు.

ఏడుపు కార్యమే కదా! మరి దానికి కారణ మేమిటి? చావే. అయితే చావ కూడనిది చచ్చిందా? చావ దగిందే చచ్చిందా? చావకూడనిది ఎలా చస్తుంది? చావ దగిందే చచ్చింది. మరి, చావ దగిందే సహజంగా చచ్చే టప్పుడు అసహజంగా ఏడవటానికి కారణం ఎక్కడుంది? హేతు వేమిటి?

ఇంత తొందరగా పోతాడని అనుకోలేదు. ఇంకా కొంత కాలం ఉంటాడని అనుకున్నాను. అందుకే ఏడుస్తున్నాను. అదే నా ఏడుపుకు కారణం అంటావా?

నిన్ను అలా అనుకోమన్నది ఎవరు? నీవే అనుకున్నావు. నీవు అనుకున్నట్లు జరగ లేదు. అలాంటప్పుడు అలా ఊహించి నందుకు ఏడవాలి గాని చచ్చి నందుకు ఏడవడం దేనికి?

సరే ఏడవ టానికి సరియైన కారణం దొరకటం లేదు. అదలా ఉంచుదాము. పోనీ ఏడ్చినందుకు ఫలం ఉంటుందా? ఉండదు. అందుకే కదా, కొందరే ఏడుస్తున్నారు. అయిన వాళ్ళే ఏడుస్తున్నారు. ఏడుపుకు ఫలితం ఉండేటట్లయితే, అయిన వాళ్ళే కాదు, కాని వారు కూడా అయిన వారి కన్నా ఎక్కువగా ఏడ్చి ఉండేవారు. వాళ్ళు వీళ్ళు ఏమిటి? అందరూ అదే పనిగా ఏడుస్తూనే ఉండేవారు.

ఇంటి ముందు నిలబడి మనం పిలిస్తే, ఇంటిలో ఉన్న మనిషి 'వస్తున్నానండీ' అని మారు పలుకుతాడు. అతడు అలా మారు పలకక పోయినా, వస్తాడనే ఆశతో మనం ఎదురు చూస్తాం.

మరణించిన వాని కోసం మనం పెద్దగా రోదిస్తే, అతడు మారు పలుకుతాడా? తిరిగి వస్తాడా? దుఃఖం మరణించిన వానిని బ్రతికిస్తుందా? అదేమన్నా అమృతమా? అలాంటప్పుడు ఏడ్పు ప్రయోజన మేమిటి?

మన ఏడుపు ఏగిన వానికి వినిపిస్తుందా? అంత పెద్దగా ఏడ్వగలమా? చనిపోయిన తరువాత రోజు రోజుకు ధ్వని ఎంతగా తగ్గిపోతూ ఉంటుందో మనకు తెలియదా? మనం రోదించినా ఫలితం లేనపుడు దుఃఖించడ మెందుకు?





మరణించిన వానికి మన ఏడుపు వినిపించదు. బ్రతికి ఉన్న వాళ్ళేమో ఏడుపును వేడుకగా వినలేరు. చావు వస్తే ఎవ్వరూ నిలవరు. చావు రానపుడు పొమ్మన్నా ఎవ్వరూ పోలేరు. పోయిన వాళ్ళు పోయారని, ఉన్నవాళ్ళు పోతారని ఏడవ టానికి ఏడ్చేవాడు మాత్రం పోకుండా ఉంటాడా?

**ఆఖ్యాయిక**

పూర్వము ఒక దోషికి మరణదండన విధించారు రాజుగారు. మరణశిక్షను అమలు చేయ వలసిన రోజు రానే వచ్చింది. దోషిని ఉరికంబం వద్దకు తీసికొని వచ్చారు. కొంతసేపట్లో ఉరి తీయబోతారు. ఆ సమయంలో అక్కడే ఉన్న రాజుగారు, 'నీ చివరి కోరిక ఏమిటో చెప్పు' అని అడిగారు.

ఏదైనా తినాలని ఉంటే తినిపిస్తారు. మరెవరి నైనా చూడాలని ఉంటే చూపిస్తారు. మరణశిక్ష అమలులో అదొక సంప్రదాయము. మరణశిక్షను అనుభవించ బోయే దోషి రాజు వైపు చూచి, నవ్వుతూ ఒక శ్లోకం చెప్పాడు.

**భట్టి ర్నష్టో భారవిశ్చాపి నష్టః**
**భిక్షుర్నష్టో భీమసేనోఽపి నష్టః**
**భుక్కుండోఽహం భూపతి స్త్వంబతాసి**
**భ భీ భు భూ ష్వంతక స్సన్నివిష్టః ॥**

మహాప్రభో! విక్రమార్కుని కాలంలో భట్టి ఉన్నాడు. మీకు తెలుసనే అనుకుంటాను. అతడు ఇప్పుడు లేడు. చచ్చిపోయాడు (*భ - నష్టః*). భారవి అనే కవి ఉండేవాడు కదా! అతడూ మరణించాడు (*భా*). భిక్షువు ఉండేవాడు. అతడూ పోయాడు (*భి*). అర్జునుని అన్నగారు భీమసేనుడు వెయ్యి ఏనుగుల బలం కలవాడని ప్రతీతి. ఆయన కూడా పోయాడు (*భీ*). నన్ను భుక్కుడు అంటారు (*భు*). ఇక కొన్ని నిముషాల్లో బయలుదేరు తున్నాను. మంత్రులు, కవులు, బిచ్చగాళ్ళు, మల్లయోధులు అందరూ పోయారు. దోషిని నేనూ పోతున్నాను.

ఇంత వరకు చూసిన దానిని బట్టి యమధర్మరాజు (***అంతకః***) అక్షర పంక్తిలో భ, భా, భి, భీ అంటూ 'భ' గుణింతములో ప్రవేశించినట్లు తెలుస్తూ ఉంది. ఇప్పుడు 'భు' (భుక్కుడు) అంటూ నా వద్దకు వచ్చాడు. 'భు' తరువాత అక్షరము 'భూ' అని తమకు తెలియనిది కాదు. నా పని పూర్తి కాగానే నేరుగా సమవర్తి తమ వద్దకే (***భూపతిః***) వచ్చేట ట్లున్నాడు. కాస్త అవధానంతో ఉంటారని చెబుతున్నా. అంతే. ఇక, నన్ను ఉరి తీసేయండి అన్నాడు దోషి

రాజు గారు లేచి, 'ఆపండి! అతణ్ణి ఉరి తీయకండి. తరువాత చెబుతాను' అంటూ అంతఃపురానికి వెళ్ళాడు. ఏం చెబుతాడు? చెప్పేందు కేముంది? ఆంతర్యంలో అలజడి మొదలై ఉంటుంది. ఎవరు ఉంటారు? పోకుండా ఎవరు ఉంటారు? కలకాలం ఉంటామని భావిస్తారు. ఎంతకాలం ఉంటారు? అల్ప కాలమే. స్వల్ప కాలమే. అదే కల-కాలం. కలగన్నంత సేపు ఉండే కాలం. నేనే ఉండ నప్పుడు వాణ్ణి పంపించడ మెందుకు? అని ప్రభువు ఆలోచనలో పడి ఉంటాడు.

**శోచ్యులు - అశోచ్యులు - పండితులు**

ఎవరి కోసం దుఃఖించాలి? దుఃఖింప దగిన వాళ్ళు ఎవరు? శోచ్యు లెవరు? ఎవ్వరూ లేరు. అందరూ అశోచ్యులే. దుఃఖింప దగని వారే. ఈ విషయం చక్కగా తెలిసిన వాళ్ళు పండితులు. వారి దృష్టిలో అందరూ అశోచ్యులే. చావు సహజం.

అర్జునుని పరిస్థితే కాస్త తికమకగా ఉంది. యుద్ధం వల్ల సంభవించే ఉపద్రవా లన్నిటినీ ఏకరువు పెడుతూ అర్జునుడు అనర్గళంగా ధర్మోపన్యాసం చేసేశాడు. ఒక అధ్యాయ మంతా మాట్లాడినా సరిపోలేదు. రెండవ అధ్యాయంలో కూడా ఐదు శ్లోకాలను ఆక్రమించాడు.

అర్జునుని మాటలేమో పండిత వచనా ల్లాగా ఉన్నాయి. ప్రవర్తన చూస్తే దుఃఖింప దగని వారి కోసం పామరుని వలె ఏడుస్తున్నాడు. పలుకుల్ని బట్టి పండితుడని భావించాలో, రోదన విని పామరుడని నిర్ణయించాలో అర్థం కావడం లేదు. ఇంతకీ, పండితు డంటే ఎవరో చెబితే సరిపో తుందని భావించాడేమో 'పండిత' పదానికి నిర్వచనం వినిపించాడు వాసుదేవుడు.

**గతాసూ నగతాసూంశ్చ నానుశోచన్తి పండితాః**

అర్జునా! చచ్చిన వాళ్ళను గూర్చి ***(గతాసూన్)***, బ్రతికిన వాళ్ళను గూర్చి ***(అగతాసూన్)***, పండితులు ***(పండితాః)*** దుఃఖించరు ***(న అనుశోచన్తి)*** అన్నాడు శ్రీకృష్ణుడు.

'పండా' అంటే ఆత్మకు సంబంధించిన జ్ఞానం. 'పండా' ఎవరికి ఉంటుందో వారే పండితులు ***(పండా ఆత్మవిషయా బుద్ధిః యేషాం తే హి పండితాః ఆత్మజ్ఞాః)***. ఆత్మజ్ఞులు. ఆత్మను తెలిసిన వారు.

**దుఃఖం తెలియనిది పాండిత్యం**

పార్థుని పలుకుల్లో పాండిత్య ప్రకర్ష ముంది. ప్రవర్తనలో పామరత్వం గోచరిస్తూ ఉంది. ఆత్మజ్ఞానము కలవారు పండితులు. ***పాండిత్యం నిర్విద్య*** అనే బృహదారణ్యక శ్రుతి ఆత్మజ్ఞానము కలవారే పండితులని నిర్ణయించింది. పారమార్థిక దృష్టితో చూచి నపుడు అందరూ ఆత్మస్వరూపులే. ఆత్మ నిత్యము కనుక అశోచ్యులే. దుఃఖింప దగని వారే. అలాంటి వారి విషయములో దుఃఖిస్తూ ఉన్నాడు కనుక అర్జునుడు పండితుడు కాడు. ఆత్మవిదుడు కాడు. అజ్ఞానము లోనే ఉన్నాడు అని నిర్ణయించాలి ***( పరమార్థతః నిత్యాన్ అశోచ్యాన్ అనుశోచసి, అతః మూఢః అసి ఇత్యభిప్రాయః )***.

అర్జునా! దుఃఖించకు అని శ్రీకృష్ణుడు ఎందుకు చెప్పలేదో ఇక్కడ అర్థమైంది అనుకుంటాను. దుఃఖించ వద్దని కృష్ణుడు చెప్పినంత మాత్రాన అర్జునుడు దుఃఖించకుండా ఉండ లేడు. అర్జునుడు దుఃఖాన్ని మానాలి అంటే అతడు పండితుడు కావాలి. ఆత్మజ్ఞుడు కావాలి. ఆత్మ ఏమిటో, అనాత్మ ఏమిటో తెలియాలి. చావు ఏమిటో, చచ్చే దెవరో అర్థం కావాలి. అందుకే, ***అశోచ్యాన్*** అంటూ ఆత్మజ్ఞానాన్ని బోధిస్తూ గీతోపదేశాన్ని ప్రారంభించాడు గోవిందుడు.

ఆత్మ పుట్టింది కాదు. కనుక చావదు. చావు లేని దాని విషయంలో దుఃఖం ఉండదు. ఆత్మ కానిది అనాత్మ. దానికి నిత్యత్వము లేదు. ఆత్మ నిత్యము కనుక ఆత్మ కొరకు దుఃఖింప నవసరం లేదు. అనాత్మ నిత్యము కాదు కనుక దాని కొరకు కూడా దుఃఖింప నవసరం లేదు. ఈ విధమైన ఆత్మానాత్మ వివేకం గల పండితులు దేని కొరకూ దుఃఖించరు. వివేకం లోపించిన కారణంగా పార్థుడు విషణ్ణు డయ్యాడు.

**ఉన్నా పోయినా ఒక్కటే**

మరణించిన వారిని గూర్చి పండితులు దుఃఖించరు. గతించిన వారు అంటే ప్రాణాలు పోయిన వారు ***(గతాసూన్, గత ప్రాణాన్, మృతాన్)***. జీవించి యున్న వారిని గూర్చి కూడా పండితులు విలపించరు. జీవించి యున్నవారు అంటే, ప్రాణాలు పోని వారు అని అర్థము ***( అగతాసూన్, అగత ప్రాణాన్ జీవతః )***. ప్రాణాలు వస్తాయి కనుక అవి పోతాయి. ఇది అనివార్యమైన విషయం. దుఃఖానికి ఆస్కారం లేని విషయం. ఆత్మ రాలేదు





కనుక పోదు. పోని, పోలేని ఆత్మ విషయంలో దుఃఖానికి అవకాశమే లేదు కనుక, ఈ జ్ఞానము గల పండితులు దుఃఖించరు. అంటే, చావు విషయంలో దుఃఖించే వారు పండితులు కారు అనేది సుస్పష్టం.

ఉన్నది పోయేందుకే కనుక చస్తే ఏడవ వద్దు. ఏడ్చినంత మాత్రాన పోయింది తిరిగి రాదు కనుక ఏడ్చి చచ్చేదీ వద్దు. బ్రతికున్న వాళ్ళు చావాలి అనుకోరు. బ్రతకాలనే అనుకుంటారు. వారి ఆశాదీపం కూడా కొడి గట్టే లాగా వారి ముందు పని గట్టుకొని ఏడ్చి చంపొద్దు. అందర్ని వదలి మనం పోతామేమో అని చచ్చే వరకు ఏడుస్తూ కూర్చోవద్దు. చావు ఎవరి కైనా సహజం. చచ్చేది ఆగదు. చావనిది సాగదు.

దేహాలు అనిత్యాలు. నేడు ఉండినా రేపు లేకుండా పోయేవే. ఉన్నప్పుడు కూడా, 'ఒక్కనాటికి - వల్లకాటికి' అనే జపం చేస్తూనే ఉంటాయి. ఆత్మ నిత్యము. అనంతము. అది ఉన్నదే. పోనిదే. ఈ విధమైన జ్ఞానంతో పండితులు శోకాన్ని దాటుతారు ***( తరతి శోకం ఆత్మవిత్*** - ఛాందోగ్యశ్రుతి ).

*పల్లవి:* **జ్ఞానమె నీ నావ - ధన్యము నీ త్రోవ**
**సంసార జలధిలో మేలైన నావ** ॥ జ్ఞానమె ॥

*చరణములు:*

1. **ఎక్కడి కేగినా - ఎంతగా తిరిగినా**
**నావ తీరానికి - కాయము కాటికి ఖాయము** ॥ జ్ఞానమె ॥

2. **లేనిది కాదులే - క్రొత్తగా రాదులే**
**ఉన్నదే తెలియాలి - జ్ఞానమే దీపమై వెలగాలి** ॥ జ్ఞానమె ॥

ఊడే వాటికి, వాడే వాటికి వగచ కుండా, వీడని, విడిపోని విశుద్ధాత్మగా విహరిస్తూ సాగిపొమ్మంది చైతన్యగీతిక.

**ఓం ప్రథమం - అద్భుత బీజం**

***అశోచ్యా నన్వ శోచస్త్వం*** అనే ఈ శ్లోకంతో గీతోపదేశాన్ని ప్రారంభించాడు గోవిందుడు. జగద్గురువులు శ్రీ శంకర భగవత్పాదులు తమ భాష్యాన్ని ఈ శ్లోకం నుండే ప్రారంభించారు.

గీతోపదేశ మనే మహావృక్షానికి ***అశోచ్యా నన్వ శోచస్త్వం*** అనే ఈ శ్లోకాన్ని బీజశ్లోకంగా చెప్పుకుంటాము. వృక్షము యొక్క వైభవ మంతా బీజం లోనే నిక్షిప్తమై ఉన్నట్లు, గీతోపదేశ మంతా ఈ శ్లోకంలో బీజ రూపంలో ఉంది. ***అశోచ్యాన్*** అంటూ రెండవ అధ్యాయంలో బోధను ప్రారంభించిన గోవిందుడు **మా శుచః** అంటూ పద్దెనిమిదవ అధ్యాయంలో గీతను సమాప్తం చేస్తాడు. దుఃఖానికి కారణం లేదు అంటూ ప్రారంభించాడు. అది ఋజువు కావాలి. గీతోపదేశంలో ఆత్మజ్ఞానాన్ని అందించి ఈ పరమ సత్యాన్ని ఋజువు చేశాడు శ్రీకృష్ణుడు. దుఃఖానికి హేతువే లేదనే వాస్తవం తెలిసి పోయింది కనుక, ఇక దుఃఖించకు **(మా శుచః)** అంటూ గీతోపదేశాన్ని ముగించాడు.

దుఃఖమగ్ను డైన అర్జునుని దుఃఖ నివృత్తికి, ఆనందప్రాప్తికి గీత బోధించ బడింది. దుఃఖం అసంగత మంటూ ఆరంభించి, దుఃఖించకు అంటూ శక్తివంతంగా సమాప్తి చేసి, బోధ యొక్క ఫలితాన్ని గీతాచార్యుడు సుస్పష్టం చేశాడు. కనుకనే గీతాపారాయణ విధానంలో అంగన్యాస కరన్యాసాలు చెబుతూ ఈ శ్లోకము యొక్క ప్రథమ పాదాన్ని బీజంగా చెప్పుకుంటాం.

***'అశోచ్యా నన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే' ఇతి బీజం***
***'సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ' ఇతి శక్తిః***

**'అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః' ఇతి కీలకమ్**

దుఃఖింప దగింది లేదు అనేది గీతోపదేశానికి బీజం. సర్వమును పరిత్యజించి ఉన్న ఒకే పరమాత్మను ఆశ్రయించడం శక్తి. సర్వ పాపాల నుండి విడిపడి మోక్షాన్ని పొంది దుఃఖానికి దూరం కావడం కీలకం. అందు చేతనే ***అశోచ్యాన్*** అంటూ ప్రారంభించి, ***మా శుచః*** అంటూ సమాప్తి చేశాడు. ఆద్యంతాల లోనే దుఃఖ ప్రసక్తి వచ్చింది. మధ్యలో దుఃఖ నివారణోపాయానికి బోధ జరగ లేదు అనే అభియోగానికి అవకాశ మివ్వకుండా ***నత్వం శోచితు మర్హసి*** - దుఃఖింప పని లేదు అని మధ్యలో కూడా తెలుపుతూనే బోధించాడు శ్రీకృష్ణుడు.

**అకర్మ అమంగళమా?**

గీత మోక్ష ప్రదాయక మైన గ్రంథము. ఆత్మజ్ఞానమే కేంద్ర విషయంగా శోభిస్తున్న గ్రంథము. జ్ఞానార్హతకు ప్రవృత్తి ప్రధానం కనుక ప్రవృత్తిని గూర్చి గీత ప్రముఖంగా ప్రవచించిందే గాని, వాస్తవానికి నివృత్తి లోనే గీత నిలిచి ఉంటుంది. గీత నివృత్త్యాత్మక గ్రంథము. ఈ ప్రత్యేకత ప్రారంభ శ్లోకం లోనే ప్రస్ఫుటంగా గోచరిస్తుంది.

ఏ శాస్త్రమైనా చెయ్య వలసింది ఉంది అని చెబుతూ ప్రారంభ మవుతుంది. గీత అలా కాకుండా చెయ్య కూడనిది చేస్తున్నావు ***(అశోచ్యా నన్వ శోచస్త్వం)*** అంటూ ప్రారంభ మైంది. నివృత్తికి ఇక్కడే అద్దం పడుతోంది భగవద్గీత.

చెయ్య కూడనిది చేస్తున్నావు అంటూ నిషేధ రూపంలో గీతోపదేశం ప్రారంభం కావడం మంగళకరంగా లేదని కొందరి అభిప్రాయం. మంగళం విషయానికి వస్తే, ఇప్పటికే మహాభారతంలో మంగళ ప్రస్తావన ఎంతగానో జరిగింది. మంగళాచరణం చేసి వ్యాసభగవానుడు భారతాన్ని ప్రారంభించాడు. గీతకు ***ధర్మక్షేత్రే కురుక్షేత్రే*** అనే ప్రథమ శ్లోకంలో మంగళాచరణం ఎలా జరిగిందో ఈ గ్రంథంలో మనమే చూశాం. ప్రస్తుతం గీత - రెండవ అధ్యాయం పదకొండవ శ్లోకంలో మనం ఉన్నాం. ఇక్కడ మళ్ళీ మంగళం అవసరమా?

గీతోపదేశాన్ని గోవిందుడు ఈ శ్లోకం నుండి ప్రారంభించాడు అని అంటున్నారు కనుక మంగళం ఉంటే బాగుంటుంది కదా! మంగళం లేకపోయినా పరిపెట్టు కోవచ్చు. కాని, కర్మ రాహిత్యంతో గీతాచార్యుడు ఉపదేశాన్ని ప్రారంభించడం మంగళకరంగా ఉందా? అనే సంశయాన్ని కొందరు దాచుకో వచ్చు. దానిని కూడా దూరం చేసుకుందాం.

మనిషికి తృప్తి కావాలా? అసంతృప్తి కావాలా? అసంతృప్తిని ప్రస్తావించడం శుభమా? సంతృప్తిని వ్యక్త పరచడం శుభమా? ఆకలితో ఉన్న వ్యక్తిని భోం చేయండి అని చెబుతాం. తృప్తిగా భోంచేసిన వ్యక్తిని ఇంక కాస్త గ్రహించండి అంటే, అయ్యో! వద్దండి, చెయ్యలేను అంటాడు. ఎందుకు అలా అంటాడు? తృప్తి చెందాడు కనుక. చెయ్యను, చెయ్యలేను అనడం అమంగళమా? అసంతృప్తితో కర్మారంభం జరుగుతుంది. తృప్తిలో, జ్ఞానంలో కర్మలు విలీన మౌతాయి.

**సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే**

కర్మలన్నీ జ్ఞానం లోనే పరిసమాప్త మవుతాయి అని గీతాచార్యుడే ముమ్ముందు నాల్గవ అధ్యాయంలో చెప్పబోతాడు. ఆ సందర్భంలో విపులంగా చర్చించు కుందాం. కనుక, మంగళకరంగా మనం కర్మలు చెయ్యొచ్చు. అంతేగాని, కర్మ మంగళం కాదు. కర్మలలో అకర్మను దర్శించడమే శుభం. మంగళం.

ఇదంతా అద్వైతాన్ని అభిలషించే వారికి, అనుసరించే వారికి సరిపోవచ్చు. మేము మాత్రం దానిని మంగళాచరణంగా అంగీకరించము అని మరొక పక్షము వాదించ వచ్చు. అయితే, వారికి కూడా సమాధానం చెబుతున్నాము.





అద్వైతము అందరూ అంగీకరించ గలిగే సామాన్య విషయం కాదు. అందరూ అంగీకరించాలని మేము కూడా కోరుకోము. అలాంటి వారికి మేము చెప్పేది ఒక్కటే. మీరు కోరుతున్నారు కనుక, అవసరం లేకపోయినా మంగళ ప్రస్తావన ఈ సందర్భంలో ముందుకు తెచ్చాం. అలా చూచినా, పదకొండవ శ్లోకం మంగళకరంగా ఉంది. ***అశోచ్యాన్*** అంటూ శ్లోకము మొదలైంది. 'అ' అనే అక్షరంతో ప్రారంభం కావడమే మంగళాచరణం.

**అక్షరాణాం అకారోఽస్మి**

అక్షరాలలో తాను 'అ' కారము అని గీత - విభూతి యోగంలో అచ్యుతుడే చెప్పాడు కనుక, భగవంతు డైన శ్రీకృష్ణుడు తన స్వరూపమైన అక్షరంతో ప్రారంభించడం చేత, ఈ శ్లోకం మంగళకరము.

**వాక్య తాత్పర్యం**

అజ్ఞాన జనితమైన శోకమోహాల నుండి విడిపడాలి అంటే, ఆత్మజ్ఞానమే ఏకైక మార్గమని తలచి శ్రీకృష్ణుడు ***అశోచ్యాన్*** అంటూ ఆత్మ యొక్క నిత్యత్వాన్ని ప్రబోధించ డానికి ఉపక్రమించాడని అర్థం చేసుకున్నాం. ఆత్మజ్ఞానము అంటే బ్రహ్మాత్మైక్య జ్ఞానము. ఆత్మయే బ్రహ్మము అనే మహావాక్య జ్ఞానము. **తత్త్వమసి** వాక్య తాత్పర్యం.

తత్ - త్వం - అసి అనే మూడు పదాలకు విపుల వ్యాఖ్యానమే భగవద్గీత అని మనం అర్థం చేసుకొని ఉన్నాం. ఈ మూడు పదాలకు వివరణంగా పరమేశ్వరుడు మూడు షట్కాలను బోధించాడు. మొదటి ఆరు అధ్యాయాలు 'త్వం' పదమును నిర్దేశించే ప్రథమ షట్కము. ఆ తరువాత ఆరు అధ్యాయాలు 'తత్' పదమును నిర్దేశించే ద్వితీయ షట్కము. చివరి ఆరు అధ్యాయాలు 'అసి' పద నిర్దేశమును గావించే తృతీయ షట్కము. ***అశోచ్యాన్*** అనే ఈ శ్లోకంతో ప్రారంభ మైన ప్రథమ షట్కము 'త్వం' పద నిర్దేశము గాన, ***అశోచ్యాన్ అన్వశోచః త్వం*** అంటూ తనలో 'త్వం' పదమును నింపుకొని, మొదటి ఆరు అధ్యాయాలలో నా పని అంతా ఇదే అని చెప్పకనే చెబుతూ ఉంది.

**ద్వితీయం అద్వితీయం**

అనాత్మ లక్షణాలను ఆత్మ యందు ఆరోపించుకొని దుఃఖించడం అందరి లాగే అర్జునునికి కూడా సాధారణ మోహం కాగా, స్వధర్మాన్ని అధర్మంగా భావించడం అర్జునునికి మాత్రమే ఉన్న అసాధారణ మోహం. సాధారణ మోహం లాగే అసాధారణ మోహం కూడా అందరికీ ఉంటుంది. కాకపోతే, అర్జునుడికి అది యుద్ధం విషయంలో తలెత్తింది. మరొకరికి మరొక విషయంలో తొంగి చూడవచ్చు.

సాధారణ మోహాన్ని నివృత్తి చేసే ప్రయత్నంలో రెండవ అధ్యాయం పదకొండవ శ్లోకం నుండి ముప్పై యవ శ్లోకం వరకు ఆత్మజ్ఞానాన్ని ఉపదేశించి ***న త్వం శోచితు మర్హసి*** - దుఃఖింప నవసరం లేదు అంటూ అక్కడ ముగించాడు!

స్వధర్మమైన యుద్ధాన్ని అధర్మంగా భావించి, యుద్ధం నుండి విరమించి పరధర్మాన్ని ఆశ్రయించాలని భావించిన పార్థుని అసాధారణ మోహాన్ని తొలగిస్తూ, అక్కడి నుండి ఎనిమిది శ్లోకాలలో ధర్మాన్ని గూర్చి అద్భుతంగా ప్రవచించాడు భగవానుడు. ఈ ధర్మ ప్రసంగాన్ని ధర్మాష్టకం అని అంటారు.

ధర్మ జీవనంలో కర్మే ప్రధానం కనుక, బంధహేతువైన కర్మను కర్మయోగంగా మార్చుకొని, కర్మసంగము, ఫలసంగము లేకుండా సమబుద్ధితో ఆనందయాత్రను సాగించేది ఎలాగో ఆ తరువాత పదిహేను శ్లోకాలలో చర్చించి యాభై మూడవ శ్లోకం వద్ద సమాప్తి చేశాడు. చివరగా సాంఖ్య, యోగాల ప్రతిరూపంగా, సాకార

రూపంలో నడయాడే జ్ఞానస్వరూపు డైన స్థితప్రజ్ఞుని వైభవాన్ని వర్ణించాడు. ఈ విధంగా ద్వితీయ మనే సాంఖ్యము అద్వితీయంగా శోభిస్తూ ఉంది. ఇక వినండి.

*దుఃఖింప దగిన వారు భీష్మద్రోణులతో సహా ఎవ్వరూ లేరు. వారు అశోచ్యులు. ఎందుకని వాళ్ళు అశోచ్యులు?* **(కుతః తే అశోచ్యాః?)** *వారు నిత్యులు కనుక* **(యతః నిత్యాః)**. *అదెలా?* **(కథమ్?)** *అదెలాగో చెబుతూ ఆత్మ యొక్క నిత్యత్వాన్ని బోధిస్తున్నాడు.*

**న త్వేవాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః ।**
**న చైవ న భవిష్యామః సర్వే వయ మతః పరమ్ ॥** 12

*న-తు-ఏవ-అహం-జాతు-న-ఆసం-న-త్వం-న-ఇమే-జనాధిపాః*
*న-చ-ఏవ-న-భవిష్యామః-సర్వే-వయం-అతః-పరం*

| | | | | | |
|---|---|---|---|---|---|
| అహం | = | నేను | జనాధిపాః | = | రాజులు కూడా |
| జాతు | = | ఒకప్పుడు | న | = | లేరు అనేది |
| న ఆసం | = | లేను అనేది | న తు ఏవ | = | లేనే లేదు |
| నతు ఏవ | = | లేనే లేదు | అతఃపరం | = | ఇక మీదట |
| త్వం | = | నీవు కూడా | వయం సర్వే | = | మన మందరము |
| న | = | లేవనేది లేదు | న భవిష్యామః | = | లేకపోవుదు మనునది |
| ఇమే | = | ఈ | న ఏవ | = | లేనే లేదు |

**పార్థా! నేను ఒకప్పుడు లేనివాణ్ణి కాను. నువ్వు కూడా లేని వాడివి కావు. ఈ రాజు లందరూ కూడా ఒకప్పుడు ఉన్నవారే. మన మందరం భవిష్యత్తులో లేకుండా పోయే వాళ్ళము అసలే కాము.**

### వ్యాఖ్య

వచ్చేది ఏదైనా మనకు ఇష్టమైన దైతే అది వస్తే మనకు సంతోషం కలుగుతుంది. ఉన్నది ఏదైనా అది మనకు ఇష్టమైన దైతే, అది పోతే దుఃఖం కలుగుతుంది. మా కోడలు ఎప్పుడు ప్రసవిస్తుందో చెబుతారా? అని జ్యోతిష్కుణ్ణి అడుగుతారు. అంతే గాని, ఆ పుట్టే బిడ్డ చనిపోయే దెప్పుడో చెప్పండి అని ఎవ్వరూ అడగరు.

ప్రసవిస్తే అంత వరకు లేని వాడే కదా పుడతాడు! పుట్టిన వాడు గిట్టకుండా ఎలా ఉంటాడు? అందరూ ఈ ప్రపంచంలో పుట్టేవాళ్ళే. గిట్టేవాళ్ళే. పుట్టడం అనేది ఒక కాలంలో జరుగుతుంది. గిట్టడం కూడా కాలం లోనే జరుగుతుంది. ఈ జనన మరణాలకు మధ్య ఉన్న కాలంలో మనిషి దేహంతో జీవిస్తాడు.

ఒక వ్యక్తి ఉన్నాడు అంటే దేహంతో ఉన్నాడనే అర్థం. దేహం ఎల్లకాలం ఉండదు కనుక, దేహం పోతే ఆ వ్యక్తి లేకుండా పోతాడు. అందుచేత అతడు శోచ్యుడు, దుఃఖింప దగిన వాడు అనేది మన భావం. అనుభవం కూడా. ఇది వాస్తవం కాదని, నేడున్నవాడు ఎప్పుడూ ఉండే వాడే నని, లేకుండా వచ్చిన వాడు కాడని, లేకుండా పోయేవాడూ కాడని, అందుచేత దుఃఖింప దగిన వాడు కాడని ఈ శ్లోకంలో ఆత్మ యొక్క నిత్యత్వాన్ని ఆవిష్కరిస్తున్నాడు భగవానుడు.

### ఉన్న నే నెవరు? నేనుగా ఉన్న దెవరు?

తాను ఉన్నట్లు ఎవరికి తెలియదు? అలాగని, తాను ఎలా ఉన్నాడో తెలిసింది ఎవరికి? నేను ఉన్నాను ***(అహమస్మి)*** అని మనిషి అంటాడు. ఇక్కడ 'నేను' అని దేనిని గూర్చి మాట్లాడు తున్నాడో అది దేహ మని అతని





అభిప్రాయం. దేహం నేడుంది. పుట్టక ముందు లేదు. లేకుండా ఉన్నదే పుట్టింది. ఇప్పుడు ఉంటూ ఉంది. కొంత కాలం ఉండి ఆ తరువాత లేకుండా పోతుంది. లేకుండా పోవడం ఎవ్వరికీ ఇష్టం లేదు. అలా పోయే పరిస్థితి వచ్చినపుడు, ఇష్ట మైనది పోతూ ఉంది కనుక దుఃఖం అనివార్యంగా ఉంటుంది. తన విషయంలో ఇష్ట మున్నట్లే, తనకు సంబంధించిన వారి విషయంలో కూడా ఇష్ట ముంటుంది కనుక, వారి దేహాలు పోతాయని తెలిసినా దుఃఖం ముంచు కొస్తుంది.

వాస్తవానికి నే నెవరు? నాలో నేనుగా ఉన్న దెవరు? అని విచారిస్తే 'నేను దేహము కాను - నాకు దేహం ఉంది' అనే అద్భుతమైన సత్యం తెలిసి వస్తుంది. గతంలో లేని దేహం భవిష్యత్తులో లేకుండా పోయేందుకే వచ్చి ఉండొచ్చు. కాని, నేను అలా లేకుండా పోయేందుకు లేకుండా వచ్చినవాణ్ణి కాను. గతంలో కూడా ఉన్నవాణ్ణే. అలాగే భవిష్యత్తులో కూడా ఉండబోయే వాణ్ణే. ఎప్పుడూ ఉన్నవాణ్ణే ఇప్పుడూ ఉన్నాను. ముమ్ముందు కూడా ఉంటాను. నేను లేని కాలమే లేదు. ఒకప్పుడు లేకుండా పోయేవి ఉన్నప్పుడు ఉండటానికి కూడా నేనే కారణము.

### ఉండి పోయేది పోతే నష్టం లేదు

### పోకుండా ఉండేది తెలియక పోతే లాభం లేదు

నేడు ఉన్నాను అనడంలో తప్పు లేదు. ఒకనాడు లేను అంటేనే దోషం. నేను పుట్టాను అనడం తప్పు కాదు. పుట్టిన రోజు పండుగ జరుపు కోవడం అనుచితమూ కాదు. పుట్టక ముందు లేను అంటేనే సమస్య ఉత్పన్నం అవుతుంది.

శ్రీరామచంద్రుడు ధర్మ రక్షణార్థం జన్మించాడని ఆయన పుట్టిన రోజును శ్రీరామనవమిగా మనం జరుపుకుంటున్నాం. అవతార మెత్తిన వాడు శ్రీమహావిష్ణువు. శ్రీరాముడుగా ఉద్భవించింది వైకుంఠవాసుడే. అంటే, శ్రీరాముడుగా పుట్టినవాడు శ్రీరాముడుగా పుట్టక ముందు ఉన్నవాడా, లేనివాడా? ఉన్నవాడే. మరి, అలా ఒకప్పుడు ఉండిన శ్రీరాముని దేహం నేడు ఉందా? లేదు. అంటే, రాముడు లేనట్లేనా? అదే వాస్తవమైతే, మనం రామధ్యానం ఎందుకు చేస్తున్నాము? మన ధ్యానాన్ని అనుగ్రహించే దెవరు? శ్రీరాముడు కాదా? శ్రీరాముని దేహం ఒక కాలంలో ఉండి, ఆ తరువాత లేకుండా పోవచ్చు. అలాగని, రాముడు లేకుండా పోలేదు. దేహం లేకపోయినా తాను ఉన్నాడు. ఉన్నాడు కనుకనే మన మొర వింటున్నాడు. ఉన్నాడు కనుకనే పిలిస్తే వస్తున్నాడు. తులసీదాసు మొర విన్నాడు. రామదాసు పిలిస్తే వచ్చాడు.

అర్జునా! నేడు నీ ముందు నేనున్నాను. నేను పుట్టినట్లు మా అమ్మ దేవకీదేవి చెబుతుంది. కాని, పుట్టక ముందే నేను ఉన్నానని మా మామయ్య కంసుడికి తెలుసు. అందుకే, నేను పుట్టగానే కబురు అందించమని కాపలా వాళ్ళను పెట్టాడు. అర్థమైందా అర్జునా! పుట్టక ముందు నేను లేను అనేది లేనే లేదు ***(న త్వేవాహం జాతు నాసం)***. ***తత్*** గా తెలిసే పరమేశ్వరుడు నిత్యమే. ఆ విషయంలో సంశయం లేదు. 'నేను'గా, 'నీవు'గా తెలిసే ***త్వం*** కూడా నిత్యమేనా? ఇక్కడే సంశయం.

అయ్యా! కృష్ణయ్యా! అది నీ విషయం. నీవు అవతారమూర్తివి. పుట్టుక లేని వాడివి. మరణం తెలియని వాడివి. నీ జనన మరణాలు చాలా విచిత్ర మైనవి. కాని, పుట్టి చచ్చే మా విషయ మేమిటి? అనేది అర్జునుని ప్రశ్న. ఇది నిజమేనా?

శ్రీకృష్ణుడు అవతారమూర్తి అని అర్జునుడికి ఈ సందర్భంలో తెలుసా? శ్రీకృష్ణుడు భగవంతుడు అని గీతోపదేశానికి ముందు అర్జునుడు గ్రహించాడా? లేదు. అది తెలిసి ఉంటే, రథంలో క్రింది భాగాన శ్రీకృష్ణుణ్ణి

కూర్చోబెట్టి, ఎత్తైన స్థానంలో తాను కూర్చుంటాడా? ఇంతెందుకు? శ్రీకృష్ణుణ్ణి రథం నడపడానికి, గుఱ్ఱాలను కడగటానికి అంగీకరిస్తాడా? తన సర్వస్వమూ అయిన అచ్యుతుడు భగవంతుడే అని పార్థునికి తెలియదు. మనకు తెలియకుండా మనతో ఉంటూ, మనల్ని ఆదుకొనే వాడే భగవంతుడు. కనుక భగవంతుని స్థాయిని ఉదహరిస్తూ శ్రీకృష్ణుడు బోధించడం లేదు. ఆత్మస్థాయి నుండే బోధను అనుగ్రహిస్తున్నాడు. ఆత్మ ఒక్కటే కనుక అందరమూ అన్ని కాలాలలో ఉన్నవాళ్ళమే అనే అద్భుత సత్యాన్ని వంట బట్టిస్తున్నాడు.

అర్జునా! నాది, నీది అని ఇక్కడ రెండు లేవు. విషయమంతా ఒక్కటే. జనన మరణాలు ఎవరివి అయినా విచిత్రాలే. విగత చిత్రాలే. చూడు పార్థా! నా దేహం రాక ముందు నేను ఎలా ఉన్నానో, నీ దేహం రాక ముందు నీవూ అలా ఉన్న వాడివే. నీవే కాదు. మన ముందు కనిపిస్తున్న ఈ రాజులు, భీష్మద్రోణాదులు సైతం వాళ్ళ దేహాలు పుట్టక ముందు కూడా ఉన్నవారే. నా దేహం లేకపోయినా, భవిష్యత్తులో నేను ఎలా ఉండబోతానో, అలాగే నీ దేహం పోయిన తరువాత నీవు, వాళ్ళ దేహాలు పతనమైన తరువాత వాళ్ళు అలాగే ఉండబోతారు. పార్థా! ఉండి పోయేది ఏదో అదే నీకు తెలుస్తూ ఉంది. పోకుండా ఉండేది ఏదో నీకు అర్థం కావడం లేదు. అదే నీ దుఃఖానికి కారణం.

అర్జునా! నీవు, ఈ రాజులందరు కూడా పుట్టక ముందు లేరు అనేది లేదు. ఉన్నవారే. ***(న త్వం... ఇమే జనాధిపాః న ఆసన్ ఇతి).*** నేను, నీవు, ఈ రాజులు దేహాలు లేక ముందు ఉన్న వాళ్ళమే. భవిష్యత్తులో దేహాలు లేకపోయినా ఉండే వాళ్ళమే. అంతేగాని, భవిష్యత్తులో లేకుండా పోయే వాళ్ళము కాము ***(అతః పరమ్ వయం సర్వే న భవిష్యామః న ఏవ).*** ఇది అర్థం కాకపోవడం వల్లనే శోకమోహాలు కలుగు తున్నాయి.

నేడయితే ఉన్నాము కానీ పుట్టక ముందు లేము కదా! ఈ భావమే మోహము. లేకుండా వచ్చాము కనుక భవిష్యత్తులో లేకుండా పోతాము. ఈ ఆలోచనే భయానికి, దుఃఖానికి కారణము. వాస్తవానికి దుఃఖ కారణం లేనే లేదు. ఆలోచనా విధానమే దుఃఖానికి కారణంగా తెలుస్తూ ఉంది.

అర్జునా! గతంలో మన మందరమూ ఉన్నాము. నేడూ ఉన్నాము. మనతో పాటు ఇప్పుడు దేహాలు ఉన్నాయి. భవిష్యత్తులో దేహాలు పతన మవుతాయి. మన ప్రయాణం మాత్రం సాగుతూనే ఉంటుంది.

ఇప్పుడు చెప్పు. భవిష్యత్తులో నీవు, వాళ్ళూ ఉంటూనే ఉంటారు. కనుక నీవు నీ కోసం దుఃఖింప నవసరం లేదు. అలాగే వాళ్ళ కోసం కూడా దుఃఖింప పని లేదు. ఇదే విషయం వాళ్ళకు కూడా వర్తిస్తుంది. వాళ్ళూ, నీవు భవిష్యత్తులో లేకుండా పోయేవారు కారు కనుక వాళ్ళు వాళ్ళ కోసం ఏడవ వలసిన పనిలేదు. అలాగే నీ కోసం ఏడవ వలసిన అగత్యం వాళ్ళకు లేదు. గతంలో అందరమూ ఉన్నాము. నేడు కూడా ఉన్నాము. భవిష్యత్తులో అందరము ఉండబోతాము. ఇక ఎవరు ఎవరి కోసం ఏడవాలి? ***(అశోచ్యా నన్వ శోచస్త్వం).***

**నువ్వు ఉంటేనే అది ఉంటుంది**

**అది లేకపోయినా నువ్వు ఉంటావు**

అర్జునా! నువ్వు దేహం లేక ముందు కూడా ఉన్నవాడివే. అప్పుడు దేహం లేదు. లేనిది వచ్చింది. దేహానికి ఆది ఉంది. కనుక అది అనాది కాదు. ఆది ఉన్న దేహానికి అంతం ఉంది. అందుకని అది అనంతం కాలేదు.

కుండ పుట్టింది కనుక దానికి ఆది ఉంది. ఆది ఉంది కనుక అంతమూ ఉంటుంది. తయారు కాక ముందు కుండ లేదు. పగిలిన తరువాత కుండ ఉండబోదు. దేహం యొక్క పరిస్థితి కూడా అదే ***(జనేః పూర్వం అపి మృతేః అథాపి దేహః నాస్తి).***





కుండ అన్ని కాలాలలో ఉండదు. కాని, మట్టి లేని కాలమే లేదు. దేహాలు ఎప్పుడూ ఉండవు. కాని, ఆత్మ లేని కాలమే లేదు. కాలము లేకపోయినా ఆత్మ ఉంటుంది. అదే ఆత్మ యొక్క కాలాతీత స్థితి. నిత్య మంటే అదే. కనుక, ఆత్మ నిత్యము. నిత్యమైన ఆత్మ నశిస్తుందా? నశించదు. మరి, దుఃఖం దేని కోసం ***(అశోచ్యా నన్వ శోచస్త్వం)?***

అర్జునా! కుండ పుట్టక ముందే మట్టి ఉంది. కుండ భగ్నమైనా మట్టి ఉంటుంది. దేహం పుట్టక ముందే నువ్వు ఉన్నావు. నేనూ ఉన్నాను. ఈ రాజులూ ఉన్నారు. దేహం పోయినా నువ్వు ఉంటావు. నేను ఉంటాను. ఈ రాజులూ ఉంటారు. దేహాలుగా ఉండ లేరు. ఆత్మగా ఉంటారు. కనుక, ఉండరేమో అనే సంశయం లేనే లేదు ***(న భవిష్యామః న ఏవ).***

కుండలు ఎన్నో ఉంటాయి. కాని, అన్ని కుండలలో ఆకాశం ఒక్కటే. దేహాలు అనేకంగా ఉంటాయి. కాని, అన్ని దేహాల లోని ఆత్మ ఒక్కటే. బల్బులు ఎన్నో రూపాల్లో ఉంటాయి. అనేక రంగుల్లో ఉంటాయి. కాని, వాటన్నిటిలో ఉండే శక్తి ఒక్కటే. అన్ని బల్బులలో ఒకే విద్యుత్ ఉన్నట్లుగా అన్ని దేహాలలో ఒకే చైతన్యం ఉంది.

**ఏకో దేవః సర్వ భూతేషు గూఢః..... ...... సర్వ భూతాంతరాత్మా**

ఒకే పరమేశ్వరుడు సర్వ భూతాలలో దాగి ఉన్నాడు. సర్వ జీవులలో ఆత్మస్వరూపంగా శోభిస్తున్నాడు అన్నది ఉపనిషత్తు.

మట్టి ఉంటేనే కుండ ఉంటుంది. కుండ లేకపోయినా, మట్టి ఉంటుంది. బల్బు వెలుగుతూ ఉంది అంటే విద్యుత్ ఉంది అని అర్థం. బల్బు పగిలి పోతుంది. అలాగని, విద్యుత్ నలిగిపోదు. నశించిపోదు.

ఆత్మ ఉంటేనే దేహాలు ఉంటాయి. దేహాలు లేకపోయినా ఆత్మ ఉంటుంది. ఇప్పుడు దేహం ఉంది. దేహంలో చైతన్యాత్మ ఉంది. దేహం పుట్టక ముందు ఈ దేహం లేదు. దేహం లేకపోయినా ఆత్మ చైతన్య స్వరూపంగా భాసిస్తూనే ఉంది. అర్జునా! నువ్వు ఆత్మవి. కనుక ఎప్పుడూ ఉంటావు. ఈ రాజులు కూడా అంతే.

**నడిచే రథాలు మారుతాయి**

**నడిపే రథికుడు మారడు**

అర్జునా! అర్థమైంది కదూ! ఎప్పుడూ ఉండేది ఏదో అది నిత్యము. ఎప్పుడూ ఉండ లేనిది ఏదో అది అనిత్యము. నిత్యము ఎప్పుడూ పోనిది కనుక దాని కోసం దుఃఖింప నవసరం లేదు. అనిత్యము ఎప్పుడైనా పోయేదే కనుక దాని కోసం కూడా దుఃఖింప పని లేదు. ఆత్మ నిత్యము. కనుక మన మందరమూ నిత్యులమే. ఎప్పుడూ ఉండే వాళ్ళమే. దేహాలు పోయినా పోయే వాళ్ళము కాము. దేహాలు రాక ముందు కూడా ఉన్న వాళ్ళమే.

దేహం రథం లాంటిది ***(శరీరం రథ మేవ).*** తనకు తానుగా నడవ లేదు. నువ్వుంటేనే నడుస్తుంది. ఎవరి రథము వారిదే. కాని, ఒక రథం ఉన్నట్లు మరొక రథం లేదు. ఏ రెండు శరీరాలూ ఒకే విధంగా లేవు. ఒకే రంగులో లేవు. ఒకే రూపంలో లేవు. మాటలో భేద ముంది. చూపులో తేడా ఉంది. నడకలో వ్యత్యాస ముంది. అర్జునా! ఈ తారతమ్యం ఎక్కడిది? అందరి శరీరాలు ఒకే విధంగా ఎందుకు లేవు?

కృష్ణా! శరీరాలు కూడా కర్మఫలాలే. అందరూ గతంలో ఒకే విధమైన కర్మాచరణం చేయలేదు. అందుచేత, అందరి శరీరాలు ఒకే విధంగా లేవు. మరి, ఈ దేహం ఎప్పుడు చేసిన కర్మకు ఫలం? ఈ జన్మలో చేసిన కర్మల యొక్క ఫలితమే అని చెప్ప గలరా? దేహం రావడమే కదా జన్మ? జన్మ వచ్చిన తరువాతే కదా

కర్మ? మరి, ఈ దేహంతో, ఈ జన్మలో ఆచరించే కర్మ వల్ల ఈ జన్మలోనే ఈ దేహాన్ని ఎలా పొందగలం? నేడున్న దేహం గత జన్మల కర్మఫలం.

అదీ విషయం. గత జన్మలో కర్మలు చేశాము కదా! ఆ కర్మలు ఏ దేహంతో చేశాము? ఏ దేహమో తెలియదు గాని ఈ దేహమైతే కాదు. ఈ దేహంతో గత జన్మలో కర్మలు ఎలా చేస్తాం? సరే. మరి వేరే దేహం ద్వారా ఇప్పుడు కర్మఫలాలను అనుభవించేది ఎవరు? నేనే. ఎవరి కర్మఫలం అది? నాదే. ఎప్పుడు చేసింది? గత జన్మలో. అంటే ఇప్పుడున్న నువ్వు అప్పుడు కూడా ఉన్నావా? ఉండబట్టే కదా చేశాను? అప్పుడు చేసిన నువ్వు ఇప్పుడు కూడా ఉన్నావా? ఉండబట్టే కదా అనుభవిస్తున్నాను? బావుంది. మరి ఇప్పుడున్న దేహం అప్పుడు లేదు కదా! లేదు. అప్పుడున్న దేహము ఇప్పుడు లేదు కదా! లేదు. అప్పుడున్న నీవు, ఇప్పుడున్న నీవు ఒక్కరేనా? అవును. అందుకే అంటున్నాను. నువ్వు ఎప్పుడూ ఉండే వాడివే నని. నేడున్న నువ్వు గతంలో ఉన్నా వని, భవిష్యత్తులో కూడా ఉండబోతా వని. నీ లాగే ఈ రాజు లందరూను. అర్జునా! ఇప్పుడు చెప్పు. దుఃఖానికి కారణ ముందా?

ప్రయాణంలో ఎన్నో బండ్లు ఎక్కుతాము. ఎన్ని ఎక్కుతామో అన్ని దిగుతాము. బండ్లు మారుతాయి. మారుతూనే ఉంటాయి. ప్రయాణం చేసే వాడు మాత్రం మారడు. మారే వాటిలో మారనిది, నశించే దేహాలలో నశించనిది ఏదో అదే నీ స్వరూపం. అందరి స్వరూపం అదే. రూపాలలో భేదాలే గాని స్వరూపంలో భేదం లేదు.

చరణం : ***రూపాలకు రూపము నీవే - రూపము లేని స్వరూపము నీవే***
***ఊరు పేరు ఉనికి ఏల? ఊపిరి నీవై నిలిచిన వేళ***

పల్లవి : ***ఎన్నో ఎన్నో రూపాలు - అన్నీ ఆరే దీపాలు***
***మారని రూపం ఆరని దీపం భువిలో దివిలో నీవే సకలం*** ॥ ఎన్నో ॥

ఇది ఆత్మ చైతన్యం. చైతన్య గానం లోని అమృతానంద రాగం.

అర్జునా! మారే దానిని మారకుండా ఆప లేము. మారని దానిని ప్రయత్నించినా మార్చ లేము. అనిత్యాలు మారుతూనే ఉంటాయి. మారే అనిత్యాలకు ఆధారమైన నిత్యాత్మ మారదు. సదాత్మగా సదా శోభిస్తూ ఉంటుంది.

అర్జునా! ఆకాశం ఉంది. వాతావరణ మార్పుల్ని ఆకాశంలో మనం చూస్తూ ఉన్నాం. వాతావరణం మారుతూ ఉంది. ఆకాశం మారుతుందా? నిత్యమైన ఆకాశం మారదు. అది సర్వగతం. అలాగే నిత్యమైన నీవు కూడా మార్పు లేని వాడవు. సర్వగతుడవు ( ***ఆకాశవత్ సర్వగతశ్చ నిత్యః*** ). నీవూ నిత్యుడవే. ఈ రాజు లందరూ నిత్యరూపులే. ఆత్మస్వరూపులే. కనుక ఎవరూ ఎవరి కోసము దుఃఖింప నవసరం లేదు.

## భేదం అజ్ఞానం - అభేదమే జ్ఞానం

అర్జునా! మన మందరము భవిష్యత్తులో కూడా లేకుండా పోయేవాళ్ళం కాము అని శ్రీకృష్ణుడు బోధించడములో అర్థం స్పష్టంగా తెలుస్తూ ఉంది. ఈ దేహాలు నశించిన తరువాత కూడా ఆత్మ స్వరూపంగా మనం సదా ఉంటాం అనేది నిర్వివాదంగా గోచరిస్తోంది.

నేను, నీవు, ఈ రాజులు అంటూ వేరు వేరుగా చెప్పింది ఉపాధి స్థాయి నుండే గాని ఆత్మస్థాయి నుండి కాదు. శ్లోకంలో **వయం** అనే బహువచనం ఉండటం వల్ల, దానిని పట్టేసుకొని భేదాన్ని అల్లుకొంటూ పోయారు అద్వైతము నచ్చనివారు. ఇలాంటి అస్పష్ట వ్యాఖ్యానాలు తలెత్త కూడదనే శ్రీ శంకర భగవత్పాదులు భాష్యంలో వివరణమును విస్పష్టం చేశారు.

**దేహ భేదాను వృత్త్యా బహువచనం న ఆత్మాభిప్రాయేణ**





అక్కడ ఉన్న రాజుల్ని ఎలా చంపాలి? అనే మీమాంసలో అర్జునుడు ఉన్నాడు. ఆ రాజు లందరికీ దేహాలు ఉన్నాయి. అవి కూడా అనేక రూపాలలో గోచరిస్తూ ఉన్నాయి. కనుక, దేహముల భేదమును బట్టి దేహస్థాయి నుండి బహువచన ప్రయోగం చేయడం జరిగిందే గాని, ఆత్మస్థాయి నుండి కాదు.

**దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా ।**
**తథా దేహాన్తరప్రాప్తి ర్ధీర స్తత్ర న ముహ్యతి ॥** 13

**దేహినః-అస్మిన్-యథా-దేహే-కౌమారం-యౌవనం-జరా**
**తథా-దేహాంతరప్రాప్తిః-ధీరః-తత్ర-న-ముహ్యతి**

| | | | | | |
|---|---|---|---|---|---|
| దేహినః | = | జీవునకు | యథా | = | ఎలాగో |
| అస్మిన్ | = | ఈ | తథా | = | అట్లే |
| దేహే | = | దేహము నందు | దేహాంతరప్రాప్తిః | = | మరొక దేహము ప్రాప్తించుటను |
| కౌమారం | = | బాల్యము | తత్ర | = | ఆ విషయమున |
| యౌవనం | = | యౌవనము | ధీరః | = | జ్ఞాని |
| జరా | = | ముసలితనము | న ముహ్యతి | = | మోహమును పొందదు. |

**జీవుడికి ఈ దేహంలో బాల్యము, తరువాత యౌవనము, ఆ తరువాత ముసలితనము కలుగుతున్నాయి కదా! అలాగే చనిపోయిన తరువాత మరొక దేహం ప్రాప్తిస్తుంది. ఈ విషయంలో జ్ఞానులు మోహానికి గురి కారు. అందుకనే, వారిని ధీరులు అని పిలుస్తారు.**

### వ్యాఖ్య

మరణించేది ఆత్మ కాదు. మార్పు చెందేది ఆత్మ కాదు. నీవు ఆత్మవే. నీవు మరణించవు. నీవు మార్పు లేని వాడివి. మార్పు లేని, మరణం తెలియని ఆత్మకు దేహం ఉపాధి. ఉపాధికి అవస్థలు ఉన్నాయి. మార్పు లున్నాయి. మరణం ఉంది. పరిణామము చెందుతూ పతనమయ్యే దేహాన్ని ఉపాధిగా కలిగిన ఆత్మ దేహి (**దేహః అస్య అస్తీతి దేహీ**). ఎవడికి దేహం ఉంటుందో అతడే దేహి, లేక జీవాత్మ. అంటే, దేహముతో కలసిన ఆత్మయే జీవుడు అని అర్థం.

దేహం రాక ముందు జీవుడు ఉన్నాడు. కనుక, దేహం నశించినా జీవుడు ఉంటాడు అని జీవి యొక్క నిత్యత్వాన్ని గడచిన శ్లోకంలో చూశాము. ఈ సత్యాన్ని గ్రహించిన జ్ఞానులు మృత్యువు విషయంలో శోకమోహాలకు గురి కారు. జీవాత్మ నశించేది కాదు. వికారము చెందేది కాదు. కనుక, ఎటువంటి వికారానికి, వినాశానికి కూడా దుఃఖింప వలసిన అవసరం లేదు. ఈ విషయం ప్రస్తుత శ్లోకంలో సోదాహరణంగా వివరింప బడుతూ ఉంది.

## దేహము - దేహి

దేహములో ఉన్నవాడు దేహి. దేహమును ఉపాధిగా కలవాడు దేహి. దేహం మారుతూ ఉంటుంది. అది గ్రహిస్తున్న దేహిలో ఏ విధమైన మార్పు ఉండదు. మార్పులన్నీ దేహధర్మాలే గాని ఆత్మధర్మాలు కావు. అందుచేతనే, మరణించిన వ్యక్తిని గూర్చి మాట్లాడే టప్పుడు జీవుడు దేహాన్ని వదిలేశాడు అంటాము. అంతేగాని, దేహము జీవుణ్ణి వదిలేసింది అని చెప్పము. చావడము అనేది దేహధర్మము కనుక, చనిపోయిన వ్యక్తిని దేహధర్మ మొందినాడు అని పెద్దలు వ్రాస్తూ ఉంటారు. పలుకుతూ ఉంటారు. ఇవన్నీ ఆత్మ యొక్క నిత్యత్వాన్ని

నిరూపించిన పవిత్ర ఆర్ష సంస్కృతిలో, జ్ఞానం కలిగిన వ్యక్తుల నాలుకలపై తొణికిస లాడే జ్ఞానామృత జల బిందువులు.

దేహం ఎప్పుడూ ఒక విధంగా ఉండదు. మారుతూ ఉంటుంది. మన దేహాన్నే తీసుకోండి. గతంలో ఉన్నట్లు ఇప్పుడు లేదు. గతానికి, ఇప్పటికి శరీరంలో చాలా మార్పు లున్నాయి. అయినా, దేహాన్ని తెలుసు కుంటున్న మనలో ఏ మార్పూ లేదు. అదే జీవాత్మ. దేహం లోని మార్పులను గ్రహిస్తూ తనలో ఏ విధమైన మార్పు లేనిది.

మారేది దేహం. మరణించేది దేహము. దేహము ఎప్పుడో ఒకనాడు మరణిస్తుంది అనేది అందరికీ తెలుసు. కాని, దేహము ఎప్పుడూ మరణిస్తూనే ఉంది అనేదే అర్థం కావాలి. ఎప్పుడూ మరణిస్తూనే ఉంది అనే సత్యం అర్థమైతే, ఇప్పుడూ మరణిస్తూనే ఉంది అనే జ్ఞానం కలుగుతుంది. మరణం దుఃఖ కారణమైతే, మరణము ఎప్పుడూ సాగుతూనే ఉంది కనుక దుఃఖము కూడా సదా కొనసాగుతూనే ఉండాలి. కాని, అలా జరగడం లేదు. ప్రాణం పోయి నప్పుడే మనుషులు దుఃఖిస్తున్నారు. అదే మరణం అని భావిస్తున్నారు. ఇదేదో కాస్త గజిబిజి గానే ఉంటుంది. కాస్త వివరంగా చెప్పుకొని అర్థం చేసుకుందాం.

**వికారం - నిర్వికారం**

ఆత్మ నశించదు. నశించని ఆత్మను అంటి పెట్టుకున్న అవస్థలు నశిస్తున్నాయి. దేహంలో వచ్చే మార్పులే అవస్థలు. అందరి అనుభవంలో అగుపించేవే. చిన్న బిడ్డను వృద్ధుడు అని అనలేము. బాలుడు అంటాము. కనుక, దేహమును ధరించిన జీవుడు, లేదా దేహి యొక్క మొదటి దశ బాల్యదశ. అదే బాల్యావస్థ.

బాలుడు బాలుడు గానే ఉండడు. పెరిగి పెద్దవాడు అవుతాడు. అంటే యౌవనములో అడుగు పెడతాడు. అతడు యువకుడు. బాల్యావస్థ నుండి యౌవనావస్థలో ప్రవేశించిన వాడు.

ఈ రెండు అవస్థల లోను దేహంలో చాలా మార్పు గోచరిస్తూ ఉంటుంది. బాల్యంలో దేహం శక్తిహీనంగా ఉంటుంది. చిన్నదిగా ఉంటుంది. యౌవనం వచ్చే సరికి దేహం శక్తివంత మౌతుంది. పెరిగి పెద్దది అవుతుంది. దృఢ పడుతుంది. ఈ రెండు అవస్థలను తెలుసు కుంటున్న దేహిలో మాత్రం ఏ మార్పూ ఉండదు.

యౌవనము నుండి అదే వ్యక్తి వార్ధక్యానికి ప్రయాణాన్ని సాగిస్తాడు. అదే వృద్ధాప్యం. ముసలితనం. ఇది వృద్ధావస్థ. ఈ అవస్థ మిగిలిన రెండు అవస్థల కన్నా భిన్నంగా ఉంటుంది. దేహంలో గణనీయమైన మార్పులు చోటు చేసుకుంటాయి.

శరీరంలో పటుత్వం తగ్గుతుంది. నడకలో వేగం ఉండదు. పరుగు ఊహకు అందదు. వెంట్రుకలు తెల్ల బడతాయి. దంతాలు ఊడి పోతాయి. ఊతకర్ర చేతికి వస్తుంది. చూపు మందగిస్తుంది. చెవులు సరిగా వినపడవు. విన్నది అర్థం కాదు. తిన్నది జీర్ణం కాదు. దేహం లేవ నంటుంది. లేపితే కూర్చోలే నంటుంది. నడుము వంగి పోతుంది. మెడ తిరగ నంటుంది. దడ మొద లవుతుంది. బాల్య యౌవనాలలో ఉన్నది ఒక శరీరమే అయినా, అప్పటికి ఇప్పటికీ, ఆ అవస్థకు ఈ అవస్థకు ఎంతో తేడా ఉంది. ఇవన్నీ వికారాలే. మార్పులే. తిరుగు లేని తీర్పులే. దేహంలో ఇన్ని వికారాలు గోచరిస్తున్నా, దేహి యైన జీవాత్మ నిర్వికారం గానే ఉంది. ఆత్మకు ముసలితనం లేదు. వృద్ధ మానవుడు అంటున్నారే గాని, వృద్ధాత్మ అని ఎవరూ అనడం లేదు.

ఎందుకో తెలుసా! మార్పులన్నీ శరీరానివే. ముసలితనం శరీరానికే. దేహి శరీరం కాదు. ముసలివాడు కాలేదు. శరీరాలలో ఉన్న వాడే గాని తాను శరీరం కాదు. శరీర రహితుడు. అందుకే, ***అశరీరం శరీరేషు*** అన్నది ఉపనిషత్తు. అంటే, శరీరాలలో శరీరం లేకుండా ఉండే వాడు అని అర్థం. ఇది అర్థమైతే దేహం లోని మార్పులు





దుఃఖ కారణాలు కావు. మరణం కూడా దేహానికే కనుక మరణంలో కూడా మోహము ఉండదు. శోకము ఉండదు. ఈ జ్ఞానము ఎవరికి ఉంటుందో అతణ్ణి ధీరపురుషుడు అంటున్నాడు భగవానుడు.

**మార్పు - మరణం**

మార్పు లన్నీ దేహానివే అని తెలిసిన వారు అవస్థలు మారుతూ ఉన్నా ఆవేదన చెందరు. ఆందోళనకు గురి కారు. కాని, మార్పు లెన్ని జరుగుతున్నా దిగులు చెందని జనులు మరణం వచ్చే సరికి దిగాలు పడతారు. కలత చెందుతారు. కన్నీళ్ళు పెట్టుకుంటారు. ఎందుకో తెలుసా! మరణం కూడా మార్పే నని తెలియదు కనుక.

మరణం అనేది ఒకచోట జరిగేది కాదు. ఒకప్పుడు కలిగేది కాదు. ఎప్పుడూ జరిగేదే. జరుగుతూ ఉండేదే. మనిషి ఒక్క క్షణంలో మరణించడం లేదు. ప్రతిక్షణం మరణిస్తూనే ఉన్నాడు. మన దేహం నిత్యము మారుతూ ఉంది. మన శరీరంలో ప్రతి జీవకణము క్షణం క్షణం మార్పుకు లోనవుతూనే ఉంది.

బాల్యావస్థను చూశాం. అది పోయింది. అదొక చావు. ఆ తరువాత యౌవనం పుట్టింది. కొంత కాలానికి అది కూడా పోయింది. అది మరొక చావు. ఆ తరువాత వృద్ధాప్యం పుట్టింది. అది మృత్యువుతో చస్తుంది. అదే చివరి చావు. ఇవన్నీ మరణాలే. చావులే. మరణం అంటే ఏదో కాదు, మార్పే.

మరి, బాల్యా ద్యవస్థలతో పాటు మరణం కూడా మార్పే అయి నప్పుడు, అవస్థల మార్పులలో దుః ఖించని వాడు మరణం విషయంలో ఎందుకు దుఃఖిస్తున్నాడు? కారణ మేమిటి?

బాల్యా ద్యవస్థలు దేహానికి వస్తున్నా, తాను మాత్రం దేహం లోనే ఉండి చూస్తున్నాడు. తనకు ఏ విధమైన హాని లేదు కనుక దుఃఖించడం లేదు. బాల్య యౌవన వార్ధక్యాల వలె మరణం కూడా ఒక అవస్థే నని తెలియక పోవడం చేత మరణంలో దుఃఖం కలుగుతోంది. మూడు అవస్థలలో తాను ఎలా నిర్వికారంగా ఉన్నాడో, నాల్గవ అవస్థ అయిన మరణంలో కూడా తాను నశించ కుండా ఉంటాడు అనే జ్ఞానం లేకపోవడం చేత మానవుడు శోకిస్తున్నాడు.

ఒక అవస్థ ముగిసి నపుడు మరొక క్రొత్త అవస్థ పుడుతుందే గాని క్రొత్త వ్యక్తి పుట్టడు. అవస్థ మారుతుందే గాని జీవితం మారడం లేదు. అవస్థ పోయినంత మాత్రాన వ్యక్తి పోవడం లేదు. అవస్థలు దేహానికి సంబంధించినవి. అవస్థలు పోయినా తాను ఉంటాడు. మరణం కూడా దేహానికి సంబంధించినదే. కనుక, దేహము పోయినా జీవుడు ఉంటాడు. అలాంటప్పుడు దుఃఖ మెందుకు? అవస్థలు నశించి నపుడు ఎలా దుఃఖం లేదో, మరణావస్థలో కూడా దుఃఖం ఉండటానికి వీల్లేదు. అయినా దుఃఖం కలుగుతూనే ఉంది.

ఇక్కడ మరొక సూక్ష్మమైన విషయాన్ని కూడా అర్థం చేసుకోవాలి. బాల్యా ద్యవస్థలు దేహానికి కలుగుతున్నా, దేశకాలాదులు మారడం లేదు అని కూడా మనిషి భావిస్తున్నాడు.

దేహంలో బాల్యా ద్యవస్థలు నడుస్తూ ఉంటే, ఈ దేహం లోని మార్పులన్నీ ఇప్పుడే, ఇక్కడే, ఈ ప్రదేశం లోనే ఉండి దర్శించడం జరుగుతోంది. ఈ దేహంతో పాటు ఈ కాలము కూడా కొన సాగుతూనే ఉంది. మరణం దగ్గరకు వచ్చే సరికి, మరణం అవస్థే అయినా, దేహాంతర ప్రాప్తి అనేది మరొక దేశంలో, మరొక కాలంలో జరుగుతూ ఉంది. అది కూడా భయానికి ముఖ్య కారణ మౌతూ ఉంది. కాని, దేశకాలాదులు కూడా మార్పులే అని తెలుసుకుంటే ఆ దిగులు కూడా దూర మవుతుంది.

మనకు ప్రాణతుల్యమైన వ్యక్తే కావచ్చు. అలాగని, అతడు విదేశాలకు వెళ్తే మనం దుఃఖిస్తామా? మరి దేహాంతర ప్రాప్తి ఏమిటి? అలాంటిదే కదా! ప్రయోజనం ఉంది కనుకనే మన ఆత్మీయుడు విదేశాలకు

వెళ్ళాడు. ప్రయోజనం ఉంది కనుకనే జీవుడు ఈ దేహాన్ని విడిచి మరొక దేహం లోకి వెళ్తున్నాడు. కనుక, చావు హర్షించ దగిందే గాని గర్హించ దగింది కాదు.

అవస్థలు మారినంత మాత్రాన జీవికి ఎలా నశింపు లేదో, దేహాంతర ప్రాప్తి కూడా అలాంటిదే. దేహము నశించి నంత మాత్రాన దేహి నశించడం లేదు. బ్రతుకులో ఎన్నో మార్పులను చూచి చలించని జీవుడే చావును కూడా ఒక మార్పుగా చూస్తున్నాడు.

వనంలో పువ్వులు వికసిస్తూ ఉంటాయి. అలాగే వాడిపోతూ ఉంటాయి. మళ్ళీ తాజా సుమాలు విరబూస్తూ ఉంటాయి. జీవన వనవాటికలో పాత అవస్థలు మరుగున పడుతూ ఉంటాయి. నూతన అవస్థలు తెర మీదికి వస్తూ ఉంటాయి. ఇలాంటి వాటికి ధీరుడు దుఃఖించడు. మోహాన్ని పొందడు **(ధీరః ధీమాన్ తత్ర ఏవం సతి న ముహ్యతి న మోహమ్ ఆపద్యతే)**. మారేవి మారుతున్నా, ఆరేవి ఆరుతున్నా, మారని, మారలేని, ఆరని, ఆరిపోని అఖండ జ్యోతిర్మయానందము తన స్వరూపమే నని ధీరునికి తెలుసు.

**నాడు ఉండినది నేడు ఉన్నది**
**రేపు ఉండునది ఉండ దగినది**
**అది ఇది కానిది అద్భుతమైనది**
**అన్నిటికీ ఆధార మైనది**
**ఆరని దీపము అఖండము**
**జీవుల గమ్యము చైతన్యము**
**రామ రామ జయ రాజారాం**
**రామ రామ జయ సీతారాం**

అని దేహివి చేరే గుర్తును తెలుపుతూ, చైతన్య గుళికను గుటక వేయించింది రామజోగి చిట్కాలులో ఆనంద విధానం.

పాత భవనాన్ని కూల్చేసి, అక్కడే మరొక అందమైన నూతన భవనాన్ని నిర్మించుకుంటాం. దివ్యమైన ఆ భవనం లోకి ప్రవేశించడానికి ఉత్సాహ పడతామే గావి నిరుత్సాహంతో నీరసిస్తామా? పాతది పోయిందని దుఃఖిస్తామా? దేహాంతర ప్రాప్తి కూడా ఇంతే.

ఆత్మ యొక్క నిత్యత్వం అర్థమైతే, దశలు మారుతున్నా, మరణం సమీపిస్తున్నా, దేహి ధీరుడై ఉంటాడు. ఆనంద స్వరూపుడై ఉంటాడు. మరణం అనేది అతనికి శోక సన్నివేశం కాదు. మంగళస్నానం లాంటిది.

ఒక యజ్ఞాన్ని వైభవోపేతంగా నిర్వహిస్తాం. పూర్ణాహుతిని ఆనందంగా జరుపుకుంటాం. ఆ తరువాత అందరమూ శుభకరంగా నదిలో దిగి మంగళస్నానం చేస్తాం. దానినే **అవభృథ స్నానం** అంటారు.

జీవితం ఒక మహాయజ్ఞము లాంటిది. ఈ దేహం సమాప్తమై, దేహాంతర ప్రాప్తి కలిగే ముందు జీవన యజ్ఞానికి పూర్ణాహుతి పవిత్ర సమయంలో లభించే మంగళస్నానమే, అవభృథ స్నానమే మరణం. శోకానికి కారణమే లేని పావన తరుణం.

**మరణం - మరపు**

చివరగా ఈ సందర్భంలో ఒక్క సందేహం మనస్సును పట్టుకొని వ్రేలాడుతూ ఉంటుంది. బాల్యాద్యవస్థల లాంటిదే దేహాంతర ప్రాప్తి కూడా అనేది అర్థమైంది. అలాంటప్పుడు, బాల్యంలో, యౌవనంలో జరిగిన విషయాలు మనకు జ్ఞాపక మున్నాయి కదా! మరి గత జన్మ స్మృతులు ఎందుకని లేవు?





అది అర్థం చేసుకొనే ముందు మరొక్క విషయాన్ని కూడా మనస్సులో పెట్టుకుందాం. ఈ జన్మలో జరిగిన విషయాలు అన్నీ మనకు జ్ఞాపక మున్నాయా? ముఖ్యంగా శైశవదశ లోని అనుభవాలు స్మృతికి వస్తున్నాయా? రావు. రాలేవు. ఎందుకో తెలుసా?

శైశవదశలో బుద్ధి వికసనం జరగదు. అందువల్ల మనస్సు పేలవంగా ఉండి ఏ అనుభవాన్ని నిలుపుకో లేక పోతుంది. అంతమాత్రాన శైశవంలో అనుభవాలు, అనుభూతులు లేవని కాదు కదా!

మరణంలో మనసు విచ్ఛేద మవుతుంది. బుద్ధి వికల మౌతుంది. అలలు తీవ్రంగా కదలి నపుడు బావిలో పూడిక కనిపించనట్లు, మనసు కల్లోల మైనందున జ్ఞాపకాలు తెలియవు. అందుకే జన్మాంతర విషయాలు మరుగున పడిపోతూ ఉంటాయి. ఇది కూడా సృష్టిలో నియతికి సంబంధించిన విషయమే. ముస్ముందు గీతా వ్యాఖ్యానంలో ఇవన్నీ చూస్తాము. కాకపోతే, జన్మాంతర జ్ఞాపకాల విషయంలో మరపు ఒక వరం లాంటిది. భగవత్ప్రసాదం వంటిది.

గత జన్మల జ్ఞాపకాలు వర్తమాన జీవితాన్ని విస్సారంగా మారుస్తాయి. రాగద్వేషాలకు పాదులుగా మారుతాయి. అనిశ్చితమైన జీవన విధానానికి శ్రీకారం చుడతాయి. అవసరం లేని వాటిని అవసరాలుగా చూపుతాయి. ప్రశాంత జీవనంలో అశాంతి మంటలు రేపినా ఆశ్చర్యపడ నవసరం లేదు. అందుకే నేమో, సర్వజ్ఞుడు, సర్వ నియంత అయిన పరమేశ్వరుడు పూర్వజన్మ స్మృతి లేకుండా మనిషి మనస్సులో మరపును మడతపెట్టి ఉంచాడు.

*అనిత్యమైన దేహం గతిస్తుంది. దేహం కన్నా అన్యమైన ఆత్మ నశించదు అనే జ్ఞానం కలగడం వల్ల మరణం విషయంలో మోహం కలగదు. కాని, జీవితకాలంలో సుఖదుఃఖాల కారణంగా శోకమోహాలు ఏర్పడుతాయి కదా! అని అర్జునుడు సంశయిస్తాడని ఊహించి* **(అష్టవన్య వచనం ఆశఙ్క్య)** *స్థూల దేహం కన్నా ఆత్మ విలక్షణంగా ఉన్నట్లే, సూక్ష్మ దేహం కన్నా కూడా ఆత్మ విలక్షణ మైనది అని చెప్పడం ప్రారంభిస్తున్నాడు గీతాచార్యుడు*

మాత్రాస్పర్శా స్తు కౌన్తేయ శీతోష్ణ సుఖదుఃఖదాః ।
ఆగమాపాయినోఽ నిత్యా స్తాం స్తితిక్షస్వ భారత ॥ 14

**మాత్రాస్పర్శాః-తు-కౌంతేయ-శీతోష్ణ సుఖదుఃఖదాః**
**ఆగమాపాయినః-అనిత్యాః-తాన్-తితిక్షస్వ-భారత**

| | | | |
|---|---|---|---|
| కౌంతేయ | = కుంతీకుమారా! | ఆగమాపాయినః | = రాకపోకలు గలవి |
| మాత్రా స్పర్శాః తు | = ఇంద్రియాలకు ఇంద్రియ విషయాలతో కలిగే సంబంధాలైతే | అనిత్యాః | = అస్థిర మైనవి |
| శీతోష్ణసుఖదుఃఖదాః | = శీతోష్ణ సుఖదుఃఖములను కలిగిస్తాయి | భారత | = హే అర్జునా! |
| | | తాన్ | = వాటిని |
| | | తితిక్షస్వ | = ఓర్చుకో |

**అర్జునా! ఇంద్రియాలకు ఇంద్రియ విషయాలతో సంబంధం కలిగి నపుడు శీతోష్ణాలు కలుగుతాయి. అలాగే సుఖదుఃఖాలు ఏర్పడుతాయి. పార్థా! అవి వస్తూ ఉంటాయి: పోతూ ఉంటాయి. స్థిరంగా ఉండవు. వాటిని నీవు ఓర్చుకోవాలి.**

**వ్యాఖ్య**

నిత్యమైన ఆత్మ నశించేది కాదు కనుక శోకానికి అవకాశం లేదు. ఆత్మ కన్నా అన్యమైన దేహం నశించేదే

కనుక దాని విషయంలో కూడా దుఃఖానికి కారణము లేదు. ఈ సత్యము మరణ భయాన్ని తొలగిస్తుంది. కాని నిత్య జీవితంలో దుఃఖాన్ని కలిగించేవి చాలా ఉన్నాయి. మరణానికి సంబంధించిన దుఃఖము తొలగినంత మాత్రాన అన్ని దుఃఖాలు అవిరై పోతాయి అని అనుకో గలమా? మరణం దేహానికి సంబంధించింది. స్థూల శరీరానికి సంబంధించింది. జీవుడు స్థూలం తోనే కాదు, సూక్ష్మ శరీరంతో కూడా తాదాత్మ్యం చెంది ఉన్నాడు. అనేక కారణాల వల్ల జీవితంలో దుఃఖం ఏర్పడుతూ ఉంటుంది. ఆ విషయాన్ని కూడా ప్రస్తుత శ్లోకంలో చర్చించి, దుఃఖ కారణాలను తొలగిస్తున్నాడు భగవంతుడు.

దేహం చస్తేనే కాదు దుఃఖం కలిగేది. చస్తుంది అనే వార్త కూడా దుఃఖాన్ని కలిగిస్తుంది. చావును ప్రక్కన పెడితే, బ్రతికి ఉన్నప్పుడు కూడా దేహం వల్ల బాధలు కలుగుతూనే ఉంటాయి.

బ్రతుకు నడవాలి అంటే మనిషి కూడా నడవక తప్పదు. కూర్చుంటే బ్రతుకు నడవదు. మరి నడిచే టప్పుడు పడే అవకాశం లేక పోలేదు. జారితే ఆశ్చర్యం లేదు. పడి దెబ్బ తగిలితే దేహానికి గాయ మవుతుంది. గాయము బాధిస్తుంది. దుఃఖాన్ని కలిగిస్తుంది.

తల ఉన్నందుకు తలనొప్పి వస్తుంది. కడుపు ఉన్నందుకు కడుపు నొప్పి వస్తుంది. అవయవాలు దేహంలో పని చేస్తున్నాయి. పని చేస్తున్నాయి కనుక కొన్ని అరిగి పోతాయి. మరి కొన్ని పాడై పోతాయి. ప్రయత్నిస్తే పాడైనవి కొన్ని బాగవుతాయి. కొన్ని శాశ్వతంగా పాడై పోతాయి. ఇవన్నీ బాధలే.

వేడిని, చలిని తట్టుకో నేందుకు దేహంపై చర్మం ఉంది. అధిక వేడికి చర్మము కాలి పోతుంది. అధిక చలికి చర్మము ముడుచుకు పోయి పగిలి పోతుంది. చర్మము ఉన్నందుకు ఈ చలనాలు తప్పవు. చర్మములో చలనాలు కలుగుతూ ఉంటే చిత్తంలో సంచలనాలు పుడుతూ ఉంటాయి. సంఘర్షణలు కుదుపుతూ ఉంటాయి. ఇవన్నీ దుఃఖాలు. వీటి స్వభావ స్వరూపాలను, నివారణోపాయాలను ఇప్పుడు తెలుసుకుందాం.

**మాత్రలు - స్పర్శలు**

మాత్రలు అంటే ఇంద్రియాలు. స్పర్శలు అంటే విషయాలు. చెవి, కన్ను, నాలుక, ముక్కు, చర్మము అనేవి ఇంద్రియాలు. శబ్దము, రూపము, రుచి, వాసన, స్పర్శ అనేవి విషయాలు. ఐదు ఇంద్రియాలు ఐదు ఇంద్రియ విషయాలను గ్రహిస్తూ ఉంటాయి. ఇంద్రియాలు దేహంలో ఉంటాయి. విషయాలు దేశంలో ఉంటాయి.

**ఆభిః మీయన్తే శబ్దాదయః ఇతి శ్రోత్రాదీని ఇంద్రియాణి మాత్రాః**

శబ్దము మొదలైన విషయాలను గ్రహించే ఇంద్రియాలను మాత్రలు అంటారు. ఇవి శబ్దాది విషయాలను కొలుస్తాయి. మదింపు వేస్తాయి. సకిలింపు వినిపిస్తే గుఱ్ఱ మని, గాండ్రింపు వినిపిస్తే వ్యాఘ్ర మని గ్రహించ డానికి చెవి అనే ఇంద్రియము కారణము. ఇది మేక, అది మేఘము అని గ్రహించడానికి కన్ను అనే ఇంద్రియము కారణము. ఈ విధంగా విషయ ప్రపంచంలో ఏది ఏమిటో గ్రహించడానికి, మదింపు వేయడానికి ఇంద్రియాలు ఉపకరిస్తాయి. వీటిని మాత్రలు అంటారు. ఇక స్పర్శలు చూద్దాం.

**స్పృశ్యన్తే ఇతి స్పర్శాః విషయాః శబ్దాదయః**

స్పర్శలు అంటే స్పృశింప బడేవి అని అర్థం. అంటే ఇంద్రియాలు అనే మాత్రల ద్వారా స్పృశింపబడే విషయాలు. ఇవే స్పర్శలు. ఇంద్రియ విషయాలు.

దేహం ఉన్నంత వరకు దేహంలో ఇంద్రియాలు ఉంటాయి. ఇవి ఐదు ఇంద్రియాలు. వీటి వల్లనే విషయ జ్ఞానము కలుగుతూ ఉంది కనుక వీటిని పంచ జ్ఞానేంద్రియాలు అంటారు. ఇవి దేహంలో ఉంటాయి.





అలాగే దేశం ఉన్నంత వరకు ప్రదేశంలో విషయాలు ఉంటాయి. ఇవి ఐదు విషయాలు. వీటి విషయమే ఇంద్రియాలకు అందే జ్ఞానము. వీటిని విషయ పంచకం అంటారు. ఇంద్రియాలు ఐదు. విషయాలు ఐదు. పంచ జ్ఞానేంద్రియాల ద్వారా పంచ విషయాలు ప్రముఖంగా అందుతూ ఉన్నాయి కనుక ఇది ప్రపంచము.

ఇంద్రియాలు ఉన్నా, విషయాలు లేకపోతే ప్రపంచం ఉన్నట్లు తెలియదు. విషయాలు ఉన్నా, ఇంద్రియాలు లేకపోతే ప్రపంచం ఏమిటో అర్థం కాదు. మాత్రలు ఉండాలి. స్పర్శలు ఉండాలి. అంతే కాదు. అవి పరస్పరము సంబంధం కలిగి ఉండాలి. అప్పుడే విషయ ప్రపంచానికి సంబంధించిన జ్ఞానము ఉత్పన్న మవుతుంది.

**మాత్రాణాం స్పర్శాః శబ్దాదిభిః సంయోగాః తే శీతోష్ణ సుఖదుఃఖదాః శీతమ్ ఉష్ణమ్ సుఖం దుఃఖం చ ప్రయచ్ఛన్తీతి**

మాత్రలు అనబడే ఇంద్రియాలకు స్పర్శలు అనబడే విషయాలతో ఏర్పడే సంయోగాలు శీతాన్ని, ఉష్ణాన్ని, సుఖాన్ని, దుఃఖాన్ని పంచుతూ ఉంటాయి. శీతోష్ణాల వల్ల సుఖదుఃఖాలు కలుగుతూ ఉంటాయి. అంటే, శీతము వల్ల సుఖము, ఉష్ణము వల్ల దుఃఖము అని కాదు. శీతము వల్ల ఒకప్పుడు సుఖము, ఒకప్పుడు దుఃఖము కలుగుతూ ఉంటుంది. అలాగే ఉష్ణము వల్ల ఒకప్పుడు సుఖము, మరొకప్పుడు దుఃఖము కలుగుతూ ఉంటుంది. దీనిని బట్టి చూస్తే శీతంలో సుఖమూ లేదు, దుఃఖమూ లేదు. అలాగే ఉష్ణంలో కూడాను. కానిపోతే దేశ కాల పరిస్థితులను బట్టి శీతోష్ణాల వల్ల సుఖదుఃఖాలు ఏర్పడుతూ ఉంటాయి. ఇది కొస్త విశ్లేషించాల్సిన విషయం. కనుక, కొస్త వివరంగా చెప్పుకుందాం.

**శీతోష్ణాలు - సుఖదుఃఖాలు**

శీతోష్ణాలు విషయాల నుండి కలుగుతాయి. సుఖదుఃఖాలు మనస్సు నుండి పుడతాయి. కాలాలు మారుతూ ఉంటాయి. వేసవిలో మండుటెండలు కాస్తాయి. వర్షాకాలంలో వానలు కురుస్తాయి. శీతాకాలంలో చలి చుట్టేస్తుంది.

వేసవిలో మండుటెండల్ని మనిషి భరించ లేడు. బాబోయ్! ఎండలు మండిం చేస్తున్నాయి. వర్షాకాలం వచ్చే దెప్పుడో! అని తొందర పడతాడు. వేసవి పోతుంది. వర్ష ఋతువు ప్రారంభ మవుతుంది. అయ్యో! వర్షాల వల్ల ఏ పనీ జరగడం లేదు. ఈ వర్షాకాలం పోయే దెప్పుడో! అని వాపోతూ ఉంటాడు. వర్షాకాలము పోయి శీతాకాలం వస్తుంది. అబ్బ! ఈ చలిని భరించలేక పోతున్నాను బాబు! చర్మము పగిలి పోతోంది. ఎముకలు విరిగి పోతున్నాయి. ఈ చలికాలం ఇంకెప్పుడు పోయేది? అంటూ శివరాత్రి కోసం ఎదురు చూస్తూ ఉంటాడు. ఏదో రాలేదు అంటాడు. అది రాగానే పోయే దెప్పుడు? అంటాడు. ఇక ఏ కాలంలో మనిషి సుఖంగా ఉంటాడు? పోయే కాలంలో తప్ప.

కాఫీ వేడిగా ఉంటుంది. చలిలో, వర్షంలో త్రాగితే చాలా సుఖంగా ఉంటుంది. అదే కాఫీని వేసవి మండుటెండల్లో త్రాగాలంటే సుఖం ఉండదు సరికదా, చాలా అసౌకర్యంగా కూడా ఉంటుంది.

శీతల పానీయాలు కూడా అంతే. వాతావరణం వేడిగా ఉన్నప్పుడు శీతల పానీయాలు సుఖాన్నిస్తాయి. అదే చలితో కూడిన వాతావరణంలో త్రాగాలంటే చాలా కష్టంగా ఉంటుంది. దీనిని బట్టి మనకు ఏమి అర్థ మవుతుంది? శీతమైనా, ఉష్ణమైనా వాటిలో కేవలం సుఖమే ఉందని చెప్పలేము. అలాగని దుఃఖమే ఉందని కూడా చెప్పలేము. శీతోష్ణాలు సుఖదుఃఖాల్ని పంచడము అనేది అనేక విషయాల మీద ఆధారపడి ఉంటుంది. శీతోష్ణాలు ఉన్నాయి. ఉంటాయి. వాటిని లేకుండా చెయ్యలేము. రాకుండా ఆపలేము. ఆ అవసరం మనకు లేదు కూడా. ఎందుకంటే, విశ్వ మనుగడకు అవి అవసరమై ఉన్నాయి. శీతోష్ణాలు ఉండేది వాటిని మనం తొలగించ డానికి కాదు. అర్థం చేసుకోవ డానికి. అవగాహన వల్ల వాటిని బాధించే శక్తి ప్రస్తుతంలో లేనికే లేదు.

దుఃఖ మనేది ఉష్ణము కాదు, శీతమూ కాదు. ఒక వస్తువు కాదు. ఒక ప్రదేశం కాదు. ఒక కాలం కాదు. ఒక పరిస్థితీ కాదు. అది ఆలోచనా విధానం. సుఖం కూడా అంతే. దుఃఖం కావాలని ఎవ్వరూ ఆలోచించరు. కానీ, ఆలోచిస్తూ, ఆలోచిస్తూ దుఃఖంలో పడిపోతారు. అలాగే సుఖం కూడా. సుఖం కావాలనే అందరూ ఆశిస్తారు. కాని సుఖ మేమిటో, ఎక్కడుందో అర్థం గాక ప్రయత్నించి దుఃఖాన్ని కొనితెచ్చుకుంటారు.

అన్ని వేళల పరిస్థితులు అనుకూలంగా ఉండవు. నేడుండినా రేపు ఉంటాయని చెప్పలేము. ఆశించినవి జరగవు. అవసరం లేని వన్నీ పిలిచినట్లు వస్తూ ఉంటాయి. ఎవరైనా ప్రయాణం చేయాలి అనుకుంటారే గాని ప్రమాదం జరగాలని ఆశించరు. మన ఆలోచనలకి జరిగే వాటికి సంబంధం ఉండదు. జీవితంలో ఏ కష్టమూ రాకూడదని మనిషి ఆలోచిస్తాడు. తప్పు లేదు. అలాగే ఆలోచించాలి కూడా. అందరము అలాగే ఆలోచిస్తున్నాం. అలాగని వచ్చే కష్టాలు రాకుండా ఆగుతాయా? వస్తున్నా మని ముందుగా మనకు కబు రంపుతాయా? మన ఆలోచనలు ఒక వైపు నడుస్తూ ఉంటాయి. జరిగేవి మరొక వైపు జరిగిపోతూ ఉంటాయి. వీచే గాలిని ఎలా ఆపలేమో, కురిసే మబ్బును ఎలా నిలప లేమో, జీవితంలో ఎదురయ్యే వాటిని కూడా ప్రక్కకు నెట్టలేము. కాకపోతే, వాటిని అర్థం చేసుకోవడం అలవరచు కోవాలి. ఏమని? వాటికి రాకపోకలు ఉన్నాయి అని.

**వస్తాయి - పోతాయి**

శీతోష్ణాలు వస్తూ ఉంటాయి. అలాగే పోతూ ఉంటాయి. స్థిరంగా ఉండవు. అందుకే అవి అనియతాలు. అనిత్యాలు. 'ఆగమం' అంటే రాక. 'అపాయం' అంటే పోక. 'ఆగమాపాయినాలు' అంటే రాకపోకలు గలవి అని అర్థం. స్థిరంగా ఉండవు అని భావం.

ఇద్దరు వ్యక్తులు ఒకచోట మాట్లాడుకుంటూ ఉంటారు. అదేదో సంతోషంగా విన దగిందే నని మనసు ఉబలాట పడుతుంది. వెళ్ళి అదేమిటో చెప్పమని వాళ్ళను అడుగుతాం. అబ్బే, ఏమీ లేదు లెండి! అని వాళ్ళు మొగమాట పడతారు. మనలో కుతూహలం పెరుగుతుంది. ఫరవాలేదు, చెప్పండి అని పట్టు పడతాం. ఏమీ లేదండి! ఫలానా వ్యక్తి మిమ్మల్ని ఇలా విమర్శించాడు అని చెబుతారు. అంతే. ఆ క్షణం నుండి గాలివానకు అరటిచెట్టు లాగా మన మనస్సు ఊగి పోతుంది. దాని ప్రభావం మనస్సు మీద కొంత కాలం అలాగే ఉంటుంది. జీవితం ఇలాగే ఉంటుంది.

ఏవి ఎప్పుడు ఎలా వస్తాయో తెలియదు. వచ్చే వాటిని ఆపలేము. అర్థం చేసుకుంటూ పోవాలి. ఎవరు మనసుతో వాళ్ళు ఆలోచిస్తారు. ఇతరుల ఆలోచనల్ని మన మనసు మోస్తూ పోతే, ఆ తరువాత ఒక దశలో మన మనస్సును మనమే భరించ లేక పోతాం. సదవగాహనను ఏర్పరచు కోవాలి. సహనాన్ని పెంచుకోవాలి. ఎందుకంటే, ఏవేవో వస్తూ ఉంటాయి. అలాగే పోతూ ఉంటాయి.

**మోపే వారు నిందలు ఎందరో**
**మోసే వాడివి కాబోకు**
**కాకి కూతలు ఎవరికి మధురము?**
**కోకిల రవమే కమనీయము**
**సహనమె సంపద పగయే ఆపద**
**సద్గతి కిదియే సోపానము**
**రామ రామ జయ రాజారామ్**
**రామ రామ జయ సీతారామ్**

అంటూ రామజోగి చిట్కాలలో చైతన్య సందేశం.





వచ్చేవి వస్తాయి. పోయేవి పోతాయి. అవి ఎలాగైనా ఉంటాయి. వచ్చేవి చెప్పి రావు. పోయేవి భుజం తట్టి పోవు. ఏవి ఎలా ఉన్నా మనకు నష్టం లేదు. మనం ఎలా ఉండాలో మనం నిర్ణయించు కోవాలి.

పరిస్థితులు మన అధీనంలో ఉండవు. కాని, ప్రవర్తన మన అధీనమే. అన్నీ వెన్నెల రాత్రులే ఉండవు. చీకటి రాత్రులు కూడా ఉంటాయి. వెన్నెలలో విహరించాలి. చీకటిలో దీపం వెలిగించు కోవాలి. అలా జీవించ గలిగితే ద్వంద్వాలు మనస్సుపై దాడి చేయలేవు. బ్రతుకులో అందాలు దూరము కావు. ఇదంతా అవగాహన లోనే స్థిరపడాలి. ఓర్చుకొనే దెలాగో మెల్లగా నేర్చుకోవాలి. అదే తితిక్ష.

ఏవి వచ్చినా పోయేందుకే వస్తాయి. అందుకనే వాటిని భగవానుడు 'ఆగమాపాయినాలు' అంటున్నాడు. అంతేకాదు, ఎంతో కాలం ఉండవు కనుక 'అనిత్యాలు' అని కూడా అంటున్నాడు. వాటి మీద మనకు నియంత్రణ లేదు. అలాగే వాటికి నిలకడ కూడా లేదు. పట్టించు కుంటేనే పట్టి పీడిస్తాయి. అర్థం చేసుకుంటే ఆనవాళ్ళు కూడా మిగలవు.

*మబ్బు లొచ్చాయి పోయాయి వచ్చినట్లే*
*రాకపోకలు లేక గగనము వెలుగుచుండె*
*జగతి మబ్బు పోయె గగనమై ఉంటివయ్య*
*నీ అడుగుల కడ పడి ఉందు నీలకంఠా!*

అని విబూది పండ్లు మనస్సును అలరిస్తాయి.

**వగచకుండా కాచుకో**

రాకపోకలతో విసిగించే అనిత్యాలను అవగాహనతో వీక్షిస్తూ సహించడమే తితిక్ష. ద్వంద్వాలు ఏవైనా అనిత్యాలే కనుక వాటి విషయంలో పొంగిపో నవసరం లేదు. అలాగే క్రుంగిపో నవసరం లేదు.

తితిక్ష అంటే దుఃఖపడుతూ భరించడం కాదు. ఆవేదనతో సహించడమూ కాదు. అవగాహనలో పరిస్థితిని అవలోకించి, మనస్సులో ఏ విధమైన ప్రతిచర్యలు లేకుండా, వచ్చే వాటికి స్వాగతం పలుకుతూ, పోయే వాటికి వీడ్కోలు చెబుతూ చలించ కుండా ఉండటమే తితిక్ష ( ***శీతోష్ణ సుఖదుఃఖాది సహిష్ణుత్వం తితిక్షా!*** ).

ఈ శ్లోకంలో అర్జునుని రెండు పేర్లతో సంబోధించాడు శ్రీకృష్ణుడు. ద్వంద్వాలను సహించాలి అనే సంకేతా న్నివ్వడానికి రెండు పేర్లతో పిలిచాడేమో! లేక, పేరున్న వాడివి, పడేసుకోకు అని చెప్పడానికో!

తల్లి వైపు నుండి పిలుస్తూ, ***కౌన్తేయా!*** అన్నాడు. కుంతీకుమారా! అంటూ తల్లిని జ్ఞాపకం చేశాడు. తండ్రి వైపు నుండి పిలుస్తూ ***భారతా!*** అన్నాడు. జ్ఞానంలో రమించేవాడా! అంటూ తండ్రిని స్మృతికి తెచ్చాడు.

తల్లి యైన కుంతీదేవి ఎన్నో బాధల్ని అవగాహనతో సహించింది. తితిక్షకు ప్రతిరూపంగా శోభించింది. ధర్మాత్ముడు, పుణ్యాత్ముడు అయిన పాండురాజు తపోనిష్ఠా గరిష్ఠుడై అనేక సందర్భాలలో తితిక్షకు మారు పేరుగా భాసించాడు. అర్జునా! అలాంటి పుణ్య దంపతులకు సంతానంగా జన్మించావు. తితిక్షను అలవరచుకొని వారి బిడ్డ వనిపించుకో! మాతాపితల పేరును నిలబెట్టు అని భావించి, అలా పిలిచాడేమో! ఇలా ఎన్నైనా చెప్పుకోవచ్చు. మాధవుని మనస్సు మానవులకు చిక్కుతుందా! చిక్కితే అది ప్రసాదమే. అనుగ్రహమే. వాస్తవానికి వాసుదేవుని మాట లోని మర్మం వాసుదేవుడికే తెలియాలి. లేదా ఆయన స్వరూపమే అయిన వ్యాసదేవునికే తెలియాలి. అంతే.

*తితిక్షాపరునికి లభించే ఫల మేమిటో చెబుతున్నాడు. శీతోష్ణ సుఖదుఃఖాలను సహించే వానికి ఏమవుతుందో వినిపిస్తున్నాడు ( శీతోష్ణాదీన్ సహతః కిం స్యాత్ ఇతి శృణు ).*

**యం హి న వ్యథయ న్త్యేతే పురుషం పురుషర్షభ ।**
**సమదుఃఖసుఖం ధీరం సోఽ మృతత్వాయ కల్పతే ॥** 15

*యం-హి-న-వ్యథయంతి-ఏతే-పురుషం-పురుషర్షభ*
*సమదుఃఖసుఖం-ధీరం-సః-అమృతత్వాయ-కల్పతే*

పురుషర్షభ =ఓ పురుషశ్రేష్ఠా!
ఏతే =ఇవి
సమదుఃఖసుఖం =సుఖ దుఃఖములను సమంగా చూచు
ధీరమ్ =ధీరుడైన
యం పురుషమ్= ఏ పురుషుణ్ణి

న వ్యథయంతి = కష్ట పెట్టవో
సః హి = అతడే
అమృతత్వాయ = మోక్షానికి
కల్పతే = అర్హుడగును

**పురుషశ్రేష్ఠుడవగు ఓ అర్జునా! సుఖదుఃఖముల యందు సమబుద్ధి కలిగిన ఏ ధీరపురుషుణ్ణి ఈ మాత్రాస్పర్శలు బాధించలేవో అట్టివాడు మోక్షమును పొందుటకు అర్హుడు.**

**వ్యాఖ్య**

ఇంద్రియాలు ఇంద్రియ విషయాలతో సంగమించి నపుడు శీతోష్ణాలు, సుఖదుఃఖాలు కలుగు తున్నాయి. అవే మానవులను సుఖదుఃఖాల ఊబిలోకి దించి కష్టపెడుతూ ఉంటాయి (*వ్యథయన్తి*). కాని, తితిక్ష కలిగి శీతోష్ణ సుఖదుఃఖాలను సమంగా భావిస్తూ, అవగాహనతో సహించే వివేకవంతుణ్ణి అవి బాధించలేవు (*న వ్యథయన్తి*).

**రెండూ ఒక్కటే**

సాధారణంగా అందరూ సుఖానికి అనుకూలంగా ఉంటారు. అలాగే దుఃఖానికి ప్రతికూలం గానూ ఉంటారు. అనుకూలమైన సుఖంలో ప్రీతిని కనబరుస్తూ ఉంటారు. ప్రతికూలమైన దుఃఖంలో అప్రీతిని ప్రదర్శిస్తూ ఉంటారు. సుఖంలో, సుఖ కారణాలలో రాగం కలిగి ఉంటారు. దుఃఖంలో, దుఃఖ కారణాలలో ద్వేషాన్ని కుమ్మరిస్తూ ఉంటారు.

సుఖదుఃఖాలను సమంగా చూస్తూ సహించే ధీరపురుషులు రాగద్వేషాల నుండి విడిపడి ఉంటారు. మాత్రాస్పర్శల వల్ల ఏర్పడే ద్వంద్వాలు వారిని కదిలించ లేవు (*న చాలయన్తి*). వారికి వ్యథను కలిగించ లేవు (*న వ్యథయన్తి*).

సుఖదుఃఖాలు రెండూ మనో వికారాలే. వాస్తవానికి వీటిలో సుఖం సుఖంగా లేదు. దుఃఖం దుఃఖంగా లేదు. ఒక వ్యక్తికి సుఖంగా ఉండేది మరొక వ్యక్తికి దుఃఖంగా ఉంటుంది. అంతేకాదు. ఒక వ్యక్తికి ఒక దశలో, ఒక కాలంలో ఏవైతే సుఖాలుగా అనిపిస్తాయో అదే వ్యక్తికి మరొక దశలో, మరొక కాలంలో అవి సుఖాలు కాకుండా పోతాయి. దుఃఖాలు కూడా అలాగే ఉంటాయి. అందుకే సుఖదుఃఖాలు మనోవికారాలు. ఎప్పుడూ ఉండవు. ఉన్నా ఒకే లాగా ఉండవు. వచ్చిపోతూ ఉంటాయి. ఒకసారి సుఖం రూపంలో వచ్చింది మరొకసారి దుఃఖం ముసుగు వేసుకొని వస్తుంది. కనుక అవి అనిత్యాలు. అనిత్యాలు కనుక అంతఃకరణ వికారాలే గాని ఆత్మ ధర్మాలు కావు.

**ధీమంతుడే శ్రీమంతుడు**

శీతోష్ణ సుఖదుఃఖాలు అనే ద్వంద్వాలు ఏ మహాపురుషుని కలత పెట్టలేక పోతాయో, అతడే ధీమంతుడు





(*ధీరం*). ధీరుడు. **ధియం** అంటే బుద్ధి. **రాతి** అంటే విగ్రహించు వాడు. కనుకనే ధీరుడు. ఆత్మయే నిత్యమని గ్రహించిన వాడు. ఈ అధ్యాయం పదకొండవ శ్లోకంలో (గీతోపదేశ ప్రారంభ శ్లోకం) పండితుడు అని కీర్తింప బడినవాడు ఈ ధీరుడే. ధీమంతుడే. ఆత్మస్థుడే.

శీతోష్ణాలు దేహాన్ని కుదుపుతాయి. ధీమంతుని చలింప చేయలేవు. కారణం, అతడు దేహస్థుడు కాడు ఆత్మస్థుడు. అనిత్యమైన స్థూల శరీరము యొక్క ప్రభావానికి లోను గాని వాడు.

సుఖదుఃఖాలు మనస్సును విచలితం చేస్తాయి. ధీరపురుషుని కదిలించ లేవు. కారణం అతడు చిత్తస్థుడు కాడు. ఆత్మస్థుడు. అనిత్యమైన సూక్ష్మ శరీరం యొక్క ప్రతాపానికి లొంగని వాడు.

ద్వంద్వాలలో అతడు సముడు. రెండూ అతనికి ఒక్కటే. తుల్య భావంతో తన్మయమైన వాడు. ఏది ఉన్నా కదలడు. ఏది లేకపోయినా కలవర పడడు. అవి ఉన్నా లేనివే యని అతని భావం. అదే తుల్య భావం.

స్థూలమైనా, సూక్ష్మమైనా రెండూ అనిత్యాలని అతడికి తెలుసు. అందుచేత వాటి ప్రభావం అతని మీద పడదు. మండుతున్న పొయ్యి మీద నీళ్ళకుండను ఉంచుతాము. కొంత సేపటికి కుండ బాగా కాగుతుంది. పట్టుకుంటే కాలుతుంది. అలాగే కుండ లోని నీళ్ళు సలసల కాగుతాయి. పైన పడితే కాల్చుతాయి.

పొయ్యి లోని మంట కుండను కాల్చింది. నీళ్ళను కాచింది. కాని, కుండ లోని ఆకాశాన్ని కాల్చ గలిగిందా? పేల్చ గలిగిందా? అందుకే ఆకాశాన్ని అసంగం అంటాము.

సుఖదుఃఖాలు కూడా కుండ లాంటి స్థూలదేహాన్ని, నీళ్ళ లాంటి సూక్ష్మదేహాన్ని కలత పెట్టగలవే గాని, ఆకాశం వంటి ఆత్మను అంట లేవు. వెంట రాలేవు. ధీరుడు ఆత్మస్థుడు. అందుకే ఆ మహితాత్ముని నిత్యాత్మదర్శన నిష్ఠుడు అని భాష్యంలో అభివర్ణించారు శ్రీ ఆది శంకరులు (**సః నిత్యాత్మదర్శననిష్ఠః**).

**ఉంటే ఏమి? అంటక పోతే**
**మంటలు మాయలు మనిషికి లేవు**
**ఎక్కడ లేదు ఆకాశము**
**అంటుట కివ్వదు అవకాశము**
**ఆత్మ ఎప్పుడూ అసంగము**
**ఎందుకు నీకు గుణసంగము?**
**రామ రామ జయ రాజారామ్**
**రామ రామ జయ సీతారామ్**

అని రామజోగి చిట్కాలులో అధ్యాత్మ అద్భుత వర్ణనము.

**ద్వార దర్శనం**

సుఖదుఃఖాలలో కలత చెందని వాడు, ద్వంద్వాలలో అందంగా అద్వయాన్ని దర్శించే ధీరపురుషుడు అమృతత్వానికి, అంటే మోక్షానికి అర్హుడు అవుతున్నాడు అని ద్వంద్వాలను సహించడం వల్ల కలిగే ఫలాన్ని చెబుతున్నాడు.

ఏదైతే అమృతమో, అది అభయ స్థానము. ఏదైతే అభయమో అది బ్రహ్మస్థానము అని శ్రుతి ప్రబోధం (*ఏత దమృతం ఏతదభయం ఏతద్బ్రహ్మ ఇతి శ్రుతి వచనం*). అట్టి బ్రహ్మము నిర్దోషం కనుక సమం అని పిలువ బడింది అన్నది భగవద్గీత (*నిర్దోషం హి సమం బ్రహ్మ*).

అలాంటి సమస్థితిని దర్శించువాడు ధీరపురుషుడు. అలాంటి ధీరపురుషుడు మోక్షానికి అర్హుడు అవుతున్నాడు ***( సోఽ మృతత్వాయ కల్పతే - సః అమృతత్వాయ మోక్షాయ, కల్పతే సమర్థః భవతి )*** అన్నాడు గీతాచార్యుడు.

**మోక్ష ద్వారం**

విషయేంద్రియ సంయోగము ఎవరిని కలత పెట్టలేదో, సుఖదుఃఖాలలో ఎవడు సమదృష్టితో ఉన్నాడో అట్టి ధీరపురుషుడు మోక్షానికి అర్హుడు అంటున్నారు కదా! మరి, అలాంటప్పుడు, మోక్షానికి సాధన చతుష్టయ సంపద కాకుండా ఒక్క తితిక్షుత్వమే అధికారి లక్షణంగా చెప్పినట్లు అయింది కదా! ఇది సరియైన దేనా?

తితిక్ష అనేది శమదమాదులలో ఒకటి. తితిక్ష ఒక్కటే మోక్ష సాధనమైన జ్ఞానమును పొందుటకు సరిపోదు. సుఖదుఃఖాలలో సమంగా ఉండట మనే తితిక్ష శమదమాదులకు ఉపలక్షణము. అలాగే ధీరమ్ ***( ధీమంతుడు )*** అనే పదము వివేక వైరాగ్యాదులకు ఉపలక్షణంగా చెప్పబడింది. కనుక వివేక, వైరాగ్యాదులతో కూడిన శమ దమాదులు మోక్షార్హతకు సాధనాలుగా చెప్పబడ్డాయి. అర్జునుడు ముముక్షుత్వముతో శ్రేయస్సును వాంఛించాడు కనుకనే గీతాచార్యుడు బోధను అనుగ్రహిస్తున్నాడు. పైగా **పురుషర్షభ** అని అర్జునుని శ్రేష్ఠత్వమును స్పష్టం చేశాడు.

'పురుషర్షభ' అనే సమాసము నందు 'ఋషభః' శబ్దము ఉత్తర పదమై, పూర్వ పదమైన 'పురుష' శబ్దము యొక్క శ్రేష్ఠత్వమును స్పష్టం చేస్తూ ఉంది ***( శ్రేష్ఠార్థ గోచరః ).*** ఈ విధంగా సాధన చతుష్టయ సంపన్నుడైన అధికారి మోక్ష సాధనమైన 'త్వం' పదార్థ జ్ఞానమును పొందుటకు అర్హత కలవాడై అమృతత్వానికి సమర్థుడు అవుతున్నాడు ***( మోక్షాయ కల్పతే, సమర్థః భవతి ).***

*అర్జునా! దుఃఖింప దగని వారి కోసం దుఃఖిస్తున్నావు అని పదకొండవ శ్లోకంలో ఉపదేశాన్ని ప్రారంభించిన గీతాచార్యుడు ఆత్మానాత్మ వివేకాన్ని ఇంతవరకు ఐదు శ్లోకాలలో చర్చించాడు. అనాత్మ రూపాలన్నీ ఎలా అనిత్యాలో ఇంతవరకు చెప్పడం జరిగింది. అది సరిపోదు. ఈ సత్యాన్నే తాత్త్విక దృష్టితో విశద పరచేందుకు సాంప్రదాయక సదసద్వివేకాన్ని శాస్త్రీయంగా బోధించ వలసిన అవసరం ఉంది. అక్కడే బోధకు పూర్ణత్వము. ఆ కార్యాన్ని ప్రారంభిస్తున్నాడు శ్రీకృష్ణ భగవానుడు.*

**నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః ।**
**ఉభయో రపి దృష్టోఽ న్త స్త్వనయో స్తత్త్వదర్శిభిః ॥** 16

***న-అసతః-విద్యతే-భావః-న-అభావః-విద్యతే-సతః***
***ఉభయోః-అపి-దృష్టః-అంతః-తు-అనయోః-తత్త్వదర్శిభిః***

| | | | | | |
|---|---|---|---|---|---|
| అసతః | = | లేని దానికి | అనయోః | = | ఈ |
| భావః | = | ఉనికి | ఉభయోః అపి | = | రెండిటి యొక్క |
| న విద్యతే | = | లేదు | అంతః తు | = | నిర్ణయము |
| సతః | = | ఉన్న దానికి | తత్త్వదర్శిభిః | = | తత్త్వజ్ఞుల చేత |
| అభావః | = | లేకపోవుట | దృష్టః | = | చూడ బడింది |
| న విద్యతే | = | ఉండదు | | | |

**లేనిది ఉండేది లేదు. ఉన్నది లేకుండా ఉండదు. ఈ రెండిటి యొక్క యదార్థ స్వరూపాన్ని చూచే వారే జ్ఞానులు.**





**వ్యాఖ్య**

**ఉండని దానికి ఉనికి లేదు**

ఆత్మ నిత్యము అని గ్రహించాము. నిత్యము అంటే ఎప్పుడూ లేకుండా ఉండేది కాదు అని అర్థం. ఇప్పుడు, అప్పుడు, ఎప్పుడూ అనే పదాలన్నీ కాలాన్నే సూచిస్తున్నాయి. కనుక ఆత్మ సదా ఉంటుంది అని చెప్పినా, సదా అనే పదము కాల వాచకము కనుక కాలమంతా ఉండేది అని అర్థం. అంటే, కాలము లేనపుడు లేనిది అని భావం. అలాంటిది నిత్యము కాలేదు. కనుక, కాలంలో ఉంటూ కాలాతీతంగా కూడా ఉండేది ఏదో అది నిత్యము. దానినే ఈ శ్లోకంలో 'సత్' అనడం జరిగింది. సత్ అంటే ఆత్మ. అదే నిత్యము. నిత్యమైన సదాత్మ లేక పోవడం అనేది లేదు ***( సతశ్చ ఆత్మనః అభావః అవిద్యమానతా న విద్యతే ).***

'సత్'కు వ్యతిరిక్త మైనది ఏదో అది 'అసత్'. కాలాతీతంగా ఉండేది సత్ అయితే, కాలాతీతంగా ఉండ లేనిది, కాలంలో మాత్రమే ఉండేది అసత్ అవుతుంది. సత్ అనేది నిత్యం కనుక అసత్ అనేది అనిత్య మవుతుంది. కాలపరిధి లోకి ఏది వచ్చినా అది అసత్తే, అనిత్యమే.

అందుచేతనే విషయేంద్రియ సంయోగము వలన కలిగే శీతోష్ణ సుఖదుఃఖాలు ఆగమాపాయినాలు, అనిత్యాలు అన్నాడు గీతాచార్యుడు ***( ఆగమా పాయినోఽ నిత్యాః తాన్ తితిక్షస్వ భారత ).***

శీతోష్ణాలు కారణాన్ని కలిగి ఉన్నాయి. కనుక అవి అసత్తు. శీతోష్ణాలను ప్రామాణికంగా పరీక్షించి నపుడు వాటికి ఉనికి ఉన్నట్లు గోచరించదు. ఒక పాత్ర వేడిగా ఉంది. అది ఉష్ణము. అది అలా ఉండటానికి అగ్ని కారణము. అంతేకాదు. తాను వేడిగా ఉన్నట్లు పాత్ర వ్యక్తీకరించ లేదు. పాత్రకు స్ఫూర్తి లేదు. పాత్ర వేడిగా ఉంది అని దానిని స్పృశించిన మనం చెబుతాము. మన చర్మానికి వేడి తగిలింది కనుక పాత్ర వేడిగా ఉంది అంటాము. ఒకవేళ చర్మము స్పర్శను కోల్పోతే పాత్ర యొక్క వేడి మనకు స్ఫురించదు. వేడి ఉన్నా లేనిదే అవుతుంది. కనుక, ఉష్ణము అనేది అగ్ని మీద, మన చర్మము మీద, చర్మాన్ని తెలుసుకొనే చిత్తము మీద ఆధారపడి ఉంది. మరొక కారణాన్ని ఎప్పుడైతే కలిగి ఉందో, ఆ కారణం లేనపుడు కార్యము లేనిదే అవుతుంది. కనుక అది అసత్. అంటే, స్వతంత్ర మనుగడను కలిగి ఉన్నది కాదు, స్వప్రతిష్ఠంగా లేదు అని అర్థం.

ఇప్పుడు పాత్ర వేడిగా ఉన్నా, కొంత సేపటికి మళ్ళీ చల్ల బడుతుంది. కనుక కార్యము ఏదైనా వికారమే. వికారము కలిగింది ఏదైనా మార్పు చెందేదే. మార్పు చెందే దానికి స్వతంత్ర సత్తా లేదు. కార్యము వికారము. వికారము కలిగింది మారి పోతుంది ***( వికారో హి సః వికారశ్చ వ్యభిచరతి ).*** నియతంగా అంటే, ఒకే రూపంలో ఉండేది అవ్యభిచారి. అదే సత్. అలా ఉండ లేనిది అనియత మైనది కనుక వ్యభిచారి. అదే అసత్.

కార్యాలన్నీ అసత్తులే. కారణం కన్నా భిన్నంగా ఉండ లేనివి. స్వతంత్ర మనుగడకు నోచు కోనివి. పుట్టక ముందు లేనివి. గతించిన తరువాత ఉండ లేనివి. అంటే, ఆ రెండు కాలాలలో గోచరించనివి. కనుక అసత్యాలు. అనిత్యాలు.

మట్టికుండనే తీసుకుందాం. పరీక్షించి చూచి నపుడు కారణమైన మట్టి కన్నా అన్యమైనది అక్కడ ఏదీ కనిపించడం లేదు. కార్యం లోని సత్త్వం కారణం లోనిదే. సత్త్వం అంటే ఉండుట అనే లక్షణము. కార్యమైన కుండలో ఉన్న దేమిటి? మట్టి. కుండకు కారణమైన దానిలో ఉన్న దేమిటి? మట్టే. మట్టిలో ఉన్నదే (సత్త్వం) కుండలో ఉంది. కారణంలో ఉన్నదే కార్యంలో ఉంది.

కుండ తయారైంది అన్నప్పుడు దానిలో 'ఉండుట' అనే ధర్మం ఉంది. 'మట్టికుండ ఉంది'. ఈ వాక్యంలో 'ఉంది' అనేది సత్త్వం. ఆ తరువాత కుండ పగిలి పోయింది. అప్పుడు కుండ లేదు. 'మట్టికుండ ఉంది' అనే

వాక్యంలో కుండ పోయింది కనుక, ఇప్పుడేముంది? కుండను తప్పించి వాక్యాన్ని చూడండి తెలుస్తుంది. 'మట్టి ఉంది'. కనుక కుండ అనే కార్యంలో 'ఉంది' అనేది ఏదయితే ఉండిందో, కుండ పగిలిన తరువాత ఆ 'ఉంది' అనేది ఎక్కడుంది? కారణం లోనే , అంటే మట్టి లోనే ఉంది. అందుకే 'కుండ' పగిలినా 'మట్టి' ఉంది. ఇక కుండ ఏమిటి? కుండకు సత్త్వం ఏమిటి? అస్తిత్వం ఏమిటి? కుండ అనే పదం కన్నా వేరుగా కుండకు అస్తిత్వం లేదు. రూపం ఉండింది. రూపానికి నామం ఉండింది. రూపం పోయింది. రూపంతో పాటు నామం కూడా పోయింది. నామరూపాలు పోయాయి. నామరూపాలు ఉండి నపుడు ఏదయితే ఉండిందో, అది మాత్రం పోలేదు. ఉంది. ఎలా ఉంది? కారణంగా ఉంది. కారణంలో ఉంది. కనుక నామరూపాలకు ఉనికి లేదు. ఈ విషయాన్నే ఛాందోగ్య శ్రుతి ధ్రువ పరచింది.

**వాచారంభణో వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యం**

కుండ అనేది ఒక రూపానికి నామం. ముంత అనేది మరొక రూపానికి నామం. నామరూపాలు నిత్యం కావు. సత్ కావు. మృత్తిక అంటే మట్టి. మట్టే సత్యం. అదే సత్. సత్ త్రికాల అబాధితం. అంటే మూడు కాలాల్లో నిషేధించను వీలు పడనిది సత్. అసత్ అనేది బాధితం. అంటే కాలంలో నిషేధింప బడేది అని అర్థం. సత్ లేకపోతే నామరూపాలకు అస్తిత్వం లేదు.

చరణము : ***ముంత మూకుడు బానలు కుండలు - నామ రూపాల పోకడలే***
***మట్టి పాత్రలకు మన్నే అండ - జగమంతటికి నీవే నిండా***

పల్లవి : ***ఎన్నో ఎన్నో రూపాలు - అన్నీ ఆరే దీపాలు***
***మారని రూపం - ఆరని దీపం***
***భువిలో దివిలో నీవే సకలం*** ॥ ***ఎన్నో*** ॥

కుండలు అమ్మే వ్యక్తి వద్దకు వెళ్ళి, ఆ కుండను ఎంత కిస్తావు? అని అడిగాడు ఒక వ్యక్తి. పది రూపాయ లండి అన్నాడు అమ్మేవాడు. ఐదు రూపాయల కిస్తావా? అన్నాడు కొనేవాడు.

కుండే కదా మీకు కావలసింది? అని ప్రశ్నించాడు అమ్మేవాడు. అవును అన్నాడు కొనేవాడు. మట్టి కాదు కదా? అని మళ్ళీ అడిగాడు అమ్మేవాడు. కాదు అన్నాడు కొనేవాడు. సరే, మట్టికుండ పది రూపాయలు. మీకు కుండే కావాలి, మట్టి వద్దు అన్నారు కనుక, మట్టిని ఉంచేసి కుండను తీసుకుపోండి. అయిదు రూపాయలే ఇవ్వండి చాలు అన్నాడు అమ్మేవాడు. ఇవ్వడానికి ఇబ్బంది లేదు కాని, కొని పట్టుకుపోయే దేమిటో కొనే వానికి అర్థం కాలేదు.

అసత్ అనేది కార్యం. వికారయుతం. పుట్టక ముందు ఉండదు. గిట్టిన తరువాత ఉండబోదు. స్వతంత్ర సత్తా లేనిది. స్వప్రతిష్ఠం కానిది. తనకు మరొక కారణాన్ని కలిగి ఉంది. మరొక దానిపై ఆధారపడి ఉంది. అది అసత్.

**ఆదౌ అంతేచ యన్నాస్తి వర్తమానేఽ పి తత్తథా**

'ఆద్యంతముల యందు ఏదయితే లేదో అది వర్తమానంలో ఉన్నా లేనిదే' అని మాండూక్యకారికలలో శ్రీ శంకరుల వారి పరమ గురువు గౌడపాదాచార్యుల వారు తెలిపారు.

**ఉన్న దానికి లేమి లేదు**

స్వతంత్ర సత్తా లేనిది, కారణాన్ని కలిగి ఉన్నది, మరొక దానిపై ఆధారపడి ఉన్నది అసత్తు అని





గ్రహించాము. దీనికి వ్యతిరిక్త మైనది సత్తు. అంటే స్వతంత్ర మనుగడ కలది, తన కంటూ ఒక కారణము లేనిది, మరొక దానిపై ఆధార పడనిది అని అర్థం.

కార్య కారణాలను విశ్లేషించి అర్థం చేసుకుంటే కార్యం ఉంది అంటే, దానికి కారణం ఉండాలి. కార్యం ***ఉంది.*** కారణం ***ఉంది.*** ***ఉంది*** అనేది కార్యకారణాలు రెండిటిలో ఉంది.

కార్యమైన కుండ ***ఉంది.*** కారణమైన మట్టి ***ఉంది.*** ***ఉంది*** అనేది రెండిటిలో ఉంది. కార్యమైన కుండ పగిలి పోతుంది. కుండ పోయినా, 'కుండ ఉంది' అనే వాక్యంలో ఉండిన ***ఉంది*** పోలేదు. ఆ ***ఉంది*** అనేది 'మట్టి ఉంది' అనే వాక్యంలో చేరిపోయి ఉంది.

కార్యమైన కుండ ఉన్నపుడు, కుండలో ఉండుట అనే ధర్మం (సత్త్వం) ఏదయితే ఉండిందో, అది కుండ పగిలి పోయిన తరువాత కుండకు కారణమైన మట్టిలో కనిపిస్తూ ఉంది.

'మట్టి కుండ ఉంది' అనేది వాక్యము. ఈ వాక్యంలో మట్టి - కుండ - ఉంది అనే మూడు పదాలు ఉన్నాయి. కుండ నశించగానే 'కుండ' అనే పదం పోయింది. మట్టి - ఉంది, అనే రెండు పదాలతో 'మట్టి ఉంది' అనే వాక్యమే ఉంది.

కుండ నశించగానే, దాని సత్త్వం మట్టిలో గోచరిస్తూ ఉంది. కార్యమైన కుండ నశించినట్లే, కారణమైన మట్టి కూడా నశించి నపుడు, మట్టి కార్య మవుతుంది. ఆ మట్టికి కారణమైన జలంలో సత్త్వం గోచరిస్తుంది. జలం నశించి నపుడు, దానికి కారణమైన వాయువులో సత్త్వం కనిపిస్తుంది. వాయువు నశిస్తే, దానికి కారణమైన ఆకాశంలో సత్త్వం చేరి పోతుంది. ఆకాశం లేని ప్రళయ కాలంలో ఆకాశానికి కారణ మైనది ఏదో దానిలో సత్త్వం ఉంటుంది. కనుక ఉండుట అనేది (సత్త్వం) లేకుండా పోవడం లేదు. ఉన్నది లేకుండా పోయేది లేదు ***( నాఽ భావో విద్యతే సతః, సతః అభావః న విద్యతే ).***

ఆకాశం దాని నుండే పుట్టింది ***( తతః ఆకాశః సంభూతః ).*** ఆకాశం పుట్టక ముందు ఆకాశానికి కారణంగా ఏదయితే ఉండిందో దాని లోనే ఉండుట అనేది ***(సత్త్వం)*** ఉండింది. ఆకాశానికి ముందు ఉన్న సద్వస్తువు ఏదో అదే అద్వితీయ పరబ్రహ్మము. అదే ***సత్తు.***

**సదేవ సౌమ్య ఇద మగ్ర ఆసీత్ ఏకమేవాద్వితీయం బ్రహ్మ నేహ నానాఽస్తి కించన**

నాయనా (సౌమ్య!) ఈ సృష్టికి పూర్వము ***( ఇదం అగ్రే, సృష్టేః ప్రాక్ )*** 'సత్తు' ఒక్కటే ఉండింది. అది రెండు కాని ఏకమై ఉండింది. అదియే బ్రహ్మము. అందులో రెండవది అనేది లేనే లేదు అన్నది ఛాందోగ్య శ్రుతి.

అదే సృష్టికి కారణము. ఆ బ్రహ్మము యొక్క సంకల్పము తోనే సృష్టి ఆవిర్భవించింది. సృష్టి కార్య మైంది. కార్యమైన సృష్టి కారణమైన బ్రహ్మము కన్నా వేరుగా లేదు. సృష్టి ఉంది అన్నపుడు, సృష్టిలో ***ఉంది*** అనేది ఏదో సృష్టి విలీన మైనపుడు, ఆ ***ఉంది*** అనేది కారణమైన బ్రహ్మము లోనే ఉంది. అదే ***సత్.***

**ఆత్మవా ఇద మేక ఏవాగ్ర ఆసీత్ నాన్యత్కించన మిషత్, స ఈక్షత లోకాన్ను సృజా ఇతి!**

ఈ సృష్టికి పూర్వము ఆత్మ ఒక్కటే ఉండింది. అది తప్ప వేరొకటి లేనే లేదు. ఆ ఆత్మే లోకాలను (సృష్టిని) సృష్టించాలని సంకల్పించింది అన్నది ఐతరేయోపనిషత్తు.

సృష్టికి పూర్వం ఉన్నది ఏదో (సత్) అదే సృష్టి లోనూ ఉంది. కుండకు పూర్వము ఉన్నది ఏదో (మట్టి) అదే కుండ లోనూ ఉంది ***( మృత్తికేత్యేవ సత్యమ్ ).*** కుండ ఉంది అని మనం చెప్పినపుడు కూడా ఆ ఉన్నది (సత్) ఏదో అది మట్టికి సంబంధించినదే. ఈ విధంగా ప్రపంచంలో ఏది ఉంది (సత్త్వం) అనిపించినా,

విచారించి అర్థం చేసుకుంటే అది, ఆది కారణమైన అద్వితీయ బ్రహ్మమునకు సంబంధించినదిగా ఉంటుంది.

మట్టికుండ కుండగా అసత్. మట్టికుండ మట్టిగా సత్. ప్రపంచము ప్రపంచముగా అసత్. ప్రపంచము పరమాత్మగా సత్. ఇక్కడ అసత్ అంటే అసలే లేనిది అని కాదు. మరొక దానిపై ఆధార పడినది, స్వతంత్ర మనుగడ లేనిది అని ఇప్పటికే మనం అర్థం చేసుకొని ఉన్నాం. అదే అసత్. అదే మిథ్య. అదే మాయ.

**మాయామయము జగమంతా**
**మమకారాలే మనసంతా**
**ఉన్నది చూడరు ఎవరైనా**
**లేనిదే చూస్తారు ఎపుడైనా**
**ఉన్నది బ్రహ్మము లేనిది జగము**
**తెలిసే దెపుడు ఈ నిజము?**
**రామ రామ జయ రాజారామ్**
**రామ రామ జయ సీతారామ్**

అంటూ రామజోగి చిట్కాలలో సదసద్వివేకం రాగాలాపన చేసింది.

ఉన్నదే ఉంది (సత్). లేనిది ఉన్నట్లు ఉంది (అసత్). ఈ రెండూ బుద్ధిలో చేరిపోయి ఉన్నాయి. ఇవే రెండు బుద్ధులు. అందువలన సదసద్వివేకం చేసి తీరాలి.

**సర్వత్ర బుద్ధి ద్వయోపలబ్ధేః సద్బుద్ధిః అసద్బుద్ధిః ఇతి**

అంతట 'సత్ బుద్ధి', 'అసత్ బుద్ధి' అని బుద్ధి ద్వయం తెలుస్తూ ఉంది. సద్విషయానికి సంబంధించిన బుద్ధి సద్బుద్ధి. సద్బుద్ధి సర్వత్ర అనుగతమై ఉంటుంది. మార్పు చెందదు. వికారానికి లోను కాదు ***(యద్విషయా బుద్ధిః న వ్యభిచరతి తత్ సత్).*** అలాగే అసద్విషయానికి సంబంధించిన బుద్ధి అసద్బుద్ధి. ఇది వికారయుతము. మార్పు చెందుతూ ఉంటుంది ***(య ద్విషయా బుద్ధిః వ్యభిచరతి తత్ అసత్).***

***సన్ ఘటః.*** అనే చోట రెండు శబ్దాలు వినిపిస్తున్నాయి. 'సన్' ఒకటి. 'ఘటః' మరొకటి. 'సన్' అంటే ఉన్నది అని అర్థం. అదే సత్. 'ఘటః' అంటే కుండ అని అర్థము. పదాలు రెండైనా అవి ఒకే వస్తువును సూచిస్తున్నాయి.

కుండ పగిలిపోతే ***(ఘటే వినష్టే),*** కుండ బుద్ధి నశిస్తుంది ***(ఘట బుద్ధిః వ్యభిచరతి).*** అంతేగాని సద్బుద్ధి నశించదు. కుండ ఉంది అన్నప్పుడు 'ఉంది' అనే దానికి వేరుగా కుండ లేదు. కుండ పోయినా, 'ఉంది' అనేది ఉంది. 'ఉంది' అనేది అన్నిచోట్ల ఉంది. ఇదే అనుగతం. పువ్వు ఉంది. దీపం ఉంది. ఏనుగు ఉంది. కుక్క ఉంది. భార్య ఉంది. 'ఉంది' అనేది అంతటా ఉంది. కనుక 'కుండ ఉంది' అనే వాక్యంలో 'ఉంది' అనేది సద్బుద్ధి. 'కుండ' అనేది అసద్బుద్ధి. సద్బుద్ధి నిత్యము. అసద్బుద్ధి అనిత్యము. వికారయుతము. మిథ్యాభూతము.

***నీలోత్పలం*** అన్నప్పుడు నీలమ్, ఉత్పలమ్ అనే రెండు పదాలలో 'నీలమ్' అనేది విశేషణము. 'ఉత్పలమ్' అనేది విశేష్యం. విశేష్యాలైన ఉత్పలాదులు ఉండటం వల్లనే నీలం అనే విశేషణాన్ని చెప్పడం జరిగింది.

నీలోత్పలం వాడి రేకులు ఊడి నపుడు, ఉత్పలం ఉండదు. కానీ నీలం ఉంటుంది. నింగిలో నీలం ఉంది. సాగరంలో నీలం ఉంది. నీ కళ్ళల్లో నీలం ఉంది. వస్త్రంలో ఉంది. జలంలో ఉంది. ఉత్పలం (అసత్) పోయింది. నీలం (సత్) మరొక చోట కనిపిస్తోంది. ఇది సదసద్వివేకం.





నీలోత్పల మనే వస్తువు నందు నీలబుద్ధి ఉంది. అలాగే ఉత్పలబుద్ధి కూడా ఉంది. నీలమ్, ఉత్పలం అనే రెండు పదాలు ఒకే వస్తువును తెలుపు తున్నాయి. పైగా, ఈ రెండు ఒక దాని కన్నా మరొకటి వేరుగా లేవు. నీలం కన్నా వేరుగా ఉత్పలం లేదు. నల్లకలువ అన్నప్పుడు కలువ నుండి రంగును ఎలా వేరు చేయగలం? ఉత్పలం నీలం కన్నా వేరు కాకుండా ఉంది అని అర్థం చేసుకోవాలి ***(నీలాభిన్నం ఉత్పలం).*** కాబట్టి నీల బుద్ధి సద్బుద్ధి. ఉత్పల బుద్ధి అసద్బుద్ధి.

***సన్ ఘటః*** అన్నచోట కూడా ఇదే. ఘటః అస్తి. కుండ ఉంది అంటే, ఆ 'ఉంది' అనేది ఏదో అది కుండ కన్నా వేరుగా లేదు ***(సదభిన్నో ఘటః, సత్ అభిన్నః ఘటః).*** 'ఉంది' అనే సత్తు కన్నా వేరుగా కుండ అనే అసత్ లేదు.

ఘట, ఉత్పలాది విశేష్యము లన్నీ వికారయుతములు. కనుక మిథ్యా భూతములు. ఉన్నట్లుగా వస్తాయి. లేనట్లుగా పోతాయి. అందుకే ఆగమాపాయినాలు. అసత్తులు కనుక అనిత్యాలు. వీటికి స్వతంత్రంగా సత్యం లేదు. వస్తుత్వము, సత్యత్వము లేదు. వీటి అర్థాలు పరమార్థంలో ఉన్నాయి.

**తత్త్వ దర్శనం**

దేహం 'ఉంది'. దేహం పోతుంది. 'ఉంది' అనేది ఆత్మగా ఉంది. దేహం అసత్. 'ఉంది' అనేది సత్. ఇక అన్నీ అంతే. ఆత్మ ఒక్కటే సత్. ఆత్మ కన్నా అన్యమైన వన్నీ అసత్. ఇదే తత్త్వం. ఈ రెండిటి నిర్ణయమే తత్త్వం ***(ఆత్మా సత్యం తదన్యత్ సర్వం మిథ్య ఇతి తత్త్వ వివేకః).*** ఈ నిర్ణయాన్ని దర్శించిన వారు తత్త్వద్రష్టలు, తత్త్వవేత్తలు ***(ఉభయోః అపి అంతః తు తత్త్వ దర్శిభిః దృష్టః).***

దేహం ఉంది. కన్ను ఉంది. చెవి ఉంది. మనస్సు ఉంది. బుద్ధి ఉంది. బుద్ధి వృత్తి ఉంది. దేశం ఉంది. కాలం ఉంది. వస్తువు ఉంది. ప్రపంచం ఉంది. అజ్ఞానం ఉంది. 'ఉంది' అనేది అంతటా ఉంది. అదే సత్. అది ఎప్పుడూ మారనిది. అసత్తు లన్నీ మారుతూ ఉంటాయి. కనుక లేనిది ఉండేది లేదు ***(న అసతః విద్యతే భావః).*** ఉన్నది లేకుండా పోయేది లేదు ***(న అభావః విద్యతే సతః).***

***కుండ పగిలి పోయింది*** - అసత్

***పగిలిన కుండ ఉంది*** - సత్ - ఇదే సదసద్వివేకం. లోక వ్యవహార దృష్టిలో నిత్యానిత్య వివేకంగా అర్థం చేసుకున్న దానిని ఈ శ్లోకంలో సదసద్వివేకంగా శాస్త్ర ప్రమాణంతో చెప్పుకున్నాం.

అర్జునా! ఉన్నది లేకుండా పోయేది కాదు కనుక దుఃఖించకు ***(అశోచ్యానన్వ శోచస్త్వం).*** లేనిది ఉండేది కాదు కనుక దుఃఖించకు ***(అశోచ్యానన్వ శోచస్త్వం).*** ఈ రెండిటికి సంబంధించిన వివేకము గల వారు పండితులు. వారు దేనికీ దుఃఖించరు ***(గతాసూ నగతా సూంశ్చ నానుశోచన్తి పండితాః).***

*ఈ విధంగా సదసద్వివేకాన్ని వివరించిన శ్రీ వాసుదేవ భగవానుడు, ఏది సత్తో అది ఎలా నశించదో ముందుగా విశదం చేస్తున్నాడు.*

అవినాశి తు తద్విద్ధి యేన సర్వమిదం తతమ్ ।
వినాశ మవ్యయ స్యాస్య న కశ్చి త్కర్తు మర్హతి ॥ **17**

**అవినాశి-తు-తత్-విద్ధి-యేన-సర్వం-ఇదం-తతం**
**వినాశం-అవ్యయస్య-అస్య-న-కశ్చిత్-కర్తుం-అర్హతి**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యేన | = | దేని చేత | అవ్యయస్య | = | నశించని |
| ఇదం సర్వం | = | ఈ సర్వము | అస్య | = | దీనికి |
| తతం | = | వ్యాపించ బడిందో | వినాశం | = | వినాశమును |
| తత్ తు | = | దాని నైతే | కర్తుం | = | చేయుటకు |
| అవినాశి | = | నాశము లేనిదిగా | కశ్చిత్ | = | ఎవడును |
| విద్ధి | = | తెలుసుకో | న అర్హతి | = | అర్హుడు కాడు |

**ఈ జగత్తంతా ఏదయితే వ్యాపించి ఉందో, అది నశించేది కాదని తెలుసుకో. నశించని దానిని నాశనం చేసే వారు ఎవ్వరూ లేరు.**

**వ్యాఖ్య**

అర్జునా! దుఃఖింప దగని వాళ్ళ కొరకు దుఃఖిస్తున్నావు అంటూ పదకొండవ శ్లోకంలో భగవంతుడు పలికిన ఆక్షేపణ వాక్యాన్ని సమర్థిస్తూ నిత్యానిత్య వస్తు వివేకాన్ని ఇంతవరకు బోధించాడు. లౌకిక దృష్టిలో అదొక అర్థవంతమైన విశ్లేషణము. ఆత్మ నిత్యము కనుక దుఃఖింప నవసరం లేదు. అనాత్మ అనిత్యము కనుక దుఃఖానికి అవకాశము లేదు అనే అందమైన వాదనను వినిపించాడు.

ఆత్మానాత్మ వివేకానికి శాస్త్రం అవసరం లేదు. యుక్తి, అనుభవం కూడా సరిపోతాయి. జగత్తులో అన్నీ మార్పు చెందుతూ ఉన్నాయి. అలా మార్పు చెందేవి అనిత్యాలు. అనిత్యాలు ఉన్నాయి అంటే, నిత్యమైన దేదో ఉండబట్టే అనిత్యాలు తెలుస్తూ ఉన్నాయి అనేది యుక్తితో నిర్ణయించ వచ్చు.

గురువు చెంత కూర్చొని శాస్త్రాన్ని అధ్యయనం చేయడానికి శిష్యునికి కావలసిన అర్హతలలో నిత్యానిత్య వస్తు వివేకం ఒకటి. అంటే, శాస్త్రాధ్యయనానికి ముందే అట్టి వివేకము విద్యార్థికి ఉండాలి. అలాంటప్పుడు నిత్యానిత్య వస్తు వివేకం శాస్త్ర సిద్ధాంత మెలా అవుతుంది?

నిత్యము అన్నప్పుడే ఎప్పుడూ ఉండేది అని కాల వాచకంగా గ్రహిస్తాము. వాస్తవానికి నిత్యమైన ఆత్మ కాలాతీత మైనది. కాబట్టి ఎప్పుడూ ఉన్నది అని కాకుండా ఉన్నది (అస్తి) అని చెప్పాలి. అలాగే అనిత్యాన్ని ఎప్పుడూ లేనిది అంటూ కాల పరిధి నుండి చెప్పడం కాకుండా, లేనిది (నాస్తి) అనాలి. ఉన్నది సత్తు. లేనిది అసత్తు. లేని అసత్తుకు ఉనికి లేదు. ఉన్న సత్తుకు లేమి ఉండదు. అయితే ఇంత వరకు వ్యావహారికంగా చర్చించిన నిత్యానిత్య వివేకం స్థానంలో, ప్రామాణికంగా శాస్త్ర దృష్టితో సదసద్వివేకాన్ని పదహారవ శ్లోకంలో చర్చించాడు గీతాచార్యుడు. ఇది శాస్త్రీయమైన తాత్త్విక దృష్టి.

సదసద్వివేకము అనేది గహనమైన విషయము. ముఖ్యంగా రెండవ అధ్యాయమైన సాంఖ్య యోగానికి గుండెకాయ లాంటిది. ఒక విధంగా కేంద్ర విషయ మనే చెప్పాలి. కనుక విషయ సౌలభ్యం కొరకు ఈ అంశాన్ని మరి కొంత విశదీకరించి విస్పష్టం చేయడం అవసరమని భావించాడో ఏమో, ప్రస్తుతం మనం అధ్యయనం చేస్తున్న పదిహేడవ శ్లోకంలో సద్విషయ చర్చను, పద్దెనిమిదవ శ్లోకంలో అసద్విషయ చర్చను చేపట్టి దివ్యంగా భాషించాడు భగవానుడు.

**సర్వం విష్ణుమయం జగత్**

ఈ శ్లోకంలో తత్ అనే పదం ఏదయితే ఉందో, అది పూర్వ శ్లోకంలో ప్రతిపాదించిన సత్‌కు ప్రత్యామ్నాయంగా వాడ బడింది. 'ఉన్న దానికి లేమి అనేది ఉండదు' అని ఏ సద్రూపాన్ని వివరించడం జరిగిందో, అదే ఇక్కడ సర్వ వ్యాపకము, అవ్యయము అయిన తత్ పదంగా తెలుస్తూ ఉంది. దాని చేతనే





***(యేన)*** ఈ సమస్త జగత్తు ***(సర్వమిదం)*** వ్యాపింపబడి ఉంది ***(తతమ్)***. అంటే, ఈ ప్రపంచ మంతా సదాత్మ చేత పరివ్యాప్తమై ఉంది అని అర్థం.

విశ్వంలో ఎన్నో ఉన్నాయి. అన్నిటిలో 'సత్' వ్యాపించి ఉంది. అందుచేత అది సర్వవ్యాపి. సర్వ వ్యాపకమై ఉంది కనుక అది అవినాశి.

'ఇదం' అనేది జగత్తును సూచిస్తుంది. ఇదం సర్వం అనడం చేత యావద్విశ్వము అని తెలుస్తూ ఉంది. జగమంతా సద్వస్తువు వ్యాపించి ఉంది అని సిద్ధాంతము.

బావుంది. ఇంతకీ విశ్వము, అనగా జగత్తు సత్తా? అసత్తా? ఇందులో సందేహ మేముంది? ముందు శ్లోకంలో ఈ విషయాన్ని సమగ్రంగా చర్చించాము కదా! ప్రపంచము సత్తు కాదు. అసత్. ఎందుకని? (1)స్వతంత్ర సత్తా లేదు. (2) మరొక దానిపై ఆధారపడి ఉంది. (3) కారణ సహితంగా తెలుస్తూ ఉంది. పైగా దృశ్యంగా ఉంది. అనిత్య మైనది.

కారణం లేకుండా కార్యం ఉండదు కనుక సత్ లేకుండా అసత్ ఉండదు. అంతేకాదు. కారణం కన్నా వేరుగా కార్యం ఉండ లేదు కనుక కార్యంలో ఉన్నది ఏదో అది కారణమే. కార్యమంతా కారణమే వ్యాపించి ఉంటుంది.

వ్యాప్య వ్యాపక సంబంధములో కూడా వ్యాపకంగా ఉండేది ఏదో అదే సత్తు. సర్వంలో వ్యాపకమై ఉండేది సత్తు మాత్రమే. సర్వము వ్యాప్యము. సద్వస్తువు ఒక్కటే వ్యాపకము. అసద్వస్తువు వ్యాప్యము.

మట్టిపాత్రలు ఉన్నాయి. మట్టి ఉంది. మట్టికుండ వ్యాప్యము. మట్టి వ్యాపకము. మట్టికుండలో అంతట వ్యాపించి ఉన్నది మట్టే కదా! అలాగే ఈ నామరూపాత్మక మైన జగత్తంతా సద్రూపమే వ్యాపించి ఉంది.

**యేన సర్వ మిదం తతమ్**

దేని చేత ***(యేన, సదాఖ్యేన బ్రహ్మణా)*** అంటే, ఏ సద్రూపమైన బ్రహ్మము చేత ఈ సమస్త మైన ప్రపంచము ***(సర్వం ఇదం)*** వ్యాపించబడి ఉందో ***(తతమ్)*** అనేది ఈ పాదము యొక్క అర్థము.

***యేన సర్వ మిదం తతమ్*** అనే ఈ శ్లోక పాదము ఇక్కడే గాక, ఎనిమిదవ అధ్యాయము ఇరవై రెండవ శ్లోకం లోను, పద్దెనిమిదవ అధ్యాయం నలభై ఆరవ శ్లోకం లోను కనిపిస్తుంది. ఇదే భావం ఈశావాస్యోపనిషత్తు లోని ప్రముఖమైన ప్రథమ మంత్రంలో వినిపించింది. ***ఈశావాస్య మిదం సర్వం యత్కించ జగత్యాం జగత్*** అన్నది ఈశోపనిషత్తు.

*అండాండంబులు పిండాండంబులు*
*బ్రహ్మాండంబులు బ్రహ్మలు మొదలుగ*
*అంతా రామమయం*
*ఈ జగమంతా రామమయం*

అని సద్రూప చైతన్యాన్ని దివ్యంగా గానం చేశాడు భద్రాచల రామదాసు.

కుండ వ్యాప్యం. మట్టి వ్యాపకం. కుండ పగిలి పోతుంది. అలాగని మట్టి నశిస్తుందా? కుండ అనేది కేవలం నామరూపాలే అని ఇప్పటికే గ్రహించాము. నామరూపాలు నశిస్తాయే గాని మట్టి నశించదు. వ్యాప్యం నశిస్తుందే గాని వ్యాపకం నశించదు.

సమస్త ప్రపంచము వ్యాప్యము. సద్వస్తువు వ్యాపకము. వ్యాప్యమైన అసద్రూప ప్రపంచము నశిస్తుంది. వ్యాపకమైన సద్రూప చైతన్యము నశించదు. సత్ అనేది ఆత్మే కనుక ఆత్మ నశించదు ( ***అవినాశి. న వినష్టుం శీలమ్ అస్య ఇతి.*** నశించే స్వభావం లేనిది ఏదో అది అవినాశి).

సర్వ వ్యాపకమైన అవ్యయ సద్రూపాన్ని ఎలా చూడగలం? అందుకే ***విద్ధి.*** తెలుసుకో అంటోంది గీత. ***తద్విద్ధి.*** దానిని తెలుసుకో అంటోంది. ఇది కేవలం జ్ఞానం కనుక, ఏ బోధనావిధి చేత అర్థ మవుతుందో, పొంద బడుతుందో అలా తెలుసుకోమని అర్థము ( ***విద్ధి విజానీహి యేన విధినా ప్రాప్యతే ఇతి*** ).

**అవినాశికి నాశము లేదు**

ప్రపంచము నశించినా సద్వస్తువు నశించదు. ప్రపంచం సద్వస్తువుపై ఆధారపడి ఉంది. సద్వస్తువు ప్రపంచంపై ఆధారపడి లేదు. ప్రపంచం లేకపోయినా సద్వస్తువు ఉంటుంది. దానికి నాశము లేదు. ఆత్మకు ఎందుకని నాశము లేదు?

ఆత్మకు నాశము ఎలా కలుగుతుంది? ఉన్నది ఏదైనా నశించాలి అంటే, ఆ నాశము తన వల్లనైనా తనకు కలగాలి. లేదా, తన కన్నా అన్యమైన దాని వల్లనైనా కలగాలి. ఆత్మకు ఈ రెండు కారణాల వల్ల నాశము ఉండదు.

ఆత్మ రూపము లేనిది. కనుక అవయవములు లేనిది. అవయవాలు ఉంటే, అవి నశించడం చేత స్వనాశము జరిగే అవకాశము ఉంటుంది. నిరవయవ మైన ఆత్మ తనకు తానుగా నశించ లేదు ( ***నిరవయవత్వాత్ దేహాదివత్*** ).

అలాగే తనకు అన్యమైన దాని వల్ల కూడా ఆత్మకు నాశము కలగదు. ఆత్మ కన్నా అన్యముగా ఏది ఉన్నా అది అసత్ అవుతుంది. అసద్వస్తువుకు తానే ఆశ్రయము కనుక తానే కర్త, కర్మ కావలసి ఉంటుంది. కనుక అదీ పొసగదు.

ఒకవేళ సద్వస్తువైన ఆత్మకు మరి యొక ఆశ్రయము ఉంటే, ఆశ్రయ నాశము జరగడం చేత తాను నశించే అవకాశం ఉంటుంది. ఆత్మకు ఆశ్రయ మనేది వేరుగా లేదు. దేనికైనా ఆత్మే ఆశ్రయమై ఉంది. కనుక, ఆ విధంగానూ నాశము సాధ్యం కాదు.

ఆత్మకు కారణము కనుక ఉంటే నశించే అవకాశము ఉంటుంది. కారణం నశిస్తే ఆత్మ నశిస్తుంది. కాని, ఆత్మ సర్వకారణమై శోభిస్తూ, తన కంటూ ఒక కారణము లేనిదై ఉన్నందున అలా కూడా ఆత్మకు నశింపు లేదు. ***నా చాస్య కశ్చిత్ జనితా.*** మరొక దాని నుండి ఆత్మ ఆవిర్భవించ లేదు అని వేదము చెబుతూ ఉంది. కనుక, ఆత్మ కారణం లేనిదై ఉంది. ఇలా ఏ విధం గాను ఆత్మకు నాశము లేనందున ఆత్మను ***అవ్యయః*** వ్యయము కానిది, నాశము లేనిది అంటున్నాడు గీతాచార్యుడు.

**చంపే శక్తి ఎవరి కుంది?**

సద్రూపమైన ఆత్మ నాశ మెరుగదు. ఆత్మను చంప గలిగే సామర్థ్యం ఎవరి కుంది? ఎవరికైనా ఉంటే, దేనికైనా ఉంటే వాళ్ళు, లేక అది ఉన్నట్లే కదా! ఎక్కడున్నట్లు? కాలం లోనే కదా! కాలంలో ఉండేవి కాలాతీత మైన ఆత్మను ఎలా చంపుతాయి? కనుక సద్వస్తువును నశింప చేసే శక్తి ఎవ్వరికీ లేదు ( ***న కశ్చిత్ కర్తు మర్హసి*** ). ఈ విషయంపై వ్యాఖ్యానాన్ని అనుగ్రహిస్తూ, సాక్షాత్తు ఈశ్వరుడు కూడా ఆత్మను చంప లేడు అని గీతాభాష్యంలో వ్రాశారు ( ***న కశ్చిత్ ఆత్మానం వినాశయితుం శక్నోతి ఈశ్వరోఽపి*** ).





ఆత్మను వధించే శక్తి ఈశ్వరునికి కూడా లేదు అని ఆచార్యులు భాష్యం చెప్పడానికి కారణాలు రెండున్నాయి. ఒకటి, ఆత్మ ఎవరో కాదు. ఆత్మయే ఈశ్వరుడు. ఆత్మయే బ్రహ్మము ( ***ఆత్మా హి బ్రహ్మ*** ). రెండు, స్వవిషయంలో క్రియ సాధ్యం కాదు ( ***స్వాత్మని చ క్రియా విరోధాత్*** ). మనిషి తన భుజాలపై తాను ఎక్కగలడా? తన కంటిలో ఉండే రేఖలు మొదలైన వాటిని తానే చూడ గలడా? ( ***యథా చక్షుర్గత రేఖాదీన్ చక్షుః న పశ్యతి*** - శ్రీ బెల్లంకొండ రామరాయకవి విరచితం ***భాష్యార్కదీపః*** ). ఆత్మయే బ్రహ్మ మైనందున తనను తాను వధించుకొనే క్రియ సాధ్యం కాదు. ఈశ్వరుని చేత కూడా ఆత్మ చావదు అనడంలో ఇదే ఉద్దేశ్యం. అర్జునా! ఈశ్వరుడే చంప లేని ఆత్మను నువ్వు చంప గలవా? ఆత్మకు చావు లేదు. ఇప్పుడు చెప్పు. నీ దుఃఖానికి అర్థముందా? కనుక, విజయా! విలపించకు.

*సద్విషయ చర్చను ముగిస్తూ, అసద్విషయ చర్చను తరువాత శ్లోకంలో చేపడుతున్నాడు.*

**అన్తవన్త ఇమే దేహా నిత్యస్యోక్తాః శరీరిణః ।**
**అనాశినోఽప్రమేయస్య తస్మా ద్యుధ్యస్వ భారత ॥** 18

*అంతవంతః-ఇమే-దేహాః-నిత్యస్య-ఉక్తాః-శరీరిణః*
*అనాశినః-అప్రమేయస్య-తస్మాత్-యుధ్యస్వ-భారత*

| | | | | | |
|---|---|---|---|---|---|
| నిత్యస్య | = | నిత్యుడును | అంతవంతః | = | అంతం కలవి |
| అనాశినః | = | నాశము లేనివాడు | ఉక్తాః | = | చెప్పబడినవి |
| అప్రమేయస్య | = | ఊహింపను వీలు కాని వాడు | తస్మాత్ | = | అందుచేత |
| శరీరిణః | = | దేహికి | భారత | = | అర్జునా! |
| ఇమే దేహాః | = | ఈ దేహములు | యుధ్యస్వ | = | పోరాడు |

**శరీరాలను ధరించు జీవుడు నిత్యుడు. నాశము లేనివాడు. ప్రమాణాలకు చిక్కని వాడు. కాని, ఈ శరీరాలు అంతరించి పోతాయి. అందుచేత, అర్జునా! యుద్ధం చెయ్యి.**

**వ్యాఖ్య**

'సత్' అవినాశి. దానికి ఎవ్వరూ నాశాన్ని కలిగించ లేరు. 'అసత్' అనేది లేనిది. లేనిది నశించేది ఉండదు. అలాంటప్పుడు దుఃఖము దేని కొరకు? ఏది నశిస్తూ ఉందని దుఃఖించాలి? నాశము దేనికి? నశింప చేసే వారెవరు? తాత్త్విక దృష్టితో చూచి నపుడు ఇది గొప్ప మోహంగా తెలుస్తూ ఉంది. అందుకనే వేదాంతం దుఃఖాన్ని తొలగించే ప్రయత్నం చేయదు. దుఃఖ మనేది ఎలా అసమంజసమో బుద్ధికి పట్టిస్తుంది. తొలగించే ప్రయత్నం కర్మ. అర్థం చేసుకోవడం జ్ఞానం.

అర్థం చేసుకొనేది బుద్ధి. బుద్ధికే జ్ఞానం పట్టించాలి. కాని, ఇప్పటికే బుద్ధిలో ఉండ కూడని జ్ఞానం చాలా ఉండి పోయింది. నిండి పోయింది. దానిని బుద్ధి నుండి దూరం చేయాలి. ఉండ వలసింది, ఉండ దగింది ఏదో దానిని ఉంచడము, ఉండకూడని దానిని దూరం చేయడం అనే కార్యం అవశ్యం చేయాలి. అప్పుడే దుఃఖం దూరం అవుతుంది. అంటే, దుఃఖం ఎక్కడికో పారి పోతుందని కాదు. త్రాడు అని తెలియగానే అంతవరకు పాము అనే భావన వల్ల ఏర్పడిన భయ శోకాదులు అదృశ్య మైనట్లు, సదసద్వివేకంలో దుఃఖం ఆవిరై పోతుంది. కనుక, దుఃఖం మనిషికి సమస్య కాదు. జ్ఞానం లేకపోవడమే సమస్య. భయంకరమైన సమస్య. ఇదే ఉపనిషత్తుల సారాంశము. ఈ సత్యమే సదసద్వివేకంలో సారభూతమైన విషయంగా పరమేశ్వరుడు గీతలో బోధిస్తున్నాడు.

**జీవః అనాత్మానాం దేహాదీనాం ఆత్మత్వేన అభిమన్యతే**
**స అభిమానః ఆత్మనః బంధః, తన్నివృత్తిః మోక్షః**
**యా తదభిమానం కారయతి సా అవిద్యా**
**స అభిమానః యయా నివర్తతే సా విద్యా ॥**

అసద్రూపము లైన దేహాదులను సద్రూపమైన ఆత్మగా భావించి జీవుడు అభిమానిస్తున్నాడు.
ఆ దేహాభిమానమే ఆత్మకు బంధము. అది తొలగి పోవడమే మోక్షము.
అట్టి దేహాభిమానాన్ని కలిగించేది అజ్ఞానము.
అట్టి అజ్ఞానాన్ని తొలగించేది ఏదో అదే జ్ఞానము.

సార రూపమైన ఈ సద్బోధను అందించింది సర్వసారోపనిషత్తు. గీత ఉపనిషత్తుల సారం కనుక ఆ సదుపదేశమునే సదసద్వివేకం ద్వారా బుద్ధికి పట్టిస్తూ ఉంది. గడచిన శ్లోకంలో 'సత్'కు సంబంధించిన విషయాన్ని చర్చించి, అవినాశి యైన ఆత్మకు నాశము అనూహ్యము కనుక దుఃఖము అసంగతం అని గ్రహించాము.

ప్రస్తుత శ్లోకంలో 'అసత్'ను గూర్చి మరికొంత విపులంగా చర్చించి, లేని దాని కోసం దుఃఖం ఉండ నవసరం లేదని సుస్పష్టంగా బోధిస్తున్నాడు భగవానుడు. కాకపోతే, ఈ సందర్భంలో ఒక్క విషయాన్ని జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి. అజ్ఞానం అనేది ప్రత్యేకంగా బుద్ధిలో ఎక్కడుంది? జ్ఞానం లేకపోవడమే అజ్ఞానం. అజ్ఞానం పోతే దుఃఖం పోతుంది. చీకటి పోవాలి అంటే వెలుగు రావాలి. అజ్ఞానం పోవాలంటే జ్ఞానం రావాలి. అందుచేత గడచిన శ్లోకంలో 'సత్' చర్చ సాగించిన జగద్గురువు, ఈ శ్లోకంలో 'అసత్' విషయాన్ని విశద పరచే దిశలో అసద్విషయాన్నే సూటిగా ప్రవేశ పెట్టకుండా, కూర్చొని పడుకోవాలి అన్నట్లు, సద్విషయ చర్చను కొనసాగిస్తూనే బుద్ధిని మెల్లగా అసద్విషయ చర్చ వైపుకు మళ్ళించి, ఆ కోణంలో ఆలోచించినా దుఃఖము అసంగత మనే శాస్త్రీయ బోధను అందిస్తున్నాడు. నిత్యుడు, అవినాశి, అప్రమేయుడు అయిన దేహి యొక్క దేహములు నశించి పోతాయి కనుక, సంతాపాన్ని మాని సంగ్రామం లోకి ప్రవేశించ మంటున్నాడు భగవానుడు.

**నిత్యం - అవ్యయం - అప్రమేయం**

'సత్' అని ఇంత వరకు దేని నైతే గ్రహించామో, ఆ సద్రూప చైతన్యమును మూడు పదాలలో ఇంకా వివరిస్తున్నాడు. దేహము అసత్. దేహమును ఉపాధిగా కలిగిన దేహి సత్. అసద్రూపమైన దేహము సద్రూపమైన దేహికి ఉపాధి. దేహి ఎవరో కాదు. జీవాత్మయే దేహి.

దేహి నిత్యుడు. అంటే ఏ వికారములు లేని వాడు. మరి, దేహంలో ఉండే వాడు కదా దేహి! అవును. అంతటా ఉండే ఆకాశము ఘటంలో కూడా ఉన్నట్లు, చైతన్య రూపుడైన జీవుడు దేహంలో కూడా ఉన్నాడు. ఘటంలో ఉన్న ఆకాశాన్ని ఘటాకాశం అన్నట్లు, దేహంలో ఉన్న జీవాత్మను దేహి అంటున్నాము. ఆకాశం ఘటంలో ఉన్నా, ఘటానికి పరిమితం కానట్లు, దేహి దేహంలో ఉన్నా, దేహ వికారాలకు లోను గాకుండా ఉన్నాడు. దేహాలు అనిత్యాలు. కాని, దేహ వికారాలకు విలక్షణంగా ఉండే దేహి నిత్యుడు ***( నిత్యః ).***

నిత్యుడు కనుక నశించే వాడు కాడు. వికారములే లేని వాడికి వినాశము ఎలా వస్తుంది? నశించేవి దేహాలు. వికారం చెందుతూ శరీరాలు నశిస్తాయి. వికారాలను చూస్తూ, వికారం చెందని దేహి నాశము లేనివాడు. అవినాశి. అవ్యయుడు ***( అనాశినః ).*** నిత్యుడు, అవ్యయుడు అయిన దేహి అప్రమేయుడు. అంటే ప్రత్యక్షాది ప్రమాణాలకు అందని వాడు. తెలుసుకొనే వాడు ప్రమాత. తెలియబడేది ప్రమేయము. తెలుసు కొనుటకు సహకరించేది ప్రమాణము. ప్రమాణము ద్వారా కలిగే జ్ఞానము ప్రమ.





విచిత్ర మేమిటంటే, మనకు లభించే ప్రత్యక్ష, అనుమానాది ప్రమాణాలన్నీ మన కన్నా అన్యమైన వాటిని గ్రహించడానికి సహకరిస్తాయి. ఉపకరిస్తాయి. ప్రమాణ వ్యాపారం సాగడానికి ఆధార మైనదే ఆత్మ. అట్టి ఆత్మను ప్రమాణాలు తెలియ చేయలేవు. ఇక్కడ ప్రమేయము ఏదో కాదు, ప్రమాతే. కనుక దేహి ప్రమాణాలకు అందే వాడు కాడు ***( అప్రమేయః ).***

**పునరుక్తి దోషం**

దేహి నిత్యుడు, అనాశినుడు అని చెప్పి నపుడు ఈ రెండూ ఒకటే కదా! అనే సందేహం రావచ్చు. నశించని వాడు నిత్యుడు. నిత్యుడైన వాడు నశించడు. ఇలా ఒకే అర్థం వచ్చే టప్పుడు రెండు పదాలతో చెప్పడం పునరుక్తి క్రిందికి రాదా? దోషం కాదా? అని కొందరు సంశయించ వచ్చు.

పునరుక్తి దోషం అనేది, వాస్తవం చెప్పాలంటే, కావ్యాలకు, సాహిత్యానికే గాని వేదాంతానికి వర్తించదు. అదలా ఉంచండి. ప్రస్తుతం ఈ సందర్భంలో మాత్రం నిత్యుడు, అవినాశి అనడం పునరుక్తి కాదు ***( నిత్యస్య అవినాశినః ఇతి న పునరుక్తం ).***

రెండిటి అర్థాలు ఒక్కటే అయినా, ఇక్కడ పునరుక్తి లేదు. లోకంలో నిత్యత్వము, వినాశము అనేవి రెండు విధాలుగా తెలుస్తున్నాయి ***( నిత్యత్వస్య ద్వివిధత్వాత్ లోకే, నాశస్య చ ).*** నిత్యత్వము రెండు విధాలుగా తెలుస్తూ ఉంటుంది. అలాగే వినాశము కూడా రెండు విధాలుగా ఉంటుంది.

వినాశము అంటే నశించడం. నాశము రెండు విధాలు. ఒకటి, పూర్తిగా నశించి పోవడం. రెండు, క్రమేపి నశిస్తూ ఉండటం. దేహము చనిపోయిన తరువాత శ్మశానంలో భస్మీభూతమై, కనిపించకుండా పోతుంది ***(అదర్శనం గతః నష్టః ఉచ్యతే).*** ఇదొక విధమైన నాశము. అలా కాకుండా, దేహము కనిపిస్తూనే ఉంటుంది. కాని, వ్యాధుల వల్ల చిక్కి శల్యమౌతూ, నశిస్తూ ఉంటుంది. ఇది మరొక విధమైన నాశము. ఈ రెండు విధాలైన వినాశాలు దేహికి లేవు అని చెప్పడానికే, నిత్యుడు, అవినాశి అనే రెండు విశేషణాలను ప్రయోగించాడు గీతాచార్యుడు.

ఒకవేళ ఈ రెండు విశేషణాలను కనుక ప్రయోగించకుండా ఉన్నట్లైతే, ప్రపంచము మార్పు చెందుతూ ఉన్నా ప్రళయం వరకు నిత్యం గానే ఉన్నట్లు, దేహి కూడా పరివర్తన చెందుతూ వ్యావహారికంగా తెలిసే ప్రవాహ నిత్యత్వం కలవాడుగా తెలుస్తాడు. ఈ కారణం చేత, నిత్యుడు, అవినాశి అనే రెండు విశేషణాలు చెప్పవలసి వచ్చింది.

అలా, నిత్యుడు, అవినాశి, అప్రమేయుడు అయిన దేహి యొక్క దేహములు అంతమై పోతాయి అంటున్నాడు అచ్యుతుడు.

**దేహము - సందేహము**

సద్రూపమైన దేహి నిత్యుడు. అసద్రూపమైన దేహాలు అనిత్యాలు. అంతవంతాలు. అంతమయ్యే స్వభావం కలవి అంతవంతాలు. అవే శరీరాలు. శరీరాలలో చరించే వాడు శరీరి. అనేక గృహాలలో మానవుడు నివసించి నట్లు, అనేక దేహాలలో దేహి వసిస్తూ ఉంటాడు. అందుచేత శరీరాలకు దేహములు ***( దేహాః )*** అని బహువచనము ప్రయోగించి, దేహికి శరీరి ***( శరీరిణః )*** అని ఏకవచన ప్రయోగం చేశాడు. దేహములు అనేకములైనా దేహి ఒక్కడే అని గ్రహించాలి.

దేహం ఉంది. దేహంలో దేహి ఉన్నాడు. దేహి వల్లనే దేహం ఉంది. దేహం లేకపోయినా దేహి ఉంటాడు.

అందుచేత, దేహము అనిత్యము. అసత్తు. దేహి నిత్యము. సత్తు. దేహి అవినాశి. దేహము నాశము కలది. కనుక దేహం నశిస్తుంది. ఆత్మ నశించదు.

దేహం ఒకటి ఉంది అంటాము. ఒకటిగా దేహం ఎక్కడుంది? అని ప్రశ్నిస్తే సమాధానం దొరకదు. దేహంలో ఎన్నో కలసి ఉన్నాయి. దేహంలో రక్తం ఉంది. మాంసం ఉంది. చర్మము ఉంది. మజ్జ ఉంది. ఎముకలు ఉన్నాయి. కేశములు ఉన్నాయి. ఎన్నో ఉన్నాయి. ఎన్నెన్నో ఉన్నాయి. ఇవన్నీ కలిస్తేనే దేహం. దేహం అనేది ప్రత్యేకంగా లేదు **(నైకః న ఏకః)**.

కలసినవి ఏవైనా విడి పోతాయి. యంత్రానికి మఱలు ఊడినట్లు, దేహంలో కీళ్ళు సడలి పోతాయి. ఊడి పోతాయి. మాంసం మెత్త బడుతుంది. క్రొవ్వు కరిగి పోతుంది. చర్మం ముడతలతో మడత పడుతుంది. రక్తం ఇంకి పోతుంది. కలసిన వన్నీ విడి పోతాయి. దేహం నశిస్తుంది. అంత మవుతుంది. ఏ దేహమైనా అంత మయ్యేదే. అందుకనే, దేహాలు అంతవంతాలు.

దేహాలు అంత మవుతా యని ఎవరికి తెలియదు? అర్జునుడికి తెలియదా? అందరికీ తెలుసు. అర్జునుడికి తెలియకుండా ఎలా ఉంటుంది? మరి, అంత సామాన్యమైన విషయాన్ని చెప్పడానికి గీతాచార్యుడు అవసరమా? దేహాలు అంతమౌతా యని అర్జునుడికి తెలుసు. అలా అర్జునుడికి తెలుసు అన్న విషయం బాగా తెలిసిన వాడు కూడా శ్రీకృష్ణు డొక్కడే. దేహాలు పోతున్నా యనే కదా అర్జునుడు పని గట్టుకొని ఏడుస్తున్నాడు! పార్థుని విలాపానికి ప్రత్యక్ష సాక్షి పార్థసారథి కాదా? అర్జునుడు ఎంత బాగా ఏడవ గలడో, కుంతీదేవి కన్నా, సుభద్ర కన్నా బాగా తెలిసిన వాడు శ్రీకృష్ణు డొక్కడే. అలాంటప్పుడు దేహాలు నశిస్తాయని అర్జునుడికి ఎందుకు చెబుతున్నాడు?

దేహాలు అంతవంతాలని, నేడున్నా ఒకనాడు లేకుండా పోతాయని శ్రీకృష్ణుడికి తెలుసు. అర్జునుడికీ తెలుసు. మనకూ తెలుసు. కాకపోతే, దేహాలు ఉన్నప్పుడు కూడా లేనివే అనే సత్యం శ్రీకృష్ణుడి కొక్కడికే తెలుసు. అర్జునుడికి తెలియదు. మనకూ తెలియదు.

దేహాలు అసత్తులు. రజ్జువులో సర్పం లాగా ఉన్నప్పుడు కూడా లేనివే. దేహాలు ఉన్నట్లు తెలుస్తూ ఉంటాయి. విశ్లేషించి వివేకంతో అర్థం చేసుకుంటే, అవి ఉన్నా లేనట్లే ఉంటాయి. ఎండమావులలో నీళ్ళు ఉన్నట్లే, ప్రపంచంలో దేహాలు ఉన్నాయి. ప్రమాణాలతో పరిశీలించి తెలుసుకోగానే, ఎండమావి కనిపిస్తున్నా నీళ్ళు లేనివే అని గ్రహించినట్లు, సదసద్వివేకంతో చూచి నపుడు దేహాలు ఉన్నా లేనివే అవుతున్నాయి అని శ్రీశంకరభాష్యము.

అంతవంతాలు అంటే కేవలం శ్మశానంలో నశిస్తున్నాయి అని కాదు. మిథ్యాభూతాలైన దేహాలు సత్యావగాహనలో అంతమౌతున్నాయి అని అర్థము.

స్వప్నంలో గోచరించిన రూపాలు స్వప్నం తరువాతే కాదు లేకుండా పోయేది, స్వప్న కాలంలో కూడా అవి లేనివే. స్వప్న దేహాలు ఎలా మేలుకోగానే అంతవంతాలో, జాగ్రత్ప్రపంచంలో చలించే దేహాలు కూడా జ్ఞానం కలిగితే స్వప్నం లోని మాయా దేహాల లాగా అంతవంతాలే **( ఇమే దేహాః స్వప్న మాయా దేహాదివత్ అన్తవన్తః )**.

**పార్థా! పోరాడు!**

ఎలా చంపేది? అంటూ అర్జునుడు దుఃఖించాడు. చచ్చేందుకు ఎవరున్నారు? అన్నంత వరకు బండిని నడిపాడు భగవంతుడు. చావని దానిని ఎవ్వరూ చంపలేరు. చచ్చే దానినే ఎవరైనా చంప గలరు. చచ్చే దెవరు? దేహాలు. దేహాలు సత్తా, అసత్తా? అసత్తే నని తేలి పోయింది. ఇక దుఃఖ మెందుకు? యుద్ధం చెయ్యొచ్చు. అర్జునా! లే! పోరాడు! అన్నాడు శ్రీకృష్ణుడు.





శ్రీకృష్ణుడు అర్జునుణ్ణి యుద్ధానికి ప్రోత్సహించాడు, **హింస చేయమన్నాడు, చేయించాడు అంటూ కొందరు అసందర్భ, అప్రయోజక ప్రసంగాలు చేస్తూ ఉంటారు.** *భారత! యుద్ధ్యస్వ* - పార్థా! పోరాడు అంటూ కురుక్షేత్రంలో అర్జునుణ్ణి యుద్ధానికి పురికొల్పాడు అనేది వారి అభియోగము.

ఇక్కడ ఒక్క విషయాన్ని జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి. లేకపోతే, ఇలాంటి పుచ్చిపోయిన అభియోగాల వాక్య బీజాల తోనే జ్ఞానపంటను పాడు చేసుకో వలసి వస్తుంది. పార్థా! యుద్ధం చెయ్యి! అని శ్రీకృష్ణుడు పలికిన వాక్యం విధివాక్యం కాదు. అనువాద వాక్యం. నువ్వు యుద్ధం చెయ్యాలి అని శ్రీకృష్ణుడు యుద్ధకర్మకు శ్రీకారం చుట్టలేదు. అర్జునుడు యుద్ధం చేయాలని నిర్ణయించుకొనే కురుక్షేత్రానికి వచ్చాడు. లేకపోతే, ఆయనకు అక్కడ ఏమి పని? వచ్చిన పనిని మరచి అచ్చి రాని మాటలన్నీ మాట్లాడు తున్నాడు. మరచిన విషయాన్ని శ్రీకృష్ణుడు జ్ఞాపకం చేశాడు. అంతే.

అర్జునుడికి యుద్ధ ఆలోచనే లేనపుడు, శ్రీకృష్ణుడే ప్రేరేపించి యుద్ధం చెయ్యమంటే, అది విధివాక్యం అవుతుంది. మొదట తానే యుద్ధానికి సిద్ధపడి వచ్చాడు. తనకు యుద్ధంలో సహాయం చేయ వలసిందిగా శ్రీకృష్ణుని ప్రార్థించి మరీ వెంట తెచ్చు కున్నాడు. అలాంటప్పుడు శ్రీకృష్ణుడు యుద్ధానికి కారకుడెలా అవుతాడు? శ్రీకృష్ణునికి యుద్ధాసక్తి లేదు. ఆయనకు ఉండేది ధర్మాసక్తి మాత్రమే. యుద్ధానికి వచ్చిన అర్జునుడు మోహానికి లోనై, ధర్మం విషయంలో నా మనస్సు సంశయాలతో ఉంది **(ధర్మ సమ్మూఢ చేతాః)**, నాకు ఏది మేలో నిశ్చయముగా చెప్పు, నన్ను శాసించు అని ప్రార్థిస్తే, శ్రీకృష్ణుడు అర్జునుడు క్షత్రియుడు కనుక ధర్మయుద్ధము క్షత్రియధర్మము అని చెప్పాడు. అంతేగాని, యుద్ధానికి అర్జునుణ్ణి ప్రేరేపించ లేదు. హింసకు కారకుడూ కాలేదు.

'యుద్ధం చెయ్యొచ్చు అనేది శ్రీకృష్ణుని ఉపదేశము. అదే జరిగి, భీష్మాదులు మరణిస్తే వాళ్లను తాను చంపిన వాడు అవుతాడు. ఒకవేళ భీష్మాదులు గెలిస్తే తాను గతించిన వాడు అవుతాడు. ఇది ఎలా?' అనే సందేహం అర్జునుని మనస్సులో ఉందని ఊహించిన భగవానుడు, ఈ సమస్య అనాదిగా జీవుల్ని పీడిస్తూ ఉన్నదే గాని, అర్జునునితో పుట్టింది కాదని, అలాగే దీనికి పరిష్కారం కూడా వేదాలు అందించే ఉన్నాయని తెలుపుతూ, కృష్ణ యజుర్వేదము లోని కఠోపనిషత్ నుండి రెండు మంత్రాలను ఎన్నుకొని ఈ సందర్భంలో ఉదహరించాడు. అవే పందొమ్మిది, ఇరవైయవ శ్లోకాలు.

**య ఏనం వేత్తి హన్తారం యశ్చైనం మన్యతే హతమ్ ।**
**ఉభౌ తౌ న విజానీతో నాయం హన్తి న హన్యతే ॥** 19

**యః ఏనం-వేత్తి-హంతారం-యః-చ-ఏనం-మన్యతే-హతం**
**ఉభౌ-తౌ-న-విజానీతః-న-అయం-హంతి-న-హన్యతే**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యః | = | ఎవ్వడు | మన్యతే | = | భావిస్తాడో |
| ఏనం | = | ఈ ఆత్మను | తౌ ఉభౌ | = | ఆ ఇద్దరు కూడా |
| హంతారం | = | చంపేదిగా | న విజానీతః | = | తెలిసిన వారు కారు |
| వేత్తి | = | తెలుసుకుంటాడో | అయం | = | ఈ ఆత్మ |
| యః చ | = | ఎవడు | న హన్తి | = | చంపదు |
| ఏనం | = | ఈ ఆత్మను | న హన్యతే | = | చంప బడదు |
| హతం | = | చచ్చేదిగా | | | |



1-15

**దేహధారి యైన జీవుడు చంపే వాడని భావించే వాడికి సత్యం తెలియదు. అలాగే జీవుడు చంపబడే వాడు అని భావించే వాడికి కూడా యథార్థం తెలియదు. దేహి చంపేవాడూ కాదు; చంపబడే వాడూ కాదు.**

**వ్యాఖ్య**

మనిషికి ఆలోచించే మనసు ఉంది. మనసు ఉంది కనుక ఏవేవో ఆలోచిస్తూ ఉంటాడు. మనిషి మనస్సులో జరిగే ఆలోచన లన్నీ వాస్తవాలు కానవసరం లేదు. పొరపాటున ఒక మనిషి అభిప్రాయం సత్యమని మనం నమ్మితే, రేపు అదే వ్యక్తి మన వద్దకు వచ్చి నా అభిప్రాయం అది కాదు అంటే ఆశ్చర్యపడ నవసరం లేదు. మనస్సులు అలాగే ఉంటాయి. ఆలోచనలు అలాగే సాగుతాయి.

అతడు వధించాడు. ఇతడు వధింపబడ్డాడు అని మాట్లాడుతూ ఉంటాము. ఈ వాక్యాలు సత్య మేనా? అనే ప్రశ్న ఎవ్వరము, ఎప్పుడు వేసుకోము. పైగా ఇలాంటి మాటలు పలకడానికి మనం శాస్త్రాలను అధ్యయనం చెయ్యలేదు. ఈ లోకం లోనే నేర్చుకున్నాం. ఈ మాటలకు ప్రపంచమే ప్రమాణము. అందువల్ల ప్రపంచంలో మనం ఏరుకున్న విషయాలు, వాటిని పట్టుకొని అల్లుకున్న భావాలు సత్యాలు కావచ్చు, కాకపోవచ్చు. అవి సత్యాలా, కాదా! అవి నిర్ణయించడానికి మనం ప్రపంచం వద్దకు వెళ్తే లాభం లేదు. శాస్త్రం వద్దకు రావాలి. జ్ఞానమును శాస్త్రము నుండే పొందాలి. అందుకే శాస్త్రము ప్రమాణమైంది. 'ప్రమ' అంటే జ్ఞానము. జ్ఞానమును అందించేది కనుక శాస్త్రము ప్రమాణము ***(ప్రమాకరణం ప్రమాణం)***. అట్టి శాస్త్రము అపౌరుషేయమైన వేదమే కాని మరొకటి కాదు. మానవుల ఊహలు, ఊహాజనిత మతాలు ఎన్నడూ ప్రమాణం కాలేవు. అందుచేతనే ఈ సందర్భంలో సాక్షాత్తు భగవంతుడైన శ్రీకృష్ణుడు కూడా వేదాన్నే ఉటంకించాడు.

ప్రస్తుతం మనం అధ్యయనం చేస్తున్న శ్లోకము, ఆ తరువాత శ్లోకము కఠోపనిషత్తులో ఉన్నాయి. వాటిని యథాతథంగా ఈ సందర్భంలో హారములో మణులు పొదిగినట్లు అమర్చాడు అచ్యుతుడు.

ఉపదేశానికి మాటలు అరువు తెచ్చుకో వలసిన అవసరం గీతాచార్యునికి లేదు. జ్ఞాన కరువు తెలియని విజ్ఞాన కల్పతరువు శ్రీకృష్ణుడు. ఉపనిష న్మంత్రాలను ఉటంకించి గీతా భవనానికి నూతన సొగసుల్ని దిద్ద వలసిన అగత్యం సర్వజ్ఞుడైన శ్యామసుందరునికి లేదు. ఒక విధంగా చెప్పాలంటే, ఉపనిషత్తులే ఆ దివ్యాత్ముని వైభవాన్ని వర్ణించలేక మూగబోయాయి ***(యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ - తైత్తిరీయ శ్రుతి)***. మనస్సులు మూగబోయేది, వాక్కులు విహ్వలత చెందేది వాసుదేవ చైతన్యాన్ని వర్ణించే సందర్భం లోనే అనేది మనం విస్మరించ కూడని విషయమే కాదు, స్మరించ దగిన వైభవము కూడా. వేదాలు వర్ణించ లేక మూగబోయాయి కనుకనే తానే ప్రేమతో స్వాత్మానంద సాగరము నుండి ఒక అలను పైకి లేపి, ఆ అద్భుతాన్ని అసమానంగా వర్ణించి, దాని అప్రమేయ వైభవాన్ని అమోఘంగా ఆవిష్కరించాడు.

***వేదైశ్చ సర్వైః అహమేవ వేద్యః***
***వేదాన్త కృత్ వేదవిదేహ చాహమ్ ॥***

అర్జునా! సమస్త వేదముల చేత తెలియ దగిన దివ్యత్వము నేనే. నేను పండించిన పంటే వేదాంతము. వేదమును తెలిసిన వాణ్ణి కూడా నేనే, అని గీత - పదిహేనవ అధ్యాయం - పదిహేనవ శ్లోకంలో వివరించాడు.

అలాంటి భగవానుడు ఈ రెండు శ్లోకాలను కఠోపనిషత్తు నుండి ఎందుకు సంగ్రహించాడు? (1)సంప్రదాయాన్ని రక్షించడానికి. (2) ఆదర్శాన్ని చూపడానికి. (3) వైభవాన్ని గుర్తించి, గౌరవించడం ఎలాగో ప్రపంచానికి చాటి చెప్పడానికి.





వేదము ప్రమాణము. వేదాలను శ్రుతులు అంటారు. శ్రుతి ప్రతిపాదిత విషయాన్ని మహాత్ములు తమదైన శైలిలో వివరించి, వ్యాఖ్యానాలు అందించ వచ్చు. వాటిని శ్రుతులు అనరు. స్మృతులు అంటారు.

స్మృతులు ఏవైనా, ఎవరు చెప్పినా, అవి శ్రుతులను అనుసరించే ఉండాలి. శ్రుతులకు భిన్న మైన స్మృతులను ఆర్షసంస్కృతి అంగీకరించదు. ఇది సంప్రదాయం. సంప్రదాయ రక్షణే జాతికి శ్రీరామరక్ష.

పవిత్రమైన ఋషి సంప్రదాయాన్ని రక్షించే ప్రయత్నంలో గీతాచార్యుడు ఉపనిషత్తుల నుండి మంత్రాలను గ్రహించి, గీతలో పొందు పరచాడు. తాను బోధించేది శ్రుతులకు భిన్నం కాదని లోకానికి సందేశా న్నిచ్చాడు. అందరూ అలాగే ప్రవర్తించాలని శ్రేష్ఠుడుగా ఆదర్శాన్ని అందించాడు. జ్ఞాన భాండాగారాలు, ఈశ్వర ప్రసాదాలైన వేదాలను విడిచి, బుద్ధితో బోధలు చేసే అస్తవ్యస్త ధోరణి నేల విడిచి సాము చేయడం లాంటి దని స్పష్టం చేశాడు. తాను ఆదర్శాన్ని ఆచరించి చూపాడు. అదే శ్రీకృష్ణుని వైభవం.

***ఋషిభి ర్బహుధా గీతం ఛన్దోభి ర్వివిధైః పృథక్***
***బ్రహ్మసూత్ర పదైశ్చైవ హేతు మద్భి ర్వినిశ్చితైః ॥***

అర్జునా! ఈ విషయం ఋషుల చేత అనేక విధాలుగా చెప్ప బడింది. వేదాలలో సహేతుకంగా వివిధ శాస్త్ర నిర్ణయాలచే గానం చేయబడింది. బ్రహ్మమును తెలిపే సూత్రాల చేత కూడా దివ్యంగా ప్రబోధించ బడింది అని భగవద్గీత - పదమూడవ అధ్యాయంలో దివ్యంగా ప్రవచించాడు. 'ఇది నా అంతరాత్మ చెప్పింది' అంటూ, అర్థరహిత ప్రసంగాలు చేసే అప్రయోజకుల నోళ్ళు మళ్ళీ తెరవకుండా భగవానుడు కట్టేశాడు.

ప్రస్తుతం మనం రెండవ అధ్యాయం - పందొమ్మిదవ శ్లోకాన్ని చర్చించ బోతున్నాం. ఈ శ్లోకం కఠోపనిషత్తులో కూడా ద్వితీయ వల్లిలో - పందొమ్మిదవ మంత్రమే. అది కాకతాళీయ న్యాయమని మీరు అనుకుంటే తప్పు లేదు. నేను మాత్రం అలా అనుకోవడం లేదు. వ్యాసుని వైచిత్ర్యాలు అలాగే ఉంటాయి అని నా అభిప్రాయం.

అర్జునా! ఆత్మ చంపు తుందని కొందరు, చస్తుందని కొందరు భావిస్తూ ఉంటారు. వీరిద్దరూ వాస్తవం తెలియని వారే. ఆత్మ చంపదు, చంప బడదు అంటున్నాడు భగవానుడు.

**కర్త కాదు - కర్మ కాదు**

నేను చంప బడతాను, నేను చంపుతాను అనే మాటలు మనం వింటూ ఉంటాము. నేను చంపేవాణ్ణి ***(హన్తాఽహం)***. నేను చంపబడే వాణ్ణి ***(హతోఽస్మ్యహం)*** అని అంటూ ఉంటారు. ఇంతకీ చచ్చే దెవరు? చంపే దెవరు?

దేహి స్వరూప చైతన్యము, నిత్యుడు, అవినాశి, అప్రమేయుడు అని ఇప్పటికే గ్రహించాము. అలాంటి దేహి ఎలా చంపుతాడు? చచ్చేది దేహము కనుక చావడము దేహ ధర్మము. చంపినాను అనేది బుద్ధి. కనుక అది అంతఃకరణ ధర్మము. ఈ రెండూ అసత్తులే. అనాత్మలైన దేహ మనోధర్మాలను ఆత్మ యందు ఆరోపించడం చేత ఆత్మ చంపుతుందని, చస్తుందని భ్రమ చెందుతూ అవివేకులు పలవరిస్తూ ఉంటారు.

చంపుట అనే క్రియ ***(హనన క్రియ)*** ఎవరికి సంబంధించింది? ఆత్మ ఎలా చంపుతుంది? ఆత్మకు చేతు లున్నాయా చంపడానికి? కంఠ ముందా పిసికితే చావడానికి? ఆత్మ అవయవాలు లేనిది కనుక, ***(నిరవయవత్వాత్)*** ఎలా చంపుతుంది? ఎలా చస్తుంది?

చంపేది బుద్ధి ధర్మము. చచ్చేది దేహ ధర్మము. చచ్చినా, చంపినా, ఈ రెండూ ఉండాలి. ఈ రెండు లేని చోట చావడమూ ఉండదు. చంపడమూ జరగదు.

చంపడము, చావడము అనే ఈ కర్తృకర్మలు జాగ్ర త్స్వప్నా ల్లోనే జరుగుతాయి. ఎందుకో తెలుసా? దేహము, బుద్ధి ఈ రెండు అవస్థల లోనే ఉన్నాయి. గాఢనిద్రలో ఇప్పటి వరకు కర్తృకర్మలు జరిగినట్లు దాఖలాలు లేవు. ఎందుకో తెలుసా? అక్కడ దేహమూ లేదు. బుద్ధీ లేదు.

అర్జునా! అర్థమైందా! ఇదంతా ఆరోపమే గాని స్వరూపం కాదు. దేహ ధర్మాన్ని ఆత్మ యందు ఆరోపించి ఒకడు చచ్చాను అంటాడు. బుద్ధి ధర్మాన్ని ఆత్మ యందు ఆరోపించి మరొకడు చంపినాను అంటాడు. తాను ఆత్మ అని తెలుసుకుంటే, తాను చచ్చేవాడు కాడని, చంపే వాడూ కాడని గ్రహిస్తాడు. ఆత్మ ఏ కర్మకు కర్త కాలేదు. ప్రపంచంలో ఏ కర్త ఏది ఆచరించినా, ఆత్మ కర్మ కాలేదు.

పార్థా! నువ్వు ఎవరో ఇప్పుడు చెప్పు? నువ్వు ఆత్మవే. కనుక చంపేవాడివి కావు. అదలా ఉంచు. భీష్ముడు ఎవరో చెప్పు? అతడూ ఆత్మే. కనుక అతనూ చచ్చేవాడు కాడు. భీష్మద్రోణాదుల్ని ఎలా చంపేది? అవి ఇంతకు ముందు నువ్వు పలికిన మాటకు అర్థముందా? ఆలోచించు అన్నాడు అచ్యుతుడు.

ఇదొక అద్భుతమైన శ్లోకం. ఎందరినో ప్రభావితం చేసింది. ఎందరో జీవితాలలో దీపం వెలిగించింది. వికారాల నుండి విడి పడి, వివేకంతో విలక్షణంగా జీవించ డానికి ఎందరికో స్ఫూర్తి నిచ్చింది. ముఖ్యంగా పాశ్చాత్యుల్ని కూడా ఎంతగానో ప్రభావితం చేసింది.

అమెరికా తత్త్వవేత్త ఎమర్సన్‌ను ఈ శ్లోకం ఎంతగానో చలింప చేసింది. ఇంగ్లండు దేశానికి చెందిన గొప్ప విశ్లేషకుడు, విమర్శకుడు, రచయిత అయిన కార్లైల్ ఆంగ్లం లోకి అనువదించ బడిన భగవద్గీతను ఎమర్సన్‌కు కానుకగా ఇచ్చాడు. అది చదివిన తరువాత ఎమర్సన్‌లో గొప్ప పరివర్తన చోటు చేసుకుంది. గీతను అధ్యయనం చేసిన తరువాత తన ఆలోచనా విధానం లోనే గొప్ప మార్పు వచ్చినట్లు తానే స్వయంగా వ్రాసు కున్నాడు.

***నాయం హన్తి న హన్యతే*** అనే వాక్యం అతనిపై అష్టాక్షరీ మంత్రం లాగా పని చేసింది. ఎమర్సన్ సాహిత్యం చదివిన వారు ఆయన రచించిన **బ్రహ్మ** (Brahma) అనే గ్రంథాన్ని మరచిపోలేరు.

*వికారాలు తెలియనిది కనుక ఆత్మ చంపదు. చంప బడదు. ఆత్మకు వికారాలు ఎలా లేవో, తరువాత శ్లోకం వివరిస్తూ ఉంది.*

**న జాయతే మ్రియతే వా కదాచి న్నాయం భూత్వా భవితా వా న భూయః ।**
**అజో నిత్యః శాశ్వతోఽయం పురాణో న హన్యతే హన్యమానే శరీరే ॥** 20

***న-జాయతే-మ్రియతే-వా-కదాచిత్-అయం-భూత్వా-భవితా-వా-న-భూయః***
***అజః-నిత్యః-శాశ్వతః-అయం-పురాణః న-హన్యతే-హన్యమానే-శరీరే***

| | | |
|---|---|---|
| అయం | = | ఈ ఆత్మ |
| కదాచిత్ | = | ఎప్పుడును |
| న జాయతే | = | పుట్టనిది |
| న మ్రియతే వా | = | చచ్చేది కాదు |
| న భూత్వా | = | లేకనే |
| భూయః | = | మరల |
| భవితా వా న | = | ఏర్పడుట లేదు |
| అయం | = | ఈ ఆత్మ |

| | | |
|---|---|---|
| అజః | = | పుట్టుక లేనిది |
| నిత్యః | = | స్థిరమైనది |
| శాశ్వతః | = | నిత్యమైనది |
| పురాణః | = | అనాది యైనది |
| శరీరే | = | శరీరము |
| హన్యమానే | = | చస్తూ ఉన్నా |
| న హన్యతే | = | చంపబడదు |





**ఆత్మ ఎన్నడూ పుట్టదు. కనుక మరణించదు. కొంతకాలం ఉండి ఆ తరువాత లేకుండా పోయేది కాదు. కొంత కాలం లేకుండా ఉండి ఆ తరువాత ఉండేది కూడా కాదు. ఆత్మ పుట్టుక లేనిది. నిత్య మైనది. తరిగేది కాదు. పురాతన మైనది. దేహము క్షీణిస్తున్నా ఆత్మ నశించదు.**

**వ్యాఖ్య**

ఆత్మ చంపేది కాదు. చచ్చేది కాదు. తాను చంపదు, తాను చావదు అని గడచిన శ్లోకంలో గ్రహించాము. మరి, పుడుతుందా? పుట్టి చావకుండా ఉంటుందా? అంటే మార్పు చెందదా? మరి, మనం చూచే మార్పు లన్నీ ఏమిటి? దేనికి సంబంధించినవి? ఇలా అనేక ప్రశ్నలు ఈ సందర్భంలో పుట్టు కొస్తాయి. వాటన్నిటికి సమాధానాలు ఈ శ్లోకంలో లభిస్తాయి.

**పుట్టదు - చావదు**

పుట్టడం అంటే, అంతవరకు లేనిది రావడం, క్రొత్తగా కనిపించడం అని అర్థము. చావడం అంటే, అంతవరకు ఉన్నది లేకుండా పోవడము అని అర్థము. లేకుండా వచ్చేది జన్మము. ఉండి పోయేది మరణము. ఈ రెండు ఆత్మకు లేవు అని తెలుపుతూ ఈ శ్లోకంలో ***న జాయతే, న మ్రియతే*** అనే రెండు వాక్యాలను ప్రవేశ పెట్టాడు గీతాచార్యుడు.

ఆత్మ పుట్టదు. పుట్టేది కాదు. ఉత్పత్తి లేదు. పుట్టడం అనే లక్షణము ఆత్మకు లేదు. జనన రూప వికారము లేదు ***( జని లక్షణా వస్తు విక్రియా న ఆత్మనః విద్యతే )***. లేనిది కలిగితే జన్మము. ఆత్మ అలా పుట్టాలి అంటే ఆత్మ లేని కాలమంటూ ఒకటి ఉండాలి.

కాలము అనేది సాపేక్షిక సత్యము. కాలము తన మనుగడకు ఆత్మపై ఆధారపడి ఉంది. ఆధారపడి ఉంది కనుక కాలము అసత్. అసద్రూపమైన కాలం ఆత్మపై ఆధారపడి దొర్లుతూ ఉంది. కాలం ఉంది అంటే, ఆత్మ ఉంది అని అర్థం. కాలం లేకపోయినా ఆత్మ ఉంటుంది.

గాఢనిద్రలో కాలం ఎవరికి తెలిసింది? తెలిసి ఉంటే, తెలిసే అవకాశమే ఉంటే, నిద్ర లేవగానే కాల మెంత? అని ఎందుకు అడుగుతాము? ఇంతసేపు నిద్ర పోయానా! అని ఎందుకు ఆశ్చర్య పోతారు? గాఢనిద్రలో కాలం లేదు. ఆత్మ ఉంది. ఉంది కనుకనే, నిద్ర లేస్తున్నాం. ఆత్మ లేని కాలమే లేనందున ఆత్మ కాలంలో ఆవిర్భవించదు.

పుట్టడం ఉంటేనే గిట్టడం. జననం ఉంటేనే మరణం. ఆత్మ జన్మించ లేదు. కనుక ఆత్మ మరణించదు. అంటే వినాశమును పొందదు. లోకంలో మరణించేవి ఎలా లేకుండా పోతున్నాయో, అటువంటి వినాశ రూప మైన మార్పు ఆత్మకు లేదు ***( న మ్రియతే చ ఇతి అన్యా వినాశ లక్షణా విక్రియా ప్రతిషిధ్యతే )***. ఆత్మ లేకుండా వచ్చింది కాదు కనుక లేకుండా పోయేది కాదు.

మరణము అంటే మార్పే కదా! వికారమే కదా! ఆత్మకు ఎలాంటి వికారమూ లేదు. అది అవికార్యం. మార్పు, లేదా వికారం జరగాలి అంటే కర్తృ కర్మ అపేక్ష అనివార్యం. కర్త ఉండాలి. కర్మ జరగాలి. అప్పుడే మార్పు జరుగుతుంది. ఆత్మ విషయంలో అలాంటి వాటికి అవకాశం లేదు.

నేను గీతా వ్యాఖ్యానము వ్రాస్తున్నాను. ఇది కర్మ. ఈ కర్మలో మార్పు అనివార్యం కదా! నేను వ్రాస్తున్నాను. దానికి ముందు వ్రాయాలి అనే ఆలోచన ఉంది. ఆ తరువాత ఒక ఆలోచన తరువాత మరొక ఆలోచన తోసుకుంటూ వచ్చాయి. అలాగే పోయాయి. ఇదే మార్పు.

ఏమి వ్రాయాలి? ఎలా వ్రాయాలి? ఎప్పుడు వ్రాయాలి? వ్రాతకు కావలసిన వన్నీ ఉన్నాయా? లేక తెచ్చుకోవాలా? ఎక్కడ నుండి తెచ్చుకోవాలి? ఇదంతా ఆలోచించేది ఎవరు? నేనే. ఇప్పుడు నే నెవరు? కర్త. కర్తలో మార్పులు ఉన్నాయా, లేవా? వ్రాయాలి అనుకు న్నప్పుడు నేను ఆలోచించే వాణ్ణి ***(మన్తా)***. వ్రాతకు కావలసినవి ఆశించి నపుడు నేను కోరుకొనే వాణ్ణి ***(కామీ)***. వ్రాయాలని కూర్చున్నా, వ్రాసే అవకాశం లేనపుడు, ప్రతిబంధకాలు తలెత్తి వ్రాతలో వేగం సన్నగిల్లి నపుడు నేను బాధపడే వాణ్ణి ***(భోక్తా)***. ఇవన్నీ కర్తలో వికారాలే కదూ! ఇలాంటి వికారాలు ఆత్మకు ఉన్నాయా? లేవు. అందుచేత ఆత్మ కర్త కాదు. కర్త కాదు కనుక కర్మ లేదు. కర్తృకర్మ అపేక్ష లేదు కనుక వికారం లేదు. వినాశం ఉండదు.

**వికార ద్వయం నాస్తి**

లేనిది కలగడం ఒక వికారం. ఉన్నది లేకుండా పోవడం మరొక వికారం. మొదటిది జన్మ. రెండవది మృత్యువు.

లేనిది ఏది వచ్చినా అది ఒకనాడు లేకుండానే పోతుంది. కుండ లేకుండానే వచ్చింది. లేని కుండ వచ్చింది కనుక అది ఒకనాడు పగిలి లేకుండానే పోతుంది. ఇదొక వికారము.

లేనిది వచ్చి లేకుండా పోవడము ఒక వికారమైతే, ఒక రూపంలో ఉన్నది మరొక రూపంగా మారి, ఆ తరువాత లేకుండా పోవడము మరొక వికారము. మొదటి వికారానికి కుండను దృష్టాంతంగా చెప్పుకున్నాం. రెండవ వికారానికి పక్షి గ్రుడ్డును తీసుకుంటే సరిపోతుంది.

పక్షి గ్రుడ్డు పెడుతుంది. ఇది పుట్టడం. కొంత కాలానికి గ్రుడ్డు నుండి పక్షిపిల్ల పుడుతుంది. ఈ విధంగా గ్రుడ్డుగా పుట్టి, గ్రుడ్డుగా ఉండి పిల్లగా మారిన పక్షి భవిష్యత్తులో మరణించి లేకుండా పోతుంది. ఈ విధంగా లేకుండా ఉండినది, మళ్ళీ కలగటం కూడా ఉండదు ***(నాయం భూత్వా భవితా వా న భూయః)***.

***న జాయతే మ్రియతే వా కదాచిత్***
***నాయం భూత్వా భవితా వా న భూయః ॥***

శ్లోకంలో ఇంత వరకు చెప్పుకున్న దానిలో ***'కదాచిత్'*** అనే ఒక్క పదాన్ని వివరించాల్సి ఉంది. 'కదాచిత్' అంటే, ఎప్పుడును లేదా ఒకప్పుడును అని అర్థం. కనుక ఈ 'కదాచిత్' అనే పదం వికారము లన్నిటికీ సంబంధించి ఉంటుంది ***(కదాచిచ్ఛబ్దః సర్వ విక్రియా ప్రతిషేధైః సంబధ్యతే)***. ఎలాగంటే, ఒకప్పుడు పుట్టింది కాదు. ఒకప్పుడు చచ్చింది కాదు. ఎప్పుడునూ మారేది కాదు. ఇలా ప్రతి మార్పు లోను ఒకప్పుడును, ఎప్పుడును అంటూ 'కదాచిత్' శబ్దము కలసి పోతుంది. కలసి ఉంటుంది ***(న కదాచిత్ జాయతే, న కదాచిత్ మ్రియతే ఇత్యేవం)***. ఈ పదంలో మరొక అందమైన అవగాహనకు తెర లేస్తుంది.

**అది లేనిది - ఇది కానిది**

**ఏదీ కాలేదు**

పుట్టడం అనే వికారము లేనిది, మరణం అనే వికారానికి లోను కానిది, మధ్యలో వచ్చే వికారాలు ఏవీ అంటనిది ఆత్మ. అవికార్య సత్తా స్వరూపము. పుట్టింది ఏదైనా గిట్టి తీరుతుంది. ఈ జనన మరణాలతో పాటు మరి కొన్ని వికారాలను పొందుతూ ఉంటుంది.

దేహమే తీసుకుందాం. దేహం పుట్టింది. పుట్టిన దేహం మరణిస్తుంది. ఈ లోగా అనేక వికారాలకు లోనవుతుంది. ఆ వికారాలు ఆరు విధాలుగా ఉంటాయి. వాటినే షడ్భావ వికారాలు అంటారు.





అవి (1) ***జాయతే***- పుట్టుట (2) ***అస్తి***- ఉండుట (3) ***వర్ధతే***- పెరుగుట (4) ***విపరిణమతే***- మార్పు చెందుట (5) ***అపక్షీయతే***- క్షీణించుట (6) ***వినశ్యతి*** - నశించుట. ఈ ఆరు వికారాలను షడ్వికారములు అంటారు. ఇలా షడ్వికారాలు పొందేది ఏదయినా నశించి పోతుంది. ఆత్మకు ఈ ఆరు వికారాలు లేవు. కనుక ఆత్మ నశించదు. పుట్టిన దానికే వికారాలు ఉంటాయి. ఆత్మ పుట్ట లేదు.

ఆత్మ ఆరు వికారాలు లేకుండా ఎలా నిత్యమై, సత్యమై ఉందో గీతాచార్యుడు దివ్యంగా బోధిస్తున్నాడు. వికార లక్షణాలు లేవని చెప్పే ప్రక్రియలో భాగంగా ఆత్మ యొక్క లక్షణాలను విశేషంగా వివరిస్తున్నాడు.

***అజః :-*** ఆత్మ పుట్టింది కాదు. ఆత్మకు పుట్టుక లేదు ***(న జాయతే, నోత్పద్యతే)***. కుండ పుట్టింది కాని ఆకాశం పుట్టలేదు. కుండ భగ్న మవుతుంది. కుండ లోని ఆకాశం భగ్నం కాదు. షడ్వికారాలలో మొదటిదైన పుట్టుక ***(జాయతే)*** ఆత్మకు లేదు. దేహం పుట్టింది కనుక దేహానికి ఉంది.

***నిత్యః :-*** ఆత్మ నిత్యము. అంటే, కాల పరిధి లోకి రాదు అని అర్థము. ఏదైనా ఉన్నది ***(అస్తి)*** అంటే, కాలంలో ఉన్నది అని అర్థము. కాలంలో ఉన్నది కాలంలో నశిస్తుంది అని భావం. ఆత్మ ఉంది. కాని కాలానికి పరిమితమై ఉన్నది కాదు. కాలంలో ఉంది. కాలాతీతంగా కూడా ఉంది. ఈ ప్రపంచంలో ఏది ఉండినా పోయేందుకే ఉంటుంది. దేహం ఉంది. ఒకనాడు పోయేందుకే ఉంది ***(అస్తి)***. అందుచేత దేహానికి 'అస్తి' అనే వికారము ఉంది. కాని, ఆత్మ లేని కాలము లేనందున, ఆత్మ యొక్క అస్తిత్వము నిత్యమై ఉంది ***(అస్తి - నిత్యః)***. ఇలా ఆత్మ రెండవ వికారము లేకుండా ఉంది.

***శాశ్వతః :-*** ఆత్మ శాశ్వత మైంది. మార్పు లేకుండా ఉంది. అదేమిటి, అంత పొడుగయ్యావు? సంవత్సరం లోనే ఇంత పెరిగావా? అని పిల్లలతో మనం అంటూ ఉంటాము. అది వర్ధమాన దశ కనుక పిల్లలు పెరుగుతూ ఉంటారు. అలా పెరిగేది దేహము ***(వర్ధతే)***. పెరగడమనే మూడవ వికారము దేహానిదే గాని ఆత్మది కాదు. అందుకే ఆత్మ శాశ్వతము. శాశ్వతము అంటే ఎప్పుడూ ఉండేది. వికారం లేకుండా అలాగే ఉండేది ***(శశ్వత్ భవః శాశ్వతః)***. పెరుగు లేనిది కనుక తరుగు తెలియనిది. అదేమిటి! అంత తగ్గిపోయారు? అని వృద్ధులతో అంటూ ఉంటాము. తరిగే ఐదవ లక్షణం ***(అపక్షీయతే)*** కూడా దేహానిదే కాని, ఆత్మది కాదు.

***పురాణః :-*** ఎప్పటి నుండో ఉన్నా, అలాగే ఉండేది కనుక ఆత్మ పురాణ మైనది ***(పురా అపి నవః పురాణః)***. ఎప్పుడూ దివ్యం గానే ఉంటుంది. వికారం చెందదు. దేహం అలా కాదు. పాత పడే కొద్ది రోతగా మారుతూ ఉంటుంది ***(విపరిణమతే)***. ఈ పరిణామ దోషము కూడా వికారమే. పరిణామము అనే నాల్గవ వికారము కూడా దేహానిదే గాని, ఆత్మది కాదు.

***న హన్యతే :-*** ఆత్మ చంప బడేది కాదు. ఆత్మ చావదు. దాని నెవరూ చంప లేరు. ఆత్మ పుట్ట లేదు. పెరగ లేదు. క్షీణించ లేదు. పరిణామం చెంద లేదు. ఇక ఎలా నశిస్తుంది? నశించే వికారము దేహానిది. దేహం వికారంతో పుట్టింది కనుక వికారిగా చస్తుంది. ఆత్మకు పుట్టుక లేదు. కనుక మృత్యువు ఉండదు. దేహాలు చస్తూ ఉన్నా ఆత్మ చావదు ***(న హన్యతే హన్యమానే శరీరే)***. కనుక నశించుట ***(వినశ్యతి)*** అనే ఆరవ వికారము కూడా దేహానిదే కాని ఆత్మది కాదు.

షడ్వికారాలు కలిగిన దేహం చస్తుంది. షడ్వికార రహితమైన ఆత్మ చావ కుండా ఉంటుంది. ఈ విధంగా ఆత్మలో షడ్వికారాలు లేవని ఈ శ్లోకంలో నిరూపించడం జరిగింది ***(అస్మిన్ శ్లోకే షడ్భావ వికారాః లౌకిక వస్తు విక్రియాః ఆత్మని ప్రతిషిధ్యన్తే)***.

ఈ విధమైన ఆత్మ తానే నని తెలిసిన జ్ఞాని జీవించి ఉన్నపుడే ముక్తుడు. జీవన్ముక్తుడు. దేహం లోనే ఉంటాడు. దేహ వికారాలు తనవి కావని గ్రహించి ఉంటాడు. నేను దేహము అనే భావం ఆ మహాత్మునిలో కదలదు. 'నేను' అనేది లేకుండా దేహంలో ఉంటాడు. 'నాది' అనేది అర్థం కాకుండా గృహంలో ఉంటాడు. అహంకారం ఆవిరై పోయింది కనుక 'నేను'గా లేని వాడు. మమకారం మరిగి పోయింది కనుక 'నాది' అనేది తెలియని వాడు. నేను మట్టిని అనే జ్ఞానం కలిగిన కుండ, వ్యవహారంలో ఉపకరిస్తున్నా, తన స్వరూపంలో తాను ఉన్నట్లు, నేను ఆత్మను అని తెలిసిన లోక వ్యవహారాలలో చరిస్తూ ఉండినా, తామరాకు నీటి లోనే నీటిని అంటకుండా ఉన్నట్లు, ఈ ప్రపంచంలో వ్యవహరిస్తూ ఉంటాడు. దేహ విలక్షణుడైన ఆ మహాత్ముడు దేహాన్ని అంటి పెట్టుకొని లేడు. దేహమే ఆ దివ్యాత్ముని నీడ లాగా అనుసరిస్తూ ఉంటుంది ***(ఛాయావత్ అనువర్తినీ)***.

ఓం... ఓం... ఓం...

*అర్జునా! దేహ మేమిటో, దేహి ఎవరో తెలిసిందా? చచ్చే దెవరో, చావని దెవరో అర్థమైందా? ఎవరి కోసం దుఃఖించాలి? శోచ్యు లెవరు? అందరూ అశోచ్యులే. అర్థమైతే దుఃఖ మెక్కడుంది? ఈ సత్యం అర్థమైన వాడే జ్ఞాని. జ్ఞాని ఎవరిని చంపుతాడు? ఎవరిని చంపిస్తాడు? ఇదంతా ఎలా చేస్తాడు? అది కూడా చెప్పుకుందాం.*

**వే దావినాశినం నిత్యం య ఏన మజ మవ్యయమ్ ।**
**కథం స పురుషః పార్థ కం ఘాతయతి హన్తి కమ్ ॥** 21

***వేద-అవినాశినం-నిత్యం-యః-ఏనం-అజం-అవ్యయం***
***కథం-సః-పురుషః-పార్థ-కం-ఘాతయతి-హంతి-కమ్***

| | | | | | |
|---|---|---|---|---|---|
| పార్థ | = | హే అర్జునా! | వేద | = | తెలుసుకున్న |
| యః | = | ఎవడు | సః పురుషః | = | ఆ పురుషుడు |
| ఏనం | = | ఈ ఆత్మను | కం | = | ఎవనిని |
| నిత్యం | = | ఎల్లప్పుడు ఉండుదానినిగా | కథం | = | ఎట్లు |
| అవినాశినం | = | నాశము లేని దానినిగా | ఘాతయతి | = | చంపించును? |
| అజం | = | పుట్టుక లేని దానినిగా | కం | = | ఎవనిని |
| అవ్యయం | = | అక్షయమైన దానినిగా | హంతి | = | చంపును? |

**పార్థా! ఆత్మ పుట్టేది కాదని, చచ్చేది కాదని, ఎప్పుడూ ఉండేదని తెలుసుకున్న వాడు ఎవరిని ఎలా చంపిస్తాడు? ఎవరిని చంపుతాడు?**

**వ్యాఖ్య**

**ఆత్మ స్వరూపం**

ఆత్మ నిత్యము. నిరవయవము. సావయవ వస్తువే పుడుతుంది. పుట్టినదే నశిస్తుంది. ఆత్మకు అవయవాలు లేవు. కనుక ఆత్మ పుట్టదు. నశించదు. ఆత్మ అవినాశి. అవినాశి అంటే చివరి దైన భావవికారం లేనిది ***(అంత్య భావ వికార రహితం)*** అని అర్థం. మరణమే అంత్యభావ వికారము. అది ఆత్మకు ఎందుకని లేదు? అని ప్రశ్నిస్తే, పుట్టుక అనే ఆది భావ వికారం లేదు కనుక మరణము అనే అంత్యభావ వికారం లేదు అనే సమాధానం వస్తుంది. ఆద్యంతముల యందు ఏదయితే లేదో, దేని కైతే ఆద్యంతములు ఉన్నవో అది మధ్యలో ఉండినా లేనిదే అని గ్రహించాము కనుక, ఏ విధమైన భావవికారం లేనిది ఆత్మ. అందుకే ఆత్మ అవినాశి.





ఆత్మను అవినాశిగా తెలుసుకున్న వాడు ఆత్మజ్ఞుడు. ఆత్మజ్ఞానము కలవాడు. జ్ఞానము నందు అధికారం కలవాడు ***(సః విద్వాన్ పురుషః అధికృతః)***. పండితుడైన ఆ ఆత్మవిదుడు ఆత్మను పుట్టుక లేని దానినిగా తెలుసుకుంటాడు ***(అజః)***. ఏ విధమైన మార్పులు లేని దానినిగా అర్థం చేసుకుంటాడు ***(అవ్యయం)***. ఆత్మను అజంగా, అవ్యయంగా, అవినాశిగా తెలుసుకున్న వాడు దేనిని ఎలా చంపుతాడు? ఎలా చంపిస్తాడు?

ఇక్కడ చంపుట ***(హన్తి)*** అని చెప్పడంలో కేవలం హననక్రియ అని అర్థం కాదు. చంపుట అనేది కర్మ. చచ్చుట అనేది కూడా కర్మే. కాని, ఇక్కడ చంపుట, చచ్చుట అనే ప్రత్యేకమైన అర్థాలు ఏవీ లేవు. 'హన్తి' అనే పదము అన్ని క్రియలకు ఉపలక్షణంగా చెప్ప బడింది. కనుక ఒక హనన క్రియే కాదు, ఆత్మలో ఏ కర్మకు అవకాశము లేదు. కర్తృకర్మ ప్రేరకాలు ఆత్మలో ఊహించుట సాధ్య పడదు అనేదే ఇక్కడ కేంద్ర విషయం.

ఒక కర్మ జరగాలి అంటే, ఆ కర్మకు సంబంధించిన ఆలోచనలు ముందుగా మనస్సులో ఉండి తీరాలి. కర్మకు ముందు కర్మకు సంబంధించిన జ్ఞానము ఉంటుంది. అట్టి జ్ఞానమును ఆధారం చేసుకొనే కర్మ చేయడం జరుగుతుంది. మరి, ఆ జ్ఞానం ఆలోచిస్తేనే కదా కలుగుతుంది? ఆలోచించాలి అంటే, మనస్సులో సంకల్పాలు నడవాలి కదా!

సంకల్పం చేసే దెవరు? కర్మ చేసే దెవరు? కర్మ చేసే వాడే సంకల్పిస్తాడా? లేక సంకల్పం లేకుండా కర్మ చేస్తాడా? ఇప్పుడు కర్త ఎవరు? చేసే వాడు కర్త. మరి, అలా చేసేవాడు ఆలోచన లేకుండా చేస్తాడా? చెయ్యలేడు. మరి ఆలోచించిం దెవరు? కర్తే. ఆ కర్త ఎవరు? ఆత్మ అవుతుందా? కాలేదు. ఎందుకో తెలుసా! ఆత్మ సంకల్పించదు. సంకల్పాలు నడవ డానికి ఆధారమైంది ఆత్మ. కనుక ఆత్మ కర్త కాదు. ఇలా ఆత్మ స్వరూపాన్ని అకర్తగా, అభోక్తగా తెలుసుకున్న వాడు ఆత్మజ్ఞుడు.

**ఆత్మవిదుడు**

ఆత్మలో కర్తృకర్మ ప్రేరకాలు లేవని తెలిసిన వాడు, ఆత్మ నిష్క్రియత్వ చైతన్య మనే జ్ఞానాన్ని పొందిన వాడు ఆత్మవిదుడు. అతడు కర్తృ భోక్తృ లక్షణాలు లేని ఆత్మలో సర్వకర్మ సన్యాసమును దర్శించిన వాడు. పరమార్థ జ్ఞానదృష్టితో జీవిస్తూ, కర్మల యందు అకర్మను దర్శించేవాడు. అందుచేతనే మన పెద్దలు, **జ్ఞాత్వా కర్మాణి కుర్వీత** అన్నారు. జ్ఞానాన్ని పొంది కర్మలు ఆచరించు అన్నారు. జ్ఞానం కలిగిన వారికి కర్మలలో అకర్మ దర్శనీయ మవుతూ ఉంటుంది. ప్రస్తుత సాంఖ్య ప్రకరణంలో ఆత్మ వికార రహిత మని, జ్ఞానికి ఏ కర్మలు ఉండవు అని ప్రబోధించడమే ప్రధాన ఉద్దేశ్య మని శ్రీ శంకరులు కూడా అభిప్రాయ పడ్డారు.

***హేత్వర్థస్య తుల్యత్వాత్ విదుషః సర్వకర్మ ప్రతిషేధ ఏవ ప్రకరణార్థః అభిప్రేతః భగవతః***

ఆత్మ వికార రహితము అనే హేతువు యొక్క అర్థం, సర్వకర్మల విషయం లోను ఆత్మ నిర్వికారము అని తెలుస్తూ ఉంది కనుక, అట్టి ఆత్మను తెలుసుకొనిన ఆత్మజ్ఞుని చేత సర్వకర్మలు నిషేధింప బడుతున్నాయి అనేది భగవంతుని అభిప్రాయము. చంపుట అనే హనన క్రియను నిషేధించుట అనేది కేవలం ఉదాహరణకు సూచించినది మాత్రమే ***(హన్తేః తు ఆక్షేపః ఉదాహరణార్థత్వేన కథితః)***.

ఆత్మ జ్ఞానోదయంలో అజ్ఞానం నివృత్తి అవుతుంది. దేహ ధర్మాలను ఆత్మ యందు ఆరోపించుకొని నేను చంపినాను - నేను చంపించినాను అనే అజ్ఞాన వచనాలు ఇక ఆ స్థితిలో విన పడవు.

ఆత్మ యందు వికారము దర్శనీయ మైనపుడు తాను కర్త అవుతాడు. లేదా, తాను కర్తగా ఉండి కర్మ యైన మరొకరిని పురి కొల్పుతాడు. కర్తృత్వమే లేనపుడు ప్రేరకత్వము ఎలా ఉంటుంది? ఆత్మను తెలుసుకున్న వాడు ఎలా చంపుతాడు? ఎలా చంపిస్తాడు? అంటే ఆత్మజ్ఞుడు కర్మలు ఎలా చేస్తాడు? ఎలా చేయిస్తాడు?

అని అర్థం. ఆత్మను తెలుసు కోవడము అంటే, అలా తెలుసుకున్న వాడు సర్వకర్మ సన్యాసి అయ్యాడని భావము.

*మరి, ఆత్మ అవినాశి అనేది నిర్ధారణ చేయ బడింది కదా! అది ఎలా?* ***(తత్ర ఆత్మన: అవినాశిత్వం ప్రతిజ్ఞాతమ్। తత్ కిం ఇవ ఇతి? ఉచ్యతే)*** *అదే చెప్పబోతున్నాడు.*

**వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోఽపరాణి ।**
**తథా శరీరాణి విహాయ జీర్ణా న్యన్యాని సంయాతి నవాని దేహీ ॥** 22

***వాసాంసి-జీర్ణాని-యథా-విహాయ-నవాని-గృహ్ణాతి-నరః-అపరాణి***
***తథా-శరీరాణి-విహాయ-జీర్ణాని-అన్యాని-సంయాతి-నవాని-దేహీ***

| | | | | | |
|---|---|---|---|---|---|
| యథా | = | ఏ ప్రకారము | తథా | = | అలాగే |
| నరః | = | మనుష్యుడు | దేహీ | = | జీవుడు |
| జీర్ణాని | = | చినిగిన | జీర్ణాని | = | శిథిలములైన |
| వాసాంసి | = | వస్త్రాలను | శరీరాణి | = | శరీరములను |
| విహాయ | = | విడిచి | విహాయ | = | విడిచి |
| అపరాణి | = | ఇతరములైన | నవాని | = | నూతనమైన |
| నవాని | = | వస్త్రాలను | అన్యాని | = | అన్యములైన దేహములను |
| గృహ్ణాతి | = | ధరించునో | సంయాతి | = | ధరించు చున్నాడు |

**మానవుడు చినిగి పోయిన వస్త్రాలను వదిలేసి, వేరే నూతన వస్త్రాలను ధరిస్తాడు కదూ! అర్జునా! జీవుడు కూడా శిథిలమైన శరీరాలను విడిచేసి, వేరే క్రొత్త శరీరాలను పొందుతూ ఉంటాడు.**

**వ్యాఖ్య**

జీవుడు నిత్యుడు. నశించే వాడు కాడు. మార్పు చెందే వాడు కాడు. మరణం పొందేవాడు కాడు అని ఇంత వరకు చూశాం. కాని, ఈ లోకంలో మనిషి పొందే అనుభవ జ్ఞానము మరో విధంగా ఉంది. ఎందరెందరో కళ్ళ ముందే గతిస్తున్నారు. ఉన్న వాళ్ళు పోయేందుకే ఉన్నారు అని తెలిసి పోయింది. ఉండి పోయే వారిలో తామూ ఒకడు అని మనిషికి అర్థమై పోయింది. ఇదొక తీరని ఆవేదన. ఆరని అశాంతి. ఇదంతా అవివేకంతో మనిషి తనకు తానుగా కల్పించుకున్న బంధము. మరణంలో సమస్తము మునిగి పోతుందని లేని ప్రళయాన్ని ఊహించుకొని మానవులు అల్లాడి పోతున్నారు. మరణం మంగళకర మైనదని, ఆహ్వానించ దగినదే గాని ఆవేదన చెంద దగిన విషయం కాదని చెబుతూ, జనన మరణాల గుట్టు విప్పుతూ, జీవుని నిత్యత్వాన్ని విస్పష్టం చేస్తున్నాడు గీతాచార్యుడు.

**గువ్వ - గూడు**

సుదీర్ఘ జీవిత ప్రయాణంలో ఈనాటి బ్రతుకు ఒక మజిలీ. ఈ విరామంలో ఎన్నో సంఘటనలు. ఎన్నెన్నో బాంధవ్యాలు. సుఖాలు, నవ్వులు, కష్టాలు, కన్నీళ్ళు, సంయోగాలు, వియోగాలు. ఇదంతా జీవితం. జీవి ఆడే చదరంగం.

నానా దిక్కుల నుండి వచ్చిన పక్షులు ఒక్క చెట్టు మీద విశ్రమిస్తాయి. విశ్రమించినట్లే ఉంటాయి. ఇంతలోనే విశ్రామం విరమించి విహారం సాగిస్తాయి. కొమ్మలు పక్షివి కావు. పక్షికి రెక్కలూ మిగలవు. చెట్టు విడిస్తే ఏ పక్షి పయనం ఏ వైపో!





చెట్టుపై గూడు; గూటిలో పక్షి. హోరుగాలి వీచినా, పై కొమ్మ నుండి పండు రాలి గూటిపై పడినా, గూడు ముక్కలౌతుంది. గువ్వ గంతు లేస్తుంది.

***గూటి మీద పండు రాలె - గూడు రెండు ముక్క లాయె***
***గూటి లోని రామచిలుక - గుట్టల పాలాయె రన్నా***
***గూటి చిలకేదిరా - చిన్నన్నా***
***గూడు చినబోయెరా!***

గూడు కాదెన్నడూ తోడు - గువ్వకు తప్పదెన్న డైనా దౌడు. గూటిలో గువ్వ ఉంటుంది. గువ్వలో గుట్టు ఉంటుంది. గుట్టు తెలియని గువ్వ గూడే సర్వమని భ్రమిస్తుంది. లేదా, గగనంలో సంచారం సాగిస్తుంది. గుట్టు తెలిస్తే గువ్వ మనసే గగన మంత విశాల మవుతుంది (*గగన సదృశం*).

**బట్ట కడితే బ్రతుకు - బట్ట విడిస్తే చావు**

మనిషి వస్త్రాన్ని ధరిస్తాడు. ఆ వస్త్రమే చిరిగి పోతే దానిని వదిలి మరొక క్రొత్త వస్త్రాన్ని ధరిస్తాడు. అలాగే మనిషి దేహ మనే వస్త్రాన్ని ధరిస్తాడు. అది దుర్బలమైతే, ఆ దేహాన్ని త్యజించి నూతన దేహాన్ని పొందుతూ ఉంటాడు.

వాడుకలో ఏవయినా పాత బడతాయి. పాడై పోతాయి. దండైనా, కుండైనా, వస్త్రమైనా, దేహమైనా - ఏదైనా శిథిలం కావలసిందే.

వస్త్రధారి వస్త్రాన్ని మోయాలి. దేహధారి దేహాన్ని మోయాలి. దేహం యొక్క ప్రయోజనం దేహికి ఉంది. ప్రయోజనం లేకపోతే ఎవ్వరూ భారాన్ని మోయరు. వస్త్రం దేహాన్ని కప్పి దేహాన్ని రక్షిస్తూ ఉంటుంది. అలాగే, దేహం దేహిని కప్పి, దేహిని రక్షిస్తూ ఉంటుంది.

అందరికీ దేహాలు ఉన్నాయి. అందరి దేహాలు ఒకే లాగా లేవు. అందరూ వస్త్రాలు ధరిస్తారు. అందరి వస్త్రాలు ఒకే రంగులో ఉండవు. ఒకే నాణ్యతలో కనిపించవు. అభిరుచుల్ని బట్టి బట్టలు. కర్మలను బట్టే దేహాలు.

ఇంటి లోని వారందరికీ ఎవరెవరికి ఎలాంటి బట్టలు కొని పెట్టాలో ఇంటిపెద్దకు తెలుసు. ఉద్యోగం చేసే వారికి ఒక రకమైన బట్టల్ని, చదువుకొనే వారికి వేరొక రకమైన బట్టల్ని, పనిపాట లేని వానికి మరొక రకమైన బట్టల్ని ఇంటి యజమాని కొని పెడతాడు. ఎవరికి ఏవి అవసరమో ఇంటిపెద్దకు తెలుసు.

ఈ ప్రపంచానికి యజమాని పరమేశ్వరుడు. ఎవరెవరికి ఎలాంటి దేహాలు ఇవ్వాలో సర్వజ్ఞుడైన సర్వేశ్వరునికి తెలుసు. అందరి దేహాలు ఒక విధంగా లేవు. రూపాలలో భేదా లున్నాయి. రంగులలో భేదా లున్నాయి. ఆరోగ్యాలలో భేదా లున్నాయి. అందాలు, వికారాలు, కళలు, కాంతులు, చూపులు, చేతలు ఎన్నో ఉన్నాయి. అన్నీ భిన్నంగా ఉన్నాయి. అవి అలా ఉండటం వెనుక ఎంతో జ్ఞాన ముంది.

దేహాలు రావడం వెనుక నియతి ఉంది. దేహాలు ఉండటంలో ధర్మా లున్నాయి. దేహాలు రాలి పోవడంలో కూడా నియతి ఉంది. దేహం వస్తుంది. అలాగే పోతుంది. అందుకే దేహాలు అనిత్యులు అని తెలుసుకున్నాం. దేహాలు నశించినా దేహి నశించడు. మరొక దేహాన్ని ధరిస్తాడు.

చిరిగిన వస్త్రాలను విడిచి పెట్టి నూతన వస్త్రాలను మనిషి ధరించినట్లు, శిథిలమైన దేహాన్ని విడిచి పెట్టి దేహి నూతన దేహాన్ని ధరిస్తూ ఉంటాడు. వ్యక్తి ఒక్కడే. కాని ధరించే వస్త్రాలు అనేకములు. అలాగే, దేహి ఒక్కడే. కాని, ధరించే దేహాలు అనేకములు. అందుచేతనే, దేహములను **శరీరాణి** అని బహువచనం తోను, జీవుని **దేహీ** అని ఏకవచనం తోను విడ మరచి బోధించాడు.

వస్త్రాలను ధరించే వ్యక్తి వస్త్రాల కన్నా వేరుగా ఉన్నాడు. కనుకనే వస్త్రాలను మార్చుకోవడానికి బాధ పడడు. మరి దేహి విషయ మేమిటి? దేహాలను ధరించే దేహి కూడా దేహాల కన్నా వేరు గానే ఉన్నాడు. కాకపోతే, దేహమే తాను అనే అజ్ఞానంలో ఉన్నాడు. అందుచేత దేహ పతనాన్ని తట్టుకో లేక గగ్గోలు పెడు తున్నాడు.

**అర్థం గాకనే ఆవేదన**

తల్లి బిడ్డకు పాలిస్తూ ఉంటుంది. కొంతసేపు ఇవ్వగానే ఆ వైపు చనుబాలు అయి పోయాయి అని తల్లి గ్రహిస్తుంది. బిడ్డను ఆ వైపే ఉంచితే లాభం లేదని భావిస్తుంది. వెంటనే బిడ్డను అటు నుండి ఇటు వైపుకు త్రిప్పుకుంటుంది. అలా చెయ్యడం బిడ్డకు పాలు పట్టించాలనే గాని, స్తన్యపానము చేయకుండా నిరోధించాలని కాదు.

అజ్ఞానంలో ఉండటం చేత ఈ సత్యం శిశువుకు తెలిసి రాదు. పాలు త్రాగే శిశువును తన దేహం నుండి దూరం చేయగానే బిడ్డ కెవ్వు మని కేక వేస్తుంది. వెంటనే తల్లి మరో వైపు తన తనువుకు హత్తు కుంటుంది. అంతే, బిడ్డ ఏడుపు ఆపేస్తుంది.

ఈ ప్రపంచంలో మనం ప్రారబ్దాన్ని అనుభవిస్తూ బ్రతుకుతున్నాం. ఒక వైపు చనుబాలు లేవని తెలియ గానే, అక్కడ నుండి వేరే వైపుకు తల్లి బిడ్డను మార్చినట్లు, ఈ ప్రపంచంలో మనకు నూకలు చెల్లిపోయా యని తెలియగానే, పరమేశ్వరుడు ఈ లోకం నుండి మనల్ని తరలిస్తాడు. అదే మృత్యువు. స్తన్యపానం చేసే బిడ్డ అవివేకంతో గోల చేసినట్లు, మనం కూడా అజ్ఞానం చేత మరణంలో దుఃఖిస్తున్నాం.

**తరలి పోయేవే తనువులు**

నూతన వస్త్రాలు శోభాయమానంగా ఉంటాయి. క్రొత్త వాటి కన్నా వాడుకలో మరింత శోభిస్తాయి. మళ్ళీ వాడుక లోనే మాసి పోతాయి. మలిన పడతాయి. మగ్గి పోతాయి. మూల పడతాయి.

వస్త్రాలు కళకళ లాడే కాలం ఉంది. చిరిగి పీలిక లయ్యే కాలమూ ఉంది. ఇదే కాల మహిమ. ఆకు రాలే కాలముంది. కాయ రాలే కాలముంది. అలాగే కాయం రాలే కాలమూ ఉంది. ఏ వస్త్రమైనా చిరిగి పోయేదే. ఎవరి తనువైనా కాటికి తరలి పోయేదే. దేహాలు దగ్ధమై పోయినా, దేహి ధగధగ మనే కాంతులతో నూతన దేహంలో ప్రవేశిస్తాడు.

చిరిగి పోయిన వస్త్రాన్ని విసర్జించి, నూతన వస్త్రాన్ని ధరించడానికి ఎవరైనా శోకిస్తారా? దుర్బలమైన దేహాన్ని త్యజించి, అందమైన, ఆరోగ్యవంతమైన దేహాన్ని పొంద డానికి మనం ఎందుకు దుఃఖిస్తున్నాం?

**కలత లేనివి కూడా కదలి పోతున్నాయి**

ఇక్కడ మరొక సందేహము పుట్టుకొస్తోంది. జీర్ణమైన శరీరాలు, వృద్ధాప్యంలో బలహీనమైన శరీరాలు ***(దుర్బలతాం గతాని)*** గతిస్తే అర్థం చేసుకోవచ్చు. నవ యవ్వనంలో ఉండే దేహాలు, రెండు పదులు కూడా నిండని ముచ్చటైన తనువులు కూడా తరలి పోతున్నాయి కదా! వాటి నెలా అర్థం చేసుకోవాలి?

క్రొత్తపాతలు, అందచందాలు, ఆరోగ్యాలు, ప్రారబ్దాలు - వీటిని మదింపు వేసే కొలత పాత్రలు ప్రపంచంలో లేవు. ఎవరి పాత్రలు వారివే. ఎవరి కొలతలు వారివే.

ఒక వ్యక్తి యవ్వనంతో చాలా అందంగా, ఆరోగ్యంగా కనిపిస్తాడు. మాటల మధ్య తన మూగబాధను వినిపిస్తాడు. వివాహ ప్రయత్నాలు ఒక వైపు సాగుతూ ఉంటే, మరో వైపు తన దేహంలో దారుణమైన క్యాన్సర్ మహామారి మకాం పెట్టి ఉధృత రూపాన్ని దాల్చి ఉందని, రాలి పోవడానికి మాసాలే మిగిలి ఉన్నాయి అని





చెబుతాడు. మనకు మాటలు మూగబోతాయి. చూడటానికి అలా ఉన్నాడు. లోపల ఇలా ఉందా? అని నివ్వెర పోతాము. బాహ్యానికి ఆ దేహం పది కాలాల పాటు ఉండ దగినదే అన్నట్లు ఉంది. దుర్బలత్వ మంతా లోపలే దాగి ఉంది.

ఒక వ్యక్తి ఇల్లు అమ్ముతాడు. మరొక వ్యక్తి ఆ ఇంటిని కొంటాడు. అమ్మిన వాడికి అది పాత ఇల్లు. అందుకే అమ్మేశాడు. కొన్నవాడికి అదే క్రొత్త ఇల్లు. మంచి ముహూర్తం చూసుకొని, బంధుమిత్రాదులతో కలసి ఏదో నూతన గృహప్రవేశం చేసినట్లు ప్రవేశిస్తాడు. నిజమే! ఆ గృహం అతని దృష్టిలో నూతనమే. కాని, గతంలో ఎన్నో శవాలను తరలించిన పాత గృహం అదే అనేది వాస్తవము.

మనం ఈ ప్రపంచానికి ఒంటరిగా రాలేదు. ప్రారబ్దాన్ని వెంట బెట్టుకొనే వచ్చాం. దేహాలు ఎలా ఉన్నా యనేది ప్రధానం కాదు. ఆ దేహంతో ఈ జన్మలో అనుభవించ వలసిన కర్మఫలం మిగిలి ఉందా, అయిపోయిందా! అనేదే ముఖ్య విషయం. ప్రారబ్ద కర్మానుభవము శేషించి ఉంటే, జీవి ఆ దేహంతో కొనసాగుతాడు. ప్రారబ్దం అడుగంటితే వల్లకాటి వైపుకు దేహాన్ని నడిపించి, అనువైన మరో దేహంలో దూరి పోతాడు.

చనిపోయిన వ్యక్తిని శ్మశానానికి అప్ప చెప్పే టప్పుడు దేహం మీద ఒక్క వస్త్రాన్ని కూడా ఉంచరు. చివరికి మొలత్రాడును కూడా తెంచేస్తారు. నాయనా! నీవు ధరించిన వస్త్రాన్ని విడిచేశావు. తరువాత, నీవు ధరించ బోయే వస్త్రం నీ కోసం నిరీక్షిస్తోంది. ఇది ఇక పనికిరాదు అనే సత్యాన్ని ఎరుక పరచాలనే అలా చేస్తారు. ఇదంతా పోయిన వాడికి తెలుస్తుందా? లేదు. ఉన్నవాళ్ళు తెలుసుకుంటా రని అలా చేస్తారు.

**ఇంధనం లేని వాహనం నడవదు**

దేహం ఈ ప్రపంచంలో ఉండటానికి, ఉండకుండా పోవడానికి వయస్సే ప్రధానం కాదు. కర్మఫలమే కీలకాంశం. కర్మఫలం తన దైన మార్గంలో పావులను కదుపుతూ ఉంటుంది.

కొందరు నూరేండ్లు నిండి చిక్కి శల్యమైన దేహంతో మరణిస్తారు. కొందరు వయస్సులో ఉండి కూడా భయంకరమైన వ్యాధుల వాత పడి, లేదా దారుణ ప్రమాదాలకు లోనై మరణిస్తారు.

తుపాకి గుండ్లు దేహంలో దూసుకు పోయినా బ్రతికిన వారు కొంద రున్నారు. తుపాకి గుండ్ల వంటి భయంకరమైన మాటల్ని విని తట్టుకోలేక ప్రాణాలు విడిచేసిన వారూ ఉన్నారు.

ఎవరి గుండె వారిదే. అలాగని ఆగే ముందు చెప్పి ఆగుతుందా? ఎవరి ప్రాణం వారిదే. అలాగని సాగే ముందు చెప్పి సాగుతుందా? ప్రారబ్దం చేతిలో అన్నీ కీలుబొమ్మలే. అందరూ ఆటబొమ్మలే.

ఇది బ్రతుకు ఆట. ఆడించే వాడి చేతి లోనే ఉంది అంతా. అర్జునా! ఆటలో ఆందోళన ఎందుకు? ఆట ఆగితే ఆవేదన ఎందుకు? ఇది తెలిస్తే ఆటలో ఆనందం ఉంటుంది. గెలుపులో ఆనందమే. ఓటమిలో కూడా ఆనందమే. గెలుపు ఓటములు కూడా ఆటలో భాగమే.

I have loved life so much, why should I not love death even more?

నేను జీవితాన్ని ఎంతగానో ప్రేమించాను. మృత్యువును అంతకన్నా ఎక్కువగా ఎందుకు ప్రేమించలేను? అని తనను తాను ప్రశ్నించు కున్నాడు విశ్వకవి టాగూర్.

అర్జునా! దేహాలు కర్మానుసారంగా రాలిపోయినా, దేహి ఏ విధమైన వికారాలకు లోను గాకుండా క్రొత్త శరీరాలను పొందుతాడు ***( దేహీ, ఆత్మా అవిక్రియః ఏవ ఇత్యర్థః ).***

దేహం ఎప్పుడో ఒకప్పుడు చస్తుంది. అది చచ్చేందుకే ఉంది. అనుక్షణం చస్తూ ఉంది. ఇది అనివార్యం. శోకించ దగనిది. దేహి అవినాశి, నిత్యుడు, శాశ్వతుడు. ఈ విషయాన్ని కూడా సహేతుకంగా చర్చించుకున్నాం. సశాస్త్రీయంగా చెప్పుకున్నాం. ఇక దుఃఖించడం మానేయ్! ***(అశోచ్యా నన్వ శోచస్త్వం).***

*అర్జునా! నువ్వు దేహివే కాని దేహానివి కావు. దేహి యైన నిన్ను నశింప చేసే శక్తి ఎవ్వరికీ లేదు. భీష్మద్రోణాదులు కూడా అంతే. వారికి కూడా ఎవ్వరూ వినాశమును కలిగించలేరు. నీవూ ఆత్మే. భీష్ముడూ ఆత్మే. ఆత్మకు ఎందుకు నశింపు లేదో చెబుతాను, విను!*

**నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః ।** 23
**న చైనం క్లేదయ న్త్యాపో న శోషయతి మారుతః ॥**

***న-ఏనం-ఛిందంతి-శస్త్రాణి-న-ఏనం-దహతి-పావకః***
***న-చ-ఏనం-క్లేదయంతి-ఆపః-న-శోషయతి-మారుతః***

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఏనం | = | ఈ ఆత్మను | ఏనం | = | ఈ ఆత్మను |
| శస్త్రాణి | = | శస్త్రములు | ఆపః చ | = | నీళ్ళు |
| న ఛిందంతి | = | ఛేదించవు | న క్లేదయంతి | = | తడుపవు |
| ఏనం | = | ఈ ఆత్మను | మారుతః | = | గాలి |
| పావకః | = | అగ్ని | న శోషయతి | = | ఎండగట్ట లేదు |
| న దహతి | = | కాల్చదు | | | |

**ఆత్మను శస్త్రాలు ఖండించ లేవు. అగ్నీ కాల్చలేదు. నీళ్ళు తడపలేవు. గాలి ఎండబెట్ట లేదు.**

**వ్యాఖ్య**

శక్తి గలవారు భువిలో ఎందరో ఉన్నారు. శక్తి గలవి ప్రపంచంలో ఎన్నో ఉన్నాయి. శక్తిని ఉపయోగించి కొందరు కొందరిని ఏదైనా చేయ గలరు. వాళ్ళే మరి కొందరిని ఏమీ చేయ లేరు. కొన్ని శక్తులు ఎవరికీ మినహాయింపు లేకుండా ఎవరి నైనా, ఏదైనా చేయ గలవు, ఎప్పుడైనా చేయ గలవు. అవసర మనుకుంటే యావద్విశ్వాన్నే కబళించే శక్తి అణువుల్లో దాగి ఉంది. కాని, ఏదీ ముట్టలేని, ఎవరూ పట్టలేని, ఏ శక్తీ నశింప చేయలేని అద్భుత చైతన్య శక్తి ప్రతి మనిషి హృదయంలో ఒదిగి ఉంది. అదే సత్. అదే ఆత్మ. పుట్టుక లేనిది. మరణం తెలియనిది. ఏ వికారాలకు లోను కానిది. దానిని నశింప చేసే శక్తి దేనికీ లేదు.

మానవదేహం పాంచభౌతికం. అది పంచభూతాల సృష్టి. మానవ దేహాన్ని పంచభూతాలు ఏదైనా చేయ గలవు. అస్త్రాలు, శస్త్రాలు, విషాలు, మారణాయుధాలు దేహాన్ని ముక్కలు చేయ గలవు. మాయం చేయ గలవు. దేహాన్ని బూడిద చేసే శక్తి నిప్పు కుంది. ముంచే శక్తి నీటి కుంది. ఎండగట్టి ఆరేసే శక్తి, ఊడ్చి పారేసే శక్తి గాలి కుంది. కాని ఇవన్నీ కలసి ఒకటైనా, ఆత్మను కదిలించ లేవు. కాల్చలేవు. పీల్చలేవు. ఊడ్చలేవు. మాడ్చలేవు. అదే అద్భుతాత్మ. ఆశ్చర్యాత్మ. చైతన్యాత్మ. సత్యాత్మ.

పంజరం తగలబడి నపుడు పంజరం లోని పక్షి తగల బడకుండా ఉంటుందా? ఇల్లు దగ్ధ మైనపుడు ఇంటి లోని మనిషి చావకుండా ఉంటాడా? మరి, దేహము దగ్ధమయ్యే టప్పుడు దేహి నశించకుండా ఎలా ఉంటాడు? ఉంటాడు. అందుకనే, ***కథం హన్తి?*** ఎలా చంపుతారు? అని ఇరవై ఒకటవ శ్లోకంలో గీతాచార్యుడు ప్రశ్నించాడు.





వధించాలి అంటే సాధనం ఉండాలి. దేని చేత వధించాలి? ఆత్మను వధించ డానికి వధ సాధనాభావ ముంది. అంటే, వధకు సాధనము అలభ్యంగా ఉంది ***(అభావః)*** అని అర్థము. అదేమిటి? బ్రతికించే సాధనము మన వద్ద లేదు అంటే అర్థం చేసుకో గలము. వధించడానికి సాధనా లెందుకు లేవు? పంచభూతాలలో ఒక్క ఆకాశాన్ని ప్రక్కన పెడితే మిగిలిన నాలుగు భూతాలు వధ సాధనాలే కదా! నిజమే. దేహం విషయంలో వధ సాధనాలే గాని ఆత్మ విషయంలో కాదు.

**ఆయుధాలు అలభ్యం**

ఆయుధాలు పృథివి యొక్క వికారాలు. స్థూల రూపాలు. స్థూల మైనవి స్థూలాన్ని ఖండించ గలవే గాని సూక్ష్మాన్ని ఖండించ లేవు. గొడ్డలి స్థూలాయుధము. చెట్టు కూడా స్థూలం. అందుచేత గొడ్డలితో చెట్టును ఖండించడం సాధ్య పడుతుంది. ఇదే గొడ్డలితో నీళ్ళను ఖండించడం సాధ్య పడుతుందా? జ్వాలను ముక్కలు చేయడం వీలు పడుతుందా? గాలిని నరకడం సాధ్యమేనా? సరే, ఇక ఆకాశం విషయం చెప్పే దేముంటుంది? చెట్టును ఖండించిన గొడ్డలి నిప్పును, నీళ్ళను, గాలిని ఖండించ లేక పోవటానికి కారణ మేమిటి? అవన్నీ సూక్ష్మాలు కావడమే. స్థూలము సూక్ష్మాన్ని ఖండించ లేదు.

ఆయుధాలు ఖండించా లంటే అంగా లుండాలి. అవయవాలు ఉండాలి. దేహానికి అవయవాలు ఉన్నాయి కనుక ఆయుధము ఖండించ గలుగుతుంది. ఆత్మకు అవయవాలు ఎక్కడున్నాయి? అందుకనే శస్త్రాలు ఆత్మను ఖండించ లేవు ***(దేహినం న ఛిన్దన్తి శస్త్రాణి నిరవయవత్వాత్).*** ఆత్మ అమూర్తం. కనుక ఆయుధాలకు అందదు.

**అగ్ని అయోగ్యం**

కాల్చే శక్తి అగ్నికి ఉన్నా, కాలే అశక్తత ఆత్మకు లేదు. కనుక, అగ్ని ఆత్మను ముట్ట లేదు. లంకలో అశోక వనా న్నంతా అగ్నిదేవుడు కాల్చేశాడు. కాని, సీతమ్మను సమీపించలేక పోయాడు. ఆత్మను తాకే యోగ్యత తనకు లేదని దూరంగా ఉండి పోయాడు.

కట్టెల్ని అగ్ని భస్మం చేస్తుంది. జలాన్ని ఆవిరి చేస్తుంది. గాలిని కాల్చుతుందా? ఆకాశాన్ని తగల బెడుతుందా? ఇలాంటివి చేసేందుకే యోగ్యత లేనపుడు ఆత్మను ఎలా దగ్ధం చేస్తుంది? ***(అగ్నిః అపి న భస్మీ కరోతి).***

**నీళ్ళు నిరుపయోగం**

పటికబెల్లం నీళ్ళల్లో పడి కరిగి పోతుంది. వస్త్రం కొంతకాలం నీళ్ళల్లో ఉంటే చీకి పోతుంది. కొన్ని నీళ్ళల్లో కరిగి పోతూ ఉంటే, మరి కొన్ని నీళ్ళల్లో తరిగి పోతూ ఉంటాయి. జలం రూపాల్ని అరూపం చేయడమే కాకుండా రూపం లేని వాటికి రూపా న్నిస్తుంది. మట్టిని జలం కరిగిస్తుంది. అంతేకాదు, మట్టికి రూపాన్నిస్తుంది కూడా. నీళ్ళు కలిపే మట్టితో బొమ్మలు తయారు చేస్తారు. ఇళ్ళను నిర్మించు కుంటారు. శరీరానికి జలం వల్లే రూపం వచ్చింది. మరణించిన తరువాత మృత కళేబరాలను నదీ జలాలే కరిగించేస్తూ ఉంటాయి.

ఆత్మ విషయంలో మాత్రం నీళ్ళు ఏమీ చేయలేక నిరుపయోగంగా మిగిలి పోతాయి. దేహాల్ని ముంచి నట్లు ఆత్మను జలాలు ముంచ లేవు. ఆత్మను అరూపం చెయ్యలేవు. కారణం, ఆత్మకు రూపం లేదు. ఆత్మకు కొంగ్రొత్త రూపాన్ని ఇవ్వడం కూడా ఉదకానికి సాధ్యం కాదు. ఆత్మ నిరవయవం.

గాలినే నీళ్ళు ఏమీ చేయలేవు. ఆత్మను ఏం చేయగలవు? నీళ్ళు నీళ్ళుగా ఉండ టానికి కారణ మైనది ఆత్మ. ఆత్మ ఆధారమైనదే గాని ఆధేయము కాదు.

**గాలి ఆడదు**

ఈల వేస్తూ, గోల చేస్తూ, నిలకడ లేకుండా పరుగులు తీసే గాలి ఆటలు ఆత్మ వద్ద సాగవు. గాలి చాలా విచిత్రమైంది. ఉండి కొందరిని బ్రతికిస్తుంది. పోయి కొందరిని చంపేస్తుంది. గాలి ఆడక కొందరు పోతారు. గాలి ఎక్కువై కొందరు చస్తారు ***(శోషణేన నాశయతి వాయుః)***. కాని, ఇదే గాలి ఆత్మను శుష్కింప చేయలేదు. కదిలించ లేదు.

వస్తువు లోని చెమురును పీల్చేసి దానిని గాలి నశింప చేస్తుంది. అందుకే పూలు వాడి పోతాయి. ముఖాలు వాలి పోతాయి. దీపాలు ఆరి పోతాయి. దేహాలు రాలి పోతాయి. అన్నిటికి అన్నీ జరుగుతాయి కాని, ఆత్మకు మాత్రం ఏమీ జరగదు.

ఒకటి వధింప బడింది అంటే దానికి కారణం ఉండాలి. ఏదయితే వధకు కారణమో, దాని చేత వధింప బడింది కార్యమై ఉండాలి. అప్పుడే వధ సాధ్య మవుతుంది. ప్రపంచంలో ఏదైనా కార్యం గానే తెలుస్తూ ఉంది. ఆత్మ ఒక్కటే కార్యంగా తెలియదు. అందుకే అది సర్వకారణం. సర్వకారణమైన ఆత్మను, పరిమితంగా ఉంటూ, కొంత కాలం కారణాలుగా కులికే కార్యాలు ఏమి చేయ గలవు? అందుకే ఆత్మ మరణ ధర్మం లేనిదై అమృత స్వరూపంగా భాసిస్తోంది.

మరణ ధర్మము కలది దేహము. దానిని నశింప చేయడానికి వధ సాధనా లున్నాయి. ఆత్మ అమృత స్వరూపము. నశించే దేహాలలో ఉన్నా నశించేది కాదు. ఆత్మకు మరణం లేదు కనుక ఆత్మను తెలుసుకున్న వాడు మరణానికి భీతి చెందడు. దుఃఖించడు.

***అశరీరం శరీరేషు అనవస్థేషు అవస్థితమ్***
***మహాన్తం విభు మాత్మానం మత్వా ధీరో న శోచతి ॥***

అనిత్యములైన దేహాలలో ఉండినా ఆత్మ దేహము లేనిది. శ్రేష్ఠ మైనది. సర్వగత మైనది. అట్టి ఆత్మను తెలుసుకున్న వాడు ధీరుడు. దుఃఖం తెలియని వాడు.

*ఆత్మను ఖండించలేరు, మండించలేరు అంటూ ఉంటే, ఎందుకని ఆత్మను నాశనం చెయ్యలేరు? అనే ప్రశ్న పుడుతుంది. దానికి సమాధాన మేమిటి? ఏముంది? సాధ్యం కాదు కనుక, అనేదే సమాధానం.*

**అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవ చ ।**
**నిత్యః సర్వగతః స్థాణు రచలోఽయం సనాతనః ॥** 24

***అచ్ఛేద్యః-అయం-అదాహ్యః-అయం-అక్లేద్యః-అశోష్యః-ఏవ-చ***
***నిత్యః-సర్వగతః-స్థాణుః-అచలః-అయం-సనాతనః***

| | | | | | |
|---|---|---|---|---|---|
| అయం | = | ఈ ఆత్మ | అయం | = | ఇది |
| అచ్ఛేద్యః | = | ఛేదింప రానిది | నిత్యః | = | నిత్య మైనది |
| అయం | = | ఈ ఆత్మ | సర్వగతః | = | అంతటను వ్యాపించినది |
| అదాహ్యః | = | దహింప రానిది | స్థాణుః | = | స్థిర మైనది |
| అక్లేద్యః | = | తడుప రానిది | అచలః | = | చలనము లేనిది |
| అశోష్యః ఏవ చ | = | ఎండింప లేనిది | సనాతనః | = | శాశ్వత మైనది |

**ఆత్మ ఖండింప బడదు. కాల్చబడదు. తడుప బడదు. ఎండింప బడదు. ఆత్మ నిత్య మైనది. అంతటా వ్యాపించి ఉండునది. సుస్థిర మైనది. చలనము లేనిది. ప్రాచీన మైనది.**





**వ్యాఖ్య**

***అయం*** అంటే ఇది అని అర్థము. మనకు ఆత్మ ఒక్కటే 'ఇది'గా తెలుస్తూ ఉంటుంది. ఆత్మకు అన్యంగా తెలిసేవి అన్నీ 'అది'గా, 'అవి' గానే ఉంటాయి.

మనకు దూరంగా ఉన్న గోడను, ఆ గోడ అంటాము. మన చేతి లోని పువ్వును ఈ పువ్వు అంటాము. అదే పువ్వును చూచిన కంటిని గూర్చి మాట్లాడ వలసి వచ్చి నపుడు ఆ పువ్వు - ఈ కన్ను అంటాము. అలాగే ఆంతర్యం లోకి మరలితే, ఆ కన్ను - ఈ మనస్సు, ఆ మనస్సు - ఈ బుద్ధి, ఆ బుద్ధి - ఈ అజ్ఞానము, ఆ అజ్ఞానము - ఈ జ్ఞానము, ఆ జ్ఞానము - దానిని తెలుసుకొనే ఈ ఆత్మ. . . అదే **అయం ఆత్మా** - ఈ ఆత్మ. అదే మన స్వరూపము.

***సర్వం హ్యేతద్బ్రహ్మ, అయమాత్మా బ్రహ్మ***
***సోయమాత్మా చతుష్పాత్***

ఈ సర్వమూ బ్రహ్మ స్వరూపమే. ఈ ఆత్మయే బ్రహ్మము ***(అయం - ఆత్మా - బ్రహ్మ)***. ఆ ***(సః)*** ఈ ***(అయం)*** ఆత్మ ***(ఆత్మా)*** నాలుగు పాదాలతో ఉంది ***(చతుష్పాత్)*** అని మాండూక్యోపనిషత్ ప్రబోధము.

***అయమాత్మా బ్రహ్మ.*** ఈ ఆత్మయే బ్రహ్మము అనే మహావాక్యంలో 'అయం' అనే ఏ పదము చేత ఆత్మ సూచింప బడిందో, అదే ప్రస్తుత శ్లోకంలో ***అయం*** అంటూ ఆత్మరూపంగా ఉపయోగింప బడింది.

ఈ ఆత్మ ***(అయమాత్మా)*** నరక డానికి వీలు లేనిది. కాల్చడానికి వీలు కానిది. ముంచ డానికి సాధ్యం కానిది. ఎండింప డానికి వీలు పడనిది. ఎందుకని? రెండవ పాదంలో సమాధానం చెబుతున్నాడు. ఆత్మ నిత్య మైనది. సర్వగత మైనది. స్థిరమైనది. చలనము లేనిది. సనాతన మైనది. కనుక పంచభూతాల చేత నశింప బడుటకు అసాధ్య మైనది.

వధించడం కర్మ. వధింప బడటం కర్మ. శస్త్రాదుల చేత చంప బడుటకు ఆత్మ అయోగ్యము, అనర్హము అనేది ఈ శ్లోకంలో నిరూపించ బడుతూ ఉంది. అంటే ఎట్టి క్రియకు కూడా ఆత్మ కర్మ కాలేదు. క్రియాఫలము ఉన్నప్పుడే కర్మత్వము సంభవిస్తుంది. ఆత్మ ఏ క్రియకు ఫలము కాదు.

కర్మల వలన నాలుగు విధాలైన క్రియాఫలాలు కలుగుతాయి. ఈ నాల్గింటిలో ఏదో ఒకటి సంభవించే అవకాశం ఉన్నప్పుడే కర్మత్వము ఉంటుంది (ఏ క్రియాఫలమైనా, హననక్రియా ఫలమైనా కూడా). ఆ నాలుగు ఏమిటి అంటే (1) ఉత్పాద్యం (2) ప్రాప్యం (3) వికార్యం (4) సంస్కార్యం. ఈ నాలుగింటిలో ఏదో ఒక క్రియాఫలం ఉన్నప్పుడే కర్మత్వం ఉంటుంది.

***(1) ఉత్పాద్యం*** :- ఆత్మ ఉత్పాద్యం కాదు. నూతనంగా మనం కుండను తయారు చేసినట్లు, ఆత్మను ఉత్పత్తి చెయ్యడం సాధ్యం కాదు. ఆత్మ స్వతస్సిద్ధం. ఉత్పత్తి చేయాలి అనే ఆలోచనకు ముందే ఆత్మ ఉంది. అలాంటప్పుడు ఆత్మను పుట్టించడం సాధ్యమా? కాదు. కనుక ఆత్మ నిత్యము.

***(2) ప్రాప్యం*** :- వస్తువు ఉంది. దేశకాలాదులలో ప్రయత్నిస్తే పొందుతాము. ఆవు పొదుగులో పాలున్నాయి. ఆవు గోశాలలో ఉంది. మనం ఇక్కడ కూర్చుంటే పాలు లభ్యం కావు. అక్కడి కెళ్ళాలి. పాలు పిండి తెచ్చుకోవాలి. ఇది ప్రాప్యం. ఆత్మ అలా లభ్య మవుతుందా? కాదు. ఎందుకని? ఆత్మ అంతటా ఉంది.

***(3) వికార్యం*** :- ఇక మూడవది వికార్యం. అంటే, పరిణామం చెందడం. ఈ పరిణామ కార్యము యొక్క ఫలంగా కర్మత్వము ఉండట మని అర్థము. పాలు ఉన్నాయి. మనకు నెయ్యి కావాలి. పాలను తోడు పెట్టాలి.

మజ్జిగ చేయాలి. వెన్న తీయాలి. నెయ్యి పొందాలి. అంటే, ఒక పరిణామ క్రమంలో పాల నుండి మనకు నెయ్యి లభిస్తూ ఉంది. ఆత్మ అలా లభిస్తుందా? లభించదు. ఆత్మ స్థిరమైనది కనుక పరిణామం చెందదు. సత్తు అయిన ఆత్మ అవికార్యము.

***(4) సంస్కార్యం :-*** సంస్కరించడం వల్ల కలిగే ఫలము అని అర్థము. దర్పణముపై దుమ్ము ఉంది. మనం ఎంత ప్రయత్నించినా అందులో మన ప్రతిబింబము కనిపించదు. దుమ్ము దులుపుతాము. అద్దం మళ్ళీ స్వచ్ఛంగా మన రూపాన్ని ప్రతిఫలింప చేస్తుంది. ఇది శుద్ధికార్యము. ఆత్మ అచలం కనుక సంస్కార్యం కాలేదు.

అందుచేత పృథివ్యాదులకు ఆత్మ విషయం కాదు. శస్త్రాదులకు విషయం కాలేదు. కాని ఇక్కడ మరొక ముఖ్య విషయ ముంది. ప్రస్తుతం ఈ శ్లోకంలో ఆత్మ ***అచ్ఛేద్య*** మని, ***అదాహ్య*** మని, ***అక్లేద్య*** మని, ***అశోష్య*** మని ఏదయితే చెప్పబడిందో, ముందు శ్లోకంలో, అంటే ఇరవై మూడవ శ్లోకంలో చెప్ప బడింది కూడా అదే కదా! అదే విషయాన్ని పున: ప్రస్తావించడం పునరుక్తి దోషం కాదా!

**పునరుక్తి లేదు - అతివ్యాప్తి రాదు**

ఈ సందర్భములో ఆత్మను గూర్చి విచారం చేస్తున్న ఈ శ్లోకాలలో పౌనరుక్త్యం ఉంది అని కొందరు శంకిస్తూ ఉంటారు. పౌనరుక్త్యం అంటే పునరుక్తి దోషం. అంటే, చెప్పిందే చెప్పడం, మళ్ళీ మళ్ళీ చెప్పడం పునరుక్తి దోషం అనబడు తుంది.

***న జాయతే మ్రియతేవా*** అనే శ్లోకం లోనే ఆత్మ నిత్యమైనది, ఏ విధమైన వికారములు లేనిది అని స్పష్టంగా చెప్ప బడింది. ఆ తరువాత శ్లోకాలలో ఆత్మను గూర్చి చెప్పిన దంతా ఈ శ్లోకంలో చెప్పిన దాని కన్నా భిన్నం కాదు, అధికంగానూ లేదు. కొంత విషయము శబ్దము చేత, కొంత విషయము అర్థము చేత పునరుక్తం అయింది. ***( కించిత్ శబ్దత: పునరుక్తం, కించిత్ అర్థత: ఇతి )***. కనుక ఇక్కడ పునరుక్తి దోషం ఉంది అని సంశయిస్తారు. కాని, దీనిని పౌనరుక్త్యం అని భావించ కూడదు.

ఆత్మ విషయము దుర్జ్ఞేయము. సులభంగా గ్రహించడం సాధ్యం కాదు. అందుచేత, స్వయంగా తానే ఆత్మ ప్రసంగం కల్పించుకొని వేరు వేరు శబ్దాలతో, అర్థాలతో బోధిస్తూ ఆత్మ విషయాన్ని సులభతరం చేస్తున్నాడు భగవంతుడు. ఇలా ఎందుకు చేస్తున్నాడు? అంటే, క్లిష్టమైన, గహనమైన ఆత్మతత్త్వమును తెలుసు కొనిన సంసారులు సంసారాల నుండి బయటపడ గలుగుతారు అనే ఉద్దేశం తోనే పరమేశ్వరుడైన వాసుదేవుడు అలా పదే పదే చెబుతున్నాడు అని శ్రీ శంకరుల వారు కూడా భాష్యంలో అభిప్రాయ పడ్డారు ***(కథం ను నామ సంసారిణామ్ అవ్యక్తం తత్త్వం బుద్ధి గోచరతామ్ ఆపన్నం సత్ సంసార నివృత్తయే స్యాత్ ఇతి )***.

పునరుక్తి దోషం వేదాంత శాస్త్రానికి లేదు. కాని, ఈ శ్లోకంలో ప్రస్తావించిన ***అచ్ఛేద్య, అదాహ్య, అక్లేద్య, అశోష్య*** మనే లక్షణాలు ఆత్మ యందే కాకుండా వేరే చోట కూడా అగుపిస్తాయి. ఇలా, ఒక దాని లక్షణాలు మరొక దాని యందు ప్రవర్తిస్తూ ఉండటం, లేదా వ్యాపించి ఉండటం అతివ్యాప్తి దోషం.

ఆత్మ ఖండింప బడదు. మండింప బడదు. తడుప బడదు. ఎండింప బడదు. ఈ నాలుగు లక్షణాలు ఆకాశానికి కూడా ఉన్నాయి. ఆకాశాన్ని ఖండించ లేము. కాల్చలేము. తడప లేము. ఎండబెట్ట లేము. ఆత్మకు చెప్పిన ఈ నాలుగు లక్షణాలు పంచభూతాలలో ఆకాశతత్త్వంలో కనిపిస్తున్నాయి.

అంతేకాదు. చతుర్విధ భూతాలు ఆకాశాన్నే కాదు, సూక్ష్మ శరీరాన్ని కూడా ఏమీ చేయలేవు. మనోబుద్ధుల్ని కూడా శస్త్రాలు ఖండించ లేవు. అగ్ని దహింప చేయ లేదు. నీళ్ళు ముంచ లేవు. వాయువు ఆరబెట్ట లేదు.





కనుక, ఈ సందర్భములో ఆత్మను గూర్చి చెప్పిన నాలుగు లక్షణాలు ఆకాశానికి, సూక్ష్మ శరీరానికి కూడా సంబంధించి ఉండటం చేత ఇక్కడ అతివ్యాప్తి దోషం వస్తుంది. శ్రీకృష్ణుడు చెప్పింది ఆత్మను గూర్చి కాదేమో, ఆకాశాదులను గూర్చి ముచ్చటించా డేమో అనే శంక కలుగుతుంది. ఈ సందేహాన్ని నివృత్తి చేస్తూ, అతివ్యాప్తి కాదు అని చెప్పడానికి గీతాచార్యుడు **నిత్యము, సర్వగతము, స్థాణువు, అచలము, సనాతనము** అంటూ శ్లోకము యొక్క రెండవ పాదములో ఉటంకించి, ఈ లక్షణాలు ఆత్మకే గాని ఆకాశాదులకు వర్తించవు అని తేటతెల్లం చేశాడు.

ఆత్మ కాలపరిధి లోకి రాదు. ఇప్పుడు ఉండి అప్పుడు లేనిది కాదు. కాలంలో ఉత్పత్తి అయినది కాదు కనుక ఆత్మ ఉత్పాద్యం కాదు. కాలంలో ఆవిర్భవించినవి కాలంలో నశించి తీరుతాయి. ఆత్మ కాలంలో పుట్టింది కాదు కనుక నశించదు. ఈ కారణం చేత ఆత్మ నిత్యము ***( నిత్య: )***.

ఆత్మ దేశ పరిధి లోకి కూడా రాదు. ఇక్కడ ఉండి అక్కడ లేనిది కాదు. కనుక అది దేశంలో ప్రాప్యం కాదు. అలా ఒక ప్రదేశానికి పరిమిత మైనవి గతించి పోతాయి. ఆత్మ దేశంలో ఉండేది కాదు. దేశకాలాదులు ఆత్మస్ఫూర్తి తోనే తెలుస్తాయి. అందుచేత ఆత్మ అంతటా ఉంది ***( సర్వగత: )***.

ఆత్మ నిత్యం కనుక మార్పు చెందదు. మార్పు లేనిది కనుక అవికార్యంగా తెలుస్తూ ఉంది. ఆత్మ లేని చోటంటూ లేదు కనుక వికార్యానికి అవకాశం లేనిదై స్థిర మైనదిగా ఉంది ***( స్థాణు: )***.

ఆత్మను శుద్ధి చేయడం కూడా సాధ్యం కాదు. ఆత్మను శుద్ధి చేయడానికి ఆత్మ కన్నా వేరుగా రెండవ వస్తువు ఉంటే కదా! కనుక ఏ విధమైన సంస్కార్యానికి అవకాశం లేకుండా ఉంది. ఆత్మ చలన రహిత మైనది ***( అచలం )***.

కర్మజనిత ఫలాలైన ఉత్పాద్యం, ప్రాప్యం, వికార్యం, సంస్కార్యం అనే చతుర్విధ ఫలాలు ఆత్మ విషయంలో నిషేధింప బడు తున్నాయి కనుక ఆత్మ శాశ్వత మైనది. స్థిరమైనది. నిత్య మైనది. సర్వగత మైనది. సనాతన మైనది ***( సనాతనమ్ )***. దీనినే క్రమంగా గుర్తించి అర్థం చేసుకుందాం.

చతుర్విధ భూతాలు ఆత్మను నశింప చేయలేవు కనుక ఆత్మ నిత్యము ***( భూతాని ఏనం ఆత్మానం నాశయితుం న ఉత్సహన్తే, తస్మాత్ నిత్య: )***. ఆత్మ నిత్యము కనుక సర్వగతము ***( నిత్యత్వాత్ సర్వగత: )***. సర్వగతము కనుక ఆత్మ స్థాణువు ***(సర్వగతత్వాత్ స్థాణు: )***. స్థాణువు కనుక స్థిరము, ధ్రువము ***( స్థాణు: ఇవ స్థిర: )***. స్థిరము కనుక ఆత్మ అచలము ***(స్థిరత్వాత్ అచల: )***. ఈ విధంగా ఈ ఆత్మ సనాతనము. చిరంతనము ***(అయం ఆత్మా అత: సనాతన: చిరంతన: )***.

ఇవన్నీ అతివ్యాప్తి దోషాన్ని నివారిస్తాయి. అంతేకాదు. ***అచ్ఛేద్యం, అదాహ్యం, అక్లేద్యం, అశోష్యం*** అంటూ ముగిస్తే, ఆత్మ లేని దేమో, శూన్యమేమో అని భావించే ప్రమాదం కూడా లేక పోలేదు. ఎందుకంటే, లేని దానిని ఎవరు ఖండిస్తారు? ఎవరు మండిస్తారు? ఎవరు తడుపుతారు? ఎవరు ఎండ బెడతారు? కనుక ఆత్మ లేనిదే నేమో! శూన్య మేమో! అనే సందేహాన్ని నివారిస్తూ, ఆత్మ **నిత్యము, సర్వగతము, స్థిరము, అచలము, సనాతనము** అని చెప్పడం జరిగింది.

*అద్భుతమైన ఈ ఆత్మ విషయ ప్రసంగము తరువాత శ్లోకంలో కూడా కొనసాగుతూ ఉంది.*

**అవ్యక్తోఽయ మచిన్త్యోఽయ మవికార్యోఽయ ముచ్యతే ।**
**తస్మాదేవం విదిత్వైనం నానుశోచితు మర్హసి ॥** 25

***అవ్యక్తః-అయం-అచింత్యః-అయం-అవికార్యః-అయం-ఉచ్యతే***
***తస్మాత్-ఏవం-విదిత్వా-ఏనం-న-అనుశోచితుం-అర్హసి***

| | | | | | |
|---|---|---|---|---|---|
| అయం | = ఈ ఆత్మ | | తస్మాత్ | = | అందువలన |
| అవ్యక్తః | = వ్యక్తము కానిది | | ఏనం | = | ఈ ఆత్మను |
| అయం | = ఈ ఆత్మ | | ఏవం | = | ఈ రీతిగా |
| అచింత్యః | = చింతింప వీలు కానిది | | విదిత్వా | = | తెలిసికొని |
| అయం | = ఈ ఆత్మ | | అనుశోచితుం | = | దుఃఖించుటకు |
| అవికార్యః | = వికారము లేనిది | | న అర్హసి | = | తగవు |
| ఉచ్యతే | = చెప్పబడింది | | | | |

**ఆత్మ ఇంద్రియాలకు గోచరము కాదు. మనస్సు ఆత్మను ఊహించ లేదు. ఆత్మ మారేది కాదు. ఈ విధంగా ఆత్మను అర్థం చేసుకుంటే, నువ్వు దుఃఖించే అవసరం ఉండదు.**

**వ్యాఖ్య**

దుఃఖింప దగినది శోచ్యం. దుఃఖింప దగనిది అశోచ్యము. విచారించి అర్థం చేసుకుంటే ఇక్కడ దుఃఖింప దగినది ఏదీ లేదు. ఏ సన్నివేశమూ శోచ్యం కాదు. ఏ వ్యక్తీ శోచ్యుడు కాడు. అంతా అశోచ్యమే. అందరూ అశోచ్యులే. ఈ సత్యం అర్థమైన వాళ్ళు పండితులు. దుఃఖం తెలియని వాళ్ళు. ఇది అర్థం కాని వాళ్ళు పండితులు కారు. కనుకనే దుఃఖిస్తూ ఉంటారు.

అర్జునుడు దుఃఖిస్తున్నాడు. ఆగకుండా తెగ ఏడుస్తున్నాడు. అర్జునుణ్ణి పండితుణ్ణి చేయాలని శ్రీకృష్ణుడు భావించాడు. ఆత్మానాత్మ వివేకాన్ని మారి పోశాడు. పిండి మరీ త్రాగించాడు. దుఃఖహేతువును సమూలంగా విశేధించి నిర్మూలించాడు.

అర్జునా! నీ దుఃఖానికి కారణం నీవా? నీవు కానిదా? అనే ప్రశ్నను లేవదీశాడు. దుఃఖానికి నీవే కారణమైతే ఏదీ శోచ్యం కాదు. ఎవరూ శోచ్యులు కారు. ఒకవేళ, నీవు కానిది నీ దుఃఖానికి కారణమైతే, అప్పుడు కూడా ఏదీ శోచ్యం కాదు. ఎవరూ శోచ్యులు కారు అనే విషయాన్ని ఇంతవరకు అమోఘంగా ప్రవచించాడు. ఈ ప్రసంగాన్ని ఇంతటితో విరమించే ప్రయత్నంలో, నీవు నిత్యాత్మవే కనుక, దుఃఖింప వలసిన అవసరం లేదంటూ, ***అశోచ్యా నన్వ శోచస్త్వం*** అనే విషయానికి పూర్ణత్వాన్ని కల్పిస్తూ, బోధకు తుది మెరుగులు దిద్దుతున్నాడు.

అర్జునా! ఈ ఆత్మ అవ్యక్తము. అచింత్యము. అవికార్యము. కనుక దుఃఖింప నవసరం లేదు అంటున్నాడు.

**అవ్యక్తం - అశోచ్యం**

ఇంద్రియాలకు ఏది గోచరమో అది వ్యక్తము. కాని, ఆత్మకు రూపాదులు లేనందున ఏ ఇంద్రియానికి కూడా ఆత్మ గోచరం కాదు. కనుక, ఇంద్రియ అప్రత్యక్ష మగుట చేత ఆత్మ అవ్యక్తము ***( సర్వ కారణ అవిషయత్వాత్ ).***

స్థూలదేహం వ్యక్త మౌతూ ఉంది. వ్యక్తమయ్యే స్థూల దేహం ఉంది అని అర్థం చేసుకొనే సూక్ష్మదేహం కూడా వ్యక్త మౌతూ ఉంది. మనలో దుఃఖం ఉంది. బాధ ఉంది. సంశయం ఉంది. సంతోషం ఉంది. ఇవన్నీ సూక్ష్మ దేహమైన మనస్సులో వ్యక్త మవుతూ ఉన్నాయి. ఎవరికి వ్యక్త మవుతున్నాయి? దేహేంద్రియాలకు మాత్రం కాదు. అవ్యక్తానికే వ్యక్త మవుతున్నాయి. కనుక ఆత్మ అవ్యక్తం. అనగా ఇంద్రియాలకు వ్యక్తం కానిది.





ఈ అవ్యక్త మనే పదాన్ని రెండు శ్లోకాలు దాటితే ఇరవై ఎనిమిదవ శ్లోకంలో విశేషంగా ఉపయోగించాడు భగవానుడు. ఏదో అర్థం గాని అవ్యక్తం నుండి జీవులు వచ్చారని, అలాగే మరణించి అవ్యక్తం లోకి పోతున్నారని, ఈ మధ్య లోనే వ్యక్త మవుతున్నా రని అవ్యక్తాన్ని అయోమయంగా, మాయావరణంగా విశేష రూపంలో వర్ణించడం జరిగింది.

కఠోపనిషత్తులో అవ్యక్తమును కార్యకారణ శక్తి సముదాయంగా పేర్కొంటూ, ***అవ్యక్తాత్ పురుషః*** అవ్యక్తము కంటే పురుషుడు శ్రేష్ఠుడని తెలిపి, ***పురుషాన్న పరం కించిత్ ( పురుషాత్ పరం కించిత్ న )***, పురుషుని కంటే శ్రేష్ఠ మైనది మరొకటి లేదు అని యమధర్మరాజు నచికేతునికి బోధించాడు.

కాని, ఈ శ్లోకంలో గీతాచార్యుడు అవ్యక్త మని చెబుతున్నది ఆత్మ విషయమే. దీనిని తెలుసుకుంటే ***(ఏవం విదిత్వా)*** దుఃఖించే కార్యము ఉండదు అని ఫల మేమిటో కూడా చెబుతున్నాడు.

**అచింత్యం - అశోచ్యం**

ఇంద్రియ ప్రత్యక్షం కానందున ఆత్మను అవ్యక్తం అన్నాడు. అంటే, ప్రత్యక్షాది ప్రమాణాలకు అందనిది అని అర్థం. ప్రత్యక్ష ప్రమాణాలకు అందని అవ్యక్తాత్మ అనుమాన ప్రమాణానికి అందే అవకాశ ముందేమో! అనే సంశయాన్ని నివారిస్తూ, ఆత్మను అచింత్య మని చెబుతున్నాడు.

పొగతో ఉన్న నిప్పును ఒక చోట సమీపంగా కళ్ళతో చూస్తాము. ఇది ప్రత్యక్షం. ఆ తరువాత మరొక చోట దూరంగా ఉన్న పొగను మాత్రమే చూసి, అక్కడ నిప్పు ఉంది అని నిర్ణయిస్తాము. నిప్పు కళ్ళకు కనిపించక పోయినా, ధూమం కనిపించడం వలన అగ్ని అనుమేయ మవుతూ ఉంది. ఇది అనుమాన ప్రమాణము.

ప్రత్యక్షం కాని దాని విషయంలో అనుమాన ప్రమాణము సిద్ధించదు. నిప్పును ప్రత్యక్షంగా చూసినట్లు మనము ఆత్మను చూడ లేదు. అందుచేత అనుమేయానికి అవకాశము లేక ఆత్మ అచింత్యమని చెప్పబడింది.

అనుమాన ప్రమాణం ఫలించాలంటే మనస్సులో వృత్తులు కదలాలి. వృత్తికి ఆత్మ విషయం కావాలి. మనస్సు ఆత్మను గూర్చి ఆలోచించ లేదు. ఆత్మ ఉండటం చేతనే మనస్సుకు ఆలోచించే సామర్థ్యం కలుగుతోంది ( ***చైతన్య జ్యోతిషా అవభాసితస్య మనసః మనన సామర్థ్యం*** - కేన భాష్యం). కనుక ఆత్మ చింతించుటకు వీలు కానిది. ఆత్మ అద్వయము. ఆత్మను తెలుసుకోవ డానికి ఆత్మ తప్ప మరొకటి లేదు ***(నాఽ న్యోతోఽ స్తి విజ్ఞాతా)*** అని వేదం చెబుతూ ఉంది.

**అవికార్యం - అశోచ్యం**

వికారం చెందేది కానందున ఆత్మ అవికార్యము. పాలు తోడు పెట్టి నపుడు పెరుగు మొదలైన పదార్థముల రూపంలో వికారం చెందుతాయి. ఆత్మ నిరవయవం కనుక అది వికారం చెందే అవకాశం లేదు. అవయవాలు లేనిది ఏదైనా వికారం చెంద లేదు. ఆత్మకు అవయవాలు లేవు కనుక అది అవికార్యం ***(అవిక్రియత్వాత్ అవికార్యః ).***

ఇరవై నాల్గవ శ్లోకంలో కర్మజన్య ఫలాలను గూర్చి తెలుసుకు న్నప్పుడు క్రొత్తగా పుట్టడం అనే 'ఉత్పాద్యం' ఆత్మ విషయంలో పొసగదు అని అర్థం చేసుకున్నాం. అంటే ఆత్మ 'అనుత్పాద్యం' అని అర్థం. అనుత్పాద్యత్వము అనే ఆత్మ ధర్మానికి అవికార్య మనే ఈ విశేషణము ఉపలక్షణంగా కనబడుతోంది. ఈ విషయం వేదంలో కూడా విస్పష్టంగా ఉంది ***పురస్తాత్సిద్ధం బ్రహ్మ ( పురస్తాత్ - సిద్ధం - బ్రహ్మ ).*** దృశ్యంగా వ్యక్త మయ్యేవి ప్రభవించక ముందే బ్రహ్మము ఉంది అని దాని అర్థం. అంటే అవికార్యంగా ఉంది అని భావము.

ప్రపంచంలో ప్రతిదీ మార్పు చెందుతూ ఉంటుంది. అణుశాస్త్ర పరిశోధనలో క్షణంలో పదార్థం మార్పు

చెందు తుందని, ముఖ్యంగా 'పార్టికల్ ఫిజిక్స్'లో అరక్షణం కాలంలో అణువు విభాగ మవుతుందని, అలా విభాగమైన అణువు ఛేదింప బడి నపుడు అసంఖ్యాకము లైన భాగాలుగా విడి పోతుందని శాస్త్రజ్ఞులు ఆశ్చర్యకర మైన విషయాల్ని చెబుతున్నారు.

**సర్వ సాక్షిత్వం**

స్థూల సూక్ష్మ కారణ శరీరాలకు ఆత్మ విలక్షణంగా ఉంది (**స్థూల సూక్ష్మ కారణ శరీరాత్ వ్యతిరిక్తః**). స్థూల శరీరం ప్రత్యక్షంగా వ్యక్త మవుతుంది. ఆత్మ స్థూల శరీరం లాగా వ్యక్త మయ్యేది కాదు కనుక అవ్యక్తము (**అవ్యక్తో౽ యం**). ఆత్మ చింతించ డానికి వీలు లేనిది. సంకల్పాలకు, ఊహలకు అందేది కాదు. ఆత్మ సూక్ష్మ శరీరం లాగా చింతించుటకు సాధ్యము కానిది కనుక అది అచింత్యము (**అచింత్యో౽ యం**). కారణ శరీరం వికారం చెందుతుంది. ప్రియాది వృత్తి సహితంగా ఉంటుంది. ఆ విధంగా ఆత్మ వికారం చెందేది కాదు. కారణ శరీరము లాగా వికారము చెందేది కాదు కనుక ఆత్మ అవికార్యము (**అవికార్యో౽ యం**).

అర్జునా! ఈ విధంగా ఆత్మను తెలుసుకుంటే (**విదిత్వా**) చావు దుఃఖాన్ని కలిగించ లేదు. నేను వీళ్ళను చంపుతున్నాను (**హన్తా అహమ్ ఏషామ్**), నా చేత వీళ్ళు చంపబడు తున్నారు (**మయా ఇమే హన్యన్తే**) అని దుఃఖించడం జరగదు. అర్జునా! భయంకర మైన శస్త్రాస్త్రాలు, మారణాయుధాలు స్పృశించ లేని ఆత్మ విషయంలో ఇక నువ్వు దుఃఖింప పని లేదు అన్నాడు భగవానుడు (**న అనుశోచితుం అర్హసి**).

ప్రమాణం లేకుండా ప్రమ కలగదు. ముఖ్యంగా ఆత్మ విషయంలో శ్రుతి ప్రమాణానికి దూరమై జ్ఞానమును పొందడం సాధ్యం కాదు. ఆత్మబోధను గ్రహించ డానికి కావలసిన బోధనావిధి భారతదేశం లోనే ఉంది. అందుచేతనే, పాశ్చాత్యులలో ధర్మబోధను అందించే వారు ఉంటారే గాని, ఆత్మజ్ఞానం కలవారు అరుదుగా ఉంటారు. అలా అరుదైన అసమాన వ్యక్తి, అద్భుత శక్తి సోక్రటీస్ మహాశయుడు.

సోక్రటీస్ ప్రబోధాల వల్ల ఏథెన్స్ ప్రజలు పాడై పోతున్నారని, ముఖ్యంగా యువత చెడిపోతూ ఉందని ఆయనపై అభియోగాన్ని మోపుతూ న్యాయస్థానంలో వ్యాజ్యము నమో దైంది. చివరికి తీర్పు రానే వచ్చింది. సోక్రటీస్‌ను విషం త్రాగి మరణించమని న్యాయస్థానం తీర్పు చెప్పింది.

సోక్రటీస్ ప్రశాంతంగా కనిపించాడు. శిక్షను అమలు పరచారు. సోక్రటీస్ విషాన్ని పానం చేశాడు. ఆ తరువాత కూడా చాలా ప్రశాంతంగా కనిపించాడు. ఆయన ముఖంలో భయాందోళనలు గోచరించ లేదు.

సోక్రటీస్‌ను దర్శించి చాలా మంది దుఃఖించారు. వారందరిని సోక్రటీస్ అనునయించాడు. తన ప్రశాంతతకు భంగం కలిగించ వద్దని ఆజ్ఞాపించాడు.

క్రైటో అనే వృద్ధుడు సోక్రటీస్‌ను సమీపించి, "In what way shall we bury you, Socrates?" 'సోక్రటీస్! నిన్ను ఎలా పూడ్చ మంటావు?' అని అడిగాడు.

"In any way you like, but first, you must catch me, the real me. Be of good cheer, my dear Crito, and say that you are burying my body only, and do with that whatever is usual and what you think best" అని సమాధానం చెప్పాడు సోక్రటీస్.

'నీకు ఎలా తోస్తే అలా చెయ్యి. కాకపోతే, ముందు నువ్వు నన్ను పట్టుకో. నా నిజ స్వరూపాన్ని పట్టుకో. నా ప్రియమైన క్రైటో! సంతోషంగా ఉండు. నువ్వు పూడ్చిపెట్టాలి అనుకొనేది నా శరీరాన్ని మాత్రమే. సాధారణంగా అందరూ ఎలా చేస్తారో అలాగే చెయ్యి! లేదా, నీకు ఏది మేలనిపిస్తే అది చెయ్యి!' అని ప్రశాంతంగా పలికాడు సోక్రటీస్.





అదొక దివ్యానుభూతి. అద్భుత మైన అంతరంగి కానుభూతి. ఆత్మవిదుని జ్ఞానానంద స్వరూప విలాసము. చిరంత నానంద చిద్విలాసము.

మేలుకున్న వాడు స్వప్నగత దేహానికి అలంకరణలు చేయాలని భావిస్తాడా? త్రాడును దర్శించిన వాడు పాము కోసం అన్వేషిస్తాడా? కలలో ఏమి జరిగితే ఏమైంది? పల్లకీలో ఊరేగినా, పాడెపై పవ్వళించినా, యుద్ధంలో నిలిచినా, అర్జునా! ఎవరి మనస్సు వ్యాకులత చెందదో, చంద్రబింబము లాగా పూర్ణమై, ప్రశాంతంగా ఎవడు కనిపిస్తాడో వాడే ఆత్మజ్ఞుడు. ఇదే జ్ఞానం. ఆత్మజ్ఞానం. గీతాజ్ఞానం. ఉపనిష ద్వైభవం.

**తుషార కర బింబాచ్ఛం మనో యస్య నిరాకులమ్**
**మరణోత్సవ యుద్ధేషు స శాన్త ఇతి కథ్యతే॥**

రణం లోను, మరణం లోను, ఉత్సవం లోను ఎవరి మనస్సు కలత పడదో, పూర్ణేందు బింబము వలె స్వచ్ఛమైన ప్రశాంతతతో ఎవడు శోభిస్తూ ఉంటాడో అతడే ఆత్మజ్ఞుడు అన్నది ఉపనిషత్తు.

*ఆత్మ నిత్యము. సర్వగతము. అట్టి ఆత్మకు నాశము లేదని, నాశము లేని దాని కొరకు దుఃఖించ నవసరం లేదని ఇంతవరకు గీతాచార్యుడు బోధించాడు. ఒకవేళ ఆత్మ నశించేదే అని సామాన్యుల వలె భావించినా కూడా దుఃఖించ వలసిన అవసరం లేదు అని చెబుతున్నాడు.*

అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతమ్ ।
తథాపి త్వం మహాబాహో నైవం శోచితు మర్హసి ॥ 26

*అథ-చ-ఏనం-నిత్యజాతం-నిత్యం-వా-మన్యసే-మృతం*
*తథాపి-త్వం-మహాబాహో-న-ఏవం-శోచితుం-అర్హసి*

| | | | | | |
|---|---|---|---|---|---|
| మహాబాహో | = | అర్జునా! | అథ మన్యసే చ | = | భావిస్తున్నావేమో |
| త్వం | = | నీవు | తథాపి | = | అట్లైనా కూడా |
| ఏనం | = | ఈ ఆత్మను | ఏవం | = | ఈ విధముగ |
| నిత్యజాతం | = | నిత్యము పుట్టుచున్న దానినిగా | శోచితుం | = | దుఃఖించుటకు |
| నిత్యం | = | నిత్యమును | న అర్హసి | = | తగవు |
| మృతం వా | = | నశించుచున్న దానినిగా | | | |

**అర్జునా! ఆత్మ ఎప్పుడూ పుడుతూ ఉంటుందని, ఎప్పుడూ చస్తూ ఉంటుందని భావిస్తున్నావా? అలా చూచినా నువ్వు దుఃఖింప నవసరం లేదే!**

**వ్యాఖ్య**

ప్రామాణికంగా, తాత్త్వికంగా పదకొండవ శ్లోకం నుండి గీతాచార్యుడు అందించిన నిత్యాత్మ బోధ ఇక్కడ తాత్కాలికంగా ఆపాడు. మరో విధమైన వాదమును లౌకికుల స్థాయి నుండి ప్రారంభించి, ఆ కోణం నుండి కూడా పరిష్కారాన్ని అందిస్తున్నాడు.

*అథ చ* - అని ప్రారంభించి నపుడే విషయం మరొక మలుపు తిరిగింది అని అర్థము. 'ఒకవేళ' అనే భావంతో చెప్పి నప్పుడు, అది సాధారణ జనుల స్థాయి నుండి చెప్పినదే గాని, సిద్ధాంత పరంగా నిర్ణయించినది కాదు అని అర్థము. *అథ చ* అనేది అంగీకార సూచకంగా కూడా వాడతారు. ఒకవేళ, ఆ పక్షాన్ని అంగీకరించినా కూడా అనే ధ్వని ఉంటుంది.

అర్జునా! నిత్యమైన ఆత్మను గూర్చి నీకు సశాస్త్రీయంగా వివరించాను. అనంగీకార మైన విషయం అందులో ఏదీ లేదు. విషయం వాస్తవమే అయినా, అందరూ అంగీకరించాలి అని ఎక్కడుంది? సంస్కారం కూడా ఊరేగుతూ ఉంటుంది కదా! నేను చెప్పింది అంగీకరించ లేని వాళ్ళు, తాము గ్రుడ్డిగా నమ్మే దానినే పట్టుకొని వ్రేలాడుతూ ఉంటారు. అలా చూచినా కూడా దుఃఖించ నవసరం లేదు అంటూ భౌతికవాదుల దృక్పథం నుండి కూడా ఒక రాగం తీస్తున్నాడు మురళీ మోహనుడు.

ఆత్మ నిత్యుడే. కాని, చస్తూ పుడుతూ ఉంటాడు అని కొందరు (తార్కికులు) వాదిస్తూ ఉంటారు. అలా చూచినా దుఃఖించడ మెందుకు? అనేది శ్రీకృష్ణుని అభిప్రాయము.

మరి కొందరు దేహమే ఆత్మ. దేహం పుడితే ఆత్మ పుడుతుంది. దేహం చస్తే ఆత్మ చస్తుంది. ఈ మధ్యలో క్షణం క్షణం మారుతూ ఉంటుంది అని చెబుతూ ఉంటారు (చార్వాకులు).

ఇలాంటి వాదాలను అనుసరించి చూచినా దుఃఖానికి హేతువు కనిపించదు. దేహంతో కలసి పుట్టడం జన్మ. దేహంతో కలసి మరణించడం మృత్యువు. చచ్చేదే మళ్ళీ మళ్ళీ చస్తూ ఉంది. పుట్టేదే మళ్ళీ మళ్ళీ పుడుతూ ఉంది. ఈ వాదమే సత్యము అని అనుకున్నా అది అర్థం చేసుకో దగిందే గాని, దుఃఖించ దగింది కాదు. ఆత్మ అవికార్యము కనుక నిత్యము అని ఇంత వరకు బోధించడం జరిగింది. దానికి భిన్నంగా లౌకిక దృష్టితో ఆత్మ వికార్యమే అని భావించినా దుఃఖించ నవసరం లేదని బోధించడానికే ఈ శ్లోకం చెప్పబడిందని జరిగిందని శ్రీమధుసూదన సరస్వతి అభిప్రాయము.

ఆత్మ సత్. ఆత్మ లేకుండా పోవడం అంటూ ఉండదు (*న అభావః విద్యతే సతః*). కనుక, ఆత్మను సద్రూపం గాను, చావు లేనిది గాను సాంఖ్య ప్రకరణంలో వర్ణించడం జరిగింది. కాని, ఆత్మ చస్తుంది అనేది మాట వరుసకు అంగీకరించి ఈ శ్లోకం చెప్పడం జరిగింది అని శ్రీ హనుమంతుల వారి పైశాచ భాష్యము.

ఆత్మ నిత్యజాతం - నిత్యమృతం. ఎప్పుడూ పుడుతూ ఉంటుంది. ఎప్పుడూ చస్తూ ఉంటుంది అని భావించినా, దుఃఖించ నవసరం లేదు అంటున్నాడు. ఎందుకని? దుఃఖించి సాధించే దేముంది? పుట్టేది పుడుతూనే ఉంటుంది. చచ్చేది చస్తూనే ఉంటుంది (*జన్మవతః జన్మ నాశవతః నాశః*). ఇందులో దుఃఖానికి అవకాశ మెక్కడుంది?

కాని, ఇక్కడ ఒక విచిత్రం ఉంది. ఇలా సిద్ధాంతాల రగడ చేసే వాళ్ళు కూడా చావు దగ్గరయ్యే సరికి ఏడుస్తూనే ఉంటారు. తమ వాళ్ళు పోతున్నారంటే చార్వాకులు కూడా ఏడుస్తారు. మాటలతో ఏడుపులు దూరం కావు. మర్మం తెలిస్తేనే మాయ మవుతాయి. ఆట లాడటం మంచిదే. బ్రతుకుతో ఆడుకోవడం ఎవరికీ శ్రేయస్కరము కాదు.

**చీకటి ముసిరిన చింతల నడుమ**
**ఆడిన ఆటలు చాలవా!**
**మృత్యుపాశము వెంట నున్నది**
**సత్యమార్గమును కనలేవా?**
**తెర పడిందా తనువే లేదు**
**మర్మము నెరిగి సాగిపో**
**రామ రామ జయ రాజారామ్**
**రామ రామ జయ సీతారామ్** అని రామజోగి చిట్కా.





ఈ సందర్భంలో అర్జునుని **మహాబాహో!** అని సంబోధించాడు భగవంతుడు. గొప్ప బాహువులు కలవాడా! అని పిలిచాడు. బాహుబలం కల వాడివి. మంచిదే. దానితో పాటు బుద్ధి బలం కూడా కల వాడివి కా! బలప్రయోగాలు అన్ని వేళల కాపాడవు. బుద్ధి లోని బాధల్ని తొలగించ డానికి జ్ఞానం, అంటే బుద్ధి బలం ఉండాలే గాని, బాహుబలం కాదు.

అర్జునా! ఈ శ్లోకంలో నేను వినిపించిన వాదము నా సిద్ధాంతము కాదు. నీ అభిప్రాయ మని కూడా నేను భావించడం లేదు. బుద్ధి పెరగక, ఎగబ్రాక లేని వాళ్ళ కోసం నేనే కొన్ని మెట్లు క్రిందికి దిగి మాట్లాడుతున్నాను. అంతే.

నీవు మాత్రం నిత్యాత్మనే అర్థం చేసుకుంటా వని భావిస్తున్నా. ఒకవేళ, నువ్వూ ఈ చాదస్తుల కోవ లోనే చేరి పోతాను అంటావా! చేరిపో! కానీ, నీ చాదస్తపు మూక చావు విషయంలో ఏడవ కుండా ఉండాలి. అదే నేను చెప్పేది. త్వరపడి ఏడ్చేశారంటే, మీరు చెప్పే సిద్ధాంతాన్ని మీరే నమ్మలేక పోతున్నారని అర్థం. పార్థా! చాతుర్యంతో జీవించడం బుద్ధిమంతుల లక్షణం గాని, చాదస్తంతో బ్రతకడం కాదు.

*పుట్టిన దానికి చావు తప్పదు. అలాగే చచ్చిన దానికి పుట్టుక తప్పదు అనే అనివార్య విషయాన్ని కొందరు ప్రస్తావించి ప్రసంగిస్తూ ఉంటారు. అలా చూచినా దుఃఖానికి అవకాశం లేదు. ఎలాగో విను!*

జాతస్య హి ధ్రువో మృత్యు ర్ధ్రువం జన్మ మృతస్య చ ।
తస్మా దపరిహార్యేఽర్థే న త్వం శోచితు మర్హసి ॥ 27

**జాతస్య-హి-ధ్రువః-మృత్యుః-ధ్రువం-జన్మ-మృతస్య-చ**
**తస్మాత్-అపరిహార్యే-అర్థే-న-త్వం-శోచితుం-అర్హసి**

| | | | | | |
|---|---|---|---|---|---|
| జాతస్య | = | పుట్టిన వానికి | తస్మాత్ | = | కాబట్టి |
| మృత్యుః | = | చావు | అపరిహార్యే | = | అనివార్య మైన |
| ధ్రువః హి | = | తప్పదు కదా! | అర్థే | = | విషయము నందు |
| మృతస్య | = | చచ్చిన వానికి | త్వం | = | నీవు |
| జన్మ చ | = | పుట్టుకయు | శోచితుం | = | దుఃఖించుటకు |
| ధ్రువం | = | తప్పదు కదా! | న అర్హసి | = | తగవు |

**పుట్టిన వానికి చావు తప్పదు. చచ్చిన వానికి జన్మ తప్పదు. అనివార్యమైన ఈ విషయానికి నువ్వు దుఃఖించచ మెందుకు?**

**వ్యాఖ్య**

ఈ ప్రపంచంలో ఉన్న వాళ్ళందరూ పుట్టిన వాళ్ళే. పై నుండి ఊడిపడ్డ వాళ్ళు కారు. అలాగే చెట్టు నుండి కాచిన వాళ్ళూ కారు. పుట్టిన వాళ్ళను చావ కుండా ఆపే శక్తిమంతులు ఇంత వరకు పుట్ట లేదు. పుట్టడం అనే లక్షణం ఉన్నప్పుడు చావు అనేది అవలక్షణం కాదు. పుట్టిన ప్రతి వ్యక్తి మరణిస్తాడు. మరణించిన వాడు తిరిగి పుడతాడు. అలా పుడుతూ, చస్తూ ఉండేది ఆత్మే అని భావించినా దుఃఖించ డానికి హేతువు కనిపించడం లేదని, గడచిన శ్లోకంలో లాగే ఈ శ్లోకంలో కూడా సామాన్యుల దృష్టి కోణం నుండి సాధారణ బోధను వినిపిస్తున్నాడు.

బండి బయలు దేరేది గమ్యాన్ని చేరడానికే. బ్రతుకు బయలు దేరేది మరణాన్ని చేరుకోవ డానికే. పుట్టి చావడం, చచ్చి పుట్టడం - ఇవే జనన మరణాలు. అపరిహార్యాలు. తప్పించుకో లేని అనివార్యాలు. చక్రభ్రమణం లాంటి ఈ జనన మరణ వలయంలో చిక్కి చచ్చిన వాడు పుట్టకుండా ఉండ గలడా? పునర్జన్మ విషయంలో పూర్వం సిద్ధాంతము మాత్రమే ఉండింది. ఇప్పుడు ఋజువులు కూడా ఉన్నాయి. అంగీకరించని వాళ్ళు కూడా అంగీకరించేలా సాక్ష్యాలు అన్ని దేశాలలో ఉన్నాయి. పుట్టి చావని వాళ్ళు ఎవరు? చచ్చి పుట్టని వాళ్ళు ఎవరు?

**పరివర్తిని సంసారే (చక్రవత్) మృతః కో వా న జాయతే**

పరిభ్రమించే ఈ చావుపుట్టుకల సంసారములో చచ్చి పుట్టని వాడు ఎవడున్నాడు? అని ప్రశ్నించింది శాస్త్రం.

ప్రపంచంలో మార్చ గలిగేవి కొన్ని ఉంటాయి. అలాగే మార్చ లేనివి కొన్ని ఉంటాయి. మార్చ గలిగే వాటిని అవసరమైతే ప్రయత్నంతో మార్చు కోవాలి. మార్చలేని వాటిని మనస్సుతో అంగీకరించాలి. అప్పుడే మనుగడకు అర్థం ఉంటుంది.

జనన మరణాలు మార్చ లేనివి. అవి మన చేతిలో లేవు. ఎందుకు పుట్టామో తెలియదు. ఎంతవరకు ఉంటామో తెలియదు. ఎప్పుడు పోతామో అర్థం కాదు. ఎవరు పుట్టించారో తెలియదు. అందుకనే, ***పుట్టించ మని అడిగినానా? పుట్టించితే అలిగినానా?*** అని ఒక కవి హృదయం మెలికలు తిరిగింది.

అర్జునా! శాస్త్రాన్ని ప్రామాణికంగా అంగీకరించ లేని వాళ్ళు అస్తవ్యస్త పోకడలతో ఏవేవో ఊహించు కుంటారు. ఎన్ని ఊహించినా, ఎంతగా ఊహించినా, వల్లకాటికి ఊరేగే ప్రయాణాన్ని ఆపలేరు. అది అపరిహార్యం. అలాంటి దాని విషయంలో దుఃఖం అర్థ రహితం.

అల పుడుతుంది. అల పడిపోతుంది. నేడు అస్తమిస్తుంది. రేపు ఉదయిస్తుంది. మనిషి పుడతాడు. మనిషి మరణిస్తాడు. ఇది అనివార్యం. అపరిహార్యం. అర్జునా! అలా చూచినా దుఃఖం అసంగతం. అర్థ రహితం.

మరణాన్ని విడిచి పెట్టి జననం ఉండదు. మనిషి జననం లోనే మరణం కూడా పుడుతుంది. క్షణంలో మనిషి పుడతాడు. ఆ క్షణం నుండే మరణం ప్రారంభ మవుతుంది. ప్రతిక్షణం మరణమే. ప్రతి నిముషం మరణమే. గంటగంటకూ మరణమే. రోజు రోజుకూ మరణమే. అందుకే నేమో! పుట్టిన క్షణం నుండే లబ్ - డబ్ అంటూ గుండె మరణ మృదంగాన్ని వినిపిస్తూ ఉంటుంది.

వ్యాపారం చేయడానికే వ్యాపారి కొట్టు తెరుస్తాడు. వ్యాపారం పూర్తి కాగానే కొట్టు కట్టేస్తాడు. జీవితంలో కూడా అంతే. జీవన వ్యాపారము పూర్తి కాగానే ప్రతి మనిషి జీవిత మనే దుకాణాన్ని కట్టేస్తాడు. అందరూ కొట్టు కట్టేసి పోయే వాళ్ళే. వ్యాపారం ఎప్పుడు పూర్తయితే కొట్టు అప్పుడే కట్టేస్తారు. ఎవరి వ్యాపారం వారిదే. ఎవరి సమయాలు వారివే.

అర్జునా! భీష్మాదులు మరణిస్తారని దుఃఖిస్తున్నావు. నీ దుఃఖానికి అర్థముందా? కారణ ముందా? సరే, నువ్వు వాళ్ళను చంపవు. అలాగని వాళ్ళు చావకుండా ఉంటారా? నువ్వు చంపనంత మాత్రాన, వాళ్ళు చావకుండా ఎప్పటికి అలాగే ఉండేట ట్లైతే యుద్ధం మానేయ్!

నువ్వు చంపక పోయినా వాళ్ళు మరణించి తీరుతారు. అయినా, నువ్వు యుద్ధం చేయడానికి వచ్చావు. హత్యలు చేస్తున్నట్లు బాధపడతా వెందుకు? యుద్ధం అన్న తరువాత ఇరువైపుల పోయేవాళ్ళు పోతారు. ఉండేవాళ్ళు ఉంటారు. పోయినవాళ్ళు చేదు కారు. ఉన్నవాళ్ళు తీపి కాలేరు. అర్థం గాని ఆలాపనలు. వ్యర్థమైన ఆవేదనలు.





జననం తరువాత మరణం, మరణం తరువాత జననం - ఈ జనన మరణాలే జగతిలో నిరంతరం. రాత్రింబవళ్ళు తిరుగుతూ ఉంటాయి. ఉదయ సాయంత్రాలు మారుతూ ఉంటాయి. వెలుగునీడలు వీడకుండా ఉంటాయి. కాలచక్రం గిర్రున తిరుగుతూ ఉంటుంది. ప్రతి భ్రమణానికి ఆయువు కుంచుకు పోతూ ఉంటుంది. కాలం జీవితంతో ఆడుకొంటూ ఉంటుంది. కాలం కరుణపై ఆధారపడి బ్రతుకు నడుస్తూ ఉంటుంది. పువ్వు కాయగా మారేది, కాయ పండుగా తయారయ్యేది చెట్టును అంటి పెట్టుకొని ఉండటానికి కాదు. చెట్టును వీడి రాలి పోవడానికి. అర్జునా! అర్థం చేసుకో! చావుపుట్టుకలు అనివార్యాలే, అపరిహార్యాలే అని భావించినా దుఃఖించడానికి ఏముంది?

*మార్పు చేసే అవకాశం ఉన్నప్పుడు మార్పు చేసే ప్రయత్నం చేయక పోయినా, ఫలితానికి దూరమైనా దుఃఖిస్తే అర్థం ఉంది. మార్పు చేయలేనిది ఉన్నప్పుడు దానిని అర్థం చేసుకొని అంగీకరించాలే గాని, ఆందోళన చెందుతూ దుఃఖించ కూడదు. దుఃఖించినా సాధించే దేమీ ఉండదు. ఇరవై ఆరు, ఇరవై ఏడవ శ్లోకాలలో శాస్త్రానికి భిన్నంగా సాధారణ మానవుల ప్రకృతిని దృష్టిలో ఉంచుకొని దుఃఖ నివారణ ప్రసంగాన్ని సాగించిన పరమేశ్వరుడు తరువాత శ్లోకంలో ముక్తాయింపు వినిపిస్తున్నాడు.*

అవ్యక్తాదీని భూతాని వ్యక్త మధ్యాని భారత ।
అవ్యక్త నిధనా న్యేవ తత్ర కా పరిదేవనా ॥ 28

**అవ్యక్తాదీని-భూతాని-వ్యక్తమధ్యాని-భారత**
**అవ్యక్త నిధనాని-ఏవ-తత్ర-కా-పరిదేవనా**

| | | |
|---|---|---|
| భారతా | = | అర్జునా! |
| భూతాని | = | ప్రాణులు |
| అవ్యక్తాదీని | = | పుట్టుటకు ముందు కనిపించవు |
| వ్యక్తమధ్యాని | = | మధ్యలో కనిపిస్తాయి |
| అవ్యక్త నిధనాని ఏవ | = | మరణించిన తరువాత కూడా కనిపించవు |
| తత్ర | = | అట్టి విషయమున |
| పరిదేవనా | = | దుఃఖపడ వలసింది |
| కా | = | ఏముంది? |

**సర్వ ప్రాణుల శరీరాలు మొదట్లో లేవు. మధ్యలో అగుపిస్తున్నాయి. గతించిన తరువాత మళ్ళీ లేకుండా పోతాయి. అలాంటి విషయంలో దుఃఖపడ వలసింది ఏముంది?**

**వ్యాఖ్య**

**ఎచటి నుండి ఎచటికో?**

ఈ ప్రపంచం అణువణువులో ప్రసూతి శాల ఉంది. అణువణువులో శ్మశానవాటిక ఉంది. అన్ని ప్రదేశాలలో ప్రాణులు పుడుతూనే ఉన్నాయి. అన్ని ప్రదేశాలలో మరణిస్తూనే ఉన్నాయి. పుట్టక ముందు ఎక్కడున్నాయో తెలియదు. చచ్చి ఎక్కడికి పోతాయో అర్థం కాదు.

పుట్టిన తరువాతే ఎవరైనా ఉన్నట్లు తెలుస్తారు. పుట్టక ముందు తెలియరు. దీనినే భగవానుడు అవ్యక్తావస్థ అంటున్నాడు. అవ్యక్తావస్థ అంటే, సుషుప్త్యవస్థ లాగా అదొక అవస్థ ఏమో అనుకోవద్దు. 'అవ్యక్తమ్' అంటే, ఇక్కడ అదర్శన మని అర్థము. అంటే, కనిపించని స్థితి. పుట్టక ముందు ఎవ్వరూ కనిపించరు. అలాగే మరణించిన తరువాత కనిపించకుండా పోతారు. అది కూడా అవ్యక్తావస్థే. అదర్శనమే. లేకుండా వస్తారు. లేకుండా పోతారు. ఉండినా కనిపించరు. కనిపించ నపుడు ఉన్నారని ఎలా నమ్మేది? అందుకే అవ్యక్తం అంటున్నాడు.

పుట్టక ముందు కనిపించరు. చచ్చిన తరువాత కనిపించరు. మధ్యలో కొంతకాలమే కనిపిస్తారు. ఇక ఆవేదన ఎందుకు? అని ప్రశ్నిస్తున్నాడు శ్రీకృష్ణుడు. తెల్లవారక ముందు చీకటి ఉంటుంది. ఆ తరువాత తెల్లవారుతుంది. సాయంత్రం పొద్దు వాలుతుంది. మళ్ళీ ప్రపంచం చీకటిలో కూరుకు పోతుంది. చీకటి నుండి వచ్చి చీకట్లోకి సాగి పోతుంది.

బండిలో ప్రయాణం చేస్తూ ఉంటాము. మధ్యలో ఎవరో వచ్చి కలుస్తారు. వాళ్ళు ఎక్కడి నుండి వచ్చారో తెలియదు. ప్రయాణం తరువాత ఎటు పోతారో అర్థం కాదు. ఈ మాత్రానికి మధ్యలో ఏముంది విలాపము? ఏముంటుంది విలాసము?

అర్జునా! భీష్మాదులు ఎక్కడ నుండి వచ్చారో నీకు తెలుసా? ఎక్కడికి పోతారో నీకు తెలుసా? పోయే వాళ్ళు చెప్పి పోతారా? చెప్పి పోవడానికి వెళ్ళే దెప్పుడో వాళ్ళకు తెలుసా? ఎక్కడికి పోతారో తెలుసా? తెలిస్తే, మనతో చెప్పి పోయేవాళ్ళు కదా! చెన్నైకి పోతున్నానని మిత్రుడు చెప్పి పోతున్నాడు కదా! పోయిన తరువాత అక్కడ నుండి ఫోన్ చేసి క్షేమంగా చేరానని చెబుతున్నాడు కదా! ఈ ప్రపంచంలో మరణించిన వాళ్ళు అలా చెప్పి పోతున్నారా? వాళ్ళు ఎక్కడ ఉండేది మనకు తెలుసా? తెలిస్తే, ఎందుకు ఏడుస్తాము? వెళ్ళి తెచ్చుకొనే వాళ్ళం కదా! అర్జునా! ఎందుకొచ్చిన ఆవేదన ఇదంతా! *(కా పరిదేవనా?).*

**వ్యర్థ ప్రలాపాలు - వృథా విలాపాలు**

అర్జునా! కనిపించకుండా వచ్చి కనిపించకుండా పోయేవాళ్ళ కోసం కంట తడి పెట్టడం సముచితంగా ఉందా? ఇకనైనా ఏడవడం మానేయ్! ఏడుపు ఒక వేడుక కాదు. అనవసరంగా ఏడవకు. అలసి పోతావు.

ఇంతకీ చావు అనేది ఒక ముగింపు అని ఎవరు చెప్పారు? చనిపోయిన వాళ్ళు లేకుండా పోయేవాళ్ళు కారు. కనిపించకుండా పోయేవాళ్ళు. అంతే. అందుకే అవ్యక్తం, అదర్శనం అని అర్థం చేసుకున్నాం.

*అదర్శనాత్ ఆపతితః పునశ్చా దర్శనం గతః*
*నాసౌ తవ న తస్య త్వం వృథా కా పరిదేవనా ॥*

కనిపించని స్థితి నుండి వచ్చాడు. కనిపించని స్థితి లోకి పోతున్నాడు. అతడు నీకు ఏమీ కాడు. నువ్వు అతనికి ఏమీ కాలేవు. ఎందుకొచ్చిన వ్యర్థ విలాపం? *(కా పరిదేవనా?)* అని మహాభారతము.

ఇక్కడ విలాప మెందుకు? అంటే, విలాసము కూడా ఎందుకు? అని అర్థం చేసుకోవాలి. విడిచి పోయేవి అని తెలిసి నపుడు పొంగిపోయి సాధించేదీ ఉండదు. క్రుంగిపోయి బావుకొనేదీ ఉండదు. అతి లేకుండా మిత జీవనాన్ని సాగించడమే ఎవరికైనా హితము.

జరిగేవే జరుగు తున్నాయి. జరగ కూడనివి జరిగితే విలపించాలి. అందరికి జరిగేవే మనకూ జరుగు తున్నాయి. గాలి వీచడం నేరమా? భూమి తిరగడం దోషమా? ఎండ కాయడం తప్పా? వానలు కురవడం పాపమా? నిప్పు కాలడం లేదా? నీళ్ళు పారడం లేదా? చెట్టుకొమ్మలు ఊగడం లేదా? కోతి చంచలంగా ఉందని కోప మెందుకు? గేదె అడ్డు తొలగ లేదని శాప మెందుకు? పోనీ, ఏడిస్తే, ఇవేమన్నా మారుతాయా? అలాంటప్పుడు మరణం విషయంలో ఏడు పెందుకు? మరణం మన ఇంట్లోనే జరిగిందా? అయిన వాళ్ళను పోగొట్టుకున్న వాళ్ళం మన మేనా? అందరికి జరిగిందే మనకూ జరుగుతూ ఉంది. కాకపోతే ఎవరికీ జరగనట్లు, మనకే జరిగినట్లు, ఏదో ఏదో ఊహించుకొని ఎదను ముక్కలు చేసుకుంటున్నాం.

**ఆఖ్యాయిక**

అవి గౌతమ బుద్ధుడు ఉన్న రోజులు. ఒక తల్లి, తన ఒక్కగా నొక్క సంతానం, బాలుడు అయిన బిడ్డను





పోగొట్టుకొని గుండె చెరువయ్యేలా దుఃఖిస్తూ ఉంది. గౌతమ బుద్ధుడు చూశాడు. ఆమెను ఓదార్చాడు. అయినా, ఉపయోగం లేకుండా పోయింది. నీకు నీ బిడ్డ కావాలి. అంతే కదూ? సరే, నేను చెప్పినట్లు చెయ్యి! నువ్వు వెళ్ళి ఎవరి ఇంటిలో ఇంత వరకు ఎవరూ చావ లేదో, వారి ఇంటి నుండి పిడికెడు ఆవాల గింజలు తీసుకొనిరా! అన్నాడు బుద్ధుడు. ఆమె ఉత్సాహంతో లేచి పరుగులు తీసింది. ఆశతో గ్రామంలో ప్రతి ఇల్లూ తిరిగింది. ఎవరూ చనిపోని ఇల్లు ఒక్కటి కూడా కనిపించ లేదు. అందరూ అయిన వాళ్ళను పోగొట్టుకున్న వాళ్ళే.

ఈ మధ్యలో ఆమె ఒక సత్యాన్ని గ్రహించింది. అందరికి జరిగిందే నాకూ జరిగింది. ధర్మానికి తన, మన భేదం తెలియదు. అందుకే అందరి విషయంలో సమదృష్టితో వర్తించే యమధర్మరాజును 'సమవర్తి' అన్నది శాస్త్రం.

ఆది ఎక్కడో తెలిసిరాదు
అంత మెప్పుడో తెలియదు
నడుమ అన్నీ మరపులే
క్షణక్షణానికి మార్పులే
ఏది ఉండునో ఏది ఊడునో
తెలియని జగతి శోకమయం
రామ రామ జయ రాజారామ్
రామ రామ జయ సీతారామ్

అని రామజోగి చిట్కా.

ఆశ్చర్య వత్పశ్యతి కశ్చి దేన మాశ్చర్యవ ద్వదతి తథైవ చాన్యః ।
ఆశ్చర్యవ చ్చైన మన్యః శృణోతి శ్రు త్వా ప్యేనం వేద న చైవ కశ్చిత్ ॥ 29

*ఆశ్చర్యవత్-పశ్యతి-కశ్చిత్-ఏనం-ఆశ్చర్యవత్-వదతి-తథా-ఏవ-చ-అన్యః*
*ఆశ్చర్యవత్-చ-ఏనం-అన్యః-శృణోతి-శ్రుత్వా-అపి-ఏనం-వేద-న-చ-ఏవ-కశ్చిత్*

| | | | | | |
|---|---|---|---|---|---|
| కశ్చిత్ | = | ఒకడు | అన్యః చ | = | మరొకడు |
| ఏనం | = | ఈ ఆత్మను | ఏనం | = | ఈ ఆత్మను |
| ఆశ్చర్యవత్ | = | ఆశ్చర్యముగా | ఆశ్చర్యవత్ | = | ఆశ్చర్యము వలె |
| పశ్యతి | = | చూస్తాడు | శృణోతి | = | వింటాడు |
| తథా ఏవ | = | అట్లే | శృత్వా అపి | = | విని కూడా |
| అన్యః చ | = | మరి ఒకడు | కశ్చిత్ | = | ఎవ్వడును |
| ఆశ్చర్యవత్ | = | ఆశ్చర్యముగా | ఏనం | = | ఈ ఆత్మను |
| వదతి | = | చెబుతాడు | న వేద ఏవ | = | ఎరుగనే ఎరుగడు |

**ఆత్మను ఒకడు ఆశ్చర్యంగా చూస్తాడు. మరొకడు చిత్రంగా చెబుతాడు. ఇంకొకడు విచిత్రంగా వింటాడు. ఇంకొకడు ఎంత విన్నా అసలే తెలుసుకోలేడు.**

**వ్యాఖ్య**

సత్యమైనది ఆత్మ. అది నశించేది కాదని ఇప్పటికే తెలుసుకున్నాం. దాని కోసం దుఃఖించ వలసిన

పనిలేదు. ఇక వస్తూ పోతూ ఉండే అపరిహార్యాలు శోకింప దగినవా? మరి దుఃఖం దేని కొరకు? అదే ఎవ్వరికీ అర్థం కాని విషయం. అందరికీ ఆశ్చర్యాన్ని కలిగించే విషయం.

ఆశ్చర్య మనేది ఒక పదం. ఆశ్చర్యమనే పదానికి మించిన ఆశ్చర్యం ఈ ప్రపంచంలో మరొకటి ఉండదు. ఉంటూ అర్థం కాకుండా ఉండేది ఏదైనా ఆశ్చర్యమే. ఎవరైనా చని పోయారు అని చెప్పగానే వినిన వ్యక్తిలో మనకు మొదట కనిపించేది ఆశ్చర్యం. ఊహించని ప్రగతిని ఎవరైనా సాధిస్తే ఆశ్చర్యం. ఎవరూ చేయలేని కార్యాన్ని ఎవరైనా పూర్తి చేస్తే ఆశ్చర్యం. ఆశ్చర్యాన్నైతే అందరూ వ్యక్తం చేస్తారు. ఆశ్చర్య మేమిటి? అని ప్రశ్నిస్తే, ఎవ్వరూ చెప్పలేక ఆశ్చర్యంగా చూస్తారు, ఆశ్చర్యంగా మిగిలి పోతారు. అదే ఆశ్చర్యం!

***ఆశ్చర్యవత్ ఆశ్చర్యమ్, అదృష్టపూర్వం అద్భుతం అకస్మాత్ దృశ్యమానం తేన తుల్యమ్ ఆశ్చర్యవత్ ఆశ్చర్యం!***

ఇంతవరకు చూడనిది అకస్మాత్తుగా చూడటం జరిగితే, అదేదో ఆశ్చర్యంతో సమానము. అలాంటి దేదైనా ఆశ్చర్యమే. అయిదు తలలతో ఆవు పుట్టింది అని చెప్పగానే, అందరూ ఆశ్చర్యంతో చూడటానికి వెళ్తారు. ఎందుకంటే, అలాంటిది గతంలో ఎన్నడూ చూడలేదు, వినలేదు కనుక. అదే ఆశ్చర్యము.

ఆంగ్లేయులు ప్రథమంగా ద్విచక్ర వాహనాన్ని మన దేశంలో ప్రవేశ పెట్టి నపుడు, ఆ సైకిల్ మీద వెళ్ళే వ్యక్తిని చూడటానికి గోదావరి గట్టు పొడవునా జనం గుమిగూడి, అదేదో చక్రం మీద మనిషి పోతున్నాడు. ఆశ్చర్యంగా ఉంది. చూద్దాం, రండి! అంటూ పరుగులు తీశారట. వస్తువు ఏమిటి? విషయ మేమిటి? అనేది కాదు ప్రధానము. అంత వరకు చూడనిది, ఒక ప్రత్యేక మైనది ఏదైనా ఉంటే అదే ఆశ్చర్యం.

ఈ ప్రపంచాన్ని ఒక ఆశ్చర్యంగా మనుషులు చెప్పుకుంటూ ఉంటారు. ఇక్కడ ఏవి ఎందుకు, ఎలా జరుగు తున్నాయో తెలియదు కనుక చిత్రమైన జగత్తు అని ఆశ్చర్య పడుతూ ఉంటారు. విచిత్రమైన ప్రపంచం అని ఆశ్చర్యాన్ని వ్యక్తం చేస్తూ ఉంటారు.

ఆత్మ విషయంలో కూడా అలాగే ఆశ్చర్యాన్ని కనబరుస్తూ ఉంటారు అంటున్నాడు గీతాచార్యుడు.

**ఆశ్చర్యాత్మ**

ఆత్మను కొందరు ఆశ్చర్యం లాగా చూస్తూ ఉంటారు. కొందరు ఆశ్చర్యం లాగా పలుకుతూ ఉంటారు. కొందరు ఆశ్చర్యం లాగా వింటూ ఉంటారు. కొందరేమో, చూచినా, మాట్లాడినా, వినినా అర్థం చేసుకోలేరు అన్నాడు శ్రీకృష్ణుడు.

ఆత్మ విషయంలో అన్నీ ఆశ్చర్యాలే. ఆత్మ అంత సులభంగా వంట బట్టేది కాదు. అందుకే ఆశ్చర్యంగా మిగిలి పోతూ ఉంటుంది. ఆత్మను అర్థం చేసుకోవడం కష్టం (***దుర్విజ్ఞేయః***). అర్జును డంతటి వాడే అటు ఇటు చూస్తున్నాడు ఆశ్చర్యంగా. అర్థమైందా, కాలేదా అనేది వేరే విషయం. అర్థమైనా ఆశ్చర్యమే. అర్థం కాకపోయినా ఆశ్చర్యమే. అందుకే నేమో, ఈ శ్లోకాన్ని పరిచయం చేస్తూ, శ్రీ శంకరాచార్యస్వామి భాష్యంలో శ్రీకృష్ణుడు అర్జునునిపై సానుభూతితో అనునయ వచనాలు పలికినట్లు ఆశ్చర్యంగా వినిపించారు.

*అయం ప్రకృతః ఆత్మా కిం త్వా మేవ ఏకం ఉపాలభే సాధారణే భ్రాన్తి*
*నిమిత్తే? కథం దుర్విజ్ఞేయః అయం ఆత్మా ఇతి? అతః ఆహ -*

ప్రకృతమైన ఈ ఆత్మను గ్రహించడం చాలా కష్టము. ఆత్మ విషయంలో అందరూ సహజం గానే భ్రాంతి చెందుతూ ఉండే టప్పుడు, అర్జునా! నిన్ను ఒక్కడినే ఎందుకు నిందించాలి? అనుకుంటూ ఆత్మను తెలుసుకోవడం ఎంత కష్టమో భగవంతుడు చెబుతున్నాడు అన్నారు శ్రీ శంకరులు.





**చూడటమే ఒక ఆశ్చర్యం**

ఒకడు ఆత్మను ఆశ్చర్యం లాగా చూస్తాడు (***ఆశ్చర్య మివ ఏనం ఆత్మానం పశ్యతి కశ్చిత్***). ఇక్కడ చూడటం అంటే తెలుసుకోవడ మని అర్థం. ఆత్మ దృశ్యం కాదు కనుక చూడటము అంటే, తెలుసుకోవడం, లేదా బుద్ధితో చూడట మని అర్థము. అలా తెలుసు కోవడంలో కలిగేది ఆశ్చర్యమే నంటున్నాడు. ఎందుకని? ఒక గ్రంథాన్ని చదివి అర్థం చేసుకుంటాం. శ్రీమద్రామాయణం ఉంది. దానిని చదివి అర్థం చేసుకుంటాం. అలాగే ఆత్మ విషయం ఉపనిషత్తులలో ఉంది. కాని, చదివితే అర్థం కాదు. అదే ఆశ్చర్యం.

***అనన్య ప్రోక్తే గతి రత్ర నాస్తి*** - ఆత్మ విషయం ఎవరి నుండైనా శ్రవణం చేయ వలసిందే గాని, మనకు మనంగా చదివితే అర్థం కాదు. అదే ఆశ్చర్యం. **ఆచార్యవాన్ పురుషో వేద.** ఆచార్యుణ్ణి అనగా గురువును పొందిన వాడే అర్థం చేసుకో గలడు అని కూడా వేదమే తెలిపింది.

గురువు వద్ద శ్రవణం చేయాలి. అది కూడా ఆశ్చర్యమే. ఇంతవరకు ఎందరి నుండి మనం ఎన్ని విషయాలు శ్రవణం చేయలేదు? కాని, ఆచార్యుని వద్ద ఆత్మ విషయం శ్రవణం చేయడం ఒక ప్రత్యేకతగా ఉంది. అదే ఆశ్చర్యము.

ఆత్మ అంటే ఏదో అని చెబుతాడని శ్రోత ఊహిస్తే, ఆత్మవు నీవే అని బోధిస్తాడు. పోనీలే, అదేమిటో తెలుసుకుందా మనుకుంటే, నువ్వు కాళ్ళు లేకనే నడుస్తావు, చెవులు లేకనే వింటావు, కళ్ళు లేకనే చూస్తావు అంటూ, మన భాష లోనే మాట్లాడుతున్నా, మనస్సుకు పట్టని విషయాల్ని అదే పనిగా చెబుతాడు.

చెవులు ఉంటేనే అంతంత మాత్రం వినపడుతూ ఉంది. చెవులు లేకనే వింటావు అనేసరికి, ఆ తరువాత ఆ కొద్దిపాటి వినికిడి కూడా పోతూ ఉంది. నువ్వు లేని చోటే లేదు అని గురువు బోధిస్తూ ఉంటే, అసలు ఉన్న దెక్కడో కూడా అర్థం కావడం లేదు. అంతా ఆశ్చర్యమే. నేను పుట్టలే దంటాడు. మరి, పుట్టిన దేది ఏం కావాలి? నీకు చావు లేదు అంటాడు. అది అర్థం చేసుకోవడానికి చచ్చినంత పని అవుతోంది. ఆశ్చర్యం!

**చెప్పడం కూడా ఆశ్చర్యమే**

ఆత్మను గూర్చి చెప్పడం కూడా చాలా కష్టమే. అసలు చెప్పడం ఎందుకు? వినే వాడికి అర్థం కావడానికి. మరి అర్థమవుతూ ఉందా? ఆశ్చర్యం! వినేవారే గాని అర్థమైంది అనే వారు ఉండరు. అలాంటి విషయాన్ని చెప్పడం సులభ సాధ్యమా?

గుండెల్ని పిండి, గొంతును అరగదీసి, మనసును మరగించి, అనేక దృక్కోణాలలో గురువు బోధిస్తాడు. తీరా ఉపనిషత్తును పూర్తి చేసిన తరువాత, రామాయణం అంతా విని రాముడికి లక్ష్మణుడు ఏమౌతాడు? అని అడిగినట్లు, ఆత్మను పొంద డానికి నేను ఏమి చేయాలి? అని అడుగుతాడు శ్రోత. పాపం, వక్త! ఆశ్చర్యం! నువ్వేమీ చేయ నవసరం లేదు నాయనా! అదేదో నేనే చేస్తాను. మళ్ళీ బోధిస్తాను అని గురువు మళ్ళీ సిద్ధ పడతాడు. ఆశ్చర్యం!

ఆత్మ మాటలకు అందనిది. మనస్సుకు చిక్కనిది. అయినా మాటల లోనే చెప్పాలి. మనస్సుకే పట్టించాలి. ***యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ*** - ఎక్కడికి నా మాటలు చేరలేవో, నీ మనస్సు చేరుకో లేదో అదే ఆత్మ అని చెప్పాలి. అది కూడా మాటల లోనే చెప్పాలి. ఆశ్చర్యము!

చెప్పింది శ్రోతకు అర్థమైతే, వక్తకు ఆశ్చర్యం! ఎంత చక్కగా గ్రహించ గలిగాడు అని ఆశ్చర్యం. ఒకవేళ చెప్పింది శ్రోత గ్రహించలేక పోతే, ఇంత చెబుతున్నా గ్రహించలేక పోతున్నా డేమిటి? అని ఆశ్చర్యం.

**వినడం కూడా ఆశ్చర్యమే**

ఇంతవరకు ఏది విన్నా మన కన్నా అన్యమైన దానిని గూర్చే విన్నాం. కాని, ఇప్పుడు మనం వినేది మనల్ని గురించే కనుక ఆశ్చర్యంగా ఉంటుంది. ఏవో ఏవో ఈ ప్రపంచంలో లభ్యమైతే మనం సుఖ పడతాము అనేది మన అవగాహన. మరి, బోధలో మనమే సుఖం, మనమే సుఖహేతువు అని ఆశ్చర్యంగా వింటాము.

ఏమిటి! నాలో ఇంత వైభవ ముందా? ఇదంతా నిజమేనా? అని శ్రోత ఆశ్చర్యంగా వింటూ ఉంటాడు. ఈలోగా, ***సర్వమిద మహం చ బ్రహ్మైవ*** - ఈ జగత్తు, బ్రహ్మము, నేను, నీవు అంతా ఒక్కటే. నీవే బ్రహ్మము అని గురువు బోధిస్తాడు. ఆశ్చర్యం! ఆశ్చర్యం! పరమాశ్చర్యం!

విన్నంత సేపు బాగానే ఉంటుంది. ఎంత విన్నా మళ్ళీ మొదటి కొస్తుంది. ఇంత వింటున్నా, అంత బాగా చెబుతున్నా అర్థం కాదేమిటో! ఆశ్చర్యం!

**వినినా వంటబట్టక పోవడం**

**పరమాశ్చర్యం!**

వినడం వరకు బాగానే ఉంటుంది. వినిన తరువాత ఏమీ విననట్టే ఉంటుంది. ఆశ్చర్యం! ఎంత విన్నా అర్థం కావడం లేదు. గురువు గారికి ఎలా అర్థమైందబ్బా! అని ఆచార్యుని ఆశ్చర్యంగా చూస్తాడు శిష్యుడు. అంతవరకు ఫరవాలేదు. మరొక ఆశ్చర్యం ఉంది.

**వక్తు రేవ హి తజ్జాడ్యం శ్రోతా యత్ర న బుధ్యతే**

వినే వాడికి అర్థం కాకపోతే ఆ దోషము చెప్పే వాడిదే అనే న్యాయ మొకటుంది. నాకు అర్థం కాక పోవడానికి కారణం నేను కాదు అని ఈ న్యాయాన్ని గనుక శిష్యుడు వినిపిస్తే గురువుకు పరమాశ్చర్యం! ఇంతకీ సారాంశ మేమిటంటే, ఎంతో పరిశ్రమిస్తేనే గాని ఆత్మజ్ఞానం కలగదు ***( అతః దుర్బోధః ఆత్మా ఇత్యభిప్రాయః).*** మన కన్నా అన్యమైన దానిని తెలుసు కోవడం ఆశ్చర్యం కాక పోవచ్చు. ఆత్మబోధలో మనం తెలుసు కుంటున్నది మనల్నే. అందుచేత అర్థమైనా ఆశ్చర్యం గానే ఉంటుంది. అర్థం కాకపోయినా ఆశ్చర్యం గానే ఉంటుంది. అంతా ఆశ్చర్యమయం.

*ఇంతవరకు బోధించిన సాంఖ్య ప్రకరణాన్ని ఇప్పుడు సమాప్తి చేస్తున్నాడు* ***( అథ ఇదానీం ప్రకరణార్థమ్ ఉపసంహరన్ ఆహ ).***

దేహీ నిత్య మవధ్యోఽయం దేహే సర్వస్య భారత ।
తస్మా త్సర్వాణి భూతాని న త్వం శోచితు మర్హసి ॥ 30

***దేహీ-నిత్యం-అవధ్యః-అయం-దేహే-సర్వస్య-భారత***
***తస్మాత్-సర్వాణి-భూతాని-న-త్వం-శోచితుం-అర్హసి***

| | | | | | |
|---|---|---|---|---|---|
| భారత | = | అర్జునా! | తస్మాత్ | = | అందుచేత |
| సర్వస్య | = | అందరి | సర్వాణి | = | సమస్తమైన |
| దేహే | = | దేహాలలో | భూతాని | = | ప్రాణుల గూర్చి |
| అయం | = | ఈ | త్వం | = | నీవు |
| దేహీ | = | ఆత్మ | శోచితుం | = | దుఃఖించుటకు |
| నిత్యం | = | ఎల్లప్పుడు | న అర్హసి | = | తగవు |
| అవధ్యః | = | వధింప బడేది కాదు | | | |





**అందరి శరీరాలలో ఉన్న ఈ ఆత్మ ఎప్పుడూ చంప బడదు. కనుక, ఏ ప్రాణిని గూర్చి కూడా నువ్వు దుఃఖించ పని లేదు.**

**వ్యాఖ్య**

**ఎక్కడికి పోదు**

ఏదో జరిగి పోతుందని, మరేదో అవుతుందని అర్జునుడు ఏదో ఏదో ఆలోచించుకొని, ఎదలో భారం నింపుకొని కురుక్షేత్రంలో ఏడుస్తూ కూర్చున్నాడు. ***అశోచ్యా నన్వ శోచస్త్వం.*** దుఃఖింప దగని విషయంలో దుఃఖిస్తున్నావు అంటూ రెండవ అధ్యాయం పదకొండవ శ్లోకంలో శ్రీకృష్ణుడు సాంఖ్యాన్ని బోధించడం ప్రారంభించాడు. ఈ శ్లోకంతో సాంఖ్య ప్రకరణం ముగుస్తుంది. ***నత్వం శోచితు మర్హసి*** అంటూ సమాప్తి చేస్తున్నాడు. 'దుఃఖం తగదు' అంటూ ప్రారంభమై 'దుఃఖింప పని లేదు' అంటూ సమాప్తి చేస్తున్నాడు.

**శుద్ధ ఆత్మతత్త్వ విజ్ఞానం సాంఖ్యం ఇతి అభిధీయతే**

నిర్మలమైన ఆత్మ తత్త్వమునకు సంబంధించిన జ్ఞానమే సాంఖ్యము అని వ్యాసుని ప్రబోధము. రెండవ అధ్యాయం లోని సాంఖ్య ప్రకరణ మంతా ఈ విషయం చుట్టే తిరిగింది. తాను ఆత్మ అని తెలుసుకున్న వాడు నిత్యతృప్తుడు. నిరాశ్రయుడు. తన తృప్తికి మరొకరిపై ఆధారపడి ఉండే వాడు కాడు. తన ఆనందానికి మరొక సన్నివేశాన్ని అన్వేషించే వాడు కాడు.

తానేమిటో తనకు తెలియడం చేత, తన దేహంతో పాటు ఈ ప్రపంచ మేమిటో కూడా అతనికి తెలుసు. తాను ఉన్నట్లు తనకు తెలుసు. ఉన్న వన్నీ ఈ ప్రపంచంలో ఎలా ఉన్నాయో కూడా తెలుసు. తెలియబడే వన్నీ ఎప్పుడూ మారుతూ ఉండినా, అలా మారే వాటి నన్నిటినీ తెలుసుకొనే తాను మారేవాడు కాడని కూడా అతనికి తెలుసు. అతడే దేహి. మారే దేహాలలో ఉంటూ మారని వాడు.

కుండ ఉంది. కుండలో ఆకాశం ఉంది. కుండను కొని తీసుకొని పోతూ ఉంటాం. మనం కుండను పట్టుకొని పోతామే గాని కుండ లోని ఆకాశాన్ని తీసుకొని పోము. కుండ ఉంటుంది. కుండలో ఆకాశం ఉంటుంది. కుండ పగుల్తుంది. కుండ లోని ఆకాశం ముక్కలు కాదు. నశించదు.

కుండలు అనేకంగా ఉంటాయి. అన్ని కుండలలో ఆకాశం ఉంటుంది. కుండలు ఎన్ని ఉంటే అన్ని ఆకాశాలు ఉండవు. కుండలు ఎన్నయినా ఉండొచ్చు. ఆకాశం మాత్రం ఒక్కటే. కుండలు ప్రయాణం చేస్తాయి. ఆకాశం పయన మెరుగదు. కుండలు పగిలి పోతాయి. ఆకాశం నశించదు. అది సర్వగతం. కుండ లన్నీ ఆకాశానికి ఉపాధులు. ఒకే ఆకాశానికి అనేకమైన ఉపాధులు.

ఆత్మకు దేహాలన్నీ ఉపాధులే. ఒకే ఆత్మకు అనేకమైన ఉపాధులు. దేహాలు ఎన్నో ఉంటాయి. దేహి ఒక్కడే. దేహాలు మార్పు చెందుతాయి. దేహి మారడు. దేహాలు నశిస్తాయి. దేహి నశించడు. అలా నశించని జీవుడు ***(దేహీ)*** దేహం లోనే ఉన్నాడు. నశించని వాడుగా ఉన్నాడు ***(అవధ్యః).*** ఏ వికారాలూ లేకుండా ఉన్నాడు ***(నిత్యః).***

అర్జునా! నీవూ అదే. ఆత్మవే. అందరూ ఆత్మస్వరూపులే. అందరి దేహాలలో ఉన్న అఖండాత్మ స్వరూపము ఒక్కటే ***( సర్వస్య దేహే అయందేహీ నిత్యః, అవధ్యః ).*** అర్జునా! పోయేది ఏదన్నా ఉంటే పోనీ. 'నేను పోతాను' అనేది మరచిపో! బాగలేనిది ఏదన్నా ఉంటే ఉండనీ. అంతమాత్రాన 'నేను బాగలేను' అనకు. నువ్వు పోయే వాడివి కావు, నీకు నశింపు లేదు, అంటూ పరమేశ్వరుడు ఈ శ్లోకంలో కూడా ఆత్మ యొక్క నిత్యత్వాన్ని వివరించి, అర్జునుని ఆవేదనకు చరమగీతం పాడుతున్నాడు.

**ఏడుపు మానేయ్!**

ఉండేది ఏమిటో, పోయేది ఏమిటో అర్థం కాక విషణ్ణుడ వయ్యావు. పోయేది అంటూ ఏదైనా ఉంటే, దానిని పోనీ. కాని, నువ్వు పోయేవాడివి కావు. వచ్చిన వాడివీ కావు. ఎన్నడూ ఉన్నవాడివే. నువ్వు ఎలా నిత్యంగా ఉన్నావో, అలాగే నీకు సంబంధించిన జ్ఞానం కూడా నిత్యమే. నువ్వు నిత్యుడుగా ఉండబట్టే నిత్యమైన నీ జ్ఞానము కల్పిత బంధాలను కరిగిస్తోంది.

దుఃఖ మనేది ఆత్మ లేక కాదు. నువ్వే ఆత్మ అని తెలియక. ఆత్మస్వరూపం కాని దెవరు? అలాగని ఆత్మ తానే అన్న జ్ఞానం ఎంత మంది కుంది? ఆత్మ యొక్క అజ్ఞానం అందరికీ అనాదిగా ఉంది. అది అలాగే కొనసాగుతూ ఉంది. ఎందుకో తెలుసా! ఆత్మ ఏమిటో అర్థం కాకపోవడం చేత.

పార్థా! ఆత్మ ఏమిటో నీకు తెలిపాను. అనాత్మ ఏమిటో కూడా తెలిపాను. ఆత్మను అనాత్మగా భావించే ప్రమాదం ఉండకూడ దనే అలా చేశాను. నువ్వేమిటో నీకు తెలిసింది. నువ్వు కాని దేమిటో కూడా నీకు అర్థమైంది. నువ్వు ఎక్కడికీ పోవు. ఏ వికారానికీ, వినాశానికి లోను కావు ***( నిత్యః అవధ్యః )***. ఇక నువ్వు కాని దంటావా? అది అసత్. లేనిదే. ఉన్నది పోదు కనుక అశోచ్యం. లేనిది ఉండేది లేదు కనుక అశోచ్యం. ఇక దుఃఖ మెక్కడుంది? కౌన్తేయా! కళ్ళు తుడుచుకో! విజయా! విలపించకు. అర్జునా! ఆవేదన చెందకు. పార్థా! లే! పోరాడు.

అర్జునునికి పట్టిన మోహం రెండు విధాలుగా ఉందని ప్రారంభం లోనే చెప్పుకున్నాం. అనాత్మ ధర్మాలను ఆత్మ యందు ఆరోపించుకొని, నేను చంపేవాణ్ణి - నేను చచ్చేవాణ్ణి అని దుఃఖించే సాధారణ మోహం మొదటిది. దానికి చికిత్స జరిగిపోయింది. అదే సాంఖ్య ప్రకరణం.

ఇక రెండవది అసాధారణ మోహం. స్వధర్మమైన యుద్ధాన్ని అధర్మంగా భావించి, పాపభీతితో శోకానికి గురి కావడం రెండవది అయిన అసాధారణ మోహం. ప్రస్తుతం రెండవ దానికి చికిత్స ప్రారంభ మవుతూ ఉంది. ధర్మం అనే కోణం నుండి చూచినా, యుద్ధం చేయ దగిందే నంటూ తరువాత శ్లోకం నుండి ప్రారంభిస్తున్నాడు భగవానుడు.

*పరమార్థ తత్త్వ దృష్టితో చూచి నపుడు శోకమోహాలకు అవకాశమే లేదని ఇంతవరకు చెప్ప బడింది. కేవలం ఆత్మజ్ఞాన దృష్టి తోనే కాదు, స్వధర్మం అనే దృష్టితో కూడా చెప్పడం జరుగుతూ ఉందని శ్రీ శంకరాచార్య స్వామి ధర్మచర్చకు భాష్యంలో శ్రీకారం చుట్టి అవతారికను అందించారు (ఇహ పరమార్థ* ***తత్త్వా పేక్షాయాం శోకో మోహో వా న సంభవతి ఇత్యుక్తమ్. న కేవలం పరమార్థ తత్త్వాపేక్షా యా మేవ, కిం తు -).***

**స్వధర్మ మపి చావేక్ష్య న వికమ్పితు మర్హసి ।** 31
**ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య న విద్యతే ॥**

***స్వధర్మం-అపి-చ-అవేక్ష్య-న-వికంపితుం-అర్హసి***
***ధర్మ్యాత్-హి-యుద్ధాత్-శ్రేయః-అన్యత్-క్షత్రియస్య-న-విద్యతే***

| | | | | | |
|---|---|---|---|---|---|
| స్వధర్మం అపి | = | స్వధర్మమును కూడా | ధర్మ్యాత్ | = | ధర్మయుతమైన |
| అవేక్ష్య చ | = | గాంచి | యుద్ధాత్ | = | యుద్ధము కంటె |
| వికంపితుం | = | చలించుటకు | అన్యత్ | = | అన్యమైన |
| న అర్హసి | = | తగవు | శ్రేయః | = | శ్రేయస్సు |
| క్షత్రియస్య | = | క్షత్రియునకు | న విద్యతే హి | = | లేదు గదా! |





**అర్జునా! నువ్వు క్షత్రియుడివి. ధర్మ యుద్ధం చేయడం నీ స్వధర్మము. అలా చూచినా కూడా యుద్ధము కన్నా నీకు శ్రేయస్కర మైనది మరొకటి లేదు. నువ్వు శోకింప పని లేదు.**

**వ్యాఖ్య**

చేయ వలసింది చేయ నపుడు చేయకూడని దానిని చేయవలసి వస్తుంది. ఏదీ చేయకుండా మనిషి జీవించలేడు. ప్రతి మనిషి ఏదో ఒకటి చేస్తూనే ఉంటాడు. ఏదో ఏదో చేస్తూ పోతే, మరేదో ఏదో అనుభవించ వలసి వస్తుంది. కనుక, చేసేది ఏదైనా ధర్మబద్ధంగా ఉండాలి. అప్పుడే వ్యక్తి సుఖశాంతులతో జీవిస్తాడు. సమాజము అభ్యుదయ మార్గంలో పయనిస్తుంది. మానవ సమాజం అభ్యుదయ మార్గంలో ఆదర్శంగా జీవించాలంటే, సమాజంలో ఉండే వ్యక్తు లందరు, వారి వారి ధర్మాలను త్రికరణ శుద్ధిగా ఆచరించ గలగాలి. ఎక్కడ ఏ చిన్న మర ఊడినా పెద్ద యంత్రము కుంటు పడునట్లు, ఏ వ్యక్తి ధర్మచ్యుతుడైనా సమాజాభ్యుదయానికి విఘాతం ఏర్పడుతుంది. ప్రభువు ధర్మం తప్పితే మరీను.

**ధర్మ జీవనం**

భార్యాబిడ్డల్ని పోషించడం యజమాని ధర్మము. ప్రజలను పాలించడం రాజు ధర్మము. పశుపక్ష్యాదులు తమ సంతానాన్ని తాము రక్షించు కుంటాయి. మీరు అలా రక్షించుకోవాలి అని వాటికి ఎవ్వరూ చెప్పలేదు. అవి కేవలం సహజాతాల ప్రేరణతో తమ ధర్మాన్ని నెరవేర్చు కుంటాయి.

మనిషికి మనస్సుంది. బుద్ధి ఉంది. ఉన్నంత మాత్రాన లాభం లేదు. అవి పని చేస్తేనే ఉపయోగం. ఎవరి బుద్ధైతే పని చేస్తుందో, అతణ్ణి బుద్ధిమంతుడు అంటారు. పని చేయక పోతే బుద్ధిహీనుడు అంటారు. బుద్ధిమంతుడు తనను తాను రక్షించుకుంటూ సమాజ అభ్యుదయానికి సహకరిస్తూ ఉంటాడు. బుద్ధిహీనుడు తనను తాను పాడు చేసుకుంటూ, సమాజ అస్థిరతకు తన వంతుగా కారకు డవుతాడు.

మనిషి జ్ఞానవంతుడు కావాలి. సాంఖ్య ప్రకరణంలో మనం చూచినట్లు ఆత్మజ్ఞానియై శోభించాలి. ధర్మపరుడు కాని వాడు జ్ఞానవంతుడు కాలేడు. ఉట్టికి ఎక్కలేని వాడు స్వర్గానికి ఎక్కుతాడా? అనేది సామెతే కాదు, సత్యం. చేయ దగిందే *(ధర్మం)* చెయ్య లేనివాడు చేయ వలసింది *(జ్ఞానాభ్యాసం)* ఏమి చేస్తాడు?

**ధర్మ ఏవ హతో హన్తి ధర్మో రక్షతి రక్షితః**

ధర్మమును నశింప చేసేవాడు ధర్మం చేత నశింప బడుతాడు. ధర్మమును రక్షించేవాడు ధర్మం చేత రక్షింప బడుతాడు అన్నది మహాభారతము. అందుచేత ధర్మాన్ని ఎవ్వరూ విడిచి పెట్ట కూడదు అని విధిగా శాసించింది ***( తస్మాత్ ధర్మం న త్యాజ్యం )***.

ధర్మం అమృతం వంటిది. అది మనిషికి ప్రాణం పోస్తుంది. అధర్మం విషం లాంటిది. అది మనిషి ప్రాణం తీస్తుంది. అధర్మంగా జీవిస్తూ, ఆనందంగా బ్రతక గలము అనుకోవడం ఎండమావులలో దప్పిక తీర్చుకొనే ప్రయత్నమే అవుతుంది.

**క్షత్రియ ధర్మం**

**క్షతాద్ యో వై త్రాయతి ఇతి స తస్మాత్ క్షత్రియః స్మృతః**

వినాశము జరగకుండా సమాజాన్ని కాపాడే వాడు క్షత్రియుడు. అవసరమైతే యుద్ధమైనా చేసి ప్రజల్ని రక్షించ వలసిన వాడు క్షత్రియుడు. అంతేగాని, తన వ్యక్తిగత ఆరాటంతో సన్యసించే వాడు మాత్రం కాదు.

**యుద్ధం స్వధర్మో నృపతేః ప్రజానాం పరిపాలనమ్**

ప్రజల్ని ధర్మబద్ధంగా పాలిస్తూ వారికి సుఖశాంతులు దూరం కాకుండా చూడటం, ఒకవేళ అలాంటి దురదృష్టకరమైన పరిస్థితి ఆసన్న మైతే, యుద్ధం చేసి అయినా సరే శాంతి భద్రతలను కాపాడటం క్షత్రియ ధర్మం. రాజధర్మం.

కనుక యుద్ధం అనేది క్షత్రియుని కర్తవ్యము. యుద్ధఫలం ఇలాగే ఉండాల్సి అనే నియమ మేమీ లేదు. అది ఎలాగైనా ఉండొచ్చు. కర్మఫలాలు దైవాధీనాలు. కర్తవ్యాన్ని నిర్వహించడం మానవుల వంతు. ఫలాలను అనుగ్రహించడం భగవంతుని తంతు. కర్తవ్యాన్ని విస్మరించే వానికి ఫలాలను గూర్చి ప్రసంగించే అర్హత ఉండదు.

క్షత్రియుడు ధర్మ పరిపాలన చేయాలి. అది ధర్మము. ఏ కారణం చేత నైనా ధర్మచ్యుతి జరిగితే, తత్ఫలితంగా శాంతిభద్రతలు కుంటు పడితే, దానిని సుస్థిర పరచ డానికి యుద్ధమే శరణ్య మైతే, యుద్ధంలో పోరాడైనా సరే, దేశాన్ని, ప్రజల్ని రక్షించాలి. అందుచేత యుద్ధం క్షత్రియుని ధర్మం అని చెప్ప బడింది. ఈ విధంగా యుద్ధం క్షత్రియునికి స్వధర్మము ( ***స్వధర్మః క్షత్రియస్య యుద్ధమ్*** ).

**ధర్మయుద్ధంలో ధనంజయుడు**

కురు సామ్రాజ్యాన్ని పాలించ డానికి అంధుడైన ధృతరాష్ట్రుడు అనర్హుడు. అందుచేత ధృతరాష్ట్రుని సోదరుడైన పాండురాజు ధర్మజ్ఞుల, శ్రేష్ఠ పురుషుల ఆదేశాన్ని ఔదల దాల్చి సింహాసనాన్ని అధిష్ఠించాడు.

అదృష్టాలు అందల మెక్కిస్తాయి. దురదృష్టాలు పని గట్టుకొని క్రిందికి దించుతాయి. పాండురాజు విధి వక్రించింది. తపస్సు నాచరించ డానికి పాండురాజు అరణ్యాలకు వెళ్ళాడు. ఆ తరువాత, పాండురాజు కుమారుడు, జ్యేష్ఠుడు అయిన ధర్మరాజు సింహాసనాన్ని అధిష్ఠించాడు. ఆయన పరిపాలనలో ధర్మం చతుష్పాదాలతో నడిచింది. ప్రజలు సుఖశాంతులలో జీవించారు.

ఇంతలోనే దాయాదుల పోరు ఆరంభమైంది. ధర్మప్రభువు ధర్మరాజును దుర్యోధనుడు దగా చేశాడు. మాయ చేసి మోసం చేసి రాజ్యాన్ని అపహరించాడు. ధర్మం అడవుల పాలైంది. అధర్మం అందల మెక్కింది. అధర్మ పాలనలో ప్రజలు అశాంతికి లోనయ్యారు. ఈ పరిస్థితిని చక్కదిద్ది, ప్రజల జీవనంలో సుఖశాంతులు నింపడము పాండవుల ధర్మమైంది. అందుకే శ్రీకృష్ణుడు పాండవుల పక్షం చేరాడు. కనుక స్వధర్మము అనే కోణము నుండి చూచినా, అర్జునుడు చలింప వలసిన అవసరము లేదు అనేది శ్రీకృష్ణుని అభిప్రాయము.

యుద్ధభూమిలో అర్జునుడు విషణ్ణుడైన సందర్భంలో ఎలా చలించి పోయాడో మనం చూశాం. శరీరం వణుకుతోంది అని అర్జునుడే అన్నాడు. ( ***వేపథుశ్చ శరీరేమే రోమహర్షశ్చ జాయతే*** ). దానిని దృష్టిలో ఉంచుకొని, అర్జునా! క్షత్రియ ధర్మాన్ని ఆచరించడానికి అనువైన ఈ యుద్ధంలో నువ్వు అంతగా చలించిపో నవసరం లేదు అంటున్నాడు శ్రీకృష్ణుడు.

**దిగులు - దిగ్భ్రాంతి**

మహాభారత యుద్ధ ఫలితాలను అతిగా ఊహించుకొని కలత చెందిన అర్జునుడు దారి తప్పి ఆలోచించాడు. అతనికి ధర్మం అధర్మంగా, అధర్మం ధర్మంగా గోచరించ సాగింది. అందుచేత స్వజనుల్ని చంపుకోవడం శ్రేయస్కరంగా కనిపించడం లేదని ప్రథమ అధ్యాయంలో వాదించాడు ( ***న చ శ్రేయోఽ ను పశ్యామి హత్వా స్వజన మాహవే*** ).

తరువాత, రెండవ అధ్యాయంలో తాను ధర్మం విషయంలో సందేహంతో ఉన్నట్లు అంగీకరించాడు. ఏది శ్రేయస్సో కూడా అర్థం కావడం లేదని ఒప్పుకున్నాడు. తనకు శ్రేయస్సును నిశ్చయించి చెప్పమని





ప్రార్థించాడు. అదంతా దృష్టిలో ఉంచుకొని శ్రీకృష్ణుడు, క్షత్రియుడైన వానికి ధర్మయుతమైన యుద్ధము కంటే శ్రేయస్కర మైనది వేరొకటి లేదు అని ధర్మ ప్రసంగం చేస్తున్న ఈ సందర్భంలో నొక్కి వక్కాణిస్తున్నాడు ( ***ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽ న్యత్ క్షత్రియస్య న విద్యతే*** ).

*క్షత్రియుడు అనివార్యమైన మరణం నుండి వెను తిరగ కూడదు. ఒకవేళ యుద్ధంలో ప్రాణం పోయినా ప్రశస్తమే. పవిత్రమే. అదే చెబుతున్నాడు.*

యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వార మపావృతమ్ ।
సుఖినః క్షత్రియాః పార్థ లభన్తే యుద్ధ మీదృశమ్ ॥ 32

**యదృచ్ఛయా-చ-ఉపపన్నం-స్వర్గద్వారం-అపావృతం**
**సుఖినః-క్షత్రియాః-పార్థ-లభంతే-యుద్ధం-ఈదృశం**

| | | | | | |
|---|---|---|---|---|---|
| పార్థ | = | అర్జునా! | ఈదృశం చ | = | ఇట్టి |
| యదృచ్ఛయా | = | కోరకుండా | యుద్ధం | = | యుద్ధమును |
| ఉపపన్నం | = | లభించిన | సుఖినః | = | సుఖవంతులు |
| అపావృతం | = | తెరవ బడిన | క్షత్రియాః | = | క్షత్రియులు |
| స్వర్గద్వారం | = | స్వర్గద్వారము అయిన | లభంతే | = | పొందుతున్నారు |

**పార్థా! యుద్ధము నువ్వు కోరుకున్నది కాదు. దీని వల్ల స్వర్గ ద్వారాలు తెరుచు కుంటాయి. ఇట్టి యుద్ధమును క్షత్రియులు మాత్రమే పొందుతారు. అలా పొందిన వాళ్ళు ధన్యులు కదా!**

**వ్యాఖ్య**

**ఊహించని కార్యం**

యుద్ధమును ఎవ్వరూ అభిలషించరు. యుద్ధాలైనా, వర్షాలైనా కోరితే వచ్చేవి కావు. పుణ్యాన్ని పంచ డానికి యుద్ధం వస్తే, పంటను పండించ డానికి వర్షాలు పడతాయి. యుద్ధం వచ్చినా, వర్షం పడినా కారణాలు ఉన్నాయి. కారణాలు లేకపోతే కోరినా అవి రావు. ఆశించకుండా వచ్చే అవకాశాలను విజ్ఞులు వినియోగించు కుంటారే గాని, పాడు చేసుకోరు.

అర్జునా! క్షత్రియుడివి కావడం చేత ఈ అవకాశం నిన్ను వరించింది. నువ్వు యుద్ధం చెయ్యాలని భావించలేదు. నన్ను కౌరవుల వద్దకు సంధికి పంపే టప్పుడు కూడా యుద్ధాన్ని నివారించమనే నువ్వు కూడా చెప్పావు. నేను కూడా అలాగే ప్రయత్నించాను. కాని, మన ప్రయత్నాలు ఫలించ లేదు. దుర్యోధనుడు యుద్ధాన్నే కోరుకున్నాడు. సంగ్రామం అనివార్యమైంది. ఇది నువ్వు ఆశించకుండానే నీకు ప్రాప్తించింది (***యదృచ్ఛయా ఉపపన్నమ్*** ).

యుద్ధం చెయ్యడం భీష్మాదులకు మాత్రం ఇష్టమా? మన లాగే యుద్ధ నివారణకు వాళ్ళు కూడా ప్రయత్నించారని నీకు తెలియదా? వారి ప్రయత్నాలు కూడా ఫలించ లేదు. యుద్ధం తప్పనిసరి అయింది. మరి, వాళ్ళు యుద్ధానికి రాలేదా? ఇష్టం లేదని పారిపోయారా? పారిపోతే క్షత్రియు లెలా అవుతారు? క్షత్రియ ధర్మాలలో యుద్ధం నుండి పారిపోకుండా ఉండటము కూడా ఒకటి అని వారికి తెలుసు ( ***యుద్ధే చాప్య పలాయనమ్ . . . . క్షాత్రం కర్మ స్వభావజమ్*** ).

### పుణ్యప్రదం

అర్జునా! అనేక యజ్ఞ యాగాదులు చేసిన వాళ్ళు వాటి ఫలంగా స్వర్గాన్ని పొందుతారు. కాని వీరులైన క్షత్రియులు అదే స్వర్గ ఫలాన్ని యుద్ధం వల్ల పొందుతారు. అందుచేత ఆశించని యుద్ధాన్ని పుణ్యం గల క్షత్రియులే పొంద గలరు.

కృష్ణా! హింసాయుతమైన యుద్ధము పుణ్యకార్యమా? అని అడుగుతా వేమో. యుద్ధం పుణ్యకార్య మని నేను చెప్పడం లేదు. యుద్ధం ధర్మ కార్యము అంటున్నాను. ధర్మ కార్యము యొక్క ఫలం పుణ్యం. ఆ పుణ్యఫలం స్వర్గం.

కనుక క్షత్రియ ధర్మాన్ని అనుసరించి యుద్ధంలో పాల్గొనే వీరులు మరణిస్తే, వారి కొరకు స్వర్గ ద్వారాలు తెరుచు కుంటాయి. ధర్మయుద్ధంలో పాల్గొనడ మనే కార్యము వల్ల లభించే పుణ్యమే, మూతబడిన స్వర్గ ద్వారాలను తెరిపిస్తుంది. ఈ శ్లోకంలో అర్జునుణ్ణి *పార్థా!* అని పిలిచాడు శ్రీకృష్ణుడు. పార్థా! అంటే, పృథ కుమారా! అని అర్థము. పృథ అంటే కుంతీదేవి. ఈ సంబోధనలో ఎంతో భావం నిగూఢంగా ఉంది. అట్టి భావప్పుహ తోనే అర్జునునికి స్ఫూర్తి నివ్వాలని భావించి శ్రీకృష్ణుడు పార్థా! అని పిలిచాడు.

శ్రీకృష్ణుడు రాయబారానికి హస్తినకు వెళ్ళి నపుడు, సంధి విఫలమై యుద్ధము అనివార్యము కాగా, తిరిగి పాండవుల వద్దకు వస్తూ, అత్తమ్మ కుంతీదేవిని దర్శించు కున్నాడు. ఆ సమయంలో కుంతీదేవి శ్రీకృష్ణునితో ఇలా అంది.

*ఏతద్ధనంజయో వాచ్యో నిత్యోద్యుక్తో వృకోదరః*
*యదర్థం క్షత్రియా సుతే తస్య కాలోఽ యమాగతః ॥*

కృష్ణా! క్షత్రియ జనని దేని కొరకు కుమారుని కంటుందో, అట్టి సమయము ఆసన్న మైనదని, అర్జునునికి, నిరంతరము పోరాట పటిమను ప్రదర్శించే భీమునికి నా మాటగా చెప్పు అన్నది.

తల్లి మాటను గుర్తుకు తెస్తూ, పార్థా! అని సంబోధించి, కోరకుండా లభించింది, స్వర్గద్వారాలను తెరిచేది అయిన యుద్ధ కార్యాన్ని ఆచరించు అని స్ఫూర్తిని కలిగిస్తున్నాడు శ్రీకృష్ణుడు.

*యుద్ధం చేయకపోతే ఏమౌతుంది? దాని ఫలిత మేమిటో కూడా చెబుతున్నాడు.*

**అథ చే త్త్వ మిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి ।**
**తతః స్వధర్మం కీర్తిం చ హిత్వా పాప మవాప్స్యసి ॥** 33

*అథః-చేత్-త్వం-ఇమం-ధర్మ్యం-సంగ్రామం-న-కరిష్యసి*
*తతః-స్వధర్మం-కీర్తిం-చ-హిత్వా-పాపం-అవాప్స్యసి*

| | | | | | |
|---|---|---|---|---|---|
| అథ | = | ఇక | తతః | = | అపుడు |
| త్వం | = | నీవు | స్వధర్మం | = | స్వధర్మమును |
| ధర్మ్యం | = | ధర్మయుక్తమైన | కీర్తిం చ | = | కీర్తిని |
| ఇమం | = | ఈ | హిత్వా | = | విడిచి |
| సంగ్రామం | = | యుద్ధమును | పాపం | = | పాపమును |
| న కరిష్యసి చేత్ | = | చేయక పోతే | అవాప్స్యసి | = | పొందుతావు |





**అర్జునా! ధర్మ సమ్మతమైన ఈ యుద్ధాన్ని నువ్వు చెయ్యక పోతే, దాని ఫలిత మేమిటో తెలుసా? నువ్వు పోగొట్టు కొనేది స్వధర్మాన్ని, కీర్తిని. పొందేది పాపాన్ని.**

### వ్యాఖ్య

### ధర్మ వర్తనం లేక పోవడమే అధర్మం

ఇష్టాయిష్టాలను నిర్ణయించుకునే అధికారం మనిషికి ఉంది. వాటిని మార్పు చేసుకునే అధికారం కూడా మనిషికి ఉంది. పాపపుణ్యాల విషయంలో మాత్రం నిర్ణయాధికారం శాస్త్రానిదే కాని మనిషిది కాదు.

వ్యక్తి సమాజానికి దూరంగా లేడు. సమాజ సహకారం లేకుండా జీవించ లేడు. సమాజం పట్ల తన ధర్మాన్ని నిర్వర్తించని వాడు అధర్మపరుడు అవుతాడు. అధర్మఫలం పాపం కనుక అతడు పాపము చేసిన వాడు అవుతాడు. పాపఫలమును అనుభవించ వలసిన వాడు కూడా అవుతాడు.

యుద్ధం చెయ్యక పోతే ఏమవుతుంది? ఏ యుద్ధం? ధర్మయుద్ధం. అందుచేతనే, ధర్మయుతమైన ఈ యుద్ధము **(ఇమం ధర్మ్యం సంగ్రామం)** అని నొక్కి మరీ స్పష్టం చేశాడు భగవంతుడు. ఇలాంటి ధర్మ యుద్ధాన్ని విరమిస్తే దుష్ఫలితం అనివార్యం అంటున్నాడు. ఈ శ్లోకంలో **అథ** అనే పద ప్రయోగము వల్ల, యుద్ధం విరమిస్తే కలిగే దోషానికి సంబంధించిన విషయాన్ని హెచ్చరికతో పరిసమాప్తం చేయడం జరిగింది.

యుద్ధ మనేది క్షత్రియునికి స్వధర్మం అని ఇప్పటికే తెలుసుకున్నాం. అధర్మపరులైన శత్రువులు ఎదురు నిలిచి పోరాడే టప్పుడు, వారిని జయించి, ధర్మాన్ని రక్షించ వలసిన బాధ్యత, భూ భారాన్ని తగ్గించ వలసిన కర్తవ్యం కూడా భూపతికే ఉంది. అందుకే ఇది సాధారణ ప్రసంగం కాదు; ధర్మశాస్త్ర ప్రబోధము.

### నిర్జిత్య పరసైన్యాని క్షితిం ధర్మేణ పాలయేత్

ధర్మదూరులైన శత్రు మూకలను జయించి భూమిని, ధర్మాన్ని క్షత్రియుడు రక్షించాలి అని ధర్మశాస్త్రం చెబుతూ ఉంది. దీనికి భిన్నంగా వర్తించడం అధర్మం అవుతుంది. చేయ వలసింది చేయక పోవడం కూడా పాపమే అని ముఖ్యంగా గుర్తించాలి.

ఇక్కడ మరొక సంశయం కలుగుతుంది. కర్మ చేస్తే ఫలితం తప్పదు అనేది అందరికీ తెలుసు. ఫలం ఏదయినా కర్మ చేస్తేనే అందుతుంది. మరి, ఇక్కడ అర్జునుడు కర్మను మానేస్తున్నాడు. అంటే, కర్మ చేయడం లేదు. చేయని దానికి ఫలం ఉందని చెప్పడం విడ్డూరంగా లేదా? అనే సంశయం కొందరికి కలుగుతూ ఉంటుంది.

నిజమే. యుద్ధం అయితే చేయడం లేదు. యుద్ధభూమికి వచ్చి తిరిగి పోతున్నాడా, లేదా? అది కర్మ కాదా? అలా తిరిగి పోవడం అనే కర్మ చేయకూడనిది కాదా? చేయకూడని దానిని చేస్తున్నాడు కనుక అది పాపం. దాని ఫలితమే పాప ఫలం. ధర్మయుద్ధం నుండి పారి పోవడం పాపం. కాని, ధర్మశాస్త్రం ఈ విషయాన్ని ఎంత క్షుణ్ణంగా చెబుతూ ఉందంటే, అలా పలాయనం చిత్తగిస్తున్న సమయంలో యోధుడు కనుక మరణిస్తే, అతని పుణ్యం జయించిన రాజుకు చెందుతుంది అని కూడా చెప్పింది.

### రాజా సుకృత మాదత్తే హతానాం విపలాయినామ్

యుద్ధభూమి నుండి పారిపోతూ మరణించిన వాడి సుకృతాన్ని రాజే పొందుతా డని యాజ్ఞవల్క్య స్మృతి చెబుతూ ఉంది. కనుకనే సంగ్రామం నుండి పరుగులు తీసి పాపం మూట కట్టుకో వద్దు అని శాస్త్రం ఆదేశించింది **(న నివర్తేత సంగ్రామాత్).**

అందుచేత, ధర్మయుతమైన ఈ యుద్ధాన్ని చేయకుండా విడిచి పెడితే, స్వధర్మాన్ని పోగొట్టు కోవడమే గాక, కీర్తిని కూడా పోగొట్టుకొని పాపాన్ని మూట కట్టుకో వలసి వస్తుందని పరమేశ్వరుడు హెచ్చరిస్తున్నాడు.

**పేరు నిలవదు - ఖ్యాతి మిగలదు**

స్వధర్మం అనేది చాలా గొప్ప విషయం. విశాలంగా అర్థం చేసుకో వలసిన విషయం. స్వధర్మం కళ్ళ లాంటిది. కళ్ళజోడు వంటిది కాదు. స్వధర్మం తల్లి లాంటిది. సవతి తల్లి వంటిది కాదు. స్వధర్మం మనతో కలిసి పుడుతుంది. స్వధర్మాన్ని మార్చుకో లేము. సవతి తల్లులు ఎందరైనా ఉండొచ్చు. కన్నతల్లి మాత్రం ఒక్కతే. ఆమె విషయంలో మార్పు జరగదు. జరగలేదు. తల్లి విషయంలో నిర్ణయాధికారం మనకు లేదు. తల వంచి అంగీకరించడమే. స్వధర్మం కూడా తల్లి లాంటిదే. అందుకని స్వధర్మాన్ని విడిచి పెట్ట కూడదు. క్షత్రియునికి యుద్ధం స్వధర్మం కనుక యుద్ధాన్ని విడిస్తే ధర్మాన్ని విడిచి పెట్టినట్లే అవుతుంది అని భగవంతుడు హెచ్చరిస్తున్నాడు. స్వధర్మాన్ని పోగొట్టు కుంటే పాపం వస్తుంది అంటున్నాడు ***(స్వధర్మం హిత్వా పాప మవాప్స్యసి).***

యుద్ధాన్ని విరమిస్తే స్వధర్మ నాశమే గాక, కీర్తి నాశమని కూడా ఎరుక పరుస్తున్నాడు. అదేమిటి? అర్జును డంతటి వీరుడు యుద్ధాన్ని విరమిస్తే జనులు శ్లాఘించరా? ఆహా! చంపే శక్తి ఉన్నా, చంపకుండా విడిచి పెట్టాడు. దయామయుడు, ప్రేమమూర్తి అని స్తుతించరా?

అలా జరగనే జరగదు. యుద్ధ రంగానికి రాకుండా విరమించి ఉంటే, అది వేరే విషయం. యుద్ధం చేయడానికి వచ్చి, రణభూమి నుండి తిరిగి పోతే, యుద్ధం చేయ లేకనే తిరిగి పోయాడు అని చెప్పుకుంటారు.

అర్జునునికి ఎంత పేరుంది! ఎంత ఖ్యాతి ఉంది! చేసిన వందలాది దానకర్మలు ఒక్క దొంగతనంతో పోయినట్లు, ఉన్న ఖ్యాతి సమస్తమూ, యుద్ధం మానేయడ మనే ఒక్క అపఖ్యాతితో తుడిచి పెట్టుకు పోతుంది. పైగా, పాపం మూట కట్టుకో వలసి వస్తుంది.

అయ్యో! ఎంత పాపాన్ని చేయడానికి పూనుకున్నాము? ***(అహోబత మహత్పాపం కర్తుం వ్యవసితా వయమ్)*** అని మొదటి అధ్యాయం నలభై ఐదవ శ్లోకం లోను, ఆతతాయులైన దుర్యోధనాదుల్ని వధించుట వలన మాకు పాపమే వస్తుంది ***(పాప మేవ ఆశ్రయేత్ అస్మాన్)*** అని అదే అధ్యాయం ముప్పై ఆరవ శ్లోకం లోను అర్జునుడు వాపోయాడు. పాప మనేది యుద్ధం చేయక పోవడం వల్ల వస్తుందే గాని ***(పాపం అవాప్స్యసి)*** యుద్ధం చేయడం వల్ల కాదు అని ఈ సందర్భంలో భగవానుడు సహేతుకంగా, సశాస్త్రీయంగా వివరించాడు.

*యుద్ధం చేయక పోవడం వల్ల కలిగే దుష్ఫలితాలను తరువాత శ్లోకంలో కూడా వినిపిస్తున్నాడు.*

**అకీర్తిం చాపి భూతాని కథయిష్యన్తి తేఽవ్యయామ్ ।**
**సమ్భావితస్య చాకీర్తి ర్మరణా దతిరిచ్యతే ॥ 34**

***అకీర్తిం-చ-అపి-భూతాని-కథయిష్యంతి-తే-అవ్యయాం***
***సంభావితస్య-చ-అకీర్తిః-మరణాత్-అతిరిచ్యతే***

| | | | | | |
|---|---|---|---|---|---|
| అపి చ | = | మరియు | కథయిష్యంతి | = | ముచ్చటించుకుంటారు |
| భూతాని | = | లోకులు | సంభావితస్య | = | మాననీయునకు |
| తే | = | నీ యొక్క | అకీర్తిః | = | అపకీర్తి |
| అవ్యయాం | = | అంతము లేని | మరణాత్ చ | = | మరణము కంటె కూడా |
| అకీర్తిం | = | అపకీర్తిని | అతిరిచ్యతే | = | అధిక మైనది. |





**ప్రజలు నీ అపకీర్తిని చాలా కాలం పాటు అదే పనిగా చెప్పుకుంటారు. సన్మానాలు అందుకొన్న వానికి అవమానము మరణం కంటే ఎక్కువే కదా?**

**వ్యాఖ్య**

**జరిగిన వన్నీ సన్మానాలే**

అర్జునా! ఒక పెద్ద బండను కొండ మీదకి మోసుకొని పోవడానికి చాలా శ్రమించాలి. సమయం కూడా చాలా పడుతుంది. అదే బండను పై నుండి క్రిందికి త్రోయడానికి పెద్దగా శ్రమించ నవసరం లేదు. పైగా ఎక్కువ కాలం పట్టదు కూడా.

అర్జునా! నీవు ఎంత కీర్తిమంతుడివి! అదంతా క్షణాల్లో వచ్చిందా? సులభంగా ప్రాప్తించిందా? ఎంత కాలం ఎంతగా శ్రమిస్తే లభించింది! ఎన్ని అద్భుతమైన ఆయుధాలు నీ వద్ద ఉన్నాయి! అవి దారిన పోయే వాళ్ళు దానం చేసినవి కావే! దేవతల్ని మెప్పించి, ఒప్పించి తెచ్చినవి కావా? పరమశివునితో నువ్వు చేసిన పోరాటం సామాన్యమా? దాని వల్ల నీకు లభించిన కీర్తి మరొకరికి సాధ్యమా? ***( మహా దేవాది సమాగమాది నిమిత్తాం, కీర్తిః).*** జనులు నిన్ను ఎంతగా కీర్తించారు! ధర్మాత్ముడు అనలేదా? శూరుడని పిలవలేదా? ***(ధర్మాత్మా, శూరః ఇత్యేవం ఆదిభిః ).*** నువ్వు యుద్ధం నుండి వెను దిరిగితే ఈ కీర్తి మిగుల్తుందా? నీ ఖ్యాతి నిలుస్తుందా?

**జరగబోయే వన్నీ అవమానాలే**

ఎంతో కాలం శ్రమించి సాధించిన కీర్తి క్షణాల్లో మటుమాయ మవుతుంది. అర్జునా! సంవత్సరాలు శ్రమించి సాధించిన పేరేమో క్షణాల్లో పోతుంది. క్షణాల్లో సంక్రమించిన అపకీర్తి మాత్రం జీవితాంతం ఉంటుంది. పేరు లేకపోతే నష్టం లేదు. పేరున్న వాడు చెడ్డపేరుతో బ్రతకడం దుర్భరంగా ఉంటుంది. మరణ సదృశంగా ఉంటుంది. కాదు, కాదు. మరణం కన్నా దారుణంగా ఉంటుంది.

నువ్వు కనిపించగానే అదిగో! అతడే! అంటూ చెప్పుకుంటారు. పూర్వం కూడా అలాగే చెప్పుకొనే వారు. కాకపోతే, దేవతల్ని సైతం ఎదిరించి పోరాడిన విజయ శిఖామణి ఇతడే! అని చెప్పుకొనే వారు. ఇప్పుడు? అదిగో, అతడే! కురుక్షేత్రం నుండి దౌడు తీసిన వీరయోధుడు అతడే! అని అవహేళన చేస్తారు. అది భరించడం నీ లాంటి వీరుడికి సాధ్యమేనా అర్జునా? ఆలోచించు!

కృష్ణా! వీరుడు అంటే, పరాక్రమాన్ని ప్రకటిస్తే నేనా? బాహుబలాన్ని ప్రదర్శించి శత్రువును వధిస్తేనే శూరుడా? వీరుడైన వానికి మనస్సు ఉండదా? క్షత్రియుడు అయినంత మాత్రాన ప్రేమ ఉండదా? ధీరుడికి సున్నిత మైన హృదయం ఉండ కూడదా? ఇప్పటి వరకు నా వైభవా లెన్నో చూశారు. ఈ యుద్ధాన్ని ఎందుకు చేయలేక పోతున్నానో ప్రజలు గ్రహించ లేరా? పండితులు వివరించ లేరా? జాలిగుండె అని నిర్ణయించ లేరా?

అర్జునా! అదంతా నీ భ్రమ! ఈ సమాజం ఒక మాయలమారి. అన్నీ బాగుంటే వగలు ఆరబోస్తుంది. ఏ మాత్రం తేడా వచ్చినా, నిజానిజాలను పరిశీలించ కుండానే పగలు కుమ్మరిస్తుంది. అసమానంగా ఊరేగిన వాణ్ణి అదుపు లేకుండా కుదిపేసే సమయం ఆసన్న మైందని పొంగి పోతుంది. నామరూపాలు లేకుండా ఊడ్చి పారేసే కాలం చేరువైందని ఆనందంతో పరవళ్ళు త్రొక్కుతుంది. సముద్ర మంత నోరు తెరుచుకొని విమర్శిస్తుంది. గాలిలా తిరుగుతూ ప్రచారం చేస్తుంది. సామాన్యులే కాదు, మహారథులు కూడా నిన్ను నిశితంగా, నిర్దయగా విమర్శిస్తారు. యుద్ధం చెయ్యలేక కేవలం పిరికితనం తోనే నువ్వు పరుగులు తీశావని చెప్పుకుంటారు. నా మాట విను!

భయా ద్రణా దుపరతం మంస్యన్తే త్వాం మహారథాః ।
యేషాం చ త్వం బహుమతో భూత్వా యాస్యసి లాఘవమ్ ॥ 35

భయాత్-రణాత్-ఉపరతం-మంస్యంతే-త్వాం-మహారథాః
యేషాం-చ-త్వం-బహుమతః-భూత్వా-యాస్యసి-లాఘవం

| | | | | | |
|---|---|---|---|---|---|
| మహారథాః | = | మహారథులు | యేషాం | = | ఎవరికి |
| త్వాం | = | నిన్ను | త్వం | = | నీవు |
| భయాత్ | = | భయము వలన | బహుమతః | = | మాననీయుడవు |
| రణాత్ | = | రణరంగము నుండి | భూత్వా | = | అయి |
| ఉపరతం | = | మరలిన వానినిగ | లాఘవం | = | చులకన |
| మంస్యంతే | = | అనుకుంటారు | యాస్యసి చ | = | పొంద గలవు |

**మహారథు లందరూ పూర్వం ఎంతగానో నిన్ను గౌరవించారు. ఇప్పుడు వాళ్ళ దృష్టిలో నువ్వు చులకనై పోతావు. కేవలం భయం వల్లనే నువ్వు యుద్ధం మానేశావని వాళ్ళందరూ భావిస్తారు.**

**వ్యాఖ్య**

**ఉన్న కృపను చూడరు**
**లేని భయాన్ని అంటకడతారు**

అర్జునా! సామాన్యులు చేసే విమర్శల్ని తట్టుకో వచ్చు. కాని, మహారథులు కూడా అలాగే భావిస్తారు. నువ్వు ఏదో కృపతో యుద్ధం నుండి వెను దిరిగావని బుజు మార్గంలో అర్థం చేసుకోరు. కర్ణుడు మొదలైన వారికి భయపడే నీవు యుద్ధాన్ని విరమించా వని చెప్పుకుంటారు (**భయాదిభిః కర్ణాదిభ్యః యుద్ధాత్ నివృత్తం చిన్తయిష్యన్తి - న కృపయా ఇతి**) అంటున్నాడు గీతాచార్యుడు.

అర్జునుడిలో ఉన్నది వాస్తవానికి కృపే. ఈ విషయం శ్రీకృష్ణునికి పూర్ణంగా తెలుసు. కాని, ఎవరు అర్థం చేసుకుంటారు? ఒక వైపు నిజం తెలుస్తూ ఉన్నా, అర్జునుణ్ణి చులకన చేయాలని పలు విధాలుగా విమర్శిస్తారు. జడిసి పోయాడు. ఇక జగడ మెక్కడిది? అని అపహేళన చేస్తారు.

పూర్వము అర్జునుడు అంటే గౌరవం ఉన్నవాళ్ళే ఇప్పుడు చులకనగా చూస్తారు. అందుకే **లాఘవమ్** అంటున్నాడు శ్రీకృష్ణుడు. 'లాఘవమ్' అంటే లఘుభావము, తేలిక భావము, చులకన భావము అని అర్థము.

లఘుభావం ఏర్పడి నపుడు కేవలం వెనుక మాత్రమే నిందిస్తారని చెప్పలేము. ముందే విమర్శిస్తారు. ముఖం మీదే అపహాస్యం చేస్తారు. ఇలాంటి సమయాల లోనే మహామహులు కూడా నీరు గారి పోతారు. ఇలా చులకన భావంతో చూచే దెవరు? పూర్వం తనను గౌరవించిన వాళ్ళే. భయపడిన వాళ్ళే. దుర్యోధనుడు మొదలైన వాళ్ళే. వాళ్ళే ఇప్పుడు నిందించే మహారథులు (**మహారథాః దుర్యోధన ప్రభృతయః**). దుర్యోధనాది ప్రభృతులు పూర్వం భయపడి గౌరవించారు. నేడు చులకన భావంతో లేని దౌర్బల్యాన్ని అంట గడతారు. కొందరు మనుషులు మారరు. వారి మనసులూ మారవు. మంచికి నోచుకోరు. వంచనకు వెనుకాడరు. అర్జునా! అలాంటి వారికి అవకాశం ఇచ్చిన వాడివి అవుతావు. బాగా ఆలోచించుకో!

చరణము : **పాలకడలిలో కాలకూట విషము**
**ఎదురౌ తుందని ఎరిగిన దెవరు?**





**ఏ పాప మెరుగని కైలాసపతికి**
**గళమున గరళము నింపిందెవరు?**
పల్లవి : **మారిన దెవరు - మార్చే దెవరు?**
**మార్పు మనిషికి సాధ్యమా మనసా?** ॥ మారిన ॥
అనుపల్లవి : **కురిసే మబ్బును నిలిపే దెవరు?**
**మారే మనసును ఆపే దెవరు?** ॥ మారిన ॥

మంచివారు చెడు నెరుగరు. చెడ్డవారు మంచి నెరుగరు. వివేకం లోపిస్తే మహిలో అన్నీ విడ్డూరాలే.

*యుద్ధం మానేస్తే, అందరి దృష్టిలో అర్జునుడు ఎలా చులకన అవుతాడో వివరించిన వాసుదేవుడు, అలా తేలిక భావంతో రెచ్చిపోయిన శత్రువులు ఏ విధంగా మాట్లాడతారో వినిపిస్తున్నాడు.*

అవాచ్యవాదాం శ్చ బహూ న్వదిష్యన్తి త వాహితాః ।
నిన్దన్త స్తవ సామర్థ్యం తతో దుఃఖతరం ను కిమ్ ॥ 36

అవాచ్యవాదాన్-చ-బహూన్-వదిష్యంతి-తవ-అహితాః
నిందంతః-తవ-సామర్థ్యం-తతః-దుఃఖతరం-ను-కిం

| | | | | | |
|---|---|---|---|---|---|
| తవ | = | నీకు | అవాచ్యవాదాన్ చ | = | అనరాని మాటల్ని కూడా |
| అహితాః | = | శత్రువులు | వదిష్యంతి | = | అన గలరు |
| తవ | = | నీ యొక్క | తతః | = | అంత కంటె |
| సామర్థ్యం | = | సామర్థ్యమును | దుఃఖతరం | = | దుఃఖము |
| నిందంతః | = | నిందిస్తూ | కిం ను | = | ఏముంటుంది? |
| బహూన్ | = | అనేకంగా | | | |

**అర్జునా! ఇక నువ్వంటే గిట్టని వాళ్ళున్నారు చూడు. నీ సామర్థ్యాన్ని నిందిస్తూ అనరాని మాటలు అంటారు. అంతకు మించిన బాధ మరొకటి ఉంటుందా?**

**వ్యాఖ్య**

అర్జునా! ఎవరైనా తేలికైన బంతి తోనే ఆడుకుంటారు. బరువైన బండతో ఎవ్వరూ ఆడుకోరు. చులకన కానంత వరకే శూరత్వము. ఒక్కసారి వీరుడు చులకన అయ్యాడా, ఆ తరువాత అందరూ శూలాలు దించడానికే చూస్తారు. మాటల ఈటెలు విసిరేందుకే సిద్ధ పడతారు. పదునైన పదాలను ప్రయోగిస్తారు. వాడియైన వాక్యాలను వినిపిస్తారు. అంతకు మించిన దుఃఖం మరొకటి ఉంటుందా?

కృష్ణా! అదేమిటి? నా శక్తేమిటో ఎవరికి తెలియదు? నా వీర వైభవ మంతా ప్రచార రూపంలో జనావళిలో ఊరేగింది కదా? సమాజానికి నేనేమైనా క్రొత్త వ్యక్తినా? ఇంత తెలిసి నన్నెందుకు నిందిస్తారు? నా సామర్థ్యము వారికి తెలియనిదా?

అర్జునా! తెలుసు. నీ శక్తేమిటో విమర్శించే వారికి బాగా తెలుసు. తెలుసు కనుకనే నిందిస్తారు. తెలియని వాళ్ళు ఎలా నిందిస్తారు? అసలు వాళ్ళు నిందించేది నీ సామర్థ్యాన్నే (**నిందంతః తవ సామర్థ్యమ్**). సామర్థ్యాన్ని శ్లాఘించాలి గాని నిందించడ మేమిటి, అంటావా? సామర్థ్యానికి క్రొత్త అర్థాలు పుట్టిస్తారు. నూతన వ్యాఖ్యానాలు వెలుగు లోకి తెస్తారు. పైగా, ప్రభుత్వం నడిపే వాళ్ళు. అందరూ ఆ వైపే మొగ్గు చూపుతారు. వాళ్ళు వేసే

నిందలు దుర్భరంగా ఉంటాయి. అనరాని మాటలు అంటారు (**అవాచ్య వాదాన్ వదిష్యన్తి**). అవి కూడా అనేక విధాలుగా ఉంటాయి (**బహూన్**). అలా ఎందుకు చేస్తారు అంటావా? వాళ్ళందరూ నీకు అహితులే కనుక. (**అహితాః శత్రవః**). శత్రువులు ఏమి చేయరు? ఏది మాట్లాడరు?

నీ సామర్థ్యము (**తవ సామర్థ్యమ్**) నీకు తెలుసు. నాకు తెలుసు. వాళ్ళకు కూడా తెలుసు. తెలిసే నిందిస్తారు. ఏముంది ఇతడి సామర్థ్యం? అంటూ విమర్శలు మొదలు పెడతారు. అబ్బ! శివుడితో యుద్ధం చేశాడట! మన ముందే నిలువ లేక పోయాడు. చూడగానే పారిపోయాడు. ఇతనేమిటి? శివుడితో యుద్ధం చేయడ మేమిటి? ఏదో వేడుక కోసం శివుడు కొంతసేపు వినోదంగా ఆడుకుంటే, ఇతడే శివుణ్ణి జయించి నట్లు చెప్పుకున్నాడు. అంతా ప్రచార ఆర్భాటము! ఈ రోజు తేలిపోయింది కదా, కురుక్షేత్రంలో ఆయన సామర్థ్య మేమిటో!

ఇక ఉత్తర గోగ్రహణం విషయం మనకే తెలుసు కదా! ఉత్తర కుమారునికి సారథిగా వచ్చినవాడి సామర్థ్యం ఏమిటో మనమే చూశాం కదా! ఏదో దయ తలచి ఒక్కడితో పోరాడట మెందుకని వదిలేస్తే, తానే మమ్మ ల్నందరినీ జయించినట్లు చాటింపు వేయించు కున్నాడు. మరి, ఆ సామర్థ్య మేదో ఇప్పుడు ప్రదర్శించ వచ్చు కదా!

ఆయన గొప్ప నాట్యాచార్యుడే కావచ్చు. ఆడుకుంటే ఎవరు కాదన్నారు? పోరాడటం అనే మాటలో ఆట ఉందని, పోరు ఒక ఆటని అర్జునుడు భావించి నట్లుంది. కర్ణ దుర్యోధనాది వీరుల ముందు నిలబడి పోరాడట మంటే, ఉత్తర కుమారునికి సారథ్యము వహించడమూ కాదు, ఉత్తరకు నాట్యం నేర్పించడమూ కాదని అర్జునుడికి ఇప్పటికి తెలిసి ఉంటుంది అని చెప్పుకుంటారు. ఒకనాటి నీ సామర్థ్యం ఈ రోజు అసమర్థతగా అందరి నోళ్ళల్లో నాని పోతుంది.

ఏదో మహాయుద్ధం చేసేటట్లు రెండు సేనల మధ్య రథాన్ని నిలపమని చెప్పాడు. ఇది ఎక్కడన్నా ఉందా? ఈ పుడమికి పోరాటాలు క్రొత్తవా? ఇది వరకు ఎందరు యుద్ధాలు చేయలేదు? ఏదో ఒక వైపు నిలబడి యుద్ధం చేయడం చూశాము. మధ్యలో నిలబడి యుద్ధం చేస్తారా? ఈ మధ్యావతారము ఏమిటో! పాండవ మధ్యముడు కనుక మధ్యలోకి వచ్చాడేమో అనుకున్నాము. తరువాత అర్థమైంది, ఈ మధ్యావతారము విరాట నగరంలో ఎత్తిందే నని. అందుకే కదా, వీర పురుషుల్ని చూడగానే కాలికి బుద్ధి చెప్పాడు.

అర్జునా! అహితులు అదుపులో ఉంటారా? అవకాశం వచ్చి నపుడు జారవిడుచు కుంటారా? మహారథులే అలా అంటారని అనుకోకు. మశకాలు కూడా తెగించి తమ మహిమను తామే చాటు కుంటాయి. మామూలు సైనికులు కూడా నన్ను చూచే భయపడి అర్జునుడు పారిపోయాడు అని భార్యలతో చెప్పుకుంటారు. నన్ను చూచిన తరువాత, ఆ నరుడు నడవనే లేదు. పార్థా! పార్థా! అంటూ సారథి వెంటబడి పిలుస్తున్నా, ఇంకెక్కడి పార్థుడు? పరుగే పరుగు. ఒకటే పరుగు. అయినా, అందరూ అలా పరుగులు తీయలేరు. పోరాటంలో లేక పోయినా, పరుగులో మాత్రం గొప్ప పటిమే ఉంది అని చెప్పుకుంటారు. అర్జునా! నీతో పాటు నాకూ తప్పదు పోటు. ఆలోచించుకో! ఇక పత్రికలలో వార్తలన్నీ మన చుట్టే తిరుగుతాయి. పతాక శీర్షికన నీ పేరు ఊరేగుతుంది. ఏదో ఓ మూల వలయం చుట్టి నాకూ కొన్ని వడ్డిస్తారు. అర్జునా! ఇంతకు మించిన దుఃఖం మరొకటి ఉంటుందా? ఇలా దుఃఖంతో జీవించడం కన్నా యుద్ధంలో మరణించడమే మేలు కదా! (**మృతం శ్రేయో న జీవితమ్**).

*యుద్ధం చేయడమా? చేయక పోవడమా? ఇక ఈ మీమాంసకు తెర దించుతూ, యుద్ధమే సమంజస మని నిర్ణయం చేస్తున్నాడు భగవంతుడు.*





హతో వా ప్రాప్స్యసి స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్ ।
తస్మా దుత్తిష్ఠ కౌన్తేయ యుద్ధాయ కృతనిశ్చయః ॥ 37

**హతః-వా-ప్రాప్స్యసి-స్వర్గం-జిత్వా-వా-భోక్ష్యసే-మహీం**
**తస్మాత్-ఉత్తిష్ఠ-కౌంతేయ-యుద్ధాయ-కృతనిశ్చయః**

| | | | | | |
|---|---|---|---|---|---|
| కౌంతేయ | = | అర్జునా! | భోక్ష్యసే | = | అనుభవించ గలవు |
| హతో వా | = | చంప బడితివా | తస్మాత్ | = | అందువలన |
| స్వర్గం | = | స్వర్గమును | కృతనిశ్చయః | = | దృఢనిశ్చయము కలవాడవై |
| ప్రాప్స్యసి | = | పొంద గలవు | యుద్ధాయ | = | యుద్ధమునకు |
| జిత్వా వా | = | జయించితివా | ఉత్తిష్ఠ | = | లెమ్ము! |
| మహీం | = | రాజ్యమును | | | |

**కౌన్తేయా! యుద్ధంలో మరణిస్తే స్వర్గాన్ని పొందుతావు. జయించావా, భూ మండలాన్ని పాలిస్తావు. ఏదైనా రానీ! నిశ్చయమైన భావంతో లేచి నిలబడు. యుద్ధానికి సిద్ధం కా!**

**వ్యాఖ్య**

కర్తవ్యాన్ని నిర్వహించే వారికి ఏదైనా మంచే జరుగుతుంది. ధర్మాన్ని ఆచరించే వారు ఎన్నడూ దగా పడరు. స్వధర్మాన్ని ఆచరించే వారు సత్ఫలితాన్నే అందుకుంటారు. కనుక ధర్మాచరణంలో సంశయాలు మంచివి కావు. యుద్ధకర్మకు సంబంధించిన సర్వ సంశయాలను అర్జునుని హృదయం నుండి దూరం చేసిన భగవానుడు, ఇక స్వధర్మమైన యుద్ధమును ఆచరించి సత్ఫలమును అందుకో మని ఆజ్ఞాపిస్తున్నాడు.

**విజయమో! వీర స్వర్గమో!**

యుద్ధం అనివార్యమని తేలిపోయింది. మరి ఫలితం మాట ఏమిటి? అది మన చేతిలో లేని విషయం. ఆట ఆడటమే మన పని. జయాపజయాలు దైవాధీనాలు. కర్మలు ఏవైనా అంతే. కర్మలు మనం చేస్తాం. రావలసిన ఫలం దైవానుగ్రహంగా వచ్చి తీరుతుంది. కాకపోతే, స్వధర్మానుష్ఠానంలో ఫలితం ఎలా ఉన్నా, అది శుభదాయకం గానే ఉంటుంది.

యుద్ధం విషయంలో కృత నిశ్చయంతో ఉండమని ఆజ్ఞాపించాడు అచ్యుతుడు. ఫలితం విషయ మంటారా? ఏముంది? ఇక్కడ రెండే ఫలితాలు ఉన్నాయి. కాకపోతే, ఏది వచ్చినా శుభమే. లాభమే. పోరాటము అనివార్యం. మరణిస్తే స్వర్గం ప్రాప్తిస్తుంది (**హతః సన్ స్వర్గం ప్రాప్స్యసి**). గెలిస్తే రాజ్యం లభిస్తుంది (**జిత్వా వా భోక్ష్యసే మహీమ్**). రెండిటిలో ఏదైనా లాభమే. వాంఛనీయమే (**ఉభయథాపి లాభః ఏవ**).

ధర్మయుద్ధంలో మరణించిన వారికి స్వర్గం ప్రాప్తిస్తుంది. ఇది శాస్త్రం నిర్ణయించిన ఫలం. ఒకవేళ గెలిస్తే రాజ్యం లభిస్తుంది. ప్రజలకు ధర్మ పరిపాలనం అందించే అవకాశం వస్తుంది. ఎన్నో పుణ్య కార్యాలు చేయ వచ్చు. రాజ్యభోగాలు అనుభవించ వచ్చు. బ్రతికితే పుణ్యకార్యాలు చేయవచ్చు. మరణిస్తే పుణ్య ఫలాన్ని అనుభవించ వచ్చు. ఎటు చూచినా లాభమే. ఏది జరిగినా నష్టం లేదు. అందుచేతనే, ఇలాంటి యుద్ధాన్ని సుఖవంతులైన క్షత్రియులే పొందుతారు అని భగవంతుడు ముప్పై రెండవ శ్లోకం లోనే చెప్పేశాడు (**సుఖినః క్షత్రియాః పార్థ లభన్తే యుద్ధ మీదృశమ్**).

కీడెంచి మేలెంచాలి అంటారు పెద్దలు. యుద్ధంలో జయాపజయాలు రెండూ లాభాలే నని తేలినా,

పరమేశ్వరుడు ముందుగా మరణాన్ని ప్రస్తావించి ***(హతోవా)*** ఆ తరువాత విజయాన్ని పేర్కొన్నాడు. ముందు మరణానికే సిద్ధం చేస్తున్నాడు. కష్టతరమైన కార్యానికి మనస్సును సిద్ధం చేసుకుంటే, ఆ తరువాత జీవితంలో కష్టాలే ఉండవు. వైఫల్యాలకు జంక కుండా సిద్ధపడి పోరాడితే, ఆ తరువాత ఏది వచ్చినా వైభవం గానే ఉంటుంది. అందుచేత, ఇక లేచి, యుద్ధానికి సిద్ధపడ మని చెబుతున్నాడు శ్రీకృష్ణుడు.

కౌన్తేయా! లే, నిలబడు అన్నాడు శ్రీకృష్ణుడు. నేను యుద్ధం చేయలేను అని చెప్పి, ధనుర్బాణాలను క్రింద పడేసి, రథము వెనుక భాగాన అర్జునుడు కూర్చుండి పోయాడు అనేది మనం చూశాం ***(రథోపస్థ ఉపావిశత్).*** యుద్ధం నిశ్చయం అని చెప్పేశాడు కనుక, ఇక లేవ మంటున్నాడు శ్రీకృష్ణుడు. లేవ మన్నాడు కదా అని లేచి ఇంటి వైపు అర్జునుడు అడుగులు వేస్తాడేమో నని, లేచేది యుద్ధము కొరకే ***(యుద్ధాయ)*** అని స్పష్టం చేస్తున్నాడు.

ఈ సందర్భంలో అర్జునుణ్ణి ***కౌంతేయా!*** అని పిలిచాడు శ్రీకృష్ణుడు. ఈ సన్నివేశంలో ఇలా పిలవడంలో ఏదో అనుబంధం పెన వేసుకొని ఉంది. ఇది కేవలం మనస్సును చలింప చేసే మాట కాదు. హృదయాన్ని ద్రవింప చేసే ప్రేమ పిలుపు.

సోదరుడు మాటల మధ్య, తమ్ముడూ! అన్నాడు అంటే, ఆ క్షణంలో ఏదో జరుగుతూ ఉందని అర్థం. పేరు పెట్టి పిలిచే తండ్రి, నాయనా! అని కుమారుణ్ణి పిలిచాడు అంటే, నా తండ్రీ! అని బిడ్డను పలకరించాడు అంటే, వాళ్ళిద్దరి మధ్య ఆ క్షణంలో మాటలకు అందనిది ఏదో జరిగిపోతూ ఉందని గ్రహించ వచ్చు. అలాగే, శ్రీకృష్ణుడు ఈ సందర్భంలో అర్జునుణ్ణి కౌంతేయా! అనడంలో కూడా అలాంటిదే ఏదో దోబూచు లాడుతోంది.

అర్జునా! చెప్ప వలసింది అంతా చెప్పాను. వివిధ కోణాలలో వివరించాను. మా మేనత్త కుమారుడివి. అందుకే, సంకోచం లేకుండా మాట్లాడేశాను. ఇక కార్యరంగం లోకి కాలు పెట్టాలి. నువ్వు సూక్ష్మగ్రాహివి. కుంతీపుత్రుడివి. కుంతము అంటే బల్లెము. బల్లె మంత కుశాగ్ర బుద్ధి గల వాడివి అని అర్థము. నడుము బిగించు. మీ అమ్మ నీకు ఎందుకు జన్మ నిచ్చిందో ఆ కార్యాన్ని నెరవేర్చ మని నా ద్వారా ఆమె నీకు ఆదేశా న్నిచ్చింది. తల్లి ఆజ్ఞను పాలించు. తల్లి పక్షము వాణ్ణి. నా మాట కూడా హృదయంలో పెట్టుకో. ఉత్తిష్ఠ! లేచి నిలబడు అనేదే కౌంతేయా! అనే సంబోధనలో శ్రీకృష్ణుని ఆంతర్యము.

**భవ్యమైన మలుపు**

భగవద్గీత ఇక్కడ ఒక అందమైన మలుపు తిరుగుతోంది. కర్మయోగానికి బాట సుగమం చేయ బడుతోంది. ఉపనిషత్తులు బ్రహ్మవిద్యనే ప్రధానంగా చేసుకొని శోభిస్తూ ఉంటాయి. భగవద్గీత బ్రహ్మవిద్యతో పాటు యోగశాస్త్రంగా కూడా దేదీప్యమాన మవుతూ ఉంది. అదే గీత యొక్క ప్రత్యేకత ***(శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మ విద్యాయాం యోగశాస్త్రే).***

కర్మ లేకుండా జీవితం క్షణం కూడా ముందుకు సాగదు. ప్రతి కర్మను అవగాహనతో ఆచరించ గలిగితే కర్మ అనేది యోగంగా మారి అమృతమయ జీవనాన్ని ప్రసాదిస్తుంది. కానిచో, బంధాన్ని సృష్టించి బ్రతుకులో అందాలను, ఆనందాలను దూరం చేస్తుంది.

నిరాశల నుండి మనిషి బయట పడాలి. నిరుత్సాహాన్ని బుద్ధి నుండి తరిమి వేయాలి. ఎన్ని పరిస్థితులు చుట్టు ముట్టినా, ఎన్ని సమస్యలు అడ్డు నిలిచినా, ఏ మాత్రం కళను కోల్పోకుండా, చుక్కల మధ్య పూర్ణ చంద్రుని లాగా శోభించే జీవన మార్గాన్ని ఇక తరువాత శ్లోకం నుండి పదిహేడు శ్లోకాలలో ఒక ప్రవాహంలా బోధించ బోతున్నాడు భగవంతుడు. ***ఉత్తిష్ఠ!*** లేచి, నిలబడు అని భగవంతుడు చెప్పింది ఒక్క అర్జునునికే





కాదు, మనందరికీ. యావ త్ప్రపంచానికి, అన్ని కాలాల లోని అందరు వ్యక్తులకి. శారీరక రుగ్మతల్ని విడిచి, మానసిక దౌర్బల్యానికి చరమగీతం పాడి, ఉత్సాహంతో, ఉద్యమ స్ఫూర్తితో, జీవిత రంగస్థలిపై తమ పాత్రను మహోన్నతంగా పోషించుటకు సిద్ధం కమ్మని సర్వ మానవాళికి పాంచజన్యాన్ని పూరిస్తూ పవిత్ర సందేశాన్ని అందివ్వ బోతాడు.

*యుద్ధంలో మరణిస్తే స్వర్గము ప్రాప్తిస్తుంది. యుద్ధంలో గెలిస్తే రాజ్యము లభిస్తుంది. నిజమే. అయితే ఈ యుద్ధం వల్ల ఇహపరాలలో ఏదో ఒకటి సిద్ధిస్తుంది. కాని, అర్జునుడు కాంక్షించిన శ్రేయస్సు ఎలా వస్తుంది? మోక్షహేతువు కానపుడు ఈ యుద్ధాన్ని చేయడ మెందుకు? సమబుద్ధితో సంగ్రామాన్ని నిర్వహిస్తే, దాని వల్ల చిత్తశుద్ధి ఏర్పడి, మోక్షమునకు దారి సుగమ మవుతుంది. ఆ విధమైన కర్మయోగమును ఆచరించడానికి తగిన ఉపదేశాన్ని అనుగ్రహిస్తున్నాడు.*

సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ ।
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాప మవాప్స్యసి ॥ 38

***సుఖదుఃఖే-సమే-కృత్వా-లాభాలాభౌ-జయాజయౌ***

***తతః-యుద్ధాయ-యుజ్యస్వ-న-ఏవం-పాపం-అవాప్స్యసి***

| | | | | | |
|---|---|---|---|---|---|
| సుఖదుఃఖే | = | సుఖదుఃఖాలను | యుద్ధాయ | = | యుద్ధానికి |
| లాభాలాభౌ | = | లాభనష్టాలను | యుజ్యస్వ | = | సిద్ధపడు |
| జయాజయౌ | = | జయాపజయాలను | ఏవం | = | ఇలా చేస్తే |
| సమే | = | సమానముగ | పాపం | = | పాపమును |
| కృత్వా | = | భావించి | న అవాప్స్యసి | = | పొందవు |
| తతః | = | ఆ తరువాత | | | |

**సుఖ మొచ్చినా, దుఃఖ మొచ్చినా ఒకేలా ఉండు. లాభ మొచ్చినా, నష్ట మొచ్చినా ఒకే భావంతో చూడు. జయ మొచ్చినా, అపజయ మొచ్చినా సమబుద్ధితో స్వీకరించు. ఇలా చేస్తే నీకు ఏ పాపమూ అంటదు.**

**వ్యాఖ్య**

అర్జునుడు అంత దుఃఖం లోనూ, తన దుఃఖ మేమిటో స్పష్టంగా దర్శించ గలిగాడు. శత్రువులు లేని సమృద్ధమైన రాజ్యము భూలోకంలో లభించినా, సురలోక ఆధిపత్యము ప్రాప్తించినా, ప్రస్తుతం తనను కాల్చేస్తున్న దుఃఖాన్ని అవి పోగొడుతాయి అని తాను భావించటం లేదని తేల్చి చెప్పేశాడు. తనకు కావలసిన శ్రేయస్సును నిశ్చయించి చెప్పమని కూడా శ్రీకృష్ణుని అడిగాడు.

అర్జునా! యుద్ధంలో మరణిస్తే స్వర్గము, జయిస్తే రాజ్యము లభిస్తాయి కనుక యుద్ధం చెయ్యమని శ్రీకృష్ణుడు ఆదేశించాడు. ఈ రెండిటిని (ఇహపర సుఖాలు) నిరుపయోగంగా అర్జునుడు చూస్తున్నాడు. పైగా అతను వాంఛించేది శ్రేయస్సు. అంటే, మోక్షము. యుద్ధం వల్ల స్వర్గమో, రాజ్యమో వస్తాయే గాని మోక్షము వచ్చే ప్రసక్తే లేదు. ముఖ్యంగా క్షత్రియునికి యుద్ధం కంటే శ్రేయస్సును ఇచ్చేది మరొకటి ఉండబో దని శ్రీకృష్ణుడు ఈ ధర్మప్రసంగాన్ని ప్రారంభిస్తూ ముప్పై ఒకటవ శ్లోకం లోనే చెప్పడం జరిగింది ***(ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య న విద్యతే).***

కర్మ ఏదైతే జరుగుతూ ఉందో, దానికి సంబంధించిన జ్ఞానం ముందే ఉంటుంది. మనం ఏ కర్మ

చేయాలి? ఎలా చేయాలి? చేసే పద్ధతి ఏమిటి? మన అవగాహన ఎలా ఉండాలి? ఇవన్నీ కర్మాచరణం జరగక ముందే మన బుద్ధిలో ఉండాలి. ఈ విధంగా, కర్మజ్ఞానములు అనుష్ఠానంలో అభిన్నంగా ఉన్నాయి. కనుక, జ్ఞానశుద్ధి లేకుండా కర్మశుద్ధి రాదు. జ్ఞానశుద్ధితో కర్మాచరణం జరిగితే, అది యుద్ధమైనా, యజ్ఞమైనా, తద్వారా అంతఃకరణము శుద్ధిపడి, ఆత్మజ్ఞానమును పొందుటకు అర్హమై, మోక్షాన్ని పొందుతుంది. ఈ విధమైన కర్మయోగ ప్రక్రియను ఆవిష్కరిస్తూ, కర్మయోగ పునాదిని ఈ శ్లోకంలో అందంగా భగవానుడు నిర్మిస్తున్నాడు. సమబుద్ధి కలిగి కర్మలను ఆచరిస్తే, పాపము పొందక పోవటమే గాక, చిత్తశుద్ధిని పొంది మోక్షమును పొందే అర్హతను సంపాదించ గలుగుతారు అని బోధిస్తున్నాడు.

ఇంతవరకు యుద్ధం చేయడానికి అనుగుణంగా హేతువు లన్నీ వినిపించాడు. ఇప్పుడు తాత్త్విక దృష్టితో, అనుష్ఠాన ప్రధానమైన కర్మయోగాన్ని ప్రవేశ పెడుతున్నాడు. ఆ తరువాత కర్మయోగాన్ని చర్చిస్తాడు. అంతటితో ఆగకుండా మున్ముందు రాబోయే అధ్యాయాలలో కూడా ఈ విషయాన్ని గీతాచార్యుడు ప్రస్తావిస్తూనే ఉంటాడు. ఇది విషయాన్ని అందంగా మలుపు తిప్పే శ్లోకము.

యుద్ధము స్వధర్మ మని భావించి పోరాటానికి దిగుతున్న అర్జునునికి సముచితమైన ఉపదేశాన్ని ఈ శ్లోకంలో శ్రీకృష్ణుడు అందిస్తున్నాడు అని భాష్యంలో శ్రీ శంకరులు కూడా అభిప్రాయ పడ్డారు **(యుద్ధ మానస్య ఉపదేశమ్).** అయితే, ఈ ఉపదేశము ప్రసంగ వశాత్తు చేయబడినా **( ఏష ఉపదేశః ప్రాసంగికః )** వాస్తవానికి పరమార్థ దర్శనమును బోధించడమే ఇందులోని ప్రధాన విషయము.

### సమతా సౌధానికి ముఖద్వారము

సమతా సౌధంలో ప్రవేశించాలి అంటే రాగద్వేషాలు సమరసమై ఉండాలి. తటస్థపడి ఉండాలి. రాగద్వేషాలు తటస్థపడిన బుద్ధిలో సుఖదుఃఖాలు నిలవ లేవు. ఇది కాస్త విచారించి, విశ్లేషణతో అర్థం చేసుకో వలసిన విషయము.

కర్మాచరణం వెనుక రాగద్వేషాలే ప్రధానంగా ఉంటాయి. ఏది చేరువైతే మనకు సుఖమో, దానిపై మనకు రాగం ఉందని అర్థము. ఏది దూరమైతే మనకు సుఖమో, దానిపై మనకు ద్వేషము ఉంది అని అర్థము. వ్యక్తుల విషయంలో కూడా అంతే. ఇవే రాగద్వేషాలు.

యుద్ధం విషయమే తీసుకుందాం. యుద్ధం సుఖమా? కానపుడు, దుర్యోధనుడికి యుద్ధంపై రాగం ఎలా ఉదయించింది? యుద్ధం ఇష్టం కాదు, దేని కారణంగా యుద్ధమనే కార్యం జరుగుతూ ఉందో, దాని మీద ఇష్టం. అదేమిటి? లాభం. రాజ్యలాభం. అదెలా వస్తుంది? యుద్ధంలో జయిస్తే వస్తుంది. కనుక లాభం అనే కార్యం జయము అనే కారణం మీద ఆధారపడి ఉంది. అందుచేత దుర్యోధనునికి యుద్ధం ప్రియంగా ఉంది. ఒకవేళ యుద్ధం అపజయాన్ని కలిగిస్తుంది అని ముందే తెలిస్తే, దాని మీద రాగం ఉదయించదు. ద్వేషం పుడుతుంది. యుద్ధాన్ని ద్వేషిస్తాడు. ఎందుకని? యుద్ధం వెనుక నష్టం కార్యంగా ఉంది కనుక. అదే రాజ్యనష్టం. దానికి కారణ మేమిటి? అపజయము. అపజయం కారణంగా రాజ్యనష్టం వాటిల్లుతోంది. కనుక యుద్ధం అప్రియంగా ఉంటుంది.

ఈ విధంగా ఏ కర్మ చేసినా, రాగద్వేషాల ప్రేరణతో కనుక చేస్తే, అవి సుఖదుఃఖాలకు కారణ మవుతాయి. రాగద్వేషాలను తృప్తి పరచేందుకు కర్మ చేయ కూడదు. ధర్మాధర్మాలను దృష్టిలో ఉంచుకొని కర్మలను ఆచరించాలి. ఇలా ధర్మాధర్మాల పరిధిలో నుండి యుద్ధం చేస్తే పాపము అంటదు **(న ఏవ పాపం అవాప్స్యసి).**





సుఖం కార్య రూపంలో తెలుస్తూ ఉంది అంటే, అందుకు లాభమో, జయమో, సన్మానమో కారణమై ఉంటుంది. అలాగే దుఃఖం కార్యరూపంలో తెలుస్తూ ఉంది అంటే అందుకు నష్టమో, అపజయమో, అవమానమో కారణమై ఉంటుంది. రాగద్వేషాలు లేని కర్మలలో సుఖదుఃఖాలు ఉండవు. రాగద్వేషాలు లేని కర్మలు బంధహేతువులు కాలేవు. అందుకనే సుఖదుఃఖాలను, లాభాలాభాలను, జయాపజయాలను సమంగా భావిస్తూ యుద్ధానికి సిద్ధపడ మని భగవానుడు ఆదేశిస్తున్నాడు. సుఖదుఃఖాలను సమం చేయుట మంటే, రాగద్వేషాలను కదలించ వద్దు అని అర్థము **( సుఖ దుఃఖే సమే కృత్వా - రాగద్వేషా అకృత్వా ఇతి ఏతత్ ).**

### రాగద్వేషాలు

సమత్వంలో శాంతి ఉంటుంది. విషమత్వంలో అశాంతి ఉంటుంది. సమత్వము యోగము. విషమత్వము రోగము. రాగద్వేషాలను సమం చేసి, ధర్మాధర్మాలను అవలోకిస్తూ, ఏది చేయాలి? ఏది చేయకూడదు? అనే వివేకంతో కర్మలను ఆచరించేవాడు యోగి అవుతాడు.

కర్మ రంగంలో ప్రవేశించే ముందు కర్మ ఎలా చెయ్యాలో క్షుణ్ణంగా తెలిసి ఉండాలి. రాగద్వేషాలు లేకుండా ఉండాలి. ధర్మాధర్మాల అవలోకనం జరుగుతూ ఉండాలి. ఈ విధంగా, రాగద్వేషాలను సమం చేసి, వాటి కార్యాలైన సుఖదుఃఖాలను, లాభాలాభాలను, జయాపజయాలను సమంగా చూసే సమబుద్ధిని ఏర్పరచుకొని, ఆ తరువాత యుద్ధానికి సిద్ధపడు అర్జునా! అంటున్నాడు శ్రీకృష్ణుడు **( తతః యుద్ధాయ యుజ్యస్వ ).** ఈ విధంగా యుద్ధం చేస్తే పాపాన్ని పొందవు అంటున్నాడు **( ఏవం యుద్ధం కుర్వన్ పాపమ్ న అవాప్స్యసి ).**

దుర్యోధనుడు యుద్ధంలో ఉన్నాడు. అతనిని యుద్ధానికి పురికొల్పిం దెవరు? ధర్మాధర్మాలా? కానే కాదు. అవి అతనికి పట్టనే పట్టవు. గిట్టనే గిట్టవు. అతని వెనుక ఉండి నడిపించేవి రాగద్వేషాలే. అవి ఎలా ఆడిస్తే అలా ఆడాడు. పాపాన్ని మూటగట్టు కున్నాడు.

దుర్యోధనుడికి రాజ్యంపై రాగ ముంది. అంతే కాదు, పాండవులపై ద్వేష ముంది. ఈ రాగద్వేషాలే అతణ్ణి యుద్ధరంగంలో నిల బెట్టాయి. అశాంతిలో పడుకో బెట్టాయి.

యుద్ధానికి రాగద్వేషాలే కారణం కనుక, యుద్ధానికి ముందు కూడా దుర్యోధనుడు అశాంతి జీవనాన్నే గడిపాడు. కాని, శ్రీకృష్ణుడు అర్జునుణ్ణి యుద్ధం చేయ వలసిందిగా ఆజ్ఞాపించడం వెనుక ఈ రాగద్వేషాలు లేవు. వాస్తవానికి అర్జునుడు కూడా రాగద్వేషాలతో కురుక్షేత్రంలో అడుగు పెట్టలేదు. ధర్మ ప్రధానం గానే యుద్ధంలో పాల్గొన డానికి వచ్చాడు. అంటే, పాండవులు దుర్యోధనుని లాగా రాగద్వేషాలతో యుద్ధానికి రాలేదా? లేదు.

మరి, యుద్ధంలో విజయాన్ని సాధిస్తే, రాజ్యాన్ని చేజిక్కించుకోరా? అది రాగం కాదా? కాదు. ఎందుకని? రాజ్యం పాండవులదే కదా! వాళ్ళ రాజ్యాన్నే వాళ్ళు పొందా లనుకుంటున్నారు. పైగా, రాజ్యం ఒక అధర్మపరుడి చేతిలో ఉంది. అలాంటి వ్యక్తి నుండి రాజ్యాన్ని, ప్రజలను రక్షించ వలసిన బాధ్యత క్షత్రియులుగా పాండవులపై ఉంది. కనుక వారు యుద్ధం చేయడంలో ధర్మమే ప్రధానంగా గోచరిస్తూ ఉంది. ఇక ద్వేష మనేది పాండవులలో కాగడా పెట్టి వెతికినా కనిపించదు. దుర్యోధనుని దుష్ట కార్యాలను వాళ్ళు నిరసించారే గాని, ఏనాడూ దుర్యోధనుని నిందించి ఎరుగరు.

కర్మలు చేయక తప్పదు. కనుక, కర్మల వెనుక రాగద్వేషాలు లేకుండా చూసుకోవాలి. కర్మల వెనుక రాగ ద్వేషాలు లేకపోతే, కర్మఫలాల విషయంలో ప్రతిచర్యలు చోటు చేసుకోవు. ప్రతిచర్యలు లేని మనస్సే ప్రశాంతంగా ఉంటుంది.

చేయక తప్పవు కర్మములు
చేసి చూడాలి ఫలములు
అనుకూలములు సుఖములు
ప్రతికూలములు శోకములు
రాగద్వేషాలే సందడులు
రాలిననాడే పండుగలు
రామ రామ జయ రాజారామ్
రామ రామ జయ సీతారామ్   ఇది రామజోగి చిట్కా.

కర్మలలో చంచలత్వం ఉంటుంది. కర్మలలో అన్నీ చలనాలే (**చలనాత్మకం కర్మ**). అలలు అలలుగా కర్మ ప్రేరిత సంకల్పాలు మనసులో కదులుతూ ఉంటాయి. వాటిని అదుపులో ఉంచుకోవాలి. అప్పుడే బుద్ధిలో ప్రశాంతత నిలుస్తుంది.

ఊయలలో బిడ్డ పడుకుని ఉంటుంది. ఆ బిడ్డ చూపులో ఏదో ప్రశాంతత తొంగి చూస్తూ ఉంటుంది. రాగద్వేషాలు లేక పోవడమే బిడ్డ ప్రశాంతతకు కారణము.

మనస్సు ప్రశాంతంగా ఉంటేనే ఏదైనా సాధించ గలం. ఆవేశాలు అంతఃకరణను కుదుపుతూ ఉంటే, బుద్ధిలో ఉద్రేకాలు ఊరేగుతూ ఉంటే, బ్రతుకు పూర్ణత్వం వైపు సాగదు.

రాగద్వేషాల్ని సమం చేస్తే, మనం నివసిస్తున్న ప్రపంచం మనకు రెండింతలుగా కనిపిస్తుంది. మనం నేలపై నడుస్తున్నా, ఆకాశంలో విహరించినట్లే ఉంటుంది. సుఖదుఃఖాలు రెండూ ఒక్కటే అనేది కర్మయోగానికి పునాది. సమభావంతో స్వధర్మాన్ని ఆచరిస్తే, ఏ పాపము అంటదు అని చెబుతూ, ఈ శ్లోకంలో కర్మయోగానికి చక్కని పునాదిని నిర్మించడం జరిగింది. కర్మను కర్మయోగంగా మార్చుకొనే దెలాగో, కర్మఫలాలను ప్రశాంతంగా, ప్రసన్నంగా ప్రసాద రూపంలో ఎలా గ్రహించాలో బోధించే అసమాన గీతా ప్రబోధానికి ఈ శ్లోకంతో శ్రీకారం చుట్టాడు శ్రీకృష్ణుడు.

*ఆత్మ విషయానికి సంబంధించిన జ్ఞానమును ఇంతవరకు చెప్పడం జరిగింది. అట్టి జ్ఞానానికి అనుకూలంగా ఏ కర్మయోగం ఆచరించడం చేత కర్మబంధం నుండి విడిపడటం జరుగుతుందో, అట్టి యోగ జ్ఞానమును చెప్పడానికి ప్రారంభిస్తూ సాంఖ్య, యోగాలకు సంబంధించిన స్పష్టమైన అవగాహనను ఇప్పుడు అందించడమే సముచిత మని భావించి, ఆ విషయాన్ని ఈ సంధి శ్లోకంలో వివరిస్తున్నాడు.*

**ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధి ర్యోగే త్విమాం శృణు ।**
**బుద్ధ్యా యుక్తో యయా పార్థ కర్మబన్ధం ప్రహాస్యసి ॥** 39

*ఏషా-తే-అభిహితా-సాంఖ్యే-బుద్ధిః-యోగే-తు-ఇమాం-శృణు*
*బుద్ధ్యా-యుక్తః-యయా-పార్థ-కర్మబంధం-ప్రహాస్యసి*

| | | | | | |
|---|---|---|---|---|---|
| పార్థ | = | అర్జునా! | అభిహితా | = | చెప్ప బడినది |
| సాంఖ్యే | = | జ్ఞానయోగ విషయమున | యయా | = | ఏ |
| ఏషా | = | ఇంతవరకు చెప్పిన | బుద్ధ్యా | = | బుద్ధిచే |
| బుద్ధిః | = | వివేకము | యుక్తః | = | కూడిన వాడవై |
| తే | = | నీ కొరకు | కర్మబంధం | = | కర్మబంధమును |





| | | | | | |
|---|---|---|---|---|---|
| ప్రహాస్యసి | = | విడువ గలవు | యోగే తు | = | యోగ విషయమున |
| ఇమాం | = | దీనినే | శృణు | = | వినుము |

**అర్జునా! పరమార్థ తత్త్వ జ్ఞానాన్ని సాంఖ్యం అంటారు. ఆ విషయాన్నే ఇంతవరకు నీకు చెప్పాను. ఇక కర్మయోగ విషయాన్ని చెబుతాను. విను. ఈ యోగశాస్త్ర జ్ఞానము చేత నువ్వు కర్మ బంధం నుండి విడి పడతావు.**

**వ్యాఖ్య**

శోకమోహాది రూప సంసార నివృత్తికి సాక్షాత్తు కారణమైన జ్ఞానము సాంఖ్యము. ఇది పరిశుద్ధమైన ఆత్మతత్త్వ విజ్ఞానము (**శుద్ధాత్మ తత్త్వ విజ్ఞానం సాంఖ్య మిత్యభి ధీయతే**). దేని చేత ఆత్మతత్త్వము చక్కగా ప్రకాశింప బడుతూ ఉందో అదే సాంఖ్యము అని శ్రీధర వ్యాఖ్య (**సమ్యక్ ఖ్యాయతే ఇతి సాంఖ్యం**). అంటే, సమస్త ఉపనిషత్తుల చేత (**సర్వైః వేదాంతైః**) ప్రకాశింపబడు ఆత్మజ్ఞానము సాంఖ్యము.

ఈ సాంఖ్య విషయమును **అశోచ్యా నన్వశోచస్త్వం** అనే పదకొండవ శ్లోకము నుండి ప్రారంభించి, ముప్పైయవ శ్లోకము వరకు వివరంగా చెప్పడం జరిగింది. ఆ తరువాత ముప్పై ఒకటవ శ్లోకము నుండి ముప్పై ఎనిమిదవ శ్లోకము వరకు చెప్పిన విషయం సాంఖ్యం కాదు. అది ప్రాసంగిక ఉపదేశము. అంటే, ప్రసంగ వశాత్తు సందర్భానుసారంగా బోధించిన అన్య విషయమే గాని సాంఖ్యము కాదు.

ఇక ఇప్పుడు, అనగా నలభైయవ శ్లోకం నుండి కర్మయోగము బోధింప బడుతూ ఉంది. ఇంతవరకు చెప్పిన (1) ఆత్మ విషయ జ్ఞానమునకు సంబంధించిన సాంఖ్యము, (2) అట్టి జ్ఞానానికి అనుకూలంగా సమబుద్ధితో ఆచరింపబడే కర్మలకు సంబంధించిన కర్మయోగము, మరియు (3) బంధమును కలిగించు కర్మలు - ఈ మూడింటికి సంబంధించిన అవగాహన ఈ సందర్భములో ఏర్పడక పోతే, ఆ తరువాత గీతా జ్ఞానమును హృదయంలో భద్రపరచు కోవడం చాలా కష్ట సాధ్య మవుతుంది. అందుకే ఈ ముప్పై తొమ్మిదవ శ్లోకాన్ని సంధి శ్లోకంగా అందించాడు పరమేశ్వరుడు.

**సాంఖ్యము లేదా సన్యాసము**

లేనిది ఉండట మంటూ ఉండదు. ఉన్నది లేకుండా పోయేదంటూ ఉండదు. ఈ రెండిటిని గూర్చిన నిర్ణయము ఏదో అదే తత్త్వవివేకము అంటూ, సదసద్వివేకం ద్వారా ఉన్నది ఆత్మే నని, దానికి అన్యమైనది ఏదైనా అనాత్మే నని సాంఖ్య ప్రకరణంలో గ్రహించాము. ఆత్మజ్ఞానము ద్వారా మోక్షమును పొందవచ్చు నని కూడా తెలుసుకున్నాం. సర్వ బంధముల నుండి విడిపడి పోవడమే మోక్షము.

ఇంతకీ బంధము అనేది సత్యమా, అసత్యమా? బంధమే కనుక సత్యమైతే, సత్యమైనది పోయేది కాదు కనుక బంధము కూడా పోదు. ఒకవేళ బంధమే కనుక అసత్యమైతే, అది లేనిదే కనుక పోవలసిన అవసరం లేదు. ఈ రెండూ కాకుండా బంధం అనేది అటు సత్యము గాక, ఇటు అసత్యము గాక మిథ్యగా గోచరించు చున్నదైతే అది కేవలం అజ్ఞానమే అవుతుంది. అజ్ఞాన జనితమైన అధ్యాసే అవుతుంది. అజ్ఞానమే సమస్యగా తెలిసే టప్పుడు, దానిని పరిష్కరించడానికి జ్ఞానము కన్నా అన్యమైన సాధనము ఉండదు. జ్ఞానము అజ్ఞానమును పోగొడుతుంది. ఉన్నది ఉన్నట్లుగా తెలుస్తుంది. అదే మోక్షము.

మోక్షము అనేది లేనిది కాదు. ఉన్నదే. కాని, అజ్ఞానం వల్ల ఉన్నట్లు తెలియనిది. ఆత్మ లేనిది కాదు. ఉన్నదే. కాని, ఉన్నట్లు తెలియనిది. చీకటిలో ఉన్న వస్తువు లేనిది కాదు. ఉన్నట్లు తెలియనిది. వెలుగు వస్తే ఉన్నట్లు తెలుస్తుంది. అలాగే, జ్ఞాన వెలుగులో అజ్ఞాన చీకట్లు విచ్ఛిన్న మవుతాయి. ఆత్మ తనంతట తానే దివ్యంగా ప్రకాశిస్తుంది. అదే మోక్షము.

ఈ ఆత్మజ్ఞానమే సాంఖ్యము. అర్జునా! ఈ సాంఖ్యానికి సంబంధించిన జ్ఞానమును నీకు బోధించాను *(ఏషా, సాంఖ్యే, బుద్ధిః జ్ఞానం, తే తుభ్యం, అభిహితా ఉక్తా )*. పరమార్థ వస్తు వివేక విషయానికి సంబంధించిన జ్ఞానాన్ని గీతాచార్యుడు బోధించాడు. ఈ జ్ఞానాన్ని పొంది అందరూ తరించాలి.

సాంఖ్యము బోధించే ఆత్మజ్ఞానమును పొందడానికి ప్రతిబంధకాలను తొలగించుకొని కేవలం జ్ఞాన సముపార్జనమే ప్రధానంగా చేసుకొని జీవించే త్యాగి సన్యాసి. ఇతనికి కర్మాపేక్ష ఉండదు. జ్ఞానాసక్తే ప్రధానంగా ఉంటుంది. ఈ విధమైన జీవనానికి అలవాటు పడిన వారు సాంఖ్యులు, లేదా సన్యాసులు. జ్ఞాననిష్ఠ యందే కాలమును వెళ్ళబుచ్చు వారు. ***నిష్ఠా*** అంటే స్థితి. ***అనుష్ఠేయ తాత్పర్యం*** - అంటే అనుష్ఠించ వలసిన దాని యందు తత్పరత్వం. ఇది సన్యాసము. సాంఖ్యజీవన విధానం. సన్యాసి శ్రవణ మనన నిదిధ్యాసల ద్వారా జ్ఞానమును పొంది, తానే బ్రహ్మము అని తెలిసికొని మోక్షరూపు డవుతాడు. సర్వబంధముల నుండి విడి పడతాడు. శోకమోహాలను దాటుతాడు. ఆనంద స్వరూపుడై శోభిస్తాడు. అతడే ఆత్మవిదుడు. ఆప్తకాముడు. బ్రహ్మజ్ఞాని. ఈ స్థితికి ఉపకరించేదే సాంఖ్యము. జ్ఞాననిష్ఠ , లేదా జ్ఞానయోగము.

**కర్మబంధము**

ప్రతి మనిషి అసంతృప్తితో బ్రతుకుతూ ఉంటాడు. తృప్తి చెందాలని అభిలషిస్తూ ఉంటాడు. అది నిత్య తృప్తిగా ఉండాలని భావిస్తూ ఉంటాడు. అలాంటి దాని కొరకు అన్వేషిస్తూ కర్మలు చేస్తూ ఉంటాడు. తద్వారా లభించే ఫలాలు శాశ్వతంగా ఉండాలని ఆశిస్తాడు. కాని కర్మఫలాలు ఎప్పుడూ శాశ్వతం కావు. కర్మలు పరిమితంగా ఉంటాయి. కాలం చేత, దేశం చేత, వ్యక్తి సామర్థ్యం చేత పరిమితంగా ఉండే కర్మలు అనిత్య మైన కర్మలు. వాటి ఫలాలు నిత్యానందాన్ని అందించ లేవు.

కర్మలు చేయకుండా మనిషి క్షణకాలం ఉండ లేడు. కర్మ చేసి నిత్యసుఖాన్ని పొంద లేడు. కర్మలు చేస్తూ ఉంటాడు. తత్సంబంధమైన ఫలాలు అందుతూ ఉంటాయి. ఫలానుభవం తరువాత ఫలం అంతరించి పోతుంది. ఫలం నశించగానే ఫలానుభవం వల్ల ఏర్పడిన ఆనందం కూడా నశిస్తుంది. కాని, ఆ ఆనందానికి సంబంధించిన ఆసక్తి మనస్సులో నిలిచి పోతుంది. అదే వాసనగా పరిణమిస్తుంది. ఇలా మనిషి ఎన్నో కర్మలు చేస్తాడు. ఎన్నో ఫలాలను అనుభవిస్తాడు. ఎన్నో వాసనలను మనస్సులో ముద్రించు కుంటాడు. ఆ వాసనల ప్రేరణతో పునః ఆయా కర్మలలో చరిస్తూ ఉంటాడు.

కర్మ - కర్మఫలం - అనుభవం - వాసన ఇది క్రమము. వాసన - కర్మ - కర్మఫలం - అనుభవం - మళ్ళీ వాసన ఇది ఒక ఆవృతం. ఇదొక భ్రమణం. చక్రభ్రమణం. సంసార చక్రభ్రమణం. కర్మబంధం. ఈ విధంగా కర్మ సముద్రంలో పడి, అనిత్యమైన ఫలాలను అనుభవిస్తూ శోకమోహాది రూప సంసారంలో జీవుడు పరిభ్రమిస్తూ ఉంటాడే గాని మోక్షాన్ని పొంద లేడు.

*కృతి మహోదధౌ పతన కారణం*
*ఫల మశాశ్వతం గతి నిరోధకం*

అశాశ్వతమైన కర్మఫలాలే కర్మ సముద్రంలో పడటానికి కారణ మవుతున్నాయి. గమ్యానికి అడ్డుగోడలై ఉన్నాయి అన్నారు ఉపదేశసారంలో శ్రీ రమణమహర్షి.

పతనానికి కారణమైన కర్మలు ప్రగతికి రాజమార్గం కాలేవు. బంధాన్ని కలిగించే కర్మలు మోక్షానికి కారణం కాలేవు. ***న మోక్షార్థాని కర్మాణి ఇతి సిద్ధమ్*** - కర్మ మోక్షానికి పనికి రాదు అని ఋజువైంది అన్నారు బృహదారణ్యకోపనిష ద్భాష్యంలో శ్రీ శంకరాచార్యస్వామి. కనుక మోక్షమును అభిలషించే వ్యక్తి కర్మల వైపు





వెళ్ళ కూడదు. జ్ఞానం వైపే తిరగాలి. జ్ఞాననిష్ఠాపరుడు కావాలి. అంటే సన్యాసి కావాలి. ఉపనిషత్తుల నిర్ణయం ఇదే. వాస్తవం చెప్పాలంటే భగవద్గీతకు కూడా ఈ విషయము నందే ఆసక్తి, అనురక్తి.

**గీతాశాస్త్రే ఆత్మ జ్ఞానవతః సన్యాసే ఏవ అధికారః న కర్మణి**

శాస్త్రము నుండి, లేదా గురువు నుండి ఆత్మకు సంబంధించిన విషయ జ్ఞానమును పొందిన వ్యక్తి సన్యాసము వైపు మరలాలే గాని, కర్మల వైపు కాదు అనేది గీతాశాస్త్రము యొక్క ఉపదేశము అని గీతాభాష్యంలో శ్రీ శంకరులు అభిప్రాయ పడ్డారు.

కర్మలు చేయకుండా ఉండలేము. అలాగని కర్మలు చేసి సాధించే దేమీ లేదు, కర్మ సముద్రంలో పడి మునిగి పోవడం తప్ప. ఇప్పుడేమి చేయాలి? *కిం కర్తవ్యం?*

**కర్మయోగము**

కర్మయోగమే తక్షణ కర్తవ్యం. అదే నిష్కామ కర్మయోగము. ఈ కర్మయోగము కర్మబంధాలను తొలగిస్తుంది. మోక్షహేతువు అవుతుంది.

కర్మ బంధము కాదు. కర్మఫలము బంధమును సృష్టించదు. కర్మఫలాలను స్వీకరించే టప్పుడు మన మనస్సులో ఏర్పడే ప్రతిచర్యలే బంధాన్ని సృష్టిస్తాయి. ఈ ప్రతిచర్యలకు రాగద్వేషాలే కారణమై ఉంటాయి. కొంప ముంచేవి రాగద్వేషాలే.

కర్మలను త్యజించ వలసిన అవసరం లేదు. రాగద్వేషాలను తటస్థం చేస్తే చాలు. కర్మాచరణంలో 'అహం' భావన లేకుండా నిమిత్తమాత్రంగా వ్యవహరిస్తూ, ఫలాలు అందినపుడు 'మమ' భావన లేకుండా ప్రసాదంగా స్వీకరించ గలిగితే కర్మలు బంధహేతువులు కావు. పైగా అంతఃకరణ శుద్ధికి ఉపకరిస్తాయి. అంతః కరణ శుద్ధి లేని బుద్ధిలో జ్ఞానం నిలవదు. కనుక కర్మయోగి కాని వాడు సన్యాసి కాలేడు. ఈ విషయాలన్నీ మున్ముందు కర్మయోగంలో విపులంగా చర్చించుకుందాం.

**సమన్వయం**

జ్ఞానమును అనుగ్రహించేది సాంఖ్యము. జ్ఞానమును గ్రహించడానికి చిత్తశుద్ధిని, చిత్త నైర్మల్యాన్ని ప్రసాదించేది కర్మయోగము. కర్మయోగి కానివాడు జ్ఞాని కాలేడు. జ్ఞానము ఎంత ప్రధానమో, జ్ఞాన సముపార్జనకు సహకరించే కర్మయోగము కూడా అంతే ప్రధానము.

***యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే***
***ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి ॥***

జ్ఞాననిష్ఠుల చేత ఏ స్థానము పొందబడుతూ ఉందో, కర్మయోగుల చేత కూడా అదే పొందబడుతూ ఉంది. సాంఖ్యమును, యోగమును ఎవ్వడు ఒక్కటిగా చూస్తాడో, వాడే సత్యదర్శనము చేసిన వాడు అని ఐదవ అధ్యాయంలో గీతాచార్యుడే చెప్పబోతాడు. ఇక్కడ సాంఖ్యము అంటే కపిలుని సాంఖ్యము కాదని, యోగము అంటే పతంజలి యోగము కాదని, నేను ప్రత్యేకించి చెప్ప నవసరం లేదనుకుంటాను.

ఎవడు కర్మయోగి అవుతాడో, వాడు తప్పక కర్మసన్యాసి అవుతాడు. కర్మయోగము సన్యాసానికి దూరంగా లేదు. సన్యాస మంటే ఏమిటి? వదలడమే సన్యాసము ***( సమ్యక్ న్యాసః ఇతి సన్యాసః )***. కర్మయోగంలో అది జరుగుతూనే ఉంది కదా!

కర్మయోగి రాగద్వేషాలను వదులు కుంటున్నాడా, లేదా? అది సన్యాస లక్షణం కాదా? కర్మఫలాలను త్యాగం చేయడం లేదా? కర్తృత్వ భావనను విడిచి పెట్టడం లేదా? భోక్తృత్వ భావనను త్యజించడం లేదా? ఇవన్నీ న్యాసాలు కావా? భవిష్యత్తులో ప్రాప్తించే సన్యాసానికి సోపానాలు కావా? ఈ విధంగా సాంఖ్య, యోగాలు రెండూ ముక్తి మార్గాలై ఉన్నాయి. వీటి సమన్వయం తోనే సిద్ధత్వం ప్రాప్తిస్తుంది. ఈ విషయాన్ని ఉపనిషత్తు కూడా ధ్రువపరచింది.

*తత్కారణం సాంఖ్య యోగాది గమ్యం*
*జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః ॥*

సర్వ కారణమైన పరబ్రహ్మమును సాంఖ్యము ద్వారా, కర్మయోగము ద్వారా పొందాలి. అట్టి భగవంతుని తెలుసుకున్న వాడు సర్వ బంధముల నుండి విడిపడు తున్నాడు అన్నది శ్వేతాశ్వతరోపనిషత్తు.

*బంధించే కర్మల కన్నా, బంధవిముక్తికి తోడ్పడే కర్మయోగము ఎంత ఉత్కృష్ట మైనదో తరువాత శ్లోకంలో చెబుతున్నాడు. ఈశ్వరారాధనతో కూడిన కర్మయోగమును అభ్యసించి, భగవదనుగ్రహానికి పాత్రులమై, పరమేశ్వర ప్రసాదం అనే నిమిత్తం వల్ల (**ఈశ్వర ప్రసాద నిమిత్త జ్ఞానప్రాప్తేః**) ప్రాప్తించే జ్ఞానముతో కర్మబంధం నుండి విడిపడి తరించుటకు నిష్కామ కర్మయోగమును స్తుతిస్తున్నాడు. కర్మయోగము నందు ఆసక్తిని పెంపొందించడమే ఈ స్తుతి యొక్క ఉద్దేశ్యము (**స్తుతి ప్రరోచనార్థమ్**).*

నేహాభిక్రమనా శోఽస్తి ప్రత్యవాయో న విద్యతే ।
స్వల్ప మప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్ ॥ 40

*న-ఇహ-అభిక్రమనాశః-అస్తి-ప్రత్యవాయః-న-విద్యతే*
*స్వల్పం-అపి-అస్య-ధర్మస్య-త్రాయతే-మహతః-భయాత్*

| | | | |
|---|---|---|---|
| ఇహ | = ఇందు | ధర్మస్య | = ధర్మము యొక్క |
| అభిక్రమనాశః | = ప్రారంభ నాశము | స్వల్పమపి | = కొంచెమైనను |
| న అస్తి | = లేదు | మహతః | = గొప్పదైన |
| ప్రత్యవాయః | = ప్రత్యవాయ దోషము | భయాత్ | = భయము నుండి |
| న విద్యతే | = ఉండదు | త్రాయతే | = రక్షించును |
| అస్య | = ఈ | | |

**అర్జునా! కర్మలలో రెండు దోషా లున్నాయి. ప్రారంభించిన పని పాడై పోవచ్చు. దీనిని అభిక్రమ నాశ దోషం అంటారు. అలాగే ఫలితాలు విరుద్ధంగా కూడా రావచ్చు. దీనిని ప్రత్యవాయ దోషం అంటారు. కర్మయోగంలో ఈ రెండూ ఉండవు. ధర్మరూపమైన ఈ యోగాన్ని స్వల్పంగా ఆచరించినా, గొప్ప భయం నుండి మనల్ని రక్షిస్తుంది.**

**వ్యాఖ్య**

కర్మ బంధహేతువు. కర్మయోగము మోక్షహేతువు. కర్మ బంధిస్తుంది. కర్మయోగము బంధము నుండి విడిపిస్తుంది. కర్మ దోషయుత మైనది. కర్మయోగము నిర్దోష మైనది. కర్మలలో నష్టం ఉంటుంది. కర్మయోగములో అంతా లాభమే. నష్టము తెలియని లాభమే. వేసే ప్రతి అడుగు అభివృద్ధి వైపే. ప్రగతికి సోపానమే. ఈ విధంగా సకామ కర్మలకు, నిష్కామ కర్మలకు ఉండే భేదాన్ని వివరిస్తున్నాడు.





**అభిక్రమ నాశం**

కర్మ దోషయుతంగా ఉంటుంది. కర్మల లోని దోషాలలో అభిక్రమనాశ దోషం ఒకటి. 'అభిక్రమము' అంటే ప్రారంభము. 'నాశం' అంటే లేదు అని అర్థం. అంటే, ఒక కర్మను ప్రారంభించి నపుడు దానికి ఫలం నిశ్చయంగా ఉంటుంది అనేది లేదు. మనం ఆరంభించిన కర్మ ఫలితాన్ని ఇవ్వకుండానే మధ్యలో నశించే అవకాశం ఉంది. ఎలాగంటే, వ్యవసాయము, వాణిజ్యము మొదలైన విషయాల లాగా (**యథా కృష్యాదేః**).

రైతు పంట పెడతాడు. అది అభిక్రమం. అంటే ప్రారంభం. పొలంలో పంట పెట్టడము అనే ఈ కర్మకు ధాన్యము ఇంటికి చేరడం ఫలం. అలా ఫలము చేతికి అందకుండా, ప్రారంభించిన కార్యము మధ్యలో పాడైతే అది అభిక్రమనాశం. కర్మలలో ఇలాంటి దోషం ఉంటుంది.

ఆదాయం రావాలని వర్తకుడు వాణిజ్యాన్ని ఆరంభిస్తాడు. కాని, మధ్యలోనే నష్టం వచ్చి వాణిజ్యము అనే కర్మ ఆగిపోవచ్చు. ఇదే అభిక్రమనాశం. వంట చేయడం కర్మ. వంట మధ్యలో పాడైతే అది అభిక్రమ నాశ దోషం.

ఆరంభించ బడిన కర్మ నశించ డానికి అనేక కారణాలు ఉండొచ్చు. ఉదాహరణకు పొలంలో పెట్టిన పంటనే తీసుకుందాం. వర్షాలు పడక పంట పాడు కావచ్చు. తెగుళ్ళు కారణం కావచ్చు. ఏది కారణం అనేది అలా ఉంచితే, పాడయ్యే అవకాశం ఉంది అనే విషయాన్ని నిరాకరించే అవకాశం లేదు.

కాని, కర్మయోగంలో ఈ విధమైన దోషం లేదు. వేసే ప్రతి అడుగు ముందడుగే. ఆరంభించిన కర్మ మధ్యలో ఆగినా వినాశము మాత్రం ఉండదు. అభిక్రమనాశం ఉండదు. కర్మయోగము మోక్ష మార్గము. ఈశ్వరారాధనతో కూడింది (**న ఇహ మోక్షమార్గే కర్మయోగే అభిక్రమనాశః**). ఎంత చేస్తే అంతే ఫలము. చేసుకున్న వారికి చేసుకున్నంత.

ఒక వ్యక్తి భయంకరమైన ఆకలితో ఉంటాడు. అతనికి కొంచెము ఆహారమే లభించ వచ్చు. దాని వల్ల అతనికి పూర్తిగా ఆకలి తీరక పోవచ్చు. కాని, కొంతైనా తీరిందా, లేదా? పూర్తిగా తిన నివ్వకుండా మధ్యలో ఎవరైనా ఆపినా, తినినంత వరకు ఆకలి తీరుతుందే గాని, అభిక్రమ నాశము ఉండదు. పూర్తిగా భోంచేయ లేదు కనుక తినింది ఆకలి తీర్చదు అనే దోషం లేదు. కర్మయోగము ఇలాంటిది. అభిక్రమ నాశ దోషము లేనిది. కర్మకు, కర్మఫలానికి మధ్య అవరోధం ఏర్పడి ఫలం అందక పోవడం అనే దోషం కర్మలలో ఉంటుందే గాని, కర్మయోగంలో ఉండదు.

ఈ రోజు పది మాలలు జపం చేయాలి అని కూర్చుంటాము. నాలుగు మాలలు చేస్తాం. ఈలోగా అవరోధం ఏదో వస్తుంది. జపం అక్కడికి ఆపి, వేరే అవసర కార్యంలో మనం నిమగ్న మవుతాం. అలా చేయడం వల్ల ఆరంభించిన జపము నాలుగు మాలలకే పరిమిత మైంది. అయినా, ఆ నాలుగు మాలలు చేయడం వలన కలిగే ఫలము తప్పక వచ్చి తీరుతుంది.

గంట సేపు చేసే పూజలో అర్ధగంట కార్యక్రమం పూర్తి అయింది. ఈ లోగా ముఖ్యమైన ఫోను వస్తుంది. లేచి వెళ్ళి, ఫోనులో మాట్లాడి, ఆ తరువాత తిరిగి వచ్చి మళ్ళీ పూజను ప్రారంభిస్తాం. ఈ విధమైన అవరోధము మధ్యలో ఏర్పడటం వల్ల పూజాఫలము అందకుండా పోవడ మనేది లేదు. భోజనం చేస్తూ చేస్తూ వెళ్ళి, ఫోను మాట్లాడిన తరువాత తిరిగి వచ్చి మళ్ళీ భోజనం చేయడం లాంటిదే.

మరి, అలా ఫోను మ్రోగి పూజకు అంతరాయం కలిగి నపుడు, భక్తుడు కలత చెందడం జరుగుతూ ఉంది కదా! అంటే, అది సాధకుని మనోస్థాయికి సంబంధించిన విషయం. కర్మఫలానికి సంబంధించింది

కాదు. కాని, ఇక్కడ మరొక సత్యాన్ని కూడా సాధకులు గ్రహించాలి. సాధనలో వచ్చే అవాంతరాలను ప్రతిబంధకాలుగా ప్రారంభ సాధకులు భావిస్తారే గాని, పరిపక్వత చెందిన వారు కలత చెందరు. పూజా సమయంలో ఫోను మ్రోగితే, ఆ ఫోను చేసిన వాడు నా కృష్ణుడే అని భక్తుడు ప్రశాంతంగా లేచి వెళ్తాడు. అంతేగాని, అదేదో అవరోధ మని భావించి ఆవేదన చెందడు. ఇలాంటి పరిపక్వత కర్మయోగంలో మెల్ల మెల్లగా అల్లుకుపోతూ ఉంటుంది.

## ప్రత్యవాయం

అభిక్రమ నాశ దోషం లాగే కర్మలలో మరొక దోషం ఉంది. అదే ప్రత్యవాయ దోషం. రోగంతో బాధపడే వ్యక్తి మందు తీసుకుంటాడు. మందు తీసుకొనే మోతాదులో భేదం వచ్చినా, పథ్యంలో లోపం జరిగినా, సత్ఫలితం రాకపోవడ మనేది ప్రక్కన పెడితే, దుష్ఫలితం వచ్చే అవకాశం కూడా ఉంది.

అలాగే ఒక రోగానికి మందు తీసుకుంటే ఆ రోగం పోవచ్చు. తీసుకున్న ఔషధం యొక్క గుణాన్ని బట్టి మరొక క్రొత్త వ్యాధి ఉత్పన్నం కావచ్చు. ఇదే ప్రత్యవాయ దోషం అంటే. ఇలాంటి దోషం కర్మయోగంలో లేదు. ఏ కొద్దిగా కూడా లేదు ***(కిం చ న అపి చికిత్సావత్ ప్రత్యవాయః విద్యతే)***.

వేదోక్త కర్మకాండలో కొన్ని సందర్భాలలో ఉచ్చారణ దోషం వల్ల విరుద్ధ ఫలాలు వచ్చే అవకాశం ఉంది. త్వష్ట ప్రజాపతి నిర్వహించిన యజ్ఞంలో ఇంద్రుని వధించే కుమారుడు కావాలి అని సంకల్పం చేస్తే, స్వరదోషం వల్ల ఇంద్రుని చేత వధింపబడే బిడ్డడు పుట్టాలి అనే భావం ఏర్పడింది. అలాగే జరిగింది*. నహుషుడు కొండచిలువగా మారడం కూడా మనకు తెలుసు. ఇవన్నీ ప్రత్యవాయ దోషాలు. **

కర్మయోగంలో ప్రత్యవాయ దోషం లేదు. నువ్వు 'ఓం నమో భగవతే వాసుదేవాయ' అని సంకీర్తన చేస్తూ ఉన్నావనుకో, ఓం నమో భగవతే వాసుదేవా. . అనే సరికి హఠాత్తుగా తుమ్మొచ్చి ఆపేశా వనుకో. దాని వల్ల నష్టం వాటిల్లదు. నువ్వు విడిచి పెట్టినా 'య' కారాన్ని కృష్ణుడు అందుకొని, తరువాత మంత్రానికి ఫలం సిద్ధం చేస్తుంటాడు. ఇదంతా కర్మయోగ వైభవం.

లాభనష్టాలలో, సుఖదుఃఖాలలో సమబుద్ధి కలిగి, ఫలితాన్ని ఈశ్వర ప్రసాదంగా స్వీకరించే కర్మయోగంలో అభిక్రమ నాశ దోషం ఉండదు. విధి ఉల్లంఘన వల్ల ఏర్పడే ప్రత్యవాయ దోషం కూడా ఉండదు. దోష రహితమైన కర్మయోగంలో ఎంత చేసుకుంటే అంత ఫలం. కర్మయోగి ఆచరించే కర్మలలో ఈశ్వరుడు ఉన్నందున, కర్మయోగి చేసే కర్మలన్నీ అలౌకిక కర్మలే. అలౌకిక కర్మలకు ఫలం కూడా అలౌకికం గానే ఉంటుంది. అదే ఈశ్వరానుగ్రహం. భగవంతుని దయ. ఈశ్వర భావనతో ఎంతగా కర్మ చేస్తూ ఉంటే అంతగా చిత్త ప్రసాదం ఏర్పడుతూ ఉంటుంది.

## నేడు స్వల్పము - రేపు సర్వము

అర్జునా! ఈ కర్మయోగ రూప ధర్మాన్ని స్వల్పంగా ఆచరించినా, అది దారుణమైన జనన మరణ రూప సంసార భయం నుండి మనలను రక్షిస్తుంది. ఇది భగవ ద్వచనం. బాధాతప్త జగత్తులో మ్రగ్గుతున్న జనావళికి భగవంతుడు వినిపిస్తున్న అభయవాక్యం.

ఈ కర్మయోగములో సాధన స్వల్పమే అయినా, ఫలం అధికంగా ఉంటుంది. ఇక్కడ భగవంతుడు స్వల్పం అన్నాడే గాని అల్పం అనలేదు. ఈ రెండిటి మధ్య తారతమ్యాన్ని కూడా మనం గుర్తించాలి.

అల్ప వస్తువు మోతాదులో తక్కువగా ఉంటుంది. విలువ కూడా తక్కువ గానే ఉంటుంది. స్వల్ప వస్తువు



*పూజ్య స్వామీజీ రచించిన చైతన్య భాగవతము. ** చైతన్య మహాభారతంలో చూడవచ్చు.



అలా కాదు. మోతాదులో తక్కువగా ఉన్నా విలువను బట్టి చూస్తే అమూల్యంగా ఉంటుంది. దీనిని యోగ్యతా లక్షణము అంటారు.

రాయి, రత్నము రెండూ రాళ్ళే. మొదటి దానికి పరిమాణమే గాని, యోగ్యత లేదు. రెండవది పరిమాణంలో చిన్నదే అయినా ధర విషయాని కొస్తే ప్రముఖంగా పలుకుతుంది. అందుకే దానిని విలువైన రాయి అంటాము.

దేవాలయం బయట ఒక రాతి ముక్క పడి ఉంటుంది. అందులో మరొక ముక్క మూర్తిగా మలచబడి ఆలయంలో పూజ లందుకొంటూ ఉంటుంది. రెండూ రాళ్ళే. రెండూ ఒకే మోతాదు లోనే ఉన్నాయి. యోగ్యత విషయాని కొచ్చే సరికి పోలికే లేకుండా పోయింది. కర్మలు ఎంత గొప్పవి అయినా బంధ హేతువులే. ఆ కర్మలే యోగభావనతో ఆచరించి నపుడు మోక్ష హేతువులు అవుతున్నాయి. ఇదంతా కర్మయోగ వైభవము.

పవిత్రమైన ఈ కర్మయోగాన్ని ఆచరించే భక్తుడు జనన మరణరూప సంసారం నుండి బయట పడతాడు. స్వల్పము అనే సంశయం అవసరం లేదు. నేడు స్వల్పం, రేపు స్వల్పం, మరునాడు స్వల్పం, ఆ మరునాడు స్వల్పం - ఆ తరువాత సర్వం.

చిన్న నిప్పురవ్వ అరణ్యాన్ని దహించి వేస్తుంది. సాగర మధ్యంలో చిక్కుకున్న వ్యక్తి చిన్న నావను ఆశ్రయించుకొని తీరం చేరుతాడు. చిన్న మాత్రను మ్రింగి రోగి దారుణమైన రోగాన్ని పోగొట్టు కుంటాడు. స్వల్పమైనా, కర్మయోగము భవబంధాలను తొలగిస్తుంది.

కర్మయోగము అనేది భావన. అది కేవలం కర్మ అనుకో కూడదు. కర్మయోగి భావనలో భగవంతుడు ఉంటాడు. భావన బుద్ధిలో ఉంటుంది. భావనలో ఈశ్వరుడు ఉన్నాడు అంటే, బుద్ధిలో ఈశ్వరుడు ఉన్నాడని అర్థము. భావన కూడా కర్మే. మానసకర్మ. భావన రూపంలో భగవంతుడు ఉన్నాడు కనుక అట్టి భావన భగవద్భావన. భగవద్భావనకు ఫలం భగవదనుగ్రహం. అదే భావశుద్ధి. అదే చిత్తశుద్ధి. అదే అంతఃకరణ శుద్ధి. ఆ చిత్త ప్రసాదమే జ్ఞానానికి కర్మయోగిని అర్హుణ్ణి చేస్తుంది. అధికారిని చేస్తుంది.

## అల్ప ప్రయోజనం - అనల్ప ఫలం

సాంఖ్యము బోధించే సన్యాసము ఉత్కృష్ట మైనది. అందులో రెండవ ఆలోచన లేదు. కాకపోతే, పట్టుకున్న ప్రతి దానిని విడిచిపెట్ట మంటూ ఉంటుంది సన్యాసము. ఆశను విడిచిపెట్టు! వ్యాపారాన్ని విడిచిపెట్టు! భార్యా బిడ్డల్ని వదిలేయ్! దేహాన్ని మరచిపో! మనస్సును నిగ్రహించు! ఆలోచనల్ని అరికట్టు! నిజమే, ఇవన్నీ మోయడం ఎందుకు? వీటిని మోయడం కన్నా క్రిందికి త్రోయడమే నయం. బుద్ధి మాత్రం ఎన్నిటి నని మోస్తుంది? మోసి మోసి అదే ఒక మోయలేని బరువై కూర్చుంటుంది.

అలాగని, అన్నిటినీ విడిచి పెట్టడం సాధ్యమా? బుద్ధి శుద్ధి పడినపుడే అవన్నీ సాధ్య పడతాయి. వినాదాలతో వివాదాలు పరిష్కారం కావు. అవగాహన తోనే ఆంతర్యం లోని అలజడులు ఆగుతాయి.

కర్మయోగం తీరుతెన్నులు సన్యాసం లాగా ఉండవు. అది వదులు - ఇది వదులు అని సన్యాసము చెప్పినట్లు కర్మయోగం చెప్పదు. అది చేయదగింది - చెయ్యి, ఇది చేయదగింది - చెయ్యి, అని బుజ్జగించి చెబుతుంది. ఏదో ఒకటి చెయ్యాలనే దురద మనకు ఉండనే ఉంది. కనుక చేయ వలసిన కర్మలను, చేయదగిన కార్యాలను రాగద్వేష రహితంగా చేస్తూ, పనిని పూజగా ఎలా మార్చుకోవాలో కర్మయోగము నేర్పుతుంది. కర్మయోగి చేసే ప్రతి కర్మ ఒక పూజగా మారుతుంది. ఈ విధమైన కర్మయోగంలో రాగద్వేషాలు పలుచబడి పోతూ ఉంటాయి. మనస్సులో ప్రశాంతత చేరిపోతూ ఉంటుంది. చిత్తశుద్ధి ఏర్పడుతూ ఉంటుంది. ఆ తరువాత చిత్త నైశ్చల్యం రానే వస్తుంది. బుద్ధి ధ్యానానికి సిద్ధ పడుతుంది. ఇదంతా కర్మయోగమే చేసి పెడుతుంది.

**మరణంలో ధ్యానం**

కర్మయోగి సాధన దశ లోనే మరణించా డనుకుందాం. కర్మయోగంలో అతిక్రమనాశ దోషము, ప్రత్యవాయ దోషము లేవు కనుక, అతడు మరణ సమయంలో కూడా ఈశ్వర భావననే కలిగి ఉంటాడు కాబట్టి, మరణానంతరము ఈశ్వరభక్తికి అవకాశం ఉండే ప్రదేశంలో జన్మించి, గడిచిన జన్మలో విడిచిన యోగాన్ని తిరిగి చేపట్టి, సాధనను కొనసాగించి తరించి పోతాడు. అందుకే కర్మయోగము కళ్యాణప్రదము.

**న హి కల్యాణ కృత్కశ్చిత్ దుర్గతిం తాత గచ్ఛతి!**

అర్జునా! కళ్యాణ ప్రదమైన కార్యమును ఆచరించు వాడు ఎప్పుడూ దుర్గతిని పొందడు అని గీతాచార్యుడు ధ్యానయోగంలో చెప్పబోతాడు.

*గీతాచార్యుడు బోధిస్తున్న సాంఖ్య, యోగాలలో నిశ్చయ రూపమైన జ్ఞానము ఒక్కటే ముఖ్యమైనది. నిశ్చయము లేనివారి జ్ఞానములు అనంతములుగా ఉంటాయి.*

వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురునన్దన ।
బహుశాఖా హ్యనన్తాశ్చ బుద్ధయోఽవ్యవసాయినామ్ ॥ 41

*వ్యవసాయాత్మికా-బుద్ధిః-ఏకా-ఇహ-కురునందన*
*బహుశాఖాః-హి-అనంతాః-చ-బుద్ధయః-అవ్యవసాయినాం*

| | | |
|---|---|---|
| కురునందన | = | అర్జునా! |
| ఇహ | = | దీని యందు |
| వ్యవసాయాత్మికా | = | నిశ్చయ రూపమైన |
| బుద్ధిః | = | బుద్ధి |
| ఏకా | = | ఒక్కటే |
| అవ్యవసాయినాం | = | నిశ్చయబుద్ధి లేని వారి |
| బుద్ధయః | = | బుద్ధులు |
| బహుశాఖాః | = | అనేక భేదములు గలవి |
| అనంతాః చ హి | = | అనంతములు గదా! |

**అర్జునా! ఈ కర్మ యోగంలో భిన్నాభిప్రాయాలు ఉండవు. బుద్ధి ఏకమై ఉంటుంది. నిశ్చయమై ఉంటుంది. నిశ్చయ బుద్ధి లేని వారి ఆలోచనలు భేదాలతో ఉంటాయి. అంతం లేకుండా సాగుతూ ఉంటాయి.**

**వ్యాఖ్య**

మనస్సులో స్పష్టత లేనప్పుడు మనుగడలో స్పష్టత ఉండదు. మనిషికి ఏమి కావాలో, తాను ఏది పొందాలో స్పష్టంగా తెలిసి ఉండాలి. తాను ఏది పొందాలో తనకే తెలియని నప్పుడు, ప్రయత్నంతో ఏది పొందినా, అది తాను ఆశించింది కాకపోవచ్చు. తన ప్రయాణం ఎటువైపో తెలియని వ్యక్తి ఎటు అయినా పోవచ్చు. తాను చేరే చోటు ఏదైనా కావచ్చు. ఈ విధమైన అస్పష్ట వైఖరి ఆధ్యాత్మిక మార్గంలో చాలా ప్రమాదకర మైనది.

**సాంఖ్యము - యోగము**

గీత బోధిస్తున్న సాంఖ్యము, యోగము రెంటిటి లోను జ్ఞానము నిశ్చయంగా ఉంటుంది. భగవద్గీత మోక్ష ప్రధానమైన శాస్త్రము. సర్వకర్మలను సన్యసించి, ఆత్మజ్ఞానమును మాత్రమే విచారము చేయడము సన్యాసము. ఇదే సాంఖ్యము. జ్ఞానమును పొందడము అంటే నేనే బ్రహ్మము అని తెలుసు కోవడమే. దీనికి సన్యాసము తప్ప మరొక మార్గము లేదు.

రెండవది కర్మయోగము. జ్ఞానము ఎంత ప్రధానమో, కర్మయోగము అంతే ప్రధానము. కర్మయోగము లేకుండా జ్ఞానము కలగదు. జ్ఞానమును పొందడానికి కావలసిన బుద్ధిని కర్మయోగము తయారు చేస్తుంది.





కనుక సాంఖ్య, యోగములు రెండూ మోక్షసాధనాలే. సాంఖ్యములో చెప్పింది, యోగంలో చెప్పబోయేది రెండూ ఒకే గమ్యం వైపు సాగుతాయి. శ్రేయోమార్గంలో అంటే, మోక్షమార్గంలో సాంఖ్య, యోగాల నిశ్చయ స్వభావం ఒక్కటే. దీనినే ఈ శ్లోకంలో **వ్యవసాయాత్మికా బుద్ధిః** అంటున్నాడు పరమేశ్వరుడు.

**నిశ్చయ స్వభావము**

వ్యవసాయాత్మికా బుద్ధి అంటే నిశ్చయ స్వభావం గల బుద్ధి లేదా జ్ఞానము అని అర్థము. ఇక్కడ నిశ్చయ స్వభావము అనేది స్పష్టతకు సంబంధించిన విషయం. మనము పొంద వలసింది ఏమిటి? దాని స్వరూప స్వభావా లేమిటి? దానిని పొంద డానికి సాధన ఏమిటి? ఇవన్నీ బుద్ధిలో స్పష్టంగా ఉండాలి. ఇదే నిశ్చయ జ్ఞానము. వ్యవసాయాత్మికా బుద్ధి (**వ్యవసాయాత్మికా బుద్ధిః**).

సన్యాసి కైనా, కర్మయోగి కైనా గమ్య మేమిటి? మోక్షము. మోక్షము ఎక్కడుంది? ఎలా ఉంది? మోక్షము జ్ఞానరూపంలో ఉంది. కనుక మోక్షానికి జ్ఞానమును పొందడ మొక్కటే మార్గము. ఇది సాంఖ్యము. జ్ఞానమును పొందడానికి సర్వ కర్మలను సన్యసించి సన్యాసి జ్ఞానమార్గంలో పయనిస్తాడు. సన్యాసము స్వీకరిస్తున్నది కూడా కేవలం జ్ఞాన సముపార్జనం చేయాలి అనే ఉద్దేశ్యం తోనే. కనుక సాంఖ్యంలో సాగుతున్న సన్యాసికి వ్యవసాయాత్మికా బుద్ధి, అంటే నిశ్చయ స్వభావము ఒకే విధంగా ఉంది (**ఏకా**).

సాంఖ్యములో సన్యాసికి వ్యవసాయాత్మికా బుద్ధి ఎలాగైతే ఒక్కటే ఉందో, కర్మయోగము నందు భక్తునికి కూడా నిశ్చయ స్వభావము ఒక్కటే ఉంది (**ఇహ కర్మయోగే నిశ్చయాత్మికా బుద్ధిః ఏకా**). తనకు మోక్షం కావాలి. మోక్షం జ్ఞానరూపంలో ఉంది. జ్ఞానమును పొందుటకు కావలసిన చిత్తశుద్ధిని కర్మయోగము ద్వారా పొందుతూ, జ్ఞానంపై దృష్టి నిలిపి జీవనయాత్రను కర్మయోగి సాగిస్తాడు. ఈ విషయంలో ఏ విధమైన సంశయాలు అతని మనస్సులో లేవు. నిశ్చయ జ్ఞాన మొక్కటే ఉంది.

**మనో హి ద్వివిధం ప్రోక్తం శుద్ధం చా శుద్ధ మేవచ**
**అశుద్ధం కామ సంకల్పం శుద్ధం కామ వివర్జితమ్ ॥**

శుద్ధ మని, అశుద్ధ మని మనస్సు రెండు విధాలు. కోరికలతో, తత్సంబంధమైన సంకల్పాలతో కూడింది అశుద్ధము. కామ సంకల్పాది దోషాలు లేనిది శుద్ధము అన్నది ఉపనిషత్తు

సన్యాసులు, కర్మయోగులు మోక్షమే తమ గమ్యంగా భావించి, దాని విషయంలో నిశ్చయ స్వభావంతో ఉన్నారు కనుక, వారిలో కామ సంకల్పాది దోషాలు కరువు. వారి బుద్ధి ఒకే విధంగా ఉంటుంది. అలాంటి ఏక లక్ష్యము లేనివారు అనేక గమ్యాలను అన్వేషిస్తూ, అనేక మార్గాలలో పయనిస్తూ ఉంటారు. అందుచేత వారి జ్ఞానము నిశ్చయంగా ఉండదు. వారు అవ్యవసాయులు. అంటే వ్యవసాయాత్మికా బుద్ధి లేనివారు. ఒకే విధమైన జ్ఞానము లేనివారు. వారి చిత్తము సదా చలిస్తూ ఉంటుంది. వారికి అనేక గమ్యాలు. అనేక మార్గాలు (**బహు శాఖాః**). వాటికి అంత మంటూ ఉండదు. ఒకటి తీరుతూ ఉంటే, మరొకటి కోరుతూ ఉంటారు.

ధనం వెంట పరుగులు తీస్తూ ఉంటారు. పదవుల వెంట పరుగు పెడుతూ ఉంటారు. ఇవన్నీ గమ్యా లనుకుంటారు. అవి ఆగకుండా సాగుతూ ఉంటాయి. అనేకమైన శాఖలుగా విస్తరించి ఉంటాయి అంటున్నాడు గీతాచార్యుడు. అంటే, అనేక భేదాలతో ఉంటాయని అర్థం. వివిధ ఫలాలను ఆశిస్తూ ఉంటారు కనుక వారికి నిశ్చయాత్మికా జ్ఞానం ఉండదు. అలాంటి వారు కర్మయోగమునకు అర్హులు కారు.

కర్మయోగి హృదయం ఆరాధనా భావంతో ఉంటుంది. భక్తుని భావంలో ఈశ్వరుడే నిండి ఉంటాడు. అందుచేత కర్మయోగము పవిత్ర మైనది. కర్మయోగము ఉపాయము. సాంఖ్యము ఉపేయము.

**కురు నందన**

ఈ శ్లోకంలో అర్జునుణ్ణి కురునందనా! అని సంబోధించాడు శ్రీకృష్ణుడు. కురునందనా! అంటే కురు వంశాన్ని సంతోష పెట్టువాడా! అని అర్థము. అంతేకాదు, 'కురు' అంటే చెయ్యి అని అర్థము. 'నందన' అంటే ఆనందించే వాడు. కురునందనా! అని ప్రత్యేకంగా సంబోధిస్తూ, కర్మయోగంలో చరించి తృప్తి చెందు అని బోధించాడు శ్రీకృష్ణుడు.

*నిశ్చయమైన జ్ఞానం లేనివారు ఎలా ఉంటారో వినిపిస్తున్నాడు.*

కర్మ బంధమా? ఈ వాక్యం పలకడం కర్మ కాదా! ఈ వాక్యాన్ని పలకాలి అని అనుకోవడం కర్మ కాదా? పలకడం వాచక కర్మ అయితే, పలకాలి అనుకోవడం మానసకర్మ. కర్మ బంధము అని చెప్పే వ్యక్తి బంధములో ఉండే చెబుతున్నాడా? లేక బంధము లేకుండా చెబుతున్నాడా? బంధములో ఉండే వ్యక్తికి బంధము ఎలా తెలుస్తుంది? బంధము అర్థమైతే ఇక బంధ మెక్కడుంది? కల కనే వ్యక్తికి ఇది కల అని తెలుస్తుందా? తెలిస్తే ఇక కల ఎక్కడుంది?

బంధము లేని వ్యక్తి కర్మ బంధము అని ఎలా చెబుతాడు? అలా చెప్పడం కర్మ అని అతనికి తెలియదా? కనుక కర్మ బంధము కాదు. కానే కాదు. గాలి వీచడం కర్మ. మొక్క పెరగడం కర్మ. పువ్వు పూయడం కర్మ. కాయ కాయడం కర్మ. అలలు కదలడం కర్మ. చిలుక పలకడం కర్మ. కళ్ళు తెరవడం కర్మ. రెప్ప పడటం కర్మ. సృష్టి కర్మ. స్థితి కర్మ. లయ కర్మ. కర్మ కాని దేముంది? కర్మలలో బంధ మెక్కడుంది?

మరి, బంధ మేమిటి? కర్మ బంధము కాదు. కోరిక బంధము. కోరికతో కూడిన ఏ కర్మ అయినా బంధమే. కోరిక లేని కర్మ బంధం కాదు. శ్వాస కర్మ కాదా! అది బంధమా? అలాగని శ్వాసను బంధిస్తే, ప్రాణం నిలుస్తుందా? చూపు బంధమా? అదీ కర్మే కదా! చూపు బంధమైతే సర్వ శక్తిమంతుడైన పరమేశ్వరుని సృష్టి లోని అందాలన్నీ దేని కొరకు? ఎవరి కొరకు? వినికిడి బంధమా? అదే వాస్తవ మైతే, సృష్టి లోని రమణీయ పలుకులు, ఆపాత మధురమైన గానామృతాలను ఎవరు ఆస్వాదించాలి? కనుక కర్మ బంధం కాదు. కోరికే బంధము.

అలా అయితే, కోరిక లేకుండా కర్మ సాధ్యమా? ఏ కర్మను ఎవరు చేసినా, వెనుక కోరిక ఉండి తీరాలి కదా! కోరిక ఉంటేనే కదా ఎవరైనా కర్మ చేస్తారు? భగవంతుడు కూడా సృష్టి చేయాలని కాంక్షించే చేశాడని ఉపనిషత్తు కూడా చెబుతూ ఉంది.

అయినా, కోరిక లేకుండా ఎవరైనా ఉండగలరా? మనిషికి అది సాధ్యమేనా? ప్రతిచోట చలన ముంది. ప్రతి చలనంలో కోరిక దాగి ఉంది. ఈ విశ్వంలో పరిమితాలన్నీ ప్రత్యక్షం గానో, పరోక్షం గానో చలిస్తూనే ఉన్నాయి. అనంతాన్ని అందుకోవాలనే ఆశే ఆ చలనాలలో దోబూచు లాడుతోంది.

భూమండలం కూడా అందుకే చలిస్తోంది. సౌరమండల మంతా మెల్లగా చలిస్తూ, ఒక మహోజ్జ్వలమైన తార వైపుకు తరలిపోతూ ఉందని విజ్ఞాన శాస్త్రవేత్తలు వింత వింత విషయాల్ని వినిపిస్తున్నారు.

మనుషు లందరూ ఆ బాట లోనే ఉన్నారు. ఆ మార్గం లోనే తెలిసో తెలియకో ప్రయాణం సాగిస్తున్నారు. అనిత్యాల నుండి విడిపడి నిత్యవస్తువును వాటేసు కోవాలని, అంతం కలిగిన వాటి నుండి విడిపడి అనంతం వైపు పరుగులు తీయాలని ఆశ పడుతున్నారు. మన అందరి కోరిక అదే.

ఎండలో తిరిగి అలసి పోయి ఇల్లు చేరిన వ్యక్తి, చల్లని పానీయం కావాలని కోరుకుంటాడు. ఎందుకని? ఎండలో వచ్చాడు. బాగా డస్సి పోయాడు. అలసటగా ఉంది. ఆవేదనగా ఉంది. ఇదంతా అనుభవిస్తూ, భరిస్తూ





కూర్చోలేడు. ఈ అస్వస్థత నుండి బయట పడాలి. శీతల పానీయం కావాలి అంటాడు. శీతల పానీయం కావాలి అని అడిగింది శీతల పానీయం కొరకు కాదు. తాను అసౌకర్యం నుండి విడిపడ టానికి.

ఇదొక్కటే కాదు. మనం ఈ ప్రపంచంలో ఏది కోరినా, దాని వెనుక దాగి ఉన్న సత్యం ఇదే. సినిమా చూసినా, టి.వి. చూసినా, కాశ్మీరు వెళ్ళినా, ఊటీలో ఊరేగినా, పకోడి నమిలినా, పాయసం జుర్రినా, ఎత్తులో ఎగిరినా, మత్తులో తూలినా, అన్నిటి వెనుక, అందరి వెనుక, ప్రతి కోరిక వెనుక అసంతృప్తి నుండి విడిపడాలనే ఆత్రుతే ఉంది. కాకపోతే, ఈ విధమైన అనుభవాలలో ఏదో కొంత తృప్తిని మనిషి అనుభవిస్తున్నాడు. వాస్తవానికి అది తృప్తి కాదు. తాత్కాలిక ఉపశమనం మాత్రమే.

మన అసంతృప్తి ఎక్కడుందో మనం చూడలేక పోతున్నాం. మనం ఆశించే తృప్తి ఎక్కడ దాగి ఉందో మనం అర్థం చేసుకోలేక పోతున్నాం. దేహము, ఇంద్రియాలు, మనస్సు కల్పించే పైపై ప్రేరణలకు స్పందిస్తున్నామే గాని, మన ఆంతర్యపు లోతుల్లో వీటికి ఏది హేతువుగా ఉందో విశ్లేషించుకోలేక పోతున్నాం.

అవి కావాలి - ఇవి కావాలి అనేది మన ఉద్దేశ్యం కాదు. అనంతంగా భాసించాలి అనేదే మన ఆశ. ఇది అనంతానికి సంబంధించిన కోరిక. అనంతమైన కోరిక. కాని, ఇంద్రియ మనస్సులు మనల్ని పరిమితాల వైపుకు ఈడుస్తున్నాయి. అసలు బంధానికి హేతువు ఇక్కడే ఉంది. అంతేగాని బంధహేతువు కర్మ కాదు.

మరి, కర్మ బంధం కానపుడు, కోరికే బంధమై నపుడు కోరికల్ని వదిలేస్తే సరిపోతుంది కదా? మరి కోరికలు ఎందుకు కదుల్తున్నాయి? నువ్వు తృప్తిగా లేవు కనుక. తృప్తి చెందాలి అని ఆశిస్తున్నావు కనుక కోరికలు కదుల్తున్నాయి. కోరికల్ని వదిలేయాలి అంటే, అవి లేకపోయినా నువ్వు తృప్తిగా ఉండ గలగాలి. ఉండ గలవా?

***తృప్తిగా ఉండటానికి కోరికల్ని వదిలేస్తావా?***

***తృప్తిగా ఉన్నావు కనుక కోరికల్ని వదిలేస్తావా?***

నువ్వు తృప్తిగా ఉండాలి అంటే కోరికల్ని వదిలేయాలి. నువ్వు తృప్తిగా లేనపుడు కోరికల్ని ఎలా వదుల్తావు? కర్త ఉన్నంత వరకు కోరికలు బంధహేతువులే. నిన్ను నువ్వు కర్తగా భావించినంత వరకు కోరికలు నిన్ను బంధిస్తూనే ఉంటాయి. బాధిస్తూనే ఉంటాయి. నీవు అకర్తవు, అభోక్తవు అని నీ స్వరూపాన్ని నీవు తెలుసుకుంటే, కోరికలు ఉన్నా నష్టం లేదు, పోయినా నష్టం లేదు. కర్మలు సాగినా కష్టం లేదు, కర్మలు ఆగినా కష్టం రాదు.

**నమాం కర్మాణి లిమ్పన్తి న మే కర్మఫలే స్పృహా**
**ఇతి మాం యోఽభిజానాతి కర్మభిర్న సబధ్యతే ॥**

అర్జునా! కర్మలు నన్ను అంటవు. కర్మఫలము నందు నాకు కోరిక లేదు. ఇలా నన్ను ఎవడు తెలుసుకుంటాడో, అతడు కర్మల చేత బద్ధుడు కాదు అన్నాడు జ్ఞానయోగంలో గీతాచార్యుడు.

కృష్ణుడు భోక్తగా లేడు. కనుక కర్త కూడా కాదు. ఆయన అకర్త. అభోక్త. ఇది జ్ఞానం. ఆత్మజ్ఞానం. ఆత్మయే పరమాత్మ. జీవుడే దేవుడు. నరుడే నారాయణుడు. మానవుడే మాధవుడు. మాధవుడు ఏమిటో అర్థ మైతే, మానవుడు మాధవుడి కన్నా అన్యం కాదని తేలిపోతుంది.

ఇది జ్ఞానం. ఇదే సాంఖ్యం (**శుద్ధాత్మ తత్త్వ విజ్ఞానం సాంఖ్య మిత్యభిధీయతే**). సన్యాసము దీని కొరకే. సన్యాసానికి అర్హత లేని వాళ్ళు చిత్తశుద్ధికి కర్మల నాచరించాలి. ఇది యోగము. కర్మయోగము. మోక్షానికి ఈ రెండూ మార్గాలే.

మరి, బంధము? ఈ రెండూ కాకుండా, కోరికల చేత, ఆశల చేత ప్రేరేపింప బడి, కర్మ సుడిగుండంలో పరిభ్రమించే మార్గము ఏదైనా బంధమే. ఇలా బంధాలు తగిలించుకొని, బ్రతుకులో అందాలు చెడగొట్టు కుంటున్న చారస్తుల్ని గురించి, ఛాందసుల్ని గురించి మూడు శ్లోకాలలో చెబుతున్నాడు, విందాం!

**యామిమాం పుష్పితాం వాచం ప్రవద న్త్యవిపశ్చిత: ।**
**వేదవాదరతా: పార్థ నాన్య దస్తీతి వాదిన: ॥** 42

*యాం-ఇమాం-పుష్పితాం-వాచం-ప్రవదంతి-అవిపశ్చిత:*
*వేదవాదరతా:-పార్థ-న-అన్యత్-అస్తి-ఇతి-వాదిన:*

| | | | |
|---|---|---|---|
| పార్థ | = అర్జునా! | వాదిన: | = వాదించువారు |
| వేదవాదరతా: | = వేదవాదముల యందు రమించు వారు | అవిపశ్చిత: | = అవివేకులు |
| అన్యత్ | = మరి యొకటి | పుష్పితాం | = వికసిత పుష్పం లాగా పైకి అందంగా కనపడే |
| అస్తి | = ఉండుట | ఇమాం | = ఇట్టి |
| న | = లేదు | యాం వాచం | = ఏ మాటలను |
| ఇతి | = అని | ప్రవదంతి | = చెబుతున్నారో |

**అర్జునా! అవిపశ్చితులు అంటే అవివేకులు. వీరికి వేదం ప్రతిపాదించిన సకామ కర్మల యందే ప్రీతి. ఫల భోగము నందే ఆసక్తి. స్వర్గాన్ని మించింది మరొకటి లేదని పువ్వులు పరచినట్లు రమణీయంగా వాదిస్తూ ఉంటారు.**

**వ్యాఖ్య**

సాంఖ్యమును అనుసరించే సన్యాసులు, యోగమును ఆశ్రయించిన కర్మయోగులు ఒకే విధమైన నిశ్చయాత్మక బుద్ధిని ఎలా కలిగి ఉన్నారో గడచిన శ్లోకంలో చూశాం. నిశ్చయాత్మక బుద్ధి లేని అవిపశ్చితుల స్వభావమును గూర్చి వరుసగా మూడు శ్లోకాలలో వినబోతున్నాం.

అవిపశ్చితులు అంటే అల్పబుద్ధులు, అవివేకులు అని అర్థం (*అవిపశ్చిత: అల్పమేధస: అవివేకిన: ఇత్యర్థ:*). అలాగని వాళ్ళు నిరక్షరకుక్షులు కారు. వేదాధ్యయనము చేసిన వారే. వేదంలో అద్భుతమైన విషయాలు ఎన్నో ఉన్నాయి. అల్పమైన ఫలాలను అందించే సాధనలు ఉన్నాయి. అనల్పము, అనంతమైన ఫలాన్ని ఇచ్చే సాధనలూ ఉన్నాయి. వివేకులు అనంతఫలము వైపు మొగ్గు చూపుతారు. అవివేకులు అల్ప ఫలాలను ఆశ్రయించుకొని ఉంటారు. అల్ప ఫలాలను ఆశించేవారు కనుక వారు అల్పమేధ కలవారు. అవిపశ్చితులు. అల్పబుద్ధి కలవారు కనుక అల్పాన్నే అనంతంగా ఊహించుకొని, వినే చెవులు దొరకగానే ఆలస్యం చేయకుండా ఊదరగొడుతూ ఉంటారు.

**పువ్వుల పలుకులు**

వీరిది సుమ సంభాషణం (*పుష్పితాం వాచమ్*). వినడానికి ఇంపుగా, సొంపుగా సంభాషిస్తారు. పువ్వులు ఎంత సున్నితంగా ఉంటాయో, వాళ్ళ పలుకులు కూడా అంత సుకుమారంగా ఉంటాయి. పట్టుకుంటే పూల రేకులు ఊడినట్లు, ప్రశ్నిస్తే వీళ్ళ మాటలు కూడా ప్రాబల్యాన్ని కోల్పోతాయి. మనోహరంగా కనిపించే పువ్వులు గంటల్లో వాడిపోయినట్లు, మంజులమైన వీరి వాదాలు క్షణాల్లో వాడోడు లేకుండా పోతాయి. కాకపోతే, వింటున్నంత సేపు రమణీయం గానే ఉన్నట్లు అనిపిస్తాయి అన్నారు శ్రీ శంకరులు కూడా (*శ్రూయమాణ రమణీయాం*). వారి పుష్పిత వాణిని **వదన్తి**, పలుకుతున్నారు అంటే సరిపోతుంది. కాని, గీతాచార్యుడు **ప్రవదన్తి** అని ఉపసర్గను





చేర్చి చెప్పాడు. వారు మాట్లాడే అర్థరహితమైన, వ్యర్థమైన విషయాలను చాలా ఘనంగా భావించి, గంభీర స్వరంతో వినిపిస్తూ ఉంటారు. అందుకని ప్రవదన్తి అన్నాడు. మాటల్లో సస లేకపోయినా, పలికే ప్రతి మాట వేద సవాసే. అదే విచిత్రము.

**వేద వాదాలు**

వీరికి భోగమే యోగము. ఏ సాధన చేస్తే ఏ ఫలం వస్తుంది? ఏ భోగం అనుభవించాలంటే ఏ యాగం చేయాలి? ఈ విధంగా ఫలాపేక్షతో కూడిన యజ్ఞయాగాదుల యందు ఆసక్తే గాని, మోక్షము, భగవంతుడు, మొదలైన విషయాలలో అనురక్తి ఉండదు. నోరు తెరిచారు అంటే కర్మలు - ఫలభోగాలే గాని మరొక ప్రస్తావన ఉండదు.

ఈ యాగం చేస్తే పుత్రులు కలుగుతారు (*పశ్యతి పుత్రం*). ఆ క్రతువు చేస్తే మనవడు పుడుతాడు (*పశ్యతి పౌత్రం*). ఎవరికి ఘనంగా దక్షిణలు ముట్టుతాయో వారు అమృతత్వాన్ని పొందుతారు (*దక్షిణావంతోఽమృతత్వం భజన్తే*). మేము యజ్ఞ యాగాదులు నిర్వహించి సోమపానం చేశాం (*అపామ సోమమ్*). ఇలాంటి నిష్ఫలమైన పుష్పిత వాక్కులను పునశ్చరణ లేకుండా పుంఖాను పుంఖాలుగా పుట్టిస్తూ ఉంటారు. అన్నీ పూల పలుకులే. మోదుగ పూలు లాంటివి. పువ్వుల్లో సువాసన ఉండదు. కాయల్లో చేదు భయంకరంగా ఉంటుంది.

**తన మాటే వేదం - తన పాటే నాదం**

భోగ సాధనాలైన కర్మలు తప్ప మరొక విషయాన్ని ముచ్చటించ డానికి అంగీకరించరు. వేదమంతా తమకే తెలుసు అంటారు. కర్మకాండనే పట్టుకొని వ్రేలాడుతూ ఉంటారు. జ్ఞానకాండ వైపు కన్ను ఎత్తైనా చూడరు. ఎందుకని? కర్మలు - భోగాలు, వీటి కన్నా అన్యమైనది, అద్భుత మైనది మరొకటి లేనే లేదని వాదిస్తూ ఉంటారు (*న అన్యత్ అస్తి ఇతి వాదిన:*). వేదాన్నే విశ్వసిస్తారు. వేదాన్నే భాషిస్తారు. వేదసారాన్ని అందుకొనే ప్రయత్నం మాత్రం చెయ్యరు. కర్మకాండకే ప్రాధాన్యత నిచ్చి, పైపై మాటలకే పరిమిత మవుతారు గాని లోతులకు వెళ్ళి ముఖ్య విషయాన్ని గ్రహించరు.

ఛాందోగ్యోపనిషత్తులో ఒక చిన్న ఆఖ్యాయిక ఉంది. ఒక జీవాత్మను మృత్యువు వెంబడించి తరుము తుంది. పరుగు లెత్తి అలసి పోయిన ఆ జీవాత్మ ఎక్కడ రక్షణ పొందాలో తెలియక వేదాలలో ప్రవేశిస్తుంది. అలాగని మృత్యువు విడిచి పెట్టకుండా, తాను కూడా వేదాల లోకి ప్రవేశిస్తుంది. ఆ జీవాత్మ మృత్యువు నుండి తప్పించుకోవడానికి వేద లోతుల్లోకి, లోతుల్లోకి, లోతుల్లోకి వెళ్తుంది. ఆ అగాధ లోతుల్లోకి వెళ్ళడం మృత్యువుకు సాధ్యం కాదు. మృత్యువు వెను దిరిగి వచ్చేస్తుంది. ఆ జీవాత్మ మరణం నుండి తప్పించుకొని తరించి పోతుంది. ఇదీ కథ.

వేదము యొక్క లోతులను చూచిన వారే మృత్యువు నుండి తప్పించు కుంటారు. వేదము యొక్క లోతు అంటే, వేదము యొక్క అంతము, లేదా చివరి భాగము. అదే వేదాంతము. ఉపనిషత్తుల జ్ఞానము. వేదాంత లోతుల లోకి దూసుకొని పోయింది కనుకనే ఆ జీవాత్మ మృత్యువు నుండి తప్పించుకో గలిగింది. **అపామ సోమమ్** అంటూ పైపైన కర్మకాండ లోనే పచార్లు చేసి ఉంటే, ఇంతే సంగతులు అని సంతకం పెట్టవలసి వచ్చేది.

*ఈ వేద లంపటుల విచిత్ర స్వభావాన్ని తరువాత శ్లోకంలో కూడా వివరిస్తున్నాడు భగవంతుడు.*

**కామాత్మాన: స్వర్గపరా జన్మకర్మ ఫలప్రదామ్ ।**
**క్రియావిశేషబహులాం భోగైశ్వర్యగతిం ప్రతి ॥** 43

కామాత్మానః-స్వర్గపరాః-జన్మకర్మఫలప్రదాం
క్రియావిశేషబహులాం-భోగైశ్వర్యగతిం-ప్రతి

| | | |
|---|---|---|
| కామాత్మానః | = | కోరికలతో నిండిన మనస్సు గల |
| స్వర్గపరాః | = | స్వర్గమే పరమ మైనది అని తలచేవారు |
| జన్మకర్మఫలప్రదాం | = | జన్మమును, కర్మఫలమును ఇచ్చే |
| క్రియా విశేష బహులాం | = | బహుళమైన కార్యకలాపములతో నిండినది |
| భోగైశ్వర్య గతిం ప్రతి | = | భోగముల యొక్క ఐశ్వర్యముల యొక్క ప్రాప్తిని గురించి |

**ఈ అవిపశ్చితుల మనస్సుల నిండా కోరికలే ఉంటాయి. స్వర్గము నందే వారికి మక్కువ. భోగాలను, సంపదలను పొందే మార్గాన్ని చెబుతూ ఉంటారు. అవి అనేక క్రియా కలాపాలతో కూడి ఉంటాయి. పైగా, జన్మ అనే కర్మ ఫలాన్ని అందిస్తాయి.**

**వ్యాఖ్య**

**కోరికల కోలాటం**

కోరికలే స్వభావంగా గల వారికి ***(కామాత్మానః)***, అవి కావాలి - ఇవి కావాలి, అది చేస్తే ఇవి వస్తాయి, ఇది చేస్తే అవి వస్తాయి, అంటూ పోయే వరకు వచ్చే వాటికి స్వాగతం పలకడం తోనే సరిపోతుంది. ఏది చేయాలన్నా, దానికి ముందుగా ఏమొస్తుంది? అనే ప్రశ్న పుడుతుంది. మనస్సు నిండా కోరికలే. బ్రతుకంతా కోరికల కోలాటం తోనే సాగుతుంది. ఇదంతా అజ్ఞాన క్రీడ. అవిద్యా విలాసము. అవిద్యా జనితమైన కర్మ సుడిగుండంలో చిక్కుకొనే భోగవాదులు అంధకారంలో కూరుకు పోతున్నారు అని ఉపనిషత్తు హెచ్చరించింది కూడా.

**అన్ధం తమః ప్రవిశన్తి యే అవిద్యా ముపాసతే**

అవిద్యను ఆశ్రయించే వారు అజ్ఞాన చీకట్లలో ప్రవేశిస్తారు అన్నది ఈశావాస్యోపనిషత్తు.

**దివిలో కాపురం**

స్వర్గమే వారికి పరమ పురుషార్థం. స్వర్గమే గమ్యము ***(స్వర్గ పరాః)***. స్వర్గ ప్రస్తావన వేదంలో ఉంది. స్వర్గం భోగభూమి. వీరు భోగాసక్తులు కనుక స్వర్గమే వీరికి సర్వస్వము. అంతే కాని స్వర్గము కూడా ఒక లోకమే నని, స్వర్గానికి కూడా ఆద్యంతా లున్నాయని, పుణ్యఫలంగా ప్రాప్తించిన స్వర్గము పుణ్యం క్షీణించ గానే నశిస్తుందని, తిరిగి జన్మ ప్రాప్తిస్తుందని వాళ్ళు ఆలోచించరు. భోగవాదులు కనుక, నందన వన విహారాలు, అమృత పానాలు, అప్సరసల విలాసాలు - ఈ వాంఛలే మళ్ళీ మళ్ళీ వాళ్ళ మనస్సులలో తిరుగుతూ ఉంటాయి. జ్ఞానకాండ వైపు దృష్టి మరల్చరు కనుక వైరాగ్య శూన్యులై ఉంటారు. ఈ స్వర్గ చర్చ ప్రతి మతం లోను ఉంది. మోక్షం తెలియని వారికి స్వర్గమే మోక్షము. బ్రతికినంత కాలం కడుపే కైలాసం. ఇల్లే వైకుంఠం. చచ్చిన తరువాత స్వర్గమే సర్వము.

ఈ స్వర్గపరుల సల్లాపాలు ఆలకించిన కొందరు అమాయకులు కొన్ని విచిత్రమైన పదాలను, వింత వింత వాక్యాలను వినిపిస్తూ ఉంటారు. మీరు ఊటీకి వెళ్ళొచ్చారు కదా! అక్కడ ఎలా ఉంది? అని అడిగితే, అబ్బ! ఏం చెప్పను? స్వర్గం లాగా ఉంది అంటాడు. స్వర్గం ఎలా ఉంటుందో చూసిన వాడు చెప్పాడా? చెప్పేవాడు చూశాడా? పోని, అతడు చెప్పిన దానిని మన మెలా అర్థం చేసుకోవాలి? మనం ఎప్పుడైనా స్వర్గం చూశామా? చూడని దానిని అర్థం చేసుకొనే దెలా? ఎవరి మనస్సులో స్వర్గానికి సంబంధించి ఎలాంటి





ఊహాచిత్రం ఉంటుందో, దానిని అలా అలా ఊహించు కోవడమే. అందుకే, ఎవడి లోకం వాడిది అనే నానుడి నోళ్ళల్లో బాగా నానింది.

ఒక కప్పు కాఫీ ఇచ్చి, ఎలా ఉంది? అని అడిగితే, ఒకడు అమృతంలా ఉందంటాడు. ఏదో పూర్వం త్రాగి త్రేపినట్లే! మా అబ్బాయికి ఒక మంచి అమ్మాయిని చూసి పెట్టండి పేరయ్య గారూ! అంటే, మీ కెందుకండీ! రంభ లాంటి అమ్మాయిని చూసి పెడతాను అంటాడే గాని, పిల్లవాడి వయస్సెంతో, రంభ వయస్సెంతో కూడా ఆలోచించడు.

**భోగ భాగ్యాలు**

ఇక వారి పుష్పితవాణి భోగం తోనే బోణి. భోగాలను, ఐశ్వర్యాలను, సిరిసంపదలను, స్వర్గాన్ని - ఇలాంటి వాటిని అనుగ్రహించే కర్మలను గూర్చే వారి చర్చ నడుస్తూ ఉంటుంది. కర్మకు ఫలం జన్మ. ఉత్తమ జన్మ రావాలి అంటే ఏ కర్మను ఆచరించాలి? అనేదే వారి సంభాషణ సారాంశమై ఉంటుంది ***( కర్మణః ఫలం జన్మైవ కర్మఫలం తత్ ప్రదాతాతీతి జన్మ కర్మ ఫలప్రదా )***.

అంతే కాకుండా క్రియా విశేషాలను అధికంగా చర్చిస్తూ ఉంటారు. క్రియా విశేషాలు అంటే క్రియల యొక్క గొప్పతనాలు ***( స్వర్గ పశు పుత్రాది అర్థాః )***. స్వర్గము, సిరిసంపదలు, ఇవే ప్రధానంగా గల విషయాలకు సంబంధించిన కర్మలు అని అర్థము. ఈ విధమైన అనుచిత ఆలోచనలు చేస్తూ జనన మరణ సంసార చక్రంలో పడి తిరుగుతూ ఉంటారు.

*చివరికి ఏమౌతుంది? వినండి.*

భోగైశ్వర్య ప్రసక్తానాం త యాపహృత చేతసామ్ ।
వ్యవసాయాత్మికా బుద్ధిః సమాధౌ న విధీయతే ॥ 44

భోగైశ్వర్య ప్రసక్తానాం-తయా-అపహృత చేతసాం
వ్యవసాయాత్మికా-బుద్ధిః-సమాధౌ-న-విధీయతే

| | | | |
|---|---|---|---|
| భోగైశ్వర్య ప్రసక్తానాం | = భోగైశ్వర్యముల యందు ఆసక్తి కల వారికి | వ్యవసాయాత్మికా | = నిశ్చయాత్మక మైన |
| | | బుద్ధిః | = బుద్ధి |
| తయా | = అట్టి పుష్పిత వాక్కులచే | సమాధౌ | = అంతఃకరణము నందు |
| అపహృత చేతసాం | = అపహరించబడిన మనస్సు గల | న విధీయతే | = ఉండదు. |

**భోగము నందు, ఐశ్వర్యము నందు ఆసక్తు లైన ఈ అవిపశ్చితుల తియ్యని పుష్పిత వాక్కులకు ఆకర్షితులై కొందరు బుద్ధిని జార విడుచు కుంటారు. అలాంటి వారి అంతఃకరణములో నిశ్చయ బుద్ధి నిలవదు.**

**వ్యాఖ్య**

**నిశ్చయం నిలవదు**

భోగమే నా కర్తవ్యం. ఐశ్వర్యమును సాధించడమే నా పని ***( భోగః కర్తవ్యం ఐశ్వర్యం చ ఇతి భోగైశ్వర్యయోః ఏవ ప్రణయవతాం )***. ఈ విషయాల యందే ఆసక్తి. ఆ విధమైన సంకల్ప సల్లాపాల చేత వివేకమును పోగొట్టుకున్న అవిపశ్చితుల బుద్ధి యందు అలాంటి విషయాలే ఉంటాయి గాని, సాంఖ్యులకు, యోగులకు ప్రాప్తించే వ్యవసాయాత్మికా బుద్ధి, నిశ్చయ రూపమైన జ్ఞానము నిలిచేందుకు అవకాశము లేదు. ఇక్కడ సమాధి అంటే అంతఃకరణము, లేదా బుద్ధి అని అర్థము.

### మోక్షం నాస్తి

ఇలాంటి భోగవాదులకు మోక్షము లభించదు. ఎందుకని? కారణం లేకుండా కార్యము సంభవించదు కనుక. ***కారణా భావే కార్యాభావః*** అనే న్యాయము ననుసరించి, కారణము లేకుండా కార్యము ప్రాప్తించదు కనుక, యోగబుద్ధి అనే కారణమే లేని ఈ భోగాసక్తులు తత్కార్యమైన మోక్షమును పొందలేరు.

భోగవాసన అంతఃకరణములో చేరి పోయింది. మనస్సంతా తేనెటీగలు ముసురుకున్నట్లు, కోరికలు నిండిపోయాయి. యోగబుద్ధి ప్రవేశించే అవకాశమే లేదు. కాపాడే వేదము ఉండి కూడా బ్రతుకు అన్యాయమై పోయింది. ప్రమాణ ఫలం అందకుండా పోయింది. అందుకనే బృహదారణ్యకోపనిషత్తు ఇలాంటి వాళ్ళను దృష్టిలో ఉంచుకొని, వేదము వేదము కాకుండా పోయింది అన్నది ***( వేదో అవేదో భవతి ).***

కాకపోతే, ఈ సందర్భంలో శ్రీకృష్ణుడు వేదనింద చేశాడని కొందరు విమర్శిస్తూ ఉంటారు. శ్రీకృష్ణుడు వేదనింద చేయలేదు. వేదసారాన్ని గ్రహించలేని వేదజడుల్ని నిరసించాడు. అంతే.

*అందుకనే, హే అర్జునా! వేదం లోని ఈ కర్మకాండలో చిక్కుకొని సంసారములో పడకుండా, సాంఖ్య, యోగాది గమ్యమైన మోక్షాన్ని పొందుటకు గుణాతీతుడివి కా! అని తరువాత శ్లోకంలో చెబుతున్నాడు.*

త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున ।
నిర్ద్వన్ద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్ ॥ 45

*త్రైగుణ్యవిషయాః-వేదాః-నిస్త్రైగుణ్యః-భవ-అర్జున*
*నిర్ద్వంద్వః-నిత్యసత్త్వస్థః-నిర్యోగక్షేమః-ఆత్మవాన్*

| | | | |
|---|---|---|---|
| అర్జున | = అర్జునా! | నిర్ద్వంద్వః | = ద్వంద్వములు లేని |
| వేదాః | = వేదములు | నిత్యసత్త్వస్థః | =సదా సత్త్వము నందే ఉన్న వాడవు |
| త్రైగుణ్యవిషయాః | =త్రిగుణములకు సంబంధించిన ఫలాలను విషయాలుగా బోధిస్తాయి | నిర్యోగక్షేమః | =యోగక్షేమములు లేని వాడవు |
| | | ఆత్మవాన్ | =అప్రమత్తుడవు |
| నిస్త్రైగుణ్యః | =త్రిగుణాలను విడిచిన వాడవుగా | భవ | =కా! |

**కర్మ కాండను ప్రతిపాదించే వేదాలు త్రైగుణ్య విషయాలు. అంటే, సంసార రూపాలు. అర్జునా! నువ్వు మూడు గుణాల నుండి ముక్తుడివి కా! ద్వంద్వాలను దాటిపో. నిత్య సత్త్వంలో నిమగ్నుడవు కా! యోగక్షేమాల నుండి విడిపడిపో! ఆత్మజ్ఞానివి కా!**

**వ్యాఖ్య**

### వేదము - వేద్యము

వేదంలో ప్రధానంగా రెండు విషయాలు ఉన్నాయి. ఒకటి కర్మకు సంబంధించింది. అదే ప్రవృత్తి. రెండవది జ్ఞానానికి సంబంధించింది. అదే నివృత్తి. ఈ రెండిటిలో ఏదో ఒక దానిని మనుషులు అనుసరిస్తూ ఉంటారు. అందుచేత అందరికీ వేదం యొక్క అవసరం ఉంది. కాకపోతే, వేదంలో ఎవరికి ఏది అవసరమో, ఎవరికి దేనిపై ఆసక్తి ఉందో, దానినే వాళ్ళు అందుకుంటారు. ఆచరిస్తారు.

గ్రంథాలయంలో ఎన్నో గ్రంథాలు ఉంటాయి. గ్రంథాలయానికి అందరూ వెళ్తారు. ఎవరికి ఏ గ్రంథం కావాలో అదే వాళ్ళు తీసికొని చదువుతారు. ఒకరు పింగళి సూరన 'కళాపూర్ణోదయము' చదువుతారు. మరొకరు షేక్స్పియర్ 'కామెడి ఆఫ్ ఎర్రర్స్' చదువుతారు*. ఎవరు ఏది చదువుతారు, ఏది చదవరు? అనేది వాళ్ళ ఇష్టాయిష్టాల మీద ఆధారపడి ఉంటుంది.



* 'కళా పూర్ణోదయము' రచించిన పింగళి సూరన పదిహేనవ శతాబ్దంలో శ్రీకృష్ణ దేవరాయల వారి ఆస్థానము లోని అష్టదిగ్గజ కవులలో ఒకడు. 'కామెడీ ఆఫ్ ఎర్రర్స్' రచించిన షేక్స్పియర్ ఇంగ్లాండు దేశీయుడు. పదిహేనవ శతాబ్దము లోని వాడే. ఇంగ్లండు, ఇండియాల మధ్య రాకపోకలు లేని కాలమది. కాని, వీరిరువురు వ్రాసిన ఈ గ్రంథాలకు సామ్యం ఉందనేది స్వామీజీ అభిప్రాయం.



నిఘంటువులో వేలాది, లక్షలాది పదాలు ఉంటాయి. వాటిలో ఎవరికి ఏ పదం అవసరమో, దాని మీదే చూపుడు వ్రేలు పడుతుంది. వేదంలో అనేక విషయాలు చర్చింప బడ్డాయి. వాటిలో ఎవరికి ఏది కావాలో దానినే వాళ్ళు ఎంచుకుంటారు.

మనిషి ఒక్కడే. కాని, ఆ మనిషిలో కోరికలు అనేకము. ఆశలు అనేకము. ఒకరు ఆశించింది మరొకరు ఆశించాలి అనే నియమం లేదు. ఒకరి కోరిక మరొకరి కోరిక కానవసరం లేదు. ఎవరి కోరికలు వారివే. ఎవరి కష్టాలు వారివే.

ఆశించడం ఇచ్ఛాశక్తి. అలా ఆశించ డానికి కావలసిన విషయ జ్ఞానము కూడా మనిషికి ఉంది. ఉండబట్టే ఆశించాడు. అదే జ్ఞానశక్తి. జ్ఞానశక్తి ద్వారా ప్రేరేపించబడి, ఇచ్ఛాశక్తి ద్వారా దేనిని కోరుకుంటాడో, దానిని పొందడానికి కావలసిన శక్తి కూడా మనిషికి ఉంది. అదే క్రియాశక్తి. క్రియాశక్తి ఉండటం వల్లనే ఈ ప్రపంచంలో తాను సాధించాలి అనుకున్నవి కొన్నైనా మనిషి సాధించ గలుగుతున్నాడు.

అంటే, అన్నీ సాధించలేక పోతున్నాడు అని అర్థం. ఇది మన అనుభవంలో, అందరి అనుభవంలో తొంగి చూస్తున్న విషయమే. అలా సాధించలేక పోవడానికి ఏవో ప్రతిబంధకాలు ఉంటాయి. ఆ ప్రతిబంధకాలను అధిగమించే శక్తి మనకు ఉండదు. అందువల్లనే ఫలాలు అందకుండా పోతాయి.

ప్రగాఢంగా మనం ఆశించింది, ప్రతిబంధకాల కారణంగా విఫల మైనపుడు, ప్రతిబంధకాలను తొలగించుకొని ఫలితాలను పొంది తృప్తి చెందడానికి మన శక్తి సరిపో నపుడు, ఎక్కడ నుండి సహాయం అందుతుందో ఆ వైపుకు తిరుగుతాము. లోకంలో అందే సహాయాలు కూడా విఫల మైనపుడు, అలౌకికమైన సహాయం కొరకు ప్రయత్నం చేస్తాము. అది దైవ సహాయం కావచ్చు. లేదా, దేవతా సహాయం కావచ్చు. అలాంటి సహాయాన్ని పొందడానికి మనం చేసే కర్మలే ప్రార్థనలు. పూజలు. యాగాలు. యజ్ఞాలు.

ఏ కర్మకు ఏది ఫలం? ఏ యాగానికి ఏది ఫలం? ఇవన్నీ వేదాలలో నిక్షిప్తమై ఉన్నాయి. ఇదంతా కర్మకాండ. ఉపాసనా కాండ. ఇది వేదంలో ఒక భాగం. కర్మకాండకు సంబంధించిన విషయం.

రెండవది జ్ఞానకాండ. ఇది వేదాలలో చివరి భాగము. కనుకనే, దీనిని వేదాంతము అంటారు. ఇక్కడ బోధింప బడేది జ్ఞానము. లౌకిక జ్ఞానము కాదు. బ్రహ్మజ్ఞానము. ఈ జ్ఞానమును బోధించే కాండ జ్ఞానకాండ. అవే ఉపనిషత్తులు. **ఉపనిషదితి బ్రహ్మ విద్యా**. ఉపనిషత్తు అంటేనే బ్రహ్మవిద్య అని అర్థము.

వేదములో ఉత్తరార్థంగా గోచరించే వేదాంతము అనే ఈ జ్ఞానకాండ కోరికల్ని తీర్చే ప్రయత్నంలో ఉండదు. కోరేవాణ్ణి గూర్చి చర్చించే విషయంలో ప్రమాణమై ఉంటుంది. కర్మలు, క్రియలు, ఫలాలను ప్రక్కనబెట్టి సూటిగా కర్తను గూర్చి చర్చిస్తుంది.

జ్ఞానకాండ కోరికలను ఎందుకు తీర్చదు? ఆ ప్రయత్నం ఎందుకు చేయదు? తనకు ఆ శక్తి లేదా? వేదం లోని కర్మకాండ కన్నా శక్తివంత మైనది వేదాంతము. కోరికలను తీర్చే శక్తి ఉందా, లేదా? అనేది అప్రధాన మైన విషయం. కోరికలు తీరినా, తీరక పోయినా, ఒరిగేది ఏమీ ఉండదు అనేదే వేదాంతానికి ప్రధానమైన విషయం. అందుకనే,

**స్వప్నస్థ రాజ్యభిక్షాభ్యాం ప్రబుద్ధః స్పృశతే ఖలు!**

కలలో రాజు అయిన వానికి మేలుకుంటే సింహాసనం ఉంటుందా? స్వప్నంలో భిక్షాటనం చేసిన యాచకునికి

మేలుకుంటే అక్షయపాత్ర ఉంటుందా? అని సూటిగా ప్రశ్నించి కోరికల వల్ల కలిగే సుఖదుఃఖాలు స్వప్నతుల్యాలు అని స్పష్టం చేసింది ఉపనిషత్తు. అందుచేత కోరికల జోలికి ఉపనిషత్తు పోదు.

ఈ సందర్భంలో కర్మకు, జ్ఞానానికి ఉన్న తేడా అస్పష్టంగా ఉండ కూడదు. అస్పష్ట అవగాహనలు గీతను అర్థం చేసుకోవడానికి సరిపోవు. కోరికలు తీర్చే పనిలో కర్మకాండ ఉంటుంది. కోరేవాణ్ణే పట్టించుకొని వేదాంతం చర్చిస్తుంది.

ఇప్పటి వరకు ఎన్నో కోరుకున్నాం. కోరినవి కొన్ని సాధించుకున్నాం. అయినా, సాధించుకో లేనివి చాలా మిగిలి ఉన్నాయి. ఎన్ని తీరినా, తృప్తి తీరని వ్యక్తి గానే మనిషి మిగిలి పోతున్నాడు. వ్యక్తి ఎంత తెలివి గల వాడైనా ఈ వెలితి నుండి తప్పించుకోలేక పోతున్నాడు. వెలితిని తొలగించి, వెలుగును ప్రసాదించే జ్ఞానం ఒక్క ఉపనిషత్తు ల్లోనే ఉంది.

వేదాలు కర్మకాండకు పరిమితమై ఉంటాయి. వాటిలోని జ్ఞానము సంసారానికి సంబంధించిన జ్ఞానము *(త్రైగుణ్య విషయాః).* ఈ సంసార హేతువులైన త్రైగుణ్య విషయాల నుండి విడిపడి కోరికలను దాటిన వాడవు కా! *(నిస్త్రైగుణ్యో భవ!)* అని బోధిస్తున్నాడు గీతాచార్యుడు.

**ముల్లోకాలు ఈ మూడే**

కర్మకాండను బోధించే వేదాలు త్రైగుణ్య విషయాలు. వివేక జ్ఞానము లోపించి, భోగైశ్వర్యాలే ప్రధాన మనుకొని జీవించే వారికి వేదము అంటే త్రైగుణ్య విషయమే అని అభిప్రాయం. త్రిగుణాలకు సంబంధించిన విషయాలు త్రైగుణ్యాలు.

సత్త్వగుణము, రజోగుణము, తమోగుణము - ఈ మూడు గుణాలను త్రిగుణములు అంటారు. సత్త్వగుణము సుగుణము. రజోగుణము అవగుణము. తమోగుణము దుర్గుణము. సత్త్వగుణము సహకరిస్తుంది. రజోగుణము వికటిస్తుంది. తమోగుణము పాడు చేస్తుంది. సత్త్వగుణములో జ్ఞానము, ప్రశాంతత ఉంటాయి. రజోగుణములో రాగద్వేషాలు, ఈర్ష్యాసూయలు, ఆవేశాలు, ఆందోళనలు ఉంటాయి. తమోగుణములో సోమరితనము, నిద్ర, దుఃఖాదులు ఉంటాయి.

ఈ ప్రపంచ మంతా మాయామయము. మాయలో ఈ త్రిగుణాలే ఉంటాయి. మాయకు స్వతంత్ర మనుగడ లేదు. మాయ బ్రహ్మమును ఆశ్రయించుకొని ఉంటుంది *(బ్రహ్మాశ్రయా సత్త్వరజస్తమో గుణాత్మికా మాయా అస్తి).* ప్రపంచమే మాయా నిర్మితము కనుక మాయలో ఉన్న త్రిగుణాలే ప్రపంచంలో కనిపిస్తాయి.

సర్వలోకాలు సృష్టి లోనివే. మాయా స్వరూపాలే. ప్రపంచమే త్రిగుణ మిళితం. భోగైశ్వర్యాలు, వాటిని పొందడానికి ఆచరించే సాధనలు ఈ త్రిగుణాల యొక్క కార్యాలే. కారణమైన మాయలో ఉన్న త్రిగుణాలే కార్యమైన జగత్తులో ఉన్నాయి. పరలోకం కూడా సృష్టి లోనిదే. కనుక, స్వర్గలోక భోగాలు, వాటిని పొందడానికి ఆచరించే సాధనలు కూడా త్రిగుణముల లోనివే.

త్రైగుణ్యమే సంసారము. సంసారానికి సంబంధించిన విషయాలను బోధించేవి త్రైగుణ్య విషయాలు *(త్రైగుణ్యం సంసారః విషయః ప్రకాశయితవ్యః యేషాం తే వేదాః త్రైగుణ్య విషయాః).*

**సాధ్య సాధనములు**

త్రిగుణముల కారణంగా రాగద్వేషాలు అనే కార్యాలు ఏర్పడ్డాయి. ఈ రాగద్వేషాలకు సంబంధించిన విషయాలనే వేదాలు బోధిస్తాయి. ఎవరు ఏ ఫలమును ఆశిస్తారో, వారికి తత్సంబంధ మైన సాధనల్ని తెలుపుతాయి. కొన్ని విషయాలలో ఫలితాలు కనిపిస్తాయి. కొన్ని విషయాలలో అగోచరంగా ఉంటాయి. కొన్నిటిని





పరిశీలించుకొనే అవకాశం ఉంటుంది. కొన్నిటిని విశ్వసించాలే గాని పరీక్షించి చూసుకొనే అవకాశం ఉండదు.

సంతానం లేని వారు సంతానం కలగ డానికి యాగం చేస్తారు. వర్ష పాతానికి యజ్ఞాలు నిర్వహిస్తారు. వీటికి ఫలితాలు ఉన్నాయా, లేదా అనేది పరీక్షించి చూసుకోవచ్చు. కాని, స్వర్గప్రాప్తి కోసం యజ్ఞం చేస్తే, దానిని ఎలా నిర్ధారణ చేసుకోవాలి? విశ్వసించాలి. అంతే.

ఏది ఏమైనప్పటికి వేద ప్రతిపాదితమైన కర్మల వలన కలిగే ఫలితాలు ఏవైనా అనిత్యాలే. నశించేవే. సంతానం కలిగినా నశించి పోవలసిందే. స్వర్గం ప్రాప్తించినా పుణ్యం క్షీణించ గానే పోగొట్టుకో వలసిందే.

త్రైగుణ్య విషయాలు సంసారము అని ఎప్పుడైతే చెప్పబడిందో, ఇక వేదము లోని కర్మకాండను ఆశ్రయించి మనం సాధించ బోయేది సంసారాన్నే కాని మరొక దానిని కాదు. సంసారానికే యజ్ఞ యాగాదులైతే, ఇక శ్రమించి వాటిని ఆచరించడ మెందుకు? సంసారాన్ని పొంది మనం ఏమి సాధించాలి? ఇప్పుడు మనం ఎక్కడున్నాం? సంసారంలో కాదా? మనం ముడిపడి ఉన్నది మూడు గుణాల్లో కాదా! చిక్కుముళ్ళు అన్నీ మూడు ముళ్ళే కదా! పీటముళ్ళు ఆ మూడే కదా!

పల్లవి : **వృథా చేయబోకు - ఈ జన్మము సదా రాదు నీకు ॥ వృథా ॥**

చరణములు : **ఉత్తమ జన్మమురా దీనిని వ్యర్థము చేయకురా**
**ఉత్త సంసారమురా రేపది మృత్యురూప మౌరా ॥ వృథా ॥**

**మూడు గుణంబులలో నీవు ముక్తుడ గారాదా!**
**పాడు ఘటము కాదా, రేపది భస్మమై పోదా! ॥ వృథా ॥**

అంటూ మూడుగుణాల సంసారం నుండి విడిపడి పొమ్మని సందేశాన్నిస్తూ చైతన్య గానం తత్త్వ గానాలాపన చేసింది. అందుకనే పరమేశ్వరుడు అర్జునా! గుణాల నుండి తప్పుకో! *(నిస్త్రైగుణ్యో భవ!)* అని ఆదేశిస్తున్నాడు.

**ముడులు విడిపోనీ**

గుణాలే సంసారం కనుక, సంసార దుఃఖం నుండి విడిపడాలి అంటే, సంసారాన్ని ప్రభావితం చేసే గుణాల నుండి బయట పడాలి. అందుకే, నిస్త్రైగుణ్యుడవు కా! అంటున్నాడు *(నిస్త్రైగుణ్యో భవ!).*

గుణాల నుండి విడిపడ గలమా? విడిపడి ఉండ గలమా? అసలు మానవ శరీరమే గుణ సముదాయం కదా! త్రిగుణాలు పోతే, త్రిగుణాల కార్యమైన శరీరం మిగుల్తుందా? కనుక, నిస్త్రైగుణ్యుడు అంటే, కోరికలు లేనివాడు అని అర్థం *(నిష్కామః భవ ఇత్యర్థః).* నిష్కాముడు అంటే అనిత్యమైన భోగైశ్వర్యముల మీద ఆసక్తి లేనివాడు. మమకారాన్ని పూర్తిగా త్యజించిన వాడు.

**రెండు తరువాతే మూడు**

కోరికల్ని జయించి కామనా రహితుడైన వాడే నిస్త్రైగుణ్యు డవుతాడు అని తెలుసుకున్నాం. కోరికల్ని జయించాలంటే ముందు ద్వంద్వాల నుండి విడిపడాలి. రెండిటి నుండి విడి పడితేనే మూడిటి నుండి విడి పడతాడు. రెండు తరువాతే కదా మూడు. కనుక ముందు ద్వంద్వముల నుండి విడిపడాలి *(నిర్ద్వంద్వో భవ!).*

సుఖదుఃఖాలకు కారణమైన పరస్పర వైరుధ్యము గల శీతోష్ణాదులు ద్వంద్వములు అని చెప్పబడ్డాయి. ద్వంద్వాలు ఉన్నంత వరకు కోరికలు తప్పవు. ద్వంద్వాలు అనే కారణాలకు కామనలు కార్యాలు. కామనలు ఉంటే త్రిగుణాలు ఉన్నట్లే. త్రిగుణాలు ఉన్నంత వరకు సంసారం తప్పదు. సంసారం ఉన్నంత వరకు దుఃఖం అనివార్యంగా ఉంటుంది. కనుక ద్వంద్వాలను దాటి పోవాలి.

ద్వంద్వాలను దాటి పోయేది ఎలా? వాటి ప్రభావం బుద్ధిపై పడకుండా ఉంటే వాటిని దాటి పోయినట్లే. శీతోష్ణాలు, మానావమానాలు, జయాపజయాలు - ఇవన్నీ ద్వంద్వాలే. ఈ ద్వంద్వాల మధ్యే అందాలు పాడై పోతున్నాయి. ఆనందాలు అదృశ్య మవుతున్నాయి.

కర్మకాండను అంటిపెట్టుకొని, భోగైశ్వర్యాలకై అర్రులు చాస్తూ, సంసార వలయంలో చిక్కుకు పోయిన భోగవాదుల్ని గూర్చి గడచిన మూడు శ్లోకాలలో చెప్పుకున్నాం. వారిని కామాత్ములని తెలుసుకున్నాం **(కామాత్మానః)**.

ప్రస్తుతం భగవానుడు చెబుతున్నది వారికి విరుద్ధమైన జీవన విధానము. కర్మకాండను ఆశ్రయించుకొని కామాత్మలైన వారిది భోగజీవితం. జ్ఞానకాండను ఆశ్రయించుకొని నిష్కాములైన వారిది త్యాగ జీవితం.

కామాత్ముల మనస్సులలో కామం ఉంటుంది. నిష్కాముల హృదయాలలో కామం ఉండదు. ఆత్మస్పృహ ఉంటుంది.

**ఆశ నిరాశల ఊయలలో**
**ఊగింది మనసు ఉసూరు మంటూ**
**ఆశే లేని జీవికి**
**ఉండదు నిరాశ ఎన్నటికి**
**ఆశ ఉంటే ఉండనీ**
**శివుడే ఆశలో నిండనీ**
**రామ రామ జయ రాజారామ్**
**రామ రామ జయ సీతారామ్**

అని రామజోగి చిట్కా.

ద్వంద్వాల నుండి విడిపడిన వారికే ఆశ అడుగంటుతుంది. నిష్కామ్యం వరిస్తుంది. ద్వంద్వాలను ఎలా దూరం చేసుకోవాలి? చెబుతున్నాడు. అర్జునా! నిత్యసత్త్వస్థుడవు కా! అప్పుడే ద్వంద్వాలను దాటి పోగలవు ***(నిత్య సత్త్వస్థో భవ!)***.

**పార్థా! ప్రశాంతంగా ఉండు!**

నిత్య సత్త్వస్థుడు అంటే, నిత్యము సత్త్వ గుణాన్ని ఆశ్రయించిన వాడు అని అర్థము. అంటే, రజోగుణ, తమోగుణాలకు లొంగని అంతఃకరణము కలవాడు. సత్త్వగుణ ప్రధానంగా ఉండేవాడు ప్రశాంతంగా ఉంటాడు. ప్రసన్నంగా ఉంటాడు. ప్రియంగా ఉంటాడు. వివేకంతో ఉంటాడు. అతనిలో రజోగుణ ప్రేరితాలైన రాగము, రోషము, ఆవేశములు అణగారి ఉంటాయి. అలాగే, తమోగుణ ప్రేరితాలైన నిద్ర, అలసత, నైరాశ్యము, శోకములు అదృశ్యమై ఉంటాయి.

***స్మృతియు సంప్రీతియును బ్రసన్నతయు నీ దృశ్యములగు సత్త్వగుణోదితములు***
***రాగలోభ రోషాదులు రాజసములు దర్పశోక ప్రముఖములు తామసములు***

అని గుణ విశేషాలను వివరించింది ఆంధ్ర మహాభారతము (తిక్కన సోమయాజి).

శ్రీమద్రామాయణంలో విభీషణుడు సత్త్వగుణానికి ప్రతీక మైతే, రావణుడు రజోగుణానికి, కుంభకర్ణుడు తమోగుణానికి ప్రతీకంగా ఉంటారు. ముగ్గురూ సోదరులే. అలాగే త్రిగుణములు కూడా మాయాదేవి బిడ్డలే.





సత్త్వము అంటే బ్రహ్మ స్వరూపము అని కూడా అర్థము. నిత్య సత్త్వస్థుడు అంటే, సదా బ్రహ్మము నందే నిలకడగా ఉండువాడు అని అర్థము. ప్రశాంత జీవనమును గడిపేవాడు, బ్రహ్మభావన యందే స్థిరంగా నిలిచిన ధన్యాత్ముడు తన జీవనయాత్రను కూడా బ్రహ్మదృష్టి తోనే కొనసాగిస్తాడు. లేనిది కావాలి అనుకోడు. ఉన్నది పోయినా కలత చెందడు.

**యోగక్షేమాలు**

యోగక్షేమాలను మరచి మనుగడను సాగించ మంటున్నాడు. నిర్యోగక్షేముడుగా జీవించ మంటున్నాడు ***(నిర్యోగ క్షేమః)***. లేని దానిని పొందడం యోగము ***(అనుపాత్తస్య ఉపాదానం యోగః)***. పొందిన దానిని రక్షించుకోవడం క్షేమం ***(ఉపాత్తస్య రక్షణం క్షేమః)***.

ఈ రెండే ప్రతి మనిషిని కుదిపేస్తూ ఉంటాయి. మనం ఆశించినవి కొన్ని లభించకుండా ఉంటాయి. ఒకవేళ లభించినా, నిలవకుండా పోతాయి. అలా పోతూనే ఉంటాయి. ఆశించింది రాకపోయినా దుఃఖమే. శ్రమించి సాధించుకున్న దానిని పోగొట్టుకున్నా శోకమే.

మొక్కను నాటడం యోగం, రక్షించుకోవడం క్షేమం. ఇల్లు కట్టుకోవడం యోగం. అది పాడు కాకుండా కాపాడుకోవడం క్షేమం. స్కూటర్ కొనడం యోగం. అది మూల పడకుండా చూసుకోవడం క్షేమం.

ఇక్కడ మరొక ముఖ్య విషయాన్ని గ్రహించాలి. యోగం విషయంలో ప్రాప్తం రెండు విధాలుగా ఉంటుంది. (1) మనము ఆశించకుండా ప్రాప్తించేవి. (2) మనం ప్రయత్నించి సాధించేవి. ఈ రెండూ యోగం క్రిందికే వస్తాయి.

మనం ఆశించకుండా ప్రాప్తించే యోగము అంటే, నా ఉద్దేశ్యం మనం అడగకుండానే పరమేశ్వరుడు ప్రసాదించినవి అని. మనకు దేహం ఉంది. మనం కోరితే వచ్చింది కాదు. ఆయన అనుగ్రహిస్తేనే వచ్చింది. అది మనకు నచ్చిందా నచ్చలేదా అనేది వేరే విషయం.

తల్లిదండ్రుల్ని మనం ఎన్నుకోలేదు. పుట్టిన తేదీని నిర్ణయించింది మనం కాదు. జన్మకాలం మనం సూచించింది కాదు. అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళు, పుట్టిన ప్రదేశము - ఇవన్నీ ఈశ్వరుడు నిర్ణయించిన విధంగానే మనకు ప్రాప్తించాయి. ఇదంతా యోగమే. అందుకనే, ఆశించని, ఊహించని ఆశ్చర్యాలు జరిగి నపుడు, 'ఆయన యోగం అలా ఉందండి' అంటూ ఉంటారు.

ఇక రెండవ యోగము మన ప్రయత్నంతో, కృషితో సాధించేది. అది మనం కట్టిన ఇల్లే కావచ్చు, తాళి కట్టిన ఇల్లాలే కావచ్చు, కన్నబిడ్డలే కావచ్చు, కొన్న కాంచనమే కావచ్చు. తినే కంచమే కావచ్చు. ఇవన్నీ కూడా పూర్వం లేకుండా ఉండి, ఆ తరువాత మన ప్రయత్నంతో పొందినవి కనుక యోగము క్రిందికే వస్తాయి.

యోగమైతే ఇలా రెండు విధాలుగా ప్రాప్తిస్తూ ఉంది కాని, క్షేమం మాత్రం రెండిటికి ఒక్కటే. పరమేశ్వరుడు ప్రసాదించిన యోగాలైనా, మనం కృషితో సాధించిన యోగాలైనా - రెండిటిని రక్షించుకోవడం మాత్రం చేస్తూనే ఉంటాం. కాని, విచిత్ర మేమిటంటే, రెండు యోగాలూ నిలవవు. రెండిటినీ కాపాడుకో లేము. రెండిటినీ పోగొట్టుకోవలసిందే. కాకపోతే, ఏది ముందో, ఏది వెనకో తెలియదు. పోతాయని మాత్రం ఖచ్చితంగా తెలుసు. పరమేశ్వరుడు ఇచ్చిన ఒళ్ళు నిలవదు. మనం కట్టుకున్న ఇల్లూ నిలవదు. ఒళ్ళు కాలి బూడిదై పోతుంది. ఇల్లు కూలి నేల పాలవుతుంది. ఇంకెక్కడి సంబంధాలు? ఎవరి కున్నాయి అనుబంధాలు?

**న మే దేహో న సంబంధో మేఘేనేవ విహాయసః**

మేఘంలో ఆకాశానికి సంబంధం ఉందా? నాకు మాత్రం దేహంతో ఎక్కడుంది సంబంధం? అని సూటిగా ప్రశ్నించాడు ఋషి కుండికోపనిషత్తులో.

ఉన్నవి నిలవవు కనుక వాటి క్షేమాలు చూడ నవసరం లేదంటారా? అలా ఎందుకంటాము? కాపాడుకొనే ప్రయత్నం చక్కగా చేయాలి. చెయ్యి జారిపోతే మాత్రం, విలక్షణంగా ఉండటం మన స్వభావం కావాలి అంటున్నాడు భగవానుడు. అంతే.

అన్నీ పోయేవే. ప్రతి దానికి వచ్చే కాలం ఉంది. అలాగే పోయే కాలం ఉంది. పోయే క్షణాన ఎవ్వరూ దేనినీ ఆపలేరు. ఇలా ఆలోచించి నపుడు యోగక్షేమాలు లాభాలా, నష్టాలా? రెండూ కావు. ఎందుకని? వచ్చేవి పోతాయి అని తెలిసి నపుడు వచ్చేవి లాభాలూ కావు, పోయేవి నష్టాలూ కావు.

ఈ లోకంలో దైవానుగ్రహంగా మనకు ప్రాప్తించినవి, మన ప్రయత్నంతో మనం సాధించినవి రెండూ మిగలవు. అంతేకాదు, ఒకవేళ స్వర్గం ప్రాప్తించినా, అది కూడా పోయేదే. అందుచేతనే, పుణ్యాన్ని, ధర్మాన్ని, స్వర్గాన్ని గూర్చి చర్చించిన ధర్మశాస్త్రాలు కూడా వాటిని లాభాలుగా పరిగణించ లేదు. ఆత్మజ్ఞానాన్నే అక్షయ లాభంగా కీర్తించాయి.

**ఆత్మలాభా న్న పరం విద్యతే**

ఆత్మలాభానికి మించి పొంద దగిన లాభ మంటూ లేదు అని ఆపస్తంభ ధర్మ సూత్రము సుస్పష్టం చేసింది.

**అర్జునా! అప్రమత్తంగా ఉండు!**

ఇక్కడ **ఆత్మవాన్** అంటే సదా ఆత్మ చింతనమే కలవాడు అని అర్థం. బ్రహ్మాకార వృత్తిని అఖండంగా సాగించేవాడు అని అర్థం. ఏ విధంగా నైనా బుద్ధిలో ఆత్మజ్ఞానమే ఉండాలి గాని, అనాత్మకు సంబంధించిన జ్ఞానము ఉండ కూడదు.

శ్రీ శంకరాచార్యస్వామి **ఆత్మవాన్** అంటే అప్రమత్తుడు అనే అర్థం చెప్పారు ( *అప్రమత్తశ్చ భవ* ). ఏమరుపాటు లేకుండా ఉండమని ఆదేశించారు. అంటే, దేహేంద్రియ మనోబుద్ధులను స్వాధీనంలో ఉంచుకో మని సూచించారు.

ఎంత విన్నా, ఎంత చదివినా, ఆచరణలో లేని విద్య సత్ఫలితా న్నివ్వదు. **సాధనా భావే సాధ్యాభావః.** సాధనము లేకుండా సాధ్యము లభించదు. అంటే, దేహేంద్రియ మనోప్రాణాలు అనాత్మ. వాటి యందు ఆత్మబుద్ధిని ఉంచకుండా అప్రమత్తుడవై ఉండు అని భావము. ఏవి ఉన్నా నష్టం లేదు. అవి 'మనము' అనుకుంటే మాత్రం లాభం లేదు.

***ఆత్మవాన్ భవ!*** అర్జునా! ఆత్మవంతుడవు కా! అని ఈ శ్లోకంలో భగవంతుని చివరి మాట. అర్జునా! ధనవంతుడవు కా! బలవంతుడవు కా! గుణవంతుడవు కా! అని చెప్పకుండా ఆత్మవంతుడవు కా! అని ఉపదేశించాడు వాసుదేవ పరబ్రహ్మ.

ధనం దగా చేసేదే. బలం బలహీన మయ్యేదే. గుణాలు చంచలములే. ఆత్మజ్ఞానమే స్థిరం. ధృవం. ఆనందప్రదం. అనంతానంద స్వరూపం.

*మరి, గీతాచార్యుడు చెప్పినట్లు ఇహపర సాధన సాధ్యాలను విస్మరిస్తే, తద్వారా లభించే సుఖాలు బ్రహ్మవిదునికి దూరమైనట్లే కదా! అని కొందరు సందేహిస్తూ ఉంటారు. అలాంటి దేమీ లేదు. బ్రహ్మవిదునికి*





*దూరంగా ఏ సుఖమూ లేదు.* **సర్వం పదం హస్తి పదే నిమగ్నమ్.** *కుంజర పాదంలో సర్వ జంతువుల పాదములు ఇమిడి ఉన్నట్లు, బ్రహ్మానందములో సమస్త సుఖాలు ఇమిడి ఉన్నాయి అని తరువాత శ్లోకంలో బోధిస్తున్నాడు.*

యావానర్థ ఉదపానే సర్వతః సంప్లుతోదకే ।
తావా న్సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః ॥ 46

**యావాన్-అర్థః-ఉదపానే-సర్వతః-సంప్లుతోదకే**
**తావాన్-సర్వేషు-వేదేషు-బ్రాహ్మణస్య-విజానతః**

| | | | |
|---|---|---|---|
| సర్వతః | = అంతటను | విజానతః | = పరమార్థ జ్ఞానము గల |
| సంప్లుతోదకే | = నిండిన జలప్రవాహము ఉండగా | బ్రాహ్మణస్య | = బ్రాహ్మణునకు |
| ఉదపానే | = నీరు లభించే బావి మొదలైన వానిలో | సర్వేషు | = సమస్తమైన |
| యావాన్ | = ఎంతగా | వేదేషు | = వేదములలో |
| అర్థః | = ప్రయోజనం ఉండునో | తావాన్ | = అంత ప్రయోజనము |

**బావులు, చెరువుల యందు మనకు ఎంత ప్రయోజనం సిద్ధిస్తుందో, అంతటా పొంగి పొరలుతున్న జలాశయంలో అంతే ప్రయోజనం సిద్ధిస్తుంది. అలాగే, వేదోక్త కర్మల వల్ల ఏ ఫలం సిద్ధిస్తుందో, పరమార్థం తెలిసిన సన్యాసికి అదే ఫలం సంపన్న మవుతుంది.**

వ్యాఖ్య

**అంతే ప్రయోజనం**

వేదాల లోని కర్మకాండ ప్రతిపాదించే సకామ కర్మలను విడిచి పెట్టిన బ్రహ్మవిదునికి, ఆయా కర్మల వల్ల ఏర్పడే ఫలితాలు దూరం కావడం లేదా? ఆ ఫలితాలను బ్రహ్మజ్ఞాని పోగొట్టుకోవడం లేదా? అనే సంశయాన్ని నివారిస్తూ, సర్వత్ర వరద నీరు పొంగి ప్రవహించే టప్పుడు, బావులు, చెరువులు, నదులు మొదలగు వాటి వల్ల ఎంత ప్రయోజనం ఉంటుందో, సర్వము తానైన బ్రహ్మజ్ఞానికి త్రైగుణ్య విషయాలైన యజ్ఞ యాగ వ్రత తపో దానాదుల వల్ల అంతే ప్రయోజనం ఉంటుంది అని చెబుతున్నాడు.

**ఉదపానే** - 'ఉద' అంటే ఉదకము. ఉదకమును అనగా జలమును పానం చేస్తారు ( *పిబన్తి* ) కనుక, జలము ఉండే స్థానానికి ఉదపానము అని పేరు. నీరు ఉండే ప్రదేశాలు ఈ భూమిపై చాలా ఉన్నాయి. వాపీ, కూప, తటాక, నదీనదాలలో నీరు ఉంటుంది. ఆ నీరు మానవాళికి ఉపయోగ పడుతూ ఉంటుంది.

దిగుడు బావుల లోని నీరు **(వాపి)** పొలాలలో సేద్యానికి ఉపయోగ పడుతుంది. చేద బావుల లోని నీరు **( కూప )** పానం చేయడానికి పనికొస్తుంది. చెరువు నీరు ( *తటాక* ) స్నానం చేసేందుకు ఉపకరిస్తుంది. పారే జలము (నదీనదాలు) బట్టలు ఉతక డానికి ఉపయోగ పడుతుంది. వీటిలో ఒక్కొక్క దాని వల్ల ఒక్కొక్క ప్రయోజనం ఉంటుంది. కాని, సర్వత్ర వరద జలము ప్రవహించే టప్పుడు వీటి అవసరం ఉంటుందా? వాపీ కూప తటాక నదీ నదాల వల్ల కలిగే ప్రత్యేక ప్రయోజనా లన్నీ ఆ మహాజలాశయంలో కలుగుతూ ఉన్నాయి కదా! అలా, ఆ మహా జలాశయము సర్వత్ర వ్యాపించి నపుడు ఈ బావులు, చెరువులు, నదులు, మొదలైన వన్నీ ఆ జలాశయంలో అంతర్భూతాలై పోయాయి కదా! ( *తత్ర అంతర్భవతి* ).

అలాగే, త్రైగుణ్య విషయాలను బోధించే వేదాల వల్ల బ్రహ్మజ్ఞానికి అలాంటి ఫలమే ఉంటుంది. యాగాలు,

యోగాలు, యజ్ఞాలు, వ్రతాలు, తపస్సులు, దానాలు మొదలైన వన్నీ వేదాల లోని కర్మకాండలో ఉన్నాయి. ఆయా సాధనలు ఆచరిస్తే లభ్యమయ్యే ఫలితాలు కూడా అక్కడే చెప్పబడ్డాయి. బ్రహ్మవిదుడు ఈ వేదోక్త కర్మముల నన్నిటినీ త్యజిస్తున్నాడు. అలాగని, వాటి వల్ల కలిగే ప్రయోజనాలను పోగొట్టుకున్న వాడు కావడం లేదు.

ఎలాగైతే, వాపీ కూప తటాకాదుల వల్ల కలిగే ప్రయోజనా లన్నీ మహా జలాశయం వల్ల కలుగుతూ ఉన్నాయో, అలాగే బ్రహ్మవిదుని యందు వేదోక్త కర్మల వల్ల ఏర్పడే ప్రయోజనా లన్నీ సిద్ధించే ఉన్నాయి. **శతే పంచాశత్.** 'నూటిలో యాభై ఉండనే ఉంది' అనే న్యాయము చందమున బ్రహ్మజ్ఞానములో సర్వ వేదోక్త కర్మల ఫలము ఇమిడి ఉంది అని అర్థము.

వేదోక్త కర్మఫలాలు అందించే సుఖాలు నైమిత్తిక సుఖాలు. అంటే, ఒక కారణం వల్ల లభించేవి. నిమిత్తము ఉండటం వల్లనే ప్రాప్తించేవి. నిమిత్తం ఉండటం వల్ల ప్రాప్తించిన నైమిత్తిక సుఖాలు, నిమిత్తం పోగానే లేకుండా పోతాయి. స్వర్గమే తీసుకుందాం. పుణ్యం నిమిత్తంగా స్వర్గం అనే సుఖం లభిస్తుంది. పుణ్యం క్షీణించ గానే స్వర్గం దూర మవుతుంది. వేద ప్రతిపాదిత కర్మల వల్ల కలిగే సుఖాలన్నీ ఈ విధమైన నైమిత్తిక సుఖాలై ఉంటాయి.

బ్రహ్మజ్ఞాని లోని ఆనందము సహజ మైనది. మరొక కారణం వల్ల ప్రాప్తించింది కాదు. అది నిత్యసుఖమే కాని నైమిత్తిక సుఖం కాదు. ఈ నైమిత్తిక సుఖాల వల్ల ప్రాప్తించే ఆనందము కూడా వాస్తవానికి బ్రహ్మానందములో ఒక లేశమే నని ఉపనిషత్తు ఉద్ఘోషించింది ***( ఏతస్య ఏవ ఆనందస్య అన్యాని భూతాని మాత్రా ముపజీవన్తి ).***

**అంతా ప్రయోజనమే**

బావి నీటి వల్ల కొంత ప్రయోజనము. చెరువు నీటి వల్ల కొంత ప్రయోజనము. నదీ జలము వల్ల కొంత ప్రయోజనము. మహా జలాశయము వల్ల అంతా ప్రయోజనమే.

వేదాల లోని సకామ కర్మల వల్ల కలిగే ప్రయోజనాలు సాధన సాధ్యాలను బట్టి భిన్నంగా ఉంటాయి. ఏ కర్మకు ఆ ఫలమే ప్రాప్తం. ఏది చేసుకుంటే అదే ఫలం. ఎంత చేసుకుంటే అంతే ఫలం. కాని, బ్రహ్మజ్ఞానము వల్ల కలిగే ఫలం అనంతఫలం. అంతా ఫలమే.

అంతం కలిగిన కర్మల ఫలితాలను ఆశించే మానవుల ప్రవృత్తిని బట్టి చూచినా, పెద్ద ప్రయోజనం లభించే టప్పుడు, చిన్న ప్రయోజనాన్ని త్యజించడం మనం చూస్తూ ఉంటాం.

పెద్ద ఉద్యోగం లభిస్తే వ్యక్తి చిన్న ఉద్యోగాన్ని త్యజిస్తాడు. మధ్యమ ఫలాల కోసం అధమ ఫలాలను, ఉత్తమ ఫలాల కోసం మధ్యమ ఫలాలను మానవులు విడిచి పెడుతూ ఉండటం సర్వ సామాన్యమైన విషయం.

**న తే (జ్ఞానినః) కర్మ ప్రశంసన్తి కూపం నద్యాం పిబన్నివ**

నదిలో పుష్కలంగా నీరు లభించే టప్పుడు మనిషి బావికి ప్రాధాన్యత నివ్వనట్లు, బ్రహ్మజ్ఞాని సకామ కర్మలకు ప్రాధాన్యత నివ్వడు అని మహాభారతంలో వ్యాసోక్తి.

బావులలో, నదులలో, చెరువులలో నీరు పెరుగుతూ ఉంటుంది. తరుగుతూ ఉంటుంది. సముద్రజలం పెరగదు. అలాగే తరగదు. సకామ కర్మల వల్ల ఏర్పడే సుఖాలలో వృద్ధిక్షయాలు ఉంటాయి. బ్రహ్మజ్ఞానం పూర్ణరూపమైంది. బ్రహ్మజ్ఞాని పూర్ణపురుషుడు. అతడి ఆనందాన్ని పెంచేవారు లేరు, తగ్గించేవారూ లేరు.

*మరి, అలాంటప్పుడు, బ్రహ్మజ్ఞానం కొరకే ప్రయత్నం చేస్తే సరిపోతుంది కదా! కర్మలు చేయడ మెందుకు? అని అర్జునుడు ప్రశ్నించకుండా, కర్మయోగ ప్రాశస్త్యాన్ని ప్రముఖంగా తరువాత శ్లోకంలో వివరిస్తున్నాడు.*





*అర్జునుడికి వేదం తెలుసు. వేదం లోని కర్మకాండ అంతా తెలుసు. కాని, కర్మను కర్మయోగంగా ఎలా మార్చుకోవాలో తెలుసుకో వలసిన సమయం ఆసన్నమైంది. అర్జునుడి అదృష్టం కొద్ది అందించేవాడు అచ్యుతు డయ్యాడు.*

కర్మ ణ్యే వాధికార స్తే మా ఫలేషు కదాచన ।
మా కర్మఫలహేతు ర్భూ ర్మా తే సఙ్గోఽ స్త్వకర్మణి ॥ 47

కర్మణి-ఏవ-అధికారః-తే-మా-ఫలేషు-కదాచన
మా-కర్మఫలహేతుః-భూః-మా-తే-సంగః-అస్తు-అకర్మణి

| | | | |
|---|---|---|---|
| తే | = నీకు | తే | = నీకు |
| కర్మణి ఏవ | = కర్మము నందే | కర్మఫలహేతుః | = కర్మఫలమునకు కారణమైన వాడవు |
| అధికారః | = అధికారము | మా భూః | = కావద్దు |
| ఫలేషు | = ఫలము నందు | అకర్మణి | = కర్మ చేయక పోవుట యందు |
| కదాచన | = ఒకప్పుడును | సంగః | = ఆసక్తి |
| మా | = లేదు | మా అస్తు | = ఉండ కూడదు |

**అర్జునా! కర్మల యందే నీకు అధికారం. ఫలాల విషయంలో ఎప్పుడూ అధికారం లేకుండా ఉండు. కర్మ ఫలాలకు నువ్వు కారణం కావద్దు. అలాగని కర్మలను మానేయాలని చూడకు.**

వ్యాఖ్య

సుందరంగా, సుశోభితంగా, సముజ్జ్వలంగా భాసించే పరమేశ్వరుని సృష్టిలో ఒక కాలంలో, ఒక ప్రదేశంలో మనం జన్మించాము. జన్మించడం మన అధీనంలో లేదు. కాని, జీవించడం మన చేతి లోనే ఉంది.

పరిస్థితుల్ని మనం శాసించ లేము. ప్రవర్తనను మనం సరిదిద్దుకో గలం. బాహ్యాన్ని మార్చడం మనకు సాధ్యం కాదు. బాహ్యంలో ఏది ఎందుకు జరుగుతూ ఉందో, వాటికి సంబంధించిన పూర్ణజ్ఞానం మనకు లేదు. జ్ఞానం లేనపుడు ఏం మార్చగలం? కాకపోతే, మనకు దృఢ నిశ్చయ మంటూ ఉంటే, అంతర్యాన్ని మార్చుకొని ఆనందంగా జీవించగలం. బుద్ధిని సరి చేసుకొని బ్రతుకును భవ్యంగా తీర్చుకోగలం.

జీవితంలో అన్నీ అనుకూలంగా ఉండవు. నేడు ఉండినా రేపు ఉంటాయని చెప్పలేము. అన్నీ మారుతూ ఉంటాయి. వాటితో పాటు మనస్సు కూడా మారుతూ ఉంటే, మథన పడుతూ ఉంటే, ఇక జీవితంలో సుఖపడట మనేది కుందేటి కొమ్మే అవుతుంది.

కొన్ని కావాలి అనుకుంటాం. కావాలి అనుకున్నవి రావాలి అని కోరుకుంటాం. వాటిని పొందాలని కర్మలు చేస్తాము. కొన్ని వస్తాయి. అన్నీ రావు. అలాగే, ఉన్నవి ఇష్టం లేకపోతే, అవి పోవాలి అని కర్మలు చేస్తాం. కొన్ని పోతాయి. అన్నీ పోవు.

ఇష్టమైనవి దగ్గరగా ఉండాలి అనుకుంటాం. కానీ, ఉండవు. ఇష్టం లేనివి దూరంగా పోవాలి అనుకుంటాం. కాని, పోవు. ఉండటానికి వచ్చినవి పొమ్మన్నా పోవు. పోవడానికి వచ్చినవి ఉండమన్నా ఉండవు. ఈ రెండిటి మధ్య ఆనందంగా బ్రతకడం ఎలాగో మనిషికి అర్థం కావాలి.

బ్రతకడం మనిషికి తెలుసు. ప్రాణం ఉన్నందుకు ఏదో ఒక విధంగా బ్రతికేస్తాడు. బ్రతుకు బండిని లాగేస్తాడు. కాని, ఆనందంగా బ్రతకడం మనిషికి తెలియదు. సుఖంగా జీవనయాత్రను సాగించడం ఎలాగో

అర్థం కాదు. ఆ రహస్యాన్ని భగవద్గీత బయట పెడుతుంది. అలా జీవించే పద్ధతిని కర్మయోగం బోధిస్తుంది. ప్రస్తుతం మనం గీతాసౌధంలో ఈ అద్భుతాన్ని వీక్షిస్తున్నాం. నాలుగు చక్రాల మీద ఆధారపడి కారు పరుగులు తీస్తూ ప్రయాణం చేసినట్లు, ప్రధానంగా నాలుగు విషయాల మీద ఆధారపడి కర్మయోగ శకటము పవిత్రమైన మార్గంలో జ్ఞానం వైపు పరుగులు పెడుతూ ఉంది.

అర్జునా! (1) కర్మ చేయడంలో నీకు అధికారం ఉంది. (2) ఫలితం విషయంలో ఎప్పుడూ లేదు. (3)కర్మ ఫలాలకు నువ్వు కారణం కావద్దు. (4) కర్మను చెయ్యకుండా ఉండటానికి ఆసక్తి చూపవద్దు. అంద మైన, అద్భుతమైన ఈ శ్లోకంలో ఈ నాలుగు ప్రధానమైన విషయాలు. మొదటిది విధివాక్యం. అంటే చేయ దగింది. మిగిలిన మూడు నిషేధ వాక్యాలు. అంటే, చేయ కూడనివి.

## నిర్ణయాధికారం నీదే

ప్రాణులన్నీ కర్మ చేస్తాయి. చలించడం ఏదైనా కర్మే *(చలనాత్మకం కర్మ)*. మనిషి ఒక్కడే కాదు, ప్రతి ప్రాణి కర్మలో నిమగ్నమయ్యే ఉంది. కాకపోతే, కర్మ స్వేచ్ఛ మనిషికి మాత్రమే ఉంది. పశుపక్ష్యాదులకు లేదు. అవి సహజాతాలతో పని చేస్తాయి. అందుచేత, సృష్ట్యాది నుండి అవి ఒకే విధంగా ఉన్నాయి. ఇంత కాలం గడచినా, పాపం మోసం చేసేది ఎలాగో ఇప్పటికీ నేర్చుకోలేక పోయాయి. మానవుని లాగా ప్రగతిని సాధించలేక పోయాయి.

మనిషికి బుద్ధి ఉంది. ఆలోచించే పరిజ్ఞానం ఉంది. విచారించే వివేక ముంది. కనుకనే, కర్మ స్వేచ్ఛ ఉంది. ఈ స్వేచ్ఛనే అధికారం అంటున్నాడు గీతాచార్యుడు. ఒక పనిని చెయ్యాలి అనుకుంటే మనిషి చెయ్యగలడు *(కర్తుం శక్యం)*. ఒక పనిని చెయ్యకూడదు అనుకుంటే, చెయ్యకుండా ఉండగలడు *(అకర్తుం శక్యం)*. ఒక విధంగా చెయ్యాలి అనుకున్న దానిని మరొక విధంగా కూడా చెయ్యగలడు *(అన్యథావా కర్తుం శక్యం)*. ఈ స్వేచ్ఛ మనిషికి ఉంది. ఇదే కర్మలలో అధికారము.

గోడ కట్టినా, గుంట త్రవ్వినా, పద్యం వ్రాసినా, పాట పాడినా, అవలోకించినా, ఆలోచించినా, వ్యవసాయం చేసినా, వ్యాపారం సాగించినా, కట్టె కొట్టినా, కట్టు కట్టినా, ఉద్యోగం సాగించినా, ఉద్యమం కొనసాగించినా - ఇవన్నీ కర్మలే. నీ ఇష్టంతో జరిగేవే. నిర్ణయాధికారం నీదే. అర్జునా! కర్మ చేయడంలో నీకు అధికార ముంది *(కర్మణి ఏవ అధికారః తే)*.

యుద్ధానికి రావాలి అనుకున్నావు, వచ్చావు *(కర్తుం శక్యం)*. యుద్ధం చెయ్యను అని కూర్చున్నావు *(అకర్తుం శక్యం)*. యుద్ధం మానేసి సన్యాసి నవుతాను అంటున్నావు *(అన్యథావా కర్తుం శక్యం)*. అర్జునా! నీకు కర్మస్వేచ్ఛ, కర్మ విషయంలో అధికారం ఉండ బట్టే ఇన్ని రంగులు మారుస్తున్నావు. క్రొత్త క్రొత్త హంగులు చూపిస్తున్నావు.

మొదటి చక్రం బాగానే తిరుగుతోంది. రెండవ చక్రం దగ్గరే సమస్య తలెత్తుతూ ఉంది. చక్రంతో పాటు తల కూడా తిరుగుతోంది. కర్మ చేయడంలో అధికారం ఉంది అనే మొదటి విషయం అర్థమైంది. ఫలితం విషయంలో అధికారం లేదు అనే రెండవ విషయమే కాస్త మ్రింగుడు పడకుండా ఉంది.

ఎవరు ఏ కర్మ చేసినా ఫలితాన్ని ఊహించే చేస్తారు. గోళ్ళు కొరుకుతూ కూర్చున్నా, మనస్సులో ఏదో మ్రింగుడు పడని విషయం ఉందనే అర్థం. కొరికితే ఏమన్నా మ్రింగుడు పడుతుందేమో అనే ఆశ. అంతే. ఏ కర్మ చేసినా, దాని వెనుక ఏదో సాధించాలి అనే కోరిక ఉండి తీరుతుంది. అదే ఫలాశ. ఫలాసక్తి. కర్మ చేసే అధికారం నీకు ఉంది. కాని, ఫలం విషయంలో అధికారం లేదు అనేదే కష్టపడి మ్రింగినా జీర్ణం కాని విషయం.





కర్మ చేసే అధికారం ఉన్నప్పుడు, ఫలాన్ని పొందే అధికారం లేకుండా ఎలా ఉంటుంది? నా కర్మకు నేను బాధ్యుణ్ణి అయి నపుడు, నా కర్మఫలానికి మరొకరు బాధ్యులు ఎలా అవుతారు? నా కర్మ యొక్క ఫలాన్ని ముందుగా ఊహించే కదా నేను కర్మ చేశాను? ఎవరైనా అలాగే చేస్తారు. ఫలితాన్ని ఊహించకుండా ఎవరైనా ఎందుకు చేస్తారు?

ప్రయోజనం అనుద్దిశ్య మందోऽపి న ప్రవర్తతే

ఫలితాన్ని ఊహించకుండా బుద్ధిహీనుడు కూడా కర్మ చేయడు. మరి, ఫలితాన్ని ఊహించి కర్మను ఆచరించే టప్పుడు, కర్మ విషయంలో ఉన్న అధికారం, ఫలం విషయంలో ఎందుకు లేదు? ఇవన్నీ చక్కని ప్రశ్నలు. వీటన్నిటికీ ఈ శ్లోకంలో జవాబులు చిక్కుతాయి.

ఈ చిక్కుముడులు విప్పే ముందు నేను ఒక్క ప్రశ్న మీ ముందు ఉంచుతాను; నాకూ కర్మాధికారం ఉంది కనుక! ఎన్నికల్లో నిలబడిన నలుగురు అభ్యర్థులు విజయం అనే ఫలాన్ని ఊహించే కదా పోటీ చేయడం అనే కర్మను సాగిస్తారు! ఎన్నికల్లో నిలబడే అధికారం నలుగురికీ ఉంది. లేకపోతే ఎలా నిలబడతారు? విజయాన్ని నలుగురూ ఊహించే కదా పోటీ చేశారు! మరి గెలిచే అధికారం నలుగురికీ ఉందా? ఉంటే, ముగ్గురెందుకు ఓడుతారు? అలాగని, గెలిచిన వ్యక్తికి అధికారం ఉందంటారా? అదే వాస్తవమైతే, ఓడిన ముగ్గురికి కూడా గెలిచే అధికారం ఉండాలి కదా? నలుగురికి అర్హతలు ఉండబట్టే కదా నిలబడ్డారు? ధరావత్తు సొమ్ము నలుగురు చెల్లించారూ కదా! కాస్త ఆలోచించండి.

ఈ ప్రపంచంలో శ్రమించే సేవకులుగా మనం ఉన్నామే గాని, జీతాలిచ్చే యజమానులుగా లేము. ఇక్కడే ఫలితాలను సాధించడంలో అధికారులం కాలేక పోతున్నాం. ఎందుకని? కాస్త విశ్లేషించి అర్థం చేసుకుందాం.

## ఫలం దైవాధీనం

కర్మయోగం అంటే ఫలితాలను ఊహించకుండా కర్మలు చేస్తూ పోవడం అని చాలా మంది వ్యాఖ్యానిస్తూ ఉంటారు. ఇలాంటి అశాస్త్రీయ, అహేతుక విషయాలను గీత బోధించదు. ఫలితం మీద దృష్టి లేకుండా, ఫలితాన్ని ఊహించకుండా, ఎవరైనా కర్మ చేయగలరా? ఫలితం మీద దృష్టి లేనపుడు కర్మ చేయడం ఎందుకు?

అర్జునా! కర్మ చేయడంలో నీకు అధికారం ఉంది. ఫలితంలో లేదు **(మా ఫలేషు)** అన్నాడు భగవానుడు. అంతేగాని, ఫలితం ఊహించ వద్దు అని చెప్పలేదు. ఫలితాన్ని ఊహించే అందరూ కర్మల్ని ఆచరిస్తారు.

జీతాన్ని ఊహించే ఉద్యోగం చేస్తాం. అదే ఫలమంటే. ఆటలో గెలవాలనే ఆడతాం. పరీక్షల్లో ఉత్తీర్ణులం కావాలనే వ్రాస్తాం. ఉద్యోగాన్ని సంపాదించాలనే ఇంటర్వ్యూకి వెళ్తాం. ఈ కర్మ లన్నీ ఊహించే ఆచరిస్తాం. అలాగే చేయాలి. కాకపోతే, మనం ఊహించిన ఫలితాలు రావచ్చు. రాకపోవచ్చు. ఫలం విషయంలో మనకు అధికారం ఉండేట ట్లయితే, అలా రాకపోవడం అనేది ఉండనే ఉండదు. ఇక్కడే మనం కాస్త లోతుగా విశ్లేషించు కోవాలి.

క్రీడాకారుడు శ్రమించి ఆడాలి. గెలవాలనే ఆడాలి. కాని, ఆడేవా ళ్ళందరూ గెలవ లేరు. గెలుపుపై మనకు అధికారం ఉంటే ఎప్పుడూ విజయం మనదే కావాలి. ఆడే అధికారం మనకు ఉంది. విజయం విషయంలో మనకు అధికారం లేదు. పని చేయకుండానే జీతాల్ని ఆశించే నేటి సమాజం, కర్మ చేసిన వారికి కూడా

ఫలితంపై అధికారం లేదు అనే సత్యాన్ని అంగీకరించ లేదు. అంగీకరించలేని సత్యాన్ని అర్థమయ్యేలా బోధించడానికే శాస్త్రం ఉంది.

మనం కర్మ చేసినంత మాత్రాన ఫలితం రావాలనే నియమం ఫలితాన్ని ఊహించి మనం కర్మ చేస్తాం. లేదు. కర్మ చేయడమే కాకుండా, ఫలితం రావడానికి అనుకూలమైన పరిస్థితుల నన్నిటినీ మనం సఫలం చేయ గలగాలి. అప్పుడే కర్మ సత్ఫలితా న్నిస్తుంది. కాని, అలా సఫలం చేయడం మన చేతిలో లేదు. మన చేత కాదు.

పంటను పండించడానికి రైతు తన వంతు కృషి తాను చేస్తాడు. కేవలం రైతు చేసే కృషి లోనే పంట రాదు. పంట పండాలి అంటే వర్షం సకాలంలో పడాలి. రైతు పంట పెట్టగలడే కాని, మేఘాల్ని పిండలేడు. అతివృష్టిని ఆపలేడు. అనావృష్టిని నివారించ లేడు. ఎన్నో కారణాల వల్ల పంట చేతికి అందకుండా పోతుంది. ఫలం వస్తే మనం అనుభవించగలం కాని, ఫలితాన్ని సృష్టించ లేము. కర్మఫలాన్ని సృష్టించుకొనే అధికారం మనకే ఉంటే, అసలు కర్మ చేయకుండానే ఫలితాన్ని సృష్టించుకో వచ్చు. అది సాధ్యపడే పని కాదు. ఫలితం విషయంలో మనకు అధికారం లేదు కనుకనే భగవంతుడు, అర్జునా! కర్మ చేయడంలో నీకు అధికార ముంది, ఫలితంలో లేదు అంటున్నాడు (***కర్మణే ఏవ అధికారః తే మా ఫలేషు కదాచన***). అంటే, ఎప్పుడూ లేదా? ఎప్పుడూ లేదు అనే దాని అర్థం. ఒకప్పుడు ఉంటే, మరొకప్పుడు కూడా ఉండే అవకాశం ఉంటుంది. ***కదాచన*** (ఎప్పుడూను) అనే పదం వాడటం లోని అర్థం అదే.

ఇంటి నుండి బయలుదేరి బండి నడుపుకుంటూ పోతుంటారు. ప్రమాదం జరగాలని ఎవరైనా అనుకుంటారా? కాని జరుగుతున్నాయా, లేదా? ఒకవేళ జరగ కూడదు అని సంకల్పించినా జరిగేవి జరగ కుండా ఉంటాయా? జరిగేవి జరిగే తీరుతాయి.

ఈ ప్రపంచం పరమేశ్వరుని సృష్టి. అందమైనది. అర్థవంత మైనది. ప్రయోజనాత్మక మైనది. దీనికి సంబంధించిన సర్వజ్ఞానము ఎవ్వరికీ లేదు, పరమాత్మకు తప్ప. ఈ ప్రపంచంలో ఎవ్వరము సర్వజ్ఞులం కాము. కనుకనే ఏది ఎందుకు ఎప్పుడు ఎలా జరుగుతుందో అర్థం చేసుకోలేక సతమత మవుతుంటాము.

మనకు అర్థం కాక పోవచ్చు. కానీ, ఉన్న వన్నీ అర్థవంతం గానే ఉన్నాయి. ఉదజని, ప్రాణవాయువు కలసి నీరు తయారైంది. రాయిని పైకి విసిరితే, భూమి ఆకర్షించడం వల్ల క్రింద పడుతోంది. ఈ సృష్టిలో అన్నీ ధర్మబద్ధంగా నడుస్తున్నాయి. ప్రతిదాని వెనుక ఒక నియతి ఉంది. ఉంది కనుకనే ఆ ప్రత్యేకమైన విషయాన్ని అధ్యయనం చేయడానికి, పరిశోధించడానికి అవకాశం కలుగుతూ ఉంది.

ఈ సృష్టి లోని ధర్మాలను ఎవరు సృష్టించారు? ఎవరికి తెలుసు? విశ్వాన్ని గూర్చి వ్యక్తి ఏమి చెప్పగలడు? విశ్వానికి కర్త ఎవరో అతనికే విశ్వాన్ని గూర్చి తెలుసు. ఈ సృష్టి లోని చట్టా లన్నీ ఆయన అధీనం లోనే ఉన్నాయి. వాస్తవం చెప్పాలంటే ఈ చట్టాల రూపంలో ఉన్నది తానే. ధర్మరూపంలో ఉండేది దైవమే. ధర్మ రూపంలో ఉన్నాడు కనుక ఆయన సర్వజ్ఞుడు. సర్వజ్ఞుడు కనుకనే సర్వాన్ని సృష్టించ గలిగాడు (***సర్వజ్ఞః సర్వం సృజతి***). సర్వజ్ఞుడైన వాడే సర్వులు ఆచరించే సమస్త కర్మలకు ఫలితాన్ని ఇవ్వగలడు. కనుక కర్మ మన చేతి లోనే ఉంది. కాని, ఫలితం దైవాధీనం.

కోరుకునే శక్తి భగవంతుడు మనిషికి ప్రసాదించాడు. దానినే ఇచ్ఛాశక్తి అంటారు. కోరే శక్తి ఉన్నవాడు కోరుకుంటే తప్పేముంది? ఏది కోరుకున్నా తప్పు లేదు. మనం కోరింది రాకపోవడమూ తప్పు కాదు. అలా రాలేదని దుఃఖ పడటమే తప్పు. లాభం కొరకు వ్యాపారం చేయడం దోషం కాదు. కాని, నష్టం వస్తే, అది రావలసింది కాదు అని దుఃఖించడం మాత్రం సమంజసం కాదు.





ఏదైనా వచ్చింది అంటే, అది రావలసింది కనుకనే వచ్చింది. రాకూడని దైతే ఎందుకొస్తుంది? ఈ ప్రపంచంలో అనివార్యాలు ఉన్నవేమో గాని అసంభవాలు లేవు. మనం ఆశించింది రాకపోవచ్చు. అలాగని, మనకు రావలసిన దానిని ఆపే శక్తి ఎవ్వరికీ లేదు. మన ఊహలకు, ఆశలకు ఫలితాలు రాకపోవచ్చు. మన కర్మలకు ఫలితాలు వచ్చి తీరుతాయి.

ఏ కర్మకు ఏది ఫలమో, ఏ కర్మ ఫలము ఎప్పుడు రావాలో, ఎక్కడ రావాలో, సర్వజ్ఞుడికే తెలుసు. మనం సర్వజ్ఞులం కాము. కనుక సత్యాన్ని గ్రహించలేము. నేడు ఆచరించిన కర్మల యొక్క ఫలితాలను గూర్చే మనం ఆలోచిస్తాం. కాని, గత జన్మల లోని కర్మల యొక్క ఫలితాలు ఈ జన్మ లోని కర్మఫలితాలలో ఏకమై అందే అవకాశం ఉంటుంది. అలాంటి పరిస్థితులలో ఏదీ అర్థం గాని అయోమయ స్థితిలో మనం పడిపోతాము. అందుకనే ఫలాలలో నీకు అధికారం వద్దు అంటున్నాడు గీతాచార్యుడు.

పల్లవి : **ఏ కర్మమునకు ఏది ఫలమో ఎరిగినవా రెవరు?**
**చేసిన కర్మము ఫలమును పొందక దాటే వారెవరు? ॥ ఏ కర్మమునకు ॥**

చరణము : **నీది కానిది, నీకు లేనిది రమ్మన్నా రాదు**
**నీది అయినది, నీకొర కున్నది పొమ్మన్నా పోదు**
**ఉండే వాటిని పొమ్మనకు, మరి లేనిది రమ్మనకు**
**రాకపోకల వాదుక తెలియక, వేదుక లేదనకు ॥ ఏ కర్మమునకు ॥**

అని కర్మఫలాలను ఆరబోసింది చైతన్య గీతిక.

**ఫల హేతువు పరమేశ్వరుడే**

కర్మ చేయాలి. కర్మఫలము వస్తుంది. కర్మఫలము నందు మనకు అధికారము లేదు (***కర్మ కుర్వతః మా ఫలేషు అధికారః అస్తు, కర్మఫల తృష్ణా మా భూత్ కదాచన***).

కర్మ చేస్తాం. ఫలితం వస్తుంది. కాని అది మనం ఆశించిన విధంగా ఉండక పోవచ్చు. మనం ఒకటి ఊహిస్తాం. ఫలం మరొకటి వస్తుంది. మనం ఆశించింది రాలేదని ఆవేదన చెందుతాం. మనం ఊహించింది రాని మాట నిజమే. కాని, మనకు రావలసిందే వచ్చింది అనేది అంతకు మించిన నిజం. లోపం ఏదన్నా ఉంటే మన ఊహలో ఉంటుందే గాని సర్వజ్ఞుడైన పరమేశ్వరుడు అందించే కర్మఫలంలో ఉండదు.

పరమేశ్వరుని అమృత హస్తాల నుండి అందుతూ ఉంది కనుక కర్మఫలము ప్రసాదము. ప్రసాదము అనేది వస్తువు కాదు, భావన. **ప్రసాదేతి ప్రసన్నతా.** ప్రశాంతతను కలిగించేది ఏదో అదే ప్రసాదము. ఫలహేతువు పరమేశ్వరుడు అనేది నిర్ధారణ కాగానే, ఫలం ప్రసాదంగా దర్శన మిస్తుంది.

ఏది అందినా, ఇచ్చేవాడు ఈశ్వరుడు కావడం వల్ల, అందినది ప్రసాదం అవుతుంది. ఏది అందు కుంటున్నా అందులో అందించే వాని రూపమే గోచరిస్తుంది. కనుక ప్రతి కర్మఫలమూ ప్రసాదమే.

ప్రసాదంలో ఇష్టాయిష్టాలు ఎవరి కుంటాయి? ప్రసాదాన్ని ఎవ్వరైనా కళ్ళ కద్దుకుని తీసుకుంటారు. తిరుపతి నుండి లడ్డు తెస్తే అది ప్రసాదము. శ్రీకాళహస్తి నుండి బిల్వపత్రం తెస్తే అది ప్రసాదము. శ్రీశైలం నుండి విబూది తెస్తే అది ప్రసాదము. కాశి నుండి గంగోదకం తెస్తే అదీ ప్రసాదమే. బృందావన ధూళి కూడా మహాప్రసాదమే. పదార్థాలు అనేకములు. కానీ, అన్నీ ప్రసాదాలే. కనుక ప్రసాదము అనేది వస్తువు కాదు, భావన అని తేలిపోయింది. ఒక వస్తువు పరమేశ్వరుని వద్ద నుండి వచ్చింది అని గుర్తించ గలిగే భక్తి మనకు ఉంటే, మరుక్షణమే ఆ వస్తువు ప్రసాద మవుతుంది.

ఈ విధమైన ప్రసాద భావనలో అంతా ప్రసన్నతే. ఆశించింది అందినా ప్రసాదమే. అందక పోయినా ప్రసాదమే. అధికంగా అందినా ప్రసాదమే. అల్పంగా అందినా ప్రసాదమే.

ప్రసాద భావనలో అనుకూలాలు అదృశ్య మవుతాయి. ప్రతికూలాలు పారి పోతాయి. ఏది అధికమో తెలియదు. ఏది అల్పమో అర్థం కాదు. కర్మయోగికి కర్మఫలాల యందు ఆసక్తి ఉండదు. అంతఃకరణ శుద్ధి కోసమే కర్మలు ఆచరిస్తాడు కనుక ఈ ప్రసాద భావన వల్ల బుద్ధి శుద్ధి పడుతుంది.

చరణము : **అనుకూలములు ప్రతికూలములు ఫలములలో లేవు**
**అధికమైనా అల్పమైనా ఫలము నిష్ఫలము**
**రాగము కాని ద్వేషము లేని ఫలములు బాధించవు**
**ఏది వచ్చినా ఎలా వచ్చినా నీ కది ప్రసాదము**

పల్లవి : **ఏ కర్మమునకు ఏది ఫలమో ఎరిగినవా రెవరు?**
**చేసిన కర్మము ఫలమును పొందక దాటే వారెవరు?**

మనకు ఏవి ఉన్నా, మనతో ఎందరు ఉన్నా, పరమేశ్వరుడు ప్రసాదిస్తేనే అవి మనకు కలిగాయి. అందుకే ఉన్న వన్నీ ప్రసాదాలు. ఉన్నవా రందరూ అనుగ్రహ రూపాలు.

సామాన్యునికి కర్మ సాధనం - ఫలం సాధ్యం. కర్మయోగికి కర్మ సాధనం - ఫలం చిత్తశుద్ధి. అందరూ ఫలం కోసం పని చేస్తారు. భక్తునికి ఫలాసక్తి ఉండదు. ఈ ప్రపంచంలో కర్మల వల్ల పొందే ఫలాలన్నీ ఏదో ఒకనాడు పోగొట్టు కొనేవే అని కర్మయోగికి తెలుసు ***(అస్మిన్ లోకే కర్మభిః సంపాదిత అనుభవః నష్టో భవతి!)***.

### కర్మశూన్యత దోషయుతం

ఫలాసక్తి లేనపుడు కర్మ చేయడం ఎందుకు? అని భావించకూడదు. ఒకవేళ కర్మలో దోషముంటే దానిని త్యజించ వచ్చు. దోషం కర్మలో లేదు. కర్మఫలం లోనూ లేదు. కర్మఫలాల విషయంలో మనం ప్రతిచర్యలతో స్పందించడంలో ఉంది. సమస్య అక్కడ ఉత్పన్న మవుతుంది.

కర్మను త్యజించడం ఎందుకు? ఆశించిన ఫలం రాదు అనే భయం ఉంటేనే కర్మను త్యజించాలి. కర్మకు ఫలం రాదని కర్మను ఆరంభించక ముందే నీకు తెలుసా? కర్మ చేస్తేనే కదా ఫలం వచ్చేది? కనుక కర్మ చేయాలి. వచ్చిన ఫలితాన్ని ప్రసాదంగా స్వీకరించాలి. అప్పుడు ఏ దోషమూ అంటదు. కర్మయోగికి కర్మశూన్యత సమస్యల్ని సృష్టిస్తుందేమో గాని కర్మాచరణము సమస్య కాదు. ఫలాసక్తితో కర్మలు చేయడం రజోగుణ మైతే, కర్మశూన్యత తమోగుణ మవుతుంది. ఫలాపేక్ష లేకుండా కర్మలు ఆచరించడం సత్త్వగుణము. కర్మయోగి నిత్య సత్త్వస్థుడు.

*కర్మయోగి కర్మఫలం కొరకు కర్మ చేయడు అని తెలిసింది. మరి కర్మలు ఎలా చేయాలి?* ***( కథం తర్హి కర్తవ్యమ్ ఇతి ఉచ్యతే )***. *తరువాత శ్లోకం ఆ విషయాన్నే స్పష్టం చేస్తూ ఉంది.*

**యోగస్థః కురు కర్మాణి సఙ్గం త్యక్త్వా ధనఞ్జయ ।**
**సిద్ధ్యసిద్ధ్యోః సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే ॥** **48**

***యోగస్థః-కురు-కర్మాణి-సంగం-త్యక్త్వా-ధనంజయ***
***సిద్ధ్యసిద్ధ్యోః-సమః-భూత్వా-సమత్వం-యోగః-ఉచ్యతే***





| | | | |
|---|---|---|---|
| ధనంజయ | = అర్జునా! | కర్మాణి | = కర్మలను |
| సంగం | = ఫలసంగమును | కురు | = చేయుము |
| త్యక్త్వా | = విడిచి | సమత్వం | = సమబుద్ధి |
| సిద్ధ్యసిద్ధ్యోః | = సిద్ధి యందు అసిద్ధి యందు కూడా | యోగః | = యోగమని |
| సమః భూత్వా | = సమభావంతో ఉన్నవాడవై | ఉచ్యతే | = చెప్పబడింది |
| యోగస్థః | = యోగములో ఉండి | | |

**అర్జునా! యోగనిష్ఠలో ఉండి కర్మలను ఆచరించు. ఫలాసక్తిని విడిచి పెట్టు. ఫలము సిద్ధించినా, సిద్ధించక పోయినా సమబుద్ధితో ఉండు. సమత్వమే యోగము.**

**వ్యాఖ్య**

నదిని దాటాలి అనేదే నీ అభిమత మైతే, నదిలో దిగకుండా నీవు ఆ పని చేయలేవు. కేవలం నదిలో దిగినా లాభం లేదు. ఈత తెలిసి ఉండాలి. లేకపోతే మునిగిపోయే ప్రమాద ముంది. మోక్ష తీరాన్ని చేరాలి అని అభిలషించే సాధకుడు కర్మ జలాలలో దిగక తప్పదు. అయితే, ఈ కర్మలను కర్మయోగంగా మార్చుకొనేది ఎలాగో తెలియక పోతే, మళ్ళీ సంసారంలో మునిగిపోయే ప్రమాదమే ఉంటుంది. కనుక యోగస్థుడవై కర్మలను ఆచరించు అని ఈ శ్లోకంలో గీత బోధిస్తూ ఉంది ***(యోగస్థః కురు కర్మాణి)***.

యోగస్థుడు అంటే యోగము నందు ఉన్నవాడు. మరి, యోగం అంటే ఏమిటి? సమత్వమే యోగము ***(సమత్వం యోగ ఉచ్యతే)*** అని యోగానికి ఒక క్రొత్త నిర్వచనాన్ని ఈ సందర్భంలో గీత వినిపిస్తూ ఉంది. సిద్ధించినది, సిద్ధించనిది, ఈ రెండిటి విషయంలో సముడుగా ఉంటూ కర్మలు చేయమని చెబుతూ ఉంది ***(సిద్ధ్య సిద్ధ్యోః సమో భూత్వా. . . ., సిద్ధ్య సిద్ధ్యోః అపి సమః తుల్యః భూత్వా కురు కర్మాణి ఇతి)***. అదెలా సాధ్యం? సంగమును, అనగా ఆసక్తిని త్యజించి కర్మలు చేయడము వల్లనే. *(సంగం త్యక్త్వా)*.

### సంగత్వమే సంగతి

కర్మ చేస్తూపో. ఫలితాన్ని విడిచి పెట్టు. కర్మఫలానికి నీవు కారణం కావద్దు అని నలభై ఏడవ శ్లోకంలో కర్మయోగాన్ని బుద్ధికి పట్టించాడు భగవంతుడు.

కర్మ బంధము కాదు. ఫలాసక్తియే బంధము అని అర్థం చేసుకున్నాం. ఫలసంగం లేకుండా కర్మలను ఆచరించడం కర్మయోగంలో కీలకమైన విషయము. కర్మలు చేస్తూ, ఫలాసక్తిని విడిచి, ప్రసాద భావనతో కర్మఫలాలను అనుభవించడం వల్ల గతంలో చేసిన కర్మల వల్ల ఏర్పడిన వాసనలు తరగిపోతూ ఉంటాయి. ఫలాసక్తిని విడిచి, రాగద్వేషాలు లేకుండా, ఈశ్వరభావనతో ప్రస్తుతం కర్మలు చేస్తూ ఉన్నాము కనుక, క్రొత్త వాసనలు అంతఃకరణములో తయారు కావు. ఈ విధంగా కర్మయోగంలో ఒక వైపు వాసనలు ప్రక్షాళన మవుతున్నాయి. మరో వైపు జ్ఞానప్రాప్తికి అంతఃకరణము శుద్ధిపడి సిద్ధపడుతూ ఉంది. హృదయం పవిత్ర మవుతూ ఉంది. ఇలాంటి హృదయమే ధ్యానానికి ఉపకరిస్తుంది. ఈ విషయాన్ని ఆరవ అధ్యాయంలో విపులంగా చెప్పుకుందాం.

జ్ఞానయోగంలో చరించే తత్త్వవిదునికి, కర్మయోగంలో సంచరించే కర్మయోగికి మోక్షమే పరమావధి కనుక సమబుద్ధి ఉండి తీరాలి. సంగత్వం ఉన్నంత వరకు సమత్వం ఉండదు. కనుక, కర్మయోగి సంగత్వాన్ని త్యజించి కర్మలు చేయాలి ***(సంగం త్యక్త్వా. . కురు కర్మాణి)***.

ఏ కర్మ తాను చేయవలసి ఉందో, ఆ కర్మను సంగత్వం లేకుండా, విధిగా కర్మయోగి నిర్వహించాలి. అంటే, కర్మ చేయాలి; కర్మసంగం ఉండ కూడదు. ఈ కర్మ నాది అనే భావన ఉండకూడదు. ఈ కర్మ నేను చేయవలసింది. నేను చేసేందుకు ఉంది అని భావించాలి. అంతేకాని, 'ఈ కర్మ నాది' అనే కర్మసంగం కర్మయోగికి పనికి రాదు. ఈ కర్మ నాది అని భావిస్తే, ఫలం ఎవరి దవుతుంది? కర్మ నాది అయినపుడు ఫలం కూడా నాదే అవుతుంది. ఇది ఫలసంగం. ఫలాసక్తి లేకుండా కర్మలను ఆచరించే వ్యక్తికి ఫలసంగం ఉండదు. కనుక, కర్మసంగం ఉండ కూడదు. ఫలసంగం ఉండ కూడదు.

కర్మ నాది కాదు అని స్పష్ట మైనపుడు, నేను కర్తను ఎలా అవుతాను? కర్తను కానపుడు కర్తృత్వ మెక్కడిది? కనుక, యోగికి కర్తృత్వ సంగం కూడా లేదు. కర్త అయినవాడే భోక్త అవుతాడు. కర్తృత్వం ఉంటేనే భోక్తృత్వం ఉంటుంది. కర్మ నాది కాదు అనే భావనతో కర్మయోగి కర్తృత్వం నుండి ఎప్పుడైతే విడిపడి పోతాడో, తత్కర్మఫలం కూడా నాది కాదు అనే భావనతో భోక్తృత్వ సంగం నుండి కూడా విడిపడి పోతాడు.

కర్మసంగం లేదు కనుక కర్తృత్వ సంగం లేదు. కర్తృత్వ సంగం లేదు కనుక ఫలసంగం లేదు. ఫలసంగం లేదు కనుక ఫల భోక్తృత్వ సంగం లేదు. ఇలా సర్వ సంగముల నుండి విడిపడి సమభావంతో ఉన్నవాడు కర్మయోగి. ఈ సమత్వమే యోగము అంటోంది భగవద్గీత. ఈ యోగంలో ఉన్నవాడు యోగస్థుడు. కర్మయోగి. కనుకనే, సంగత్వాన్ని త్యజించి, యోగస్థుడవై కర్మల నాచరించు అర్జునా! అంటున్నాడు యోగీశ్వరుడైన శ్రీకృష్ణుడు *(యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ!).*

యోగస్థుడైన వాడు ఏ కర్మలైనా చేయనీ. ఎన్ని కర్మలైనా చేయనీ. సంగం లేదు కనుక అతడిని కర్మ బంధించదు. పైగా అతడు చేసే కర్మ లన్నీ ఒకే మార్గంలో పోతూ ఉంటాయి. సద్గతి వైపే సాగుతూ ఉంటాయి. మోక్షం వైపే నడుస్తూ ఉంటాయి.

**సమత్వమే సద్గతి**

కర్మ బంధించదు. సంగత్వం బంధిస్తుంది. ఫలాశే బంధకారణ మవుతూ ఉంది. కర్మయోగి యోగస్థుడు. కామ్యకర్మలు చేయడు. ఫలాసక్తి లేకపోవడమే తన సమ వైఖరికి కారణము.

ఫలాసక్తి లేని వానికి ఏ ఫలమైనా సమమే. ఇదే సమత్వము. ఇది ప్రియము, అది అప్రియము అని భావిస్తేనే కర్మలు బంధిస్తాయి. ఇది సుఖము - అది దుఃఖము అని తలచి నపుడే రాగద్వేషాలు పుట్టుకొస్తాయి. ఫలాల వెనుక ధర్మాలు ఉన్నాయి అనేది అర్థమైతే, రాగద్వేషాలు అంకురించవు. ఈ విషయంలో కర్మయోగి చిత్తము చలించదు. కనుక కర్మ చేసేటప్పుడే తాను యోగస్థుడు *(యోగస్థః కురు కర్మాణి).*

కర్మ సుఖాన్ని ఇవ్వదు. దుఃఖాన్నీ ఇవ్వదు. కర్మ కేవలం కర్మఫలాన్ని ఇస్తుంది. అంతే. కర్మఫలాల విషయంలో మనకు ఉండే రాగద్వేషాలను బట్టి, ఆసక్తిని బట్టి సుఖదుఃఖాలు కలుగుతూ ఉంటాయి.

యోగస్థుడైన వాడు చేసే కర్మలు గంగాజలం వలె పావనమై ఉంటాయి. తులసిదళాల వలె పవిత్రమై ఉంటాయి. యోగస్థుడు కర్మలు ఆచరిస్తున్నాడు అంటే, అవి కేవలం ఈశ్వరార్థమై ఉంటాయి *(యోగస్థః సన్ కురు కర్మాణి, కేవలం ఈశ్వరార్థమ్).* అతడు కేవలం ఈశ్వరుని కొరకే కర్మలు ఆచరిస్తాడు.

మన కర్మలు ఈశ్వరుని కెందుకు? సంసారం కోసం ఉద్యోగం చేసినట్లు, ఈశ్వరుని కొరకు కర్మలు చేయాలా? మన కర్మలు సర్వజ్ఞుడైన ఈశ్వరునికి అవసరమా? కానే కాదు. మరి ఈశ్వరార్థం కర్మలు ఎందుకు చేయాలి?

మనం చేయదగిన కర్మ ఏదో దానిని చేయడం మన ధర్మము. యోగస్థుడు ధర్మార్థం కర్మను చేస్తున్నాడే





గాని ఫలం కొరకు కాదు. ధర్మరూపంలో ఉన్నది ఎవరో కాదు, దైవమే. కనుక దైవానికి తల వంచి యోగస్థుడు కర్మను ఆచరిస్తున్నాడు. అంతేగాని, తన కర్మ ఈశ్వరునికి అవసరమై కాదు. తన కర్మల వల్ల ఈశ్వరుడు సంతృప్తి చెందేదీ లేదు. తన కర్తవ్యాన్ని నిర్వహించే టప్పుడు, ఆ కర్తవ్య రూపంలో గోచరిస్తున్న శ్రీకృష్ణుణ్ణే దర్శిస్తూ, ఫలసంగం లేకుండా, కర్మాచరణంలో తృప్తి చెందేవాడే యోగస్థుడు. మనం చేసే కర్మల వల్ల పరమేశ్వరుడు తృప్తి చెందడానికి అంతకు పూర్వం భగవంతుడు అసంతృప్తిలో ఉన్నాడా? అందువల్ల, నేను చేసే కర్మల వల్ల ఈశ్వరుడు సంతోషించాలి అనే సంగత్వాన్ని కూడా విడిచి పెట్టేయాలి అని వ్యాఖ్యానించారు భాష్యంలో శ్రీ శంకరాచార్యస్వామి.

విధిగా నీవు చేయ వలసిన కర్మ స్వకర్మ. స్వకర్మ రూపంలో ఉన్నది సర్వేశ్వరుడే అని తెలిసి పోయింది. ఇక ఇప్పుడు మనం చేసే ప్రతి కర్మ ఈశ్వరార్చనయే. ఆచరించే ప్రతి కర్మలో ఈశ్వర దర్శనమే. ఇక్కడ పని లేదు. పూజే ఉంది. యోగస్థుడు ఆచరించే ఆరాధనే ఉంది. ఈ విధంగా కర్మ లాచరించే వానికి బంధ మెక్కడుంటుంది? ఆనందం దూరంగా ఎక్కడికి పోతుంది? స్వధర్మాచరణములో ఎంతెంత అవగాహన పెరుగుతూ ఉంటే, అంతంత సమత్వం నిండుతూ ఉంటుంది. ఆరాధనా పూరిత కర్మ ద్వారా మనస్సును ఆత్మజ్ఞానానికి సిద్ధం చేయడమే ఇక్కడ యోగము. ఇదే **సిద్ధి.** దీనికి భిన్న మైనది **అసిద్ధి.** ఈ రెండిటిలో కూడా సమంగా ఉండటమే యోగము *(సమత్వం యోగ ఉచ్యతే).*

ఫలాపేక్ష లేకుండా కర్మలు చేస్తూ ఉంటే చిత్తశుద్ధి కలుగుతుంది. తద్వారా కలిగే జ్ఞానప్రాప్తి లక్షణము **సిద్ధి** *(ఫల తృష్ణా శూన్యేన క్రియమాణే కర్మణి సత్త్వ శుద్ధిజా, జ్ఞానప్రాప్తి లక్షణా సిద్ధిః).* దీనికి విరుద్ధ మైనది **అసిద్ధి** *(తద్విపర్యయజా అసిద్ధిః).* ఈ రెండిటి విషయంలో కూడా సమంగా ఉంటూ కర్మలు చేయడమే యోగం *(తయోః అపి సమః తుల్యః భూత్వా కురు కర్మాణి).* అంటే, ఈ కర్మను ఆచరిస్తే, ఇది చిత్తశుద్ధికి దోహదపడి జ్ఞానప్రాప్తిని కలిగిస్తుందని, ఈ కర్మపై ఆశ గాని, లేదా రాగం గాని; ఆ కర్మ వల్ల అంతఃకరణము మలినమై జ్ఞానప్రాప్తికి ప్రతిబంధక మౌతుందని ఆ కర్మపై నిరాశ గాని, లేదా ద్వేషం గాని లేకుండా, రెండిటి విషయం లోను సమబుద్ధి కలిగి యుండటమే యోగము. అంతఃకరణ అశుద్ధికి సంగత్వమే కారణం కాని కర్మ కాదు అని యోగస్థునికి తెలుసు. అందుకని అతడు చలించదు. ఇది యోగస్థుని అద్భుతమైన యోగస్థితి.

*సమత్వ బుద్ధితో కూడిన ఈ నిష్కామకర్మ సకామ కర్మల కంటే ఎంత శ్రేష్ఠ మైనదో వివరిస్తున్నాడు.*

**దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగా ద్ధనఞ్జయ ।**
**బుద్ధౌ శరణ మన్విచ్ఛ కృపణాః ఫలహేతవః ॥** 49

దూరేణ-హి-అవరం-కర్మ-బుద్ధియోగాత్-ధనంజయ
బుద్ధౌ-శరణం-అన్విచ్ఛ-కృపణాః-ఫలహేతవః

| | | | |
|---|---|---|---|
| ధనంజయ | = అర్జునా! | బుద్ధౌ | = బుద్ధి యందు |
| బుద్ధియోగాత్ | = బుద్ధియోగము కంటె | శరణం | = ఆశ్రయమును |
| కర్మ | = కామ్యకర్మ | అన్విచ్ఛ | = కోరుకో |
| దూరేణ | = చాలా దూరం చేత | ఫలహేతవః | = ఫలము నాశించు వారు |
| అవరం హి | = తక్కువైనది కదా! | కృపణాః | = కృపణులు |

**ధనంజయా! ఫలాపేక్షతో చేసే కర్మ, బుద్ధి యోగము కంటే చాలా తక్కువది. కనుక బుద్ధి యోగాన్నే ఆశ్రయించు. ఫలాసక్తి కలవారు దీనులు.**

### వ్యాఖ్య

**ఉండని దానికి ఉనికి లేదు**

సమత్వబుద్ధితో కూడిన కర్మయోగం పవిత్ర మైనది. రాగద్వేషాలకు చాలా దూరంలో ఉంటుంది. ఫలితాల విషయంలో ఆందోళన లేకుండా సమబుద్ధితో ఉంటుంది. అంతఃకరణ శుద్ధిని కలిగిస్తుంది. సాంఖ్యము బోధించే జ్ఞానాన్ని అందుకోవ డానికి మార్గాన్ని సుగమం చేస్తుంది. సూటిగా చెప్పాలంటే మోక్షహేతువు అవుతూ ఉంది. ఫలసంగం లేకుండా ఉండటమే కర్మయోగ వైశిష్ట్యము.

ఫలితాన్ని కోరుతూ, ఫలాసక్తితో కర్మలు చేసేవారు దీనులు అంటున్నాడు గీతాచార్యుడు ***( కృపణాః ).*** వారు ఎందుకని కృపణులు అంటే, ఫలాసక్తి చేత ప్రేరేపింపబడి విశేషంగా కర్మ లాచరిస్తూ ఉన్నారు కనుక ***(ఫల హేతవః ఫలతృష్ణా ప్రయుక్తాః ).***

సమత్వబుద్ధితో కూడిన కర్మయోగముతో పోల్చి చూచి నపుడు ఫలాసక్తితో చేసే సకామ కర్మ చాలా నికృష్టమైంది ***( అవరం నికృష్టం ).*** సకామ కర్మలు ఫలసంగంతో కూడుకొని ఉంటాయి. రాగద్వేషాల మధ్య ఊగిస లాడుతూ ఉంటాయి. భోగైశ్వర్య ప్రసక్తి తోనే నిండి ఉంటాయి. జననమరణాలకు కారణమై, బంధహేతువులుగా ఉంటాయి. సకామ కర్మలలో మోక్షాపేక్ష అనూహ్యం. చిత్తశుద్ధి శూన్యం. నికృష్టమైన ఈ సకామ కర్మలు శ్రేయోదాయకం కావు కనుక, దీనుల వలె వాటిని ఆశ్రయించ వద్దని పరమేశ్వరుడు ఈ శ్లోకంలో హెచ్చరిక చేస్తూ ఉన్నాడు. చిత్తశుద్ధిని, చిత్త నైర్మల్యాన్ని కలిగించే నిష్కామ కర్మయోగమునే ఆశ్రయించమని బోధిస్తున్నాడు ***( బుద్ధౌ శరణ మన్విచ్ఛ ).***

సమత్వబుద్ధి యోగమును ***( బుద్ధౌ )*** ఆశ్రయించ మంటున్నాడు ***( శరణమ్ ఆశ్రయమ్ అభయప్రాప్తి కారణమ్, అన్విచ్ఛ ప్రార్థయస్వ ).*** సమత్వబుద్ధి భయాన్ని నిర్మూలిస్తుంది. అభయాన్ని అనుగ్రహిస్తుంది. అందుకే దానిని అభయప్రాప్తి కారణము అన్నారు భాష్యంలో శ్రీ శంకరులు.

కర్మ ఆరంభించక ముందే, ఈ కర్మ వల్ల ప్రయోజనం ఏమిటి? అనే ఊహలను, ఆశలను ముందుంచుకొని, విచారించుకొని ఆ తరువాత కర్మాచరణములో ప్రవేశించడం సకామ కర్మలలో సాధారణ మైన విషయము. తమ అంచనాలు నెరవేరుతాయో లేదో అనే భయం కర్మారంభము నుండే ప్రారంభ మవుతుంది. ఒకవేళ నెరవేరక పోతే ఎలా? అనే సందిగ్ధం మనస్సులో ఆందోళనకు నాంది పలుకుతుంది. ఈ భయాలు నిరాశల్ని పెంచుతాయి. నిరుత్సాహాన్ని మనసులో దించుతాయి. అందుకే ఫలాసక్తి కలవారు కృపణులు. దీనత్వంతో బ్రతికేవారు ***( కృపణాః ).*** దీనత్వంతో బ్రతికే వ్యక్తి జీవితం నికృష్టంగా ఉంటుంది ***( అవరం ).***

ఫలాసక్తే ఈ నికృష్టమైన దీనత్వానికి కారణము. ఫలసంగం వల్లే భయాలు పుట్టుకొస్తున్నాయి. సమత్వ బుద్ధితో వ్యవహరించే వారిలో ఫలసంగం ఉండదు. భయాలూ ఉండవు. అందుకనే బుద్ధి యోగాన్ని ఆశ్రయించ మంటున్నాడు భగవానుడు ***( బుద్ధౌ శరణం ).*** పైగా, అది అభయప్రదం అంటున్నాడు ***( అభయప్రాప్తి కారణమ్ )***. దానినే ఆశ్రయించ మంటోంది గీత. ప్రార్థించ మంటోంది ***( అన్విచ్ఛ ప్రార్థయస్వ ).***

ఫలాసక్తితో సకామ కర్మలను ఆచరించే దీనులు ఆశానిరాశల మధ్య ఊగిస లాడుతూ ఉంటారు. అశాంతితో అలమటిస్తూ ఉంటారు. మనిషికి ఏది ఉంది, ఏది లేదు అనేది ప్రధానం కాదు. ఆశ ఒక్కటి ఉంటే చాలు. ఎన్ని ఉన్నా లేనట్లే. అది తీరని దాహం. వయస్సు గతిస్తున్నా ఆశ నశించదు. పైగా నిరాశా నిస్పృహలను పెంచుతూ పోతుంది.





చరణము : **లేనినాడు ధన మొకటే లేదు**
**ఉన్ననాడు మరి లేనివి ఎన్నో!**
**ఎన్నున్నా - ఆశ కదిలితే**
**పండని కాయే ఆ బ్రతుకెపుడు**
పల్లవి : **ఉన్నది గాంచవె ఓ మనసా!**
**వేరొండులే దనే సత్యము తెలుసా!**

అంటూ ఆశాపాశాన్ని త్రుంచే ప్రయత్నంలో, ఉన్న సత్యాన్ని కళ్ళ ముందు ఆరబోసింది చైతన్యగీతిక.

నలభై ఎనిమిది, నలభై తొమ్మిదవ శ్లోకాలలో వరుసగా అర్జునుణ్ణి ***ధనంజయ - ధనంజయ*** అంటూ సంబోధించాడు దామోదరుడు. అర్జునా! లౌకిక ధనాన్ని జయించావు. ఇక అక్షయ ధనాన్ని కూడా జయించు. మోక్షసిరిని చేజిక్కించుకో అని చెప్పడమే 'ధనంజయ!' అని రెండు శ్లోకాల్లోనూ వరుసగా సంబోధించడం లోని ఆంతర్యం. అందుకని **బుద్ధౌ శరణ మన్విచ్ఛ** - బుద్ధియోగాన్ని ఆశ్రయించు. అభయస్థితిని పొంది తరించు అని బోధించాడు.

*సమత్వబుద్ధి వల్ల పాపపుణ్యాలు అంటవు. కర్మలు చేస్తున్నా కర్మలకు అంటకుండా ఉండే స్థితిని కర్మయోగము అనుగ్రహిస్తుంది. ఎలాగో చూడండి!*

**బుద్ధియుక్తో జహా తీహ ఉభే సుకృతదుష్కృతే ।**
**తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్ ॥** 50

***బుద్ధియుక్తః-జహాతి-ఇహ-ఉభే-సుకృతదుష్కృతే***
***తస్మాత్-యోగాయ-యుజ్యస్వ-యోగః-కర్మసు-కౌశలం***

| | | | |
|---|---|---|---|
| బుద్ధియుక్తః | = సమత్వబుద్ధితో కూడిన వాడు | యోగాయ | = యోగము కొరకు |
| ఉభే సుకృతదుష్కృతే | = పుణ్యపాపముల రెండింటిని | యుజ్యస్వ | = ప్రయత్నించు |
| ఇహ | = ఇక్కడే | కర్మసు | = కర్మల యందు |
| జహాతి | = విడుస్తున్నాడు | కౌశలం | = నేర్పు |
| తస్మాత్ | = ఆ కారణము చేత | యోగః | = యోగము |

**సమత్వ బుద్ధి కలవాడు పుణ్యపాపాలను రెండిటినీ ఈ లోకం లోనే విడిచి పెట్టేస్తున్నాడు. అందుచేత బుద్ధి యోగానికి సిద్ధం కా! కర్మలలో కుశలత్వమే యోగము.**

### వ్యాఖ్య

కర్మయోగాన్ని సంక్షిప్తంగా, సారభూతంగా నలభై ఏడవ శ్లోకంలో వివరిస్తూ భగవానుడు ఉపదేశించిన నాల్గవ అంశం 'కర్మలను విడిచిపెట్ట కూడదు' **( మాతే సఙ్గోస్త్వ కర్మణి ).** ఆ విషయాన్ని ప్రస్తుత శ్లోకం విస్పష్టం చేస్తూ ఉంది.

యోగాన్ని నిర్వచిస్తూ, సమత్వమే యోగము అని నలభై ఎనిమిదవ శ్లోకంలో ఉపదేశించాడు. సమత్వ మనేది కర్మలకు సంబంధించింది కాదు. కర్మఫలాలకు సంబంధించింది. కర్మలను ఆచరించడములో, లేదా ఆరంభించడంలో సమత్వం కుదరదు. కారణం? కర్మలు స్థూలమైనవి. పైగా, దేని కదే. ఒక కర్మ మరొక కర్మ కాదు. పంట పెట్టడం ఒక కర్మ అయితే, వంట చేయడం మరొక కర్మ. ఈ రెండిటిని సమంగా చూడటం

సాధ్య పడదు. ఫలితాలు మనస్సుపై ప్రభావాన్ని చూపుతాయి కనుక, వాటి విషయంలో ప్రసాద భావన కలిగి ఉంటే, రాగద్వేషాలు తటస్థ మవుతాయి. ప్రసాదంలో భేదాలు చూడనట్లే, కర్మ ఫలితాల విషయంలో కూడా సమత్వం కుదురుతుంది. కాని, కర్మలను ఆరంభించే విషయంలో అది వర్తించదు. ఆ విషయాన్ని ఈ శ్లోకం విశద పరుస్తూ **యోగః కర్మసు కౌశలమ్** అంటూ యోగానికి మరొక అద్భుతమైన నిర్వచనాన్ని అందిస్తోంది.

ముందు కర్మ జరిగితే తరువాత ఫలితం వస్తుంది. ఫలాలలో ప్రసాద బుద్ధి కలిగి సమభావంతో ఉండటం వల్ల ఫలభోగ సంగము ఉండదు. నూతన వాసనలు తయారు కావు. ఉన్నవి కూడా ప్రక్షాళనం అవుతూ ఉంటాయి. చిత్తశుద్ధి ఏర్పడుతూ ఉంటుంది.

కాని, ఫలితానికి ముందే కర్మాచరణములో దోషాలు సంక్రమించే ప్రమాదం ఉంది కదా? ఇది కర్మ సంగాన్ని కలిగించదా? పాపపుణ్యాలను అంటగట్టదా? అనేది సంశయం. ఆ విషయాన్నే ఈ శ్లోకంలో చర్చిస్తున్నాడు భగవానుడు. మనం సోదాహరణంగా అర్థం చేసుకుందాం.

ఒక వ్యక్తి అధర్మంగా ఒక కర్మను ఆచరించి, ఫలితాల విషయంలో సమత్వంతో మెలిగితే, అతడు కర్మయోగి అవుతాడా? పాప కర్మాచరణం చేసినవాడు కాకుండా పోతాడా? అక్రమ వ్యాపారం చేస్తాడు. ఫలితం అధికమైనా, అల్పమైనా, అనుకూలమైనా, ప్రతికూలమైనా ప్రసాదంగా సమబుద్ధితో స్వీకరిస్తాడు. అంతమాత్రాన, అతడు కర్మయోగి అవుతాడా? పాపపుణ్యాల నుండి విడిపడినవా డవుతాడా? కాదు. ఫలితాల విషయంలో ఒకవేళ సమత్వాన్ని అలవరచుకుంటే, ఫలసంగం లేనివాడు అవుతాడు కాని కర్మసంగం నుండి, కర్తృత్వ సంగము నుండి విడిపడిన వాడు కాలేడు. అందుచేత, ***సమత్వం యోగ ఉచ్యతే*** అనే యోగ నిర్వచనము ఒక్కటే చిత్తశుద్ధికి సరిపోదు కనుక, **యోగః కర్మసు కౌశలమ్** అనే రెండవ నిర్వచనాన్ని ఈ శ్లోకంలో అందిస్తున్నాడు.

**కర్మలలో కుశలత్వము**

విహిత కర్మలను, అంటే చేయదగిన కర్మలను ధర్మబద్ధంగా చేసిన వ్యక్తి సమత్వబుద్ధితో ఫలాలను ప్రసాదంగా స్వీకరించడం వల్ల ఫలసంగం లేనివాడు అవుతున్నాడు. ఇక్కడ మరొక ముఖ్యమైన విషయాన్ని మనం విశ్లేషించుకోవాలి.

నేను కర్తను అనే భావంతో కర్మ చేసినపుడు కర్తృత్వం ఏర్పడుతూ ఉంది. కర్త అయినవాడు భోక్త కాకుండా ఎలా ఉంటాడు? ఫలితాలను ఎలా తప్పించుకుంటాడు? సమత్వంతో జీవిస్తే, ఫలితం యొక్క ప్రభావం మనసు మీద పడకుండా జాగ్రత్త పడగలడు. నూతన వాసనలు తయారు కాకుండా చూసుకో గలడు. కాని, కర్మాచరణములో జరిగిన పాపపుణ్యాల నుండి ఎలా విడి పడతాడు? కేవలం ఈ జన్మలో చేసినవే గాక, గత జన్మలలో చేసిన పాపపుణ్యాల మూటను కూడా మోస్తూ ఉన్నాడు కదా! వాటి నుండి ఎలా విడి పడతాడు?

నేను కర్తను అనే కర్తృత్వ భావనతో చేసినపుడు, పాపపుణ్యాలు కర్తను అంటిపెట్టుకొనే ఉంటాయి. కేవలం ఫలసంగం వల్ల ఏర్పడే దుష్పరిణామాలను తొలగించుకున్నంత మాత్రాన కర్మసంగం వల్ల ఏర్పడే పాపపుణ్యాల నుండి ఎలా విడిపడతాడు?

మరొక విషయాన్ని కూడా ఇక్కడ అర్థం చేసుకోవాలి. కర్మఫలాల విషయంలో ప్రసాద భావన వల్ల సమత్వం ప్రాప్తించింది. బావుంది. మరి ప్రసాదం ఏమిటి? ఈశ్వర ప్రసాదం. పరమేశ్వరుడు ప్రవేశించకుండా ప్రసాదం లభిస్తుందా? భక్తుడు ఉండి, భగవంతుని అర్చించి నపుడే కదా ప్రసాదం లభిస్తుంది? ఇది చాలా జాగ్రత్తగా అర్థం చేసుకోవలసిన విషయం.





భగవంతుని విశ్వసించని నాస్తికుడు ప్రసాదాన్ని స్వీకరించ గలడా? ఫలితాన్ని స్వీకరించగలడే గాని, ఫలితాన్ని ప్రసాదంగా స్వీకరించ లేడు. సామాన్య జ్ఞానంతో అతడు ఆచరించిన కర్మ శాస్త్ర దృష్ట్యా ధర్మమే అయినప్పటికి, ఫలితాన్ని మాత్రం అతడు ప్రసాదంగా స్వీకరించలేడు. పరమేశ్వర భావన లేకుండా ప్రసాద భావన ఉండే అవకాశమే లేదు.

భక్తుడైన కర్మయోగి పరమేశ్వర భావనతో ఉన్నాడు కనుక, ఫలితాన్ని ప్రసాదంగా గ్రహించ గలడు. బావుంది! మరి నైవేద్యం పెట్టకుండానే ప్రసాదం లభిస్తుందా? లభించదు. కనుక కర్మను ఆచరించే టప్పుడు, ఆ కర్మలో పరమేశ్వరుడు ఉన్నప్పుడే అట్టి కర్మ పూజగా మారి, ఫలితం ప్రసాదంగా అందుతుంది.

కర్మ ఫలితాన్ని ప్రసాదంగా స్వీకరించాలి అంటే, ముందు కర్మను అర్చనగా ఆచరించాలి. చేసే పని పూజ కావాలి అంటే, కర్మ చేసే ముందే భావనలో ఈశ్వరుడు ఉండాలి. ఈశ్వర భావనతో కర్మ జరగాలి. మరి అదెలా సాధ్యం?

పరమేశ్వరుడు సర్వవ్యాపి. విశ్వవ్యాపి. విశ్వంలో విశ్వనాథుడు ధర్మరూపంలో ఉన్నాడు. నేను చేసే కర్మ గనుక ధర్మబద్ధంగా ఉంటే, ధర్మరూపంలో దైవమే ఉన్నాడు కనుక, పనిలో పరమేశ్వరుని పూజించడమే అవుతుంది.

పని అనే పూజలో కర్త అయిన నేను పూజారిగా ఉన్నాను. విశ్వమంతా ధర్మరూపంలో వ్యాపించి ఉన్న పరమేశ్వరుడు విశ్వం లోనే ఉన్న వ్యక్తిలో కూడా వ్యాపించి ఉన్నాడు. నా దేహం కూర్చుంటే, అందులో ఆయన ప్రమేయం ఉంది. నా దేహం తిరిగితే, అందులో ఆయన ప్రమేయం ఉంది. నా చేతులు పని చేయడం వెనుక ఆయన శక్తే ఉంది. ఆయన దృష్టి పడటం వల్లనే నా చూపుకు వెలుగు ఉంది. కనుక నా ద్వారా ఎన్నో జరగవచ్చు. అలాగని నేను కర్తను కాను. హరియే కర్త. ఈ భావనతో పని చేస్తే, ఆ పని పూజ అవుతుంది **(నాహం కర్తా హరిః కర్తా తత్పూజా కర్మచాఖిలమ్ ).**

ఈ విధమైన వైఖరితో సాగే పని పూజ అవుతుంది కనుక ఫలితం ప్రసాదం అవుతుంది. ఒక నాస్తికుడు మంచి పనే చెయ్యవచ్చు. కాని, ఈ విధమైన ఈశ్వర భావనతో చెయ్యగలడా? అందుచేత నాస్తికుడు ఆచరించిన సత్కర్మకు సత్ఫలితం రావచ్చు నేమో గాని, ఆ ఫలితం ప్రసాదంగా మాత్రం మారదు. రాగద్వేషాలు సమరస మైతేనే ఫలితం ప్రసాదం. ప్రసాద భావన ఉంటేనే చిత్తశుద్ధి కలుగుతుంది.

కర్మ పూజ కావాలి. ఈశ్వరారాధన కావాలి. ఫలితం ప్రసాదం కావాలి. కర్మ పూజ కావాలి అంటే కర్మలో పరమేశ్వరుడు ఉండాలి. కర్మలో పరమేశ్వరుడు ఎలా ఉంటాడు? ధర్మరూపంలో ఉంటాడు. అంటే, కర్మ ధర్మబద్ధంగా ఉంటేనే కర్మలో ఈశ్వరుడు ఉన్నట్లు. ధర్మబద్ధ మైన కర్మను ఈశ్వర భావనతో, అహంకారం లేకుండా ఆచరించి నపుడే అది పూజ అవుతుంది. ఫలితాన్ని ఈశ్వర భావనతో, మమకారం లేకుండా స్వీకరించి నపుడే అది ప్రసాదం అవుతుంది.

కర్మ పూజ కానపుడు ఫలితం ప్రసాదం కాలేదు. ఫలితాలు అందినపుడు ప్రతిచర్యలు లేకుండా, ప్రసాదంగా సమత్వంతో స్వీకరించాలి అంటే, కర్మను ఆచరించే టప్పుడు ఈశ్వర భావనతో ధర్మబద్ధంగా ఆచరించ గలగాలి. **సమత్వం యోగ ఉచ్యతే** అనే యోగ నిర్వచనము ఫలితాల విషయంలో మనకు ఉండవలసిన వైఖరిని స్పష్టం చేసింది. కాని, కర్మాచరణములో మన వైఖరి ఎలా ఉండాలో **యోగః కర్మసు కౌశలమ్** అనే నిర్వచనము విశదపరుస్తూ ఉంది.

తాను ధర్మబద్ధంగా చేయవలసింది ఏదో అది స్వధర్మము. దానిని ఆచరించడమే స్వకర్మ. ఈ స్వకర్మ

ద్వారా పరమేశ్వరుని అర్చించిన వారికి చిత్తశుద్ధి సిద్ధిస్తుంది ***(స్వకర్మణా తం అభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః)***. స్వధర్మాన్ని ఈశ్వరార్పణ బుద్ధితో ఆచరిస్తాడు కనుక ఫలితం సిద్ధించినా, సిద్ధించక పోయినా సమత్వబుద్ధితో ఉంటాడు. ఇదే కర్మలలో కుశలత్వము ***(స్వధర్మాఖ్యేషు కర్మసు వర్తమానస్య యా సిద్ధ్య సిద్ధ్యోః సమత్వ బుద్ధిః ఈశ్వరార్పిత చేతస్తయా తత్ కౌశలం కుశలభావః తద్ధి కౌశలం)***. ఇదే కౌశలం. కర్మలలో నేర్పు. ఈ విధమైన అవగాహనతో కర్మయోగి కర్మల యందు కుశలత్వంతో ఉంటాడు. కర్మలలో కర్మయోగి నేర్పరి. అంతేగాని, కర్మలలో నేర్పరితనం కల ప్రతి వ్యక్తీ కర్మయోగి కాలేడు. అలా అయ్యేట ట్లయితే, నేర్పుతో చోరత్వానికి పాల్పడే జేబుదొంగలు కూడా కర్మయోగులు కావాలి.

***యోగః కర్మసు కౌశలం*** అనే యోగ నిర్వచనము కర్మ విషయంలో బంధం లేకుండా చేస్తూ ఉంది. ***సమత్వం యోగ ఉచ్యతే*** అనే యోగ నిర్వచనము ఫలం విషయంలో బంధ విముక్తిని కలిగిస్తూ ఉంది. ఈ విధంగా కర్మయోగానికి పూర్ణత్వం సిద్ధిస్తూ ఉంది. కర్మయోగి కర్మల లోను, ఫలితాల లోను సమబుద్ధితో చరిస్తున్నాడు. కనుక పుణ్యపాపాల నుండి విడిపడు తున్నాడు.

**పాపపుణ్యాలు పారిపోతాయి**

కర్మసంగం నుండి, ఫలసంగం నుండి విడిపడిన కర్మయోగి పాపపుణ్యాల నుండి కూడా విడిపడు తున్నాడు.

కర్మలో ధర్మాధర్మా లుంటాయని తెలుసుకున్నాం. ధర్మబద్ధంగా చేస్తే అది సత్కర్మ. అధర్మంగా ఆచరిస్తే అది దుష్కర్మ. సత్కర్మ సుకృతం. దుష్కర్మ దుష్కృతం. సుకృత ఫలం పుణ్యం. దుష్కృత ఫలం పాపం. ఈ పాపపుణ్యాలు రెండూ మనిషిని బంధిస్తాయి. ఈ రెండూ కర్మల లోనే ఉన్నాయి కనుక బంధము కర్మల లోనే ఉంది. అదే కర్మబంధం.

కర్మయోగి పాపపుణ్యాలను ఇక్కడే విడిచేస్తున్నాడు ***(జహాతీహ)*** అంటున్నాడు ఈ శ్లోకంలో గీతాచార్యుడు. ఇక్కడే వదిలేస్తున్నాడు అంటే, ఈ లోకం లోనే విడిచిపెడు తున్నాడు అని అర్థం ***(జహాతి త్యజతి, ఇహ అస్మిన్ లోకే)***.

పుణ్యపాపాలను అనుభవించ డానికి ప్రత్యేకంగా లోకాలు ఉన్నాయి. పుణ్యం చేసుకున్న వాడు స్వర్గానికి పోతాడు. పాపం చేసిన వాడు నరకానికి పోతాడు. కర్మయోగి ఎక్కడికీ పోవడం లేదు. అందుచేత, పుణ్య పాపాలను ఇక్కడే విడిచేస్తున్నాడు.

పాపము యొక్క అనుభవము దుర్భరము కనుక దానిని విడిచి పెట్టడం బాగానే ఉంది. పుణ్యఫలాన్ని కూడా ఎందుకు విడిచి పెట్టాలి? అని కొందరు సంశయిస్తూ ఉంటారు.

పుణ్యం చేసిన వాళ్ళు స్వర్గానికి పోతారు. పాపం చేసిన వాళ్ళు నరకానికి పోతారు. పాప ఫలాన్ని అనుభవించిన తరువాత మళ్ళీ ఆ జీవుడు మానవ లోకంలో పుడుతాడు. అలాగే పుణ్యఫలంగా ప్రాప్తించిన స్వర్గ సుఖాన్ని అనుభవించిన తరువాత, ఆ జీవుడు కూడా మానవలోకం లోనే మళ్ళీ జన్మిస్తాడు. ఇరువురికీ జన్మ అనివార్యం.

కర్మయోగి తరించి పోతాడు కనుక పరలోకానికి వెళ్ళే ప్రసక్తి లేదు. పుణ్యపాపాలను అనుభవించడానికి పరలోకం వెళ్ళడు కనుక ఆ పుణ్యపాపాలను ఈ లోకం లోనే విడిచిపెట్టి వెళ్తున్నాడు.

కర్మయోగి పుణ్యపాపాలను ఎలా త్యజిస్తాడు? వచ్చే వాటిని ***(ఆగామి)*** రాకుండా ఆపుకో గలడేమో గాని, గత జన్మలలో ఆచరించిన కర్మల ఫలితంగా సంక్రమించిన పుణ్యపాపాలను ఎలా పోగొట్టుకుంటాడు? జ్ఞానం





వల్లనే పాపపుణ్యాలు నశిస్తాయి. కర్మయోగం వల్ల అంతఃకరణ శుద్ధి జరుగుతుందే గాని, పాపపుణ్యాలు ఎలా నశిస్తాయి? పరమార్థ దర్శనం కలిగి నపుడే కదా పుణ్యపాపాలు నశిస్తాయి!

నిజమే. జ్ఞానం వల్లనే కర్మ లన్నీ దగ్ధ మవుతాయి. పుణ్యపాపాలు జ్ఞానం చేతనే అదృశ్య మవుతాయి. కాకపోతే, కర్మయోగి జ్ఞానానికి ఎంతో దూరం లేడు. ఇదే అర్థం కావలసిన విషయం. కర్మయోగంలో నిష్ణాతు డైన వాడు ఆలస్యం లేకుండా జ్ఞానాన్ని పొందుతాడు. జ్ఞాని అవుతాడు కనుక పుణ్యపాపాలను ఇక్కడే విడి చేస్తాడు అని అర్థం ***(సత్త్వశుద్ధి జ్ఞానప్రాప్తి ద్వారేణ ఉభే సుకృత దుష్కృతే ఇహ జహాతి)***. ఈ విషయాన్ని ఉపనిషత్తు కూడా ధ్రువపరుస్తూ ఉంది. చిత్తశుద్ధిని పొందిన సాధకుడు పుణ్యపాపాలను విడిచి నిరంజన స్వరూపు డవుతున్నాడు అని ప్రమాణాన్ని అందించింది.

**విద్వాన్ పుణ్య పాపే విధూయ నిరంజనః సామ్య ముపైతి**

సాధకుడు ***(విద్వాన్ సాధకః ఇత్యర్థః)*** బంధహేతువులైన పుణ్యపాప కర్మలను సమూలంగా విడిచిపెట్టి ***(విధూయ నిరస్య దగ్ధ్వా)*** నిరంజనుడై, పరమేశ్వరునితో సామ్యమును పొందుతున్నాడు అని అథర్వణ వేదం.

ధర్మాత్ముడైన వాడు శాశ్వత శాంతిని పొందుతున్నాడు. అర్జునా! నా భక్తుడు (కర్మయోగి) నశించడు అని తెలుసుకో అని తొమ్మిదవ అధ్యాయంలో భగవంతుడే చెబుతాడు. ఇదంతా కర్మయోగ వైభవము. చూస్తూ ఉండగానే కర్మయోగంలో కర్మ పడిపోయి యోగం నిలుస్తుంది. కళ్ళ ముందే కర్మయోగి కర్మను జార్చుకొని యోగియై శోభిస్తున్నాడు. ఆ తరువాత జ్ఞానియై తరించిపోతాడు.

కనుక కర్మలను విడిచిపెట్టే ప్రయత్నం అవసరం లేదు. కర్మయోగి కాగలిగితే, కర్మలు వాటంతట అవే లేకుండా పోతాయి. కనుక కర్మను విడిచిపెట్ట నవసరం లేదు ***(మాతే సంగోఽ స్త్వ కర్మణి)***. అర్జునా! యోగమును ఆచరించు. కర్మయోగివి కా! సమత్వబుద్ధిని సాధించు ***(తస్మాత్ సమత్వ బుద్ధి యుక్తో భవ!)***.

కర్మయోగి కర్మబంధము నుండి ఎలా విడిపడుతున్నాడో తరువాత శ్లోకంలో వివరిస్తున్నాడు.

**కర్మజం బుద్ధియుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః ।**
**జన్మబన్ధ వినిర్ముక్తాః పదం గచ్ఛ న్త్యనామయమ్ ॥** 51

***కర్మజం-బుద్ధియుక్తాః-హి-ఫలం-త్యక్త్వా-మనీషిణః***
***జన్మబంధ-వినిర్ముక్తాః-పదం-గచ్ఛంతి-అనామయం***

| | | | |
|---|---|---|---|
| బుద్ధియుక్తాః | = సమత్వబుద్ధి గల | జన్మబంధ వినిర్ముక్తాః | = జన్మబంధము నుండి విడిపడిన వారై |
| మనీషిణః | = వివేకులు | | |
| కర్మజం | = కర్మ వలన పుట్టిన | అనామయం | = దుఃఖరహితమైన |
| ఫలం | = ఫలితమును | పదం | = స్థానమును |
| త్యక్త్వా | = విడిచి | గచ్ఛంతి హి | = పొందుచున్నారు కదా! |

**సమబుద్ధి కలిగిన వివేకవంతులు కర్మలు పంచే ఫలాలను త్యజిస్తారు. జన్మ బంధాల నుండి విడిపడతారు. ఏ ఉపద్రవాలు లేని చోటికి చేరి పోతారు.**

**వ్యాఖ్య**

బంధానికి కారణమైన కర్మల లోనే చరిస్తూ ఉండినా బంధానికి లొంగని శక్తిని, యుక్తిని ప్రసాదిస్తుంది

కర్మయోగము. ఇదే సమత్వము. ఇదే కర్మలలో కుశలత్వము. కర్మయోగంలో కొనసాగే సుకృతాత్ములు బంధానికి కారణమైన 'కర్మ'ను దూరం చేసుకొని ముక్తి హేతువైన 'యోగం'లో శోభిస్తారు.

మానవు లందరూ పాపపుణ్యా లనే పడవ లోనే ప్రయాణం చేస్తూ ఉంటారు. కర్మయోగంలో ప్రవేశించ గానే పాపం కారిపోతుంది. పుణ్యం మాత్రమే మిగిలి ఉంటుంది. చిత్తశుద్ధి ఏర్పడగానే పుణ్యపాపాలు రెండూ కారిపోతాయి. కాయ పెరుగుతూ ఉంటే పూలరేకులు రాలి పోతాయి. ఆ తరువాత కాయ పండుగా మారుతుంది. రాగద్వేషాల కారణంగా ఏర్పడే పుణ్యపాపాలను దాటిన కర్మయోగి జ్ఞానమును పొంది తరిస్తాడు.

సమత్వబుద్ధి గల వాడు పుణ్యపాపములు రెండిటిని ఈ లోకము నందే విడిచి పెడుతున్నాడు అని యాభైయవ శ్లోకం మొదటి పాదంలో తెలిపాడు ***(బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృత దుష్కృతే)***. సమత్వబుద్ధి గలవాడు కర్మ ఫలములను విడిచి పెడుతున్నాడు అని యాభై ఒకటవ శ్లోకం మొదటి పాదములో తెలిపాడు. రెండూ ఒకే విషయం. కాని యాభైయవ శ్లోకం రెండవ పాదమును పరిశీలిస్తే యోగాన్ని అనుష్ఠించు, కర్మల యందలి కుశలత్వమే యోగము అని సాధనను ఎరుక పరచి, యాభై ఒకటవ శ్లోకం రెండవ పాదంలో బంధ విముక్తి జరిగి, మోక్షప్రాప్తి కలుగుతూ ఉంది అని ఫలం వినిపిస్తున్నాడు.

**ఫలత్యాగం**

సమత్వబుద్ధి గల కర్మయోగి ఫల సంగాన్ని త్యజిస్తున్నాడు ***(సమత్వం యోగ ఉచ్యతే)***. కర్మ సంగాన్ని కూడా త్యజిస్తున్నాడు ***(యోగః కర్మసు కౌశలమ్)***. పుణ్యపాపాలే కర్మఫలం కనుక పుణ్యపాపాల నుండి విడిపడిన కర్మయోగి పుణ్యపాపాల ఫలమైన జన్మబంధము నుండి కూడా విడిపడు తున్నాడు ***(జన్మ బంధ వినిర్ముక్తాః)***.

బంధాన్ని ఎవరూ భరించ లేరు. బంధములో అందము ఉండదు. ఆనందమూ ఉండదు. బంధము నుండి విడిపడాలని అందరూ భావిస్తూ ఉంటారు. ఇంతకీ ఏది బంధం? జన్మ బంధమే బంధము అంటున్నాడు గీతాచార్యుడు ***(జన్మ ఏవ బంధః జన్మబంధః)***.

జన్మించడం లోనే బంధము తెలుస్తూ ఉంది. వాస్తవానికి జన్మించడములో ఒక బంధము నుండి బయట పడటమే జరిగింది. కాకపోతే, జన్మించగానే మరెన్నో బంధాలు తగుల్కోవడం చేత జన్మ బంధ మైంది.

పుట్టక ముందే తొమ్మిది నెలలు తల్లి గర్భంలో జీవి బందీయై ఉన్నాడు. జన్మించడంతో చెరసాల నుండి బయట పడ్డట్లే అయింది. కాని, అక్కడ నుండి క్రొత్త క్రొత్త బంధాలు మొదలవు తున్నాయి. ఊయలలో కొంత కాలము, ఇంట్లో కొంత కాలము, పాఠశాలలో కొంత కాలము, కార్యాలయాల్లో కొంత కాలము, సంసారంలో కొంత కాలము, వైద్యశాలలో కొంత కాలము - ఇలా జీవులు ఎప్పుడూ బంధాల లోనే కొనసాగుతూ ఉంటారు. ఎలా విడిపడతామా అని ఆందోళన చెందుతూ ఉంటారు. అట్టి వారికి తరుణోపాయాన్ని గీత అందిస్తోంది.

కర్మసంగాన్ని, ఫలభోగ సంగాన్ని త్యజించిన కర్మయోగులు, జననమరణాలు శరీరానికే గాని అకర్త యైన ఆత్మకు కాదని, తామే ఆత్మ యని తత్త్వజ్ఞానాన్ని పొందుతారు. దుఃఖ రహితమైన ముక్తి పథాన్ని సాధించి తరిస్తారు. అది కూడా, ఎప్పుడో మరణించిన తరువాత కాకుండా, జీవించి ఉండగానే సాక్షాత్కరించు కుంటారు ***(జీవన్తః ఏవ జన్మబంధ వినిర్ముక్తాః సన్తః పదం పరమం విష్ణోః మోక్షాఖ్యం గచ్ఛన్తి, అనామయం సర్వోపద్రవ రహితం ఇత్యర్థః)***. కర్మఫలాన్ని త్యజించి, జ్ఞానవంతులైన వారు జీవించి ఉండగానే జన్మబంధాల నుండి విడిపడి, ఏ ఉపద్రవాలు లేని విష్ణుదేవుని యొక్క పరమపదము అనే మోక్షాన్ని పొందుతారు.





**పదం ప్రాప్తం**

పరమపదము ఏదో అదే పరంధామము. అదే విష్ణుపదము. అదే మోక్షము. మనిషి మరణిస్తే మన సంప్రదాయంలో పరమపదించాడు అని అంటారు. పరమపదము అంటే ఏమిటి?

***తద్విష్ణోః పరమం పదం*** అన్నది వేదము. 'పదం', 'ధామం' అనేవి వేద పదాలు. పరమం పదం, పరంధామం అనేవి జీవుల గమ్యాన్ని నిర్దేశించే ప్రమాణ పదాలు.

పదం అన్నా, ధామం అన్నా స్థలము, లేదా ప్రదేశము అని అర్థం. చనిపోయిన తరువాత జీవులు చేరే ప్రదేశమే పరమపదం. ఆ చోటు ఎక్కడ? ఆ ప్రదేశము ఏది? ఈ విషయంలో మతాలు చిత్ర విచిత్రంగా చెబుతాయి. కాని, వేదము ఈ మతాలకు భిన్నంగా, విలక్షణంగా శోభిస్తూ ప్రవచిస్తుంది.

చనిపోయిన తరువాత ఇక్కడ లేము కనుక మరొక చోటికి చేరి ఉంటాము అనేది మతాల విశ్వాసం. భువిని విడిచిన జీవులు దివిని చేరుతారు అనేది వారి నమ్మకం. దివి అంటే మరొక లోకం లేదా స్వర్గం అని వారి భావము.

స్వర్గానికి వెళ్ళడం అంటే మళ్ళీ తిరిగి వస్తారా, లేదా? ఒక చోటికి వెళ్ళడ మంటూ జరిగితే తిరిగి రావడము కూడా జరుగుతుంది. ఈ విషయాన్ని గీత - తొమ్మిదవ అధ్యాయం కూడా ధ్రువపరుస్తుంది.

**తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి**

పుణ్యఫలంగా స్వర్గానికి వెళ్ళిన వారు పుణ్యఫల భోగాన్ని అనుభవించి, పుణ్యము క్షీణించ గానే మళ్ళీ భూలోకం చేరుతారని గీతాబోధ.

చావడం తిరిగి పుట్టడానికే అయితే, పుట్టుక మాట అలా ఉంచితే, చావుకు కూడా అర్థం లేకుండా పోతుంది. ఇలాంటి వ్యర్థ ప్రయాణాలు, అనర్థ ప్రమాణాలు చేరలేని దివ్యధామమే వేదం చెప్పిన పరంధామం. అదే పరమపదం. అదే ఈ శ్లోకంలో అనామయ పదం. అంటే, సర్వోపద్రవ రహిత స్థితి. ఏ బాధలు, ఉపద్రవాలు లేని స్థితి.

**యద్గత్వా న నివర్తన్తే తద్ధామ పరమం మమ**

అర్జునా! ఎక్కడికి చేరితే తిరిగి రావడ మంటూ ఉండదో అదియే నా పరంధామం అని గీత - పదిహేనవ అధ్యాయంలో భగవంతుడు చెబుతాడు.

ఏది పరంధామం? పరమేశ్వరుని ధామమే పరంధామం. అది ఎక్కడ? పరమేశ్వరుడు ఏమిటో తెలిస్తే, ఆయన పరంధామం ఎక్కడో అర్థ మవుతుంది.

సృష్టికి పరమేశ్వరుడు అభిన్న నిమిత్త ఉపాదాన కారణం కావడం చేత పరమేశ్వరుని కన్నా వేరుగా సృష్టి లేదు. ఉండలేదు. సృష్టి రూపంలో ఉన్నది పరమేశ్వరుడే. విశ్వమున్న చోటే విశ్వేశ్వరు డున్నాడు. విశ్వం లేక పోయినా, విశ్వేశ్వరుడు దివ్యంగా ప్రకాశిస్తూ ఉంటాడు. అదే అతని అనంత వైభవం. అనంతం అనేది ఒక ప్రదేశంలో ఉంటుందా? అనంతం జ్ఞానరూపంలో ఉంటుంది. జ్ఞానం కలిగిన వ్యక్తి అనంతు డవుతాడు. అనంతుడు ఎక్కడికి పయనిస్తాడు? ఎక్కడ నుండి ప్రయాణం ఆరంభిస్తాడు? ఎక్కడికి చేరుతాడు? అనంతుడు చేరడానికి తన కన్నా అన్యంగా ఏముందని? ఏ ప్రదేశ ముందని? కనుకనే,

**బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి** - బ్రహ్మమును తెలుసుకొనే వాడు బ్రహ్మమే అగుచున్నాడు.

**బ్రహ్మవిదాప్నోతి పరమ్** - బ్రహ్మవిదుడు పరంధామమును పొందుతున్నాడు.

తానే పరంధామంగా విలసిల్లు తున్నాడు. పరమపదంగా శోభిస్తున్నాడు. అనామయ పదంగా భాసిస్తున్నాడు. అదే విష్ణుపదం. విష్ణువు అంటే, అంతటా ఉండేవాడు (*వ్యాపన శీలం*). అంతేగాని, ఏదో ఒక లోకంలో ఊరేగే వాడు కాదు. ఊరించేవాడూ కాదు. కనుక పరంధామం, లేదా పరమపదం, లేదా అనామయపదం అనేది లౌకిక స్థానం కాదు. అలౌకిక ధామం. స్వరూప ధామం. అదే మోక్షం. అది ఉన్నదే గాని కానున్నది కాదు. అందుకనే, జన్మబంధ వినిర్ముక్తుడు అనామయ పదమును చేరుతాడని గీతాచార్యుడు బోధిస్తే, అది మరణించిన తరువాత కలిగేది కాదు, జీవించి ఉండగానే, ఇక్కడే ఇప్పుడే స్వరూపంగా పొందబడేది అని శ్రీ శంకరాచార్య స్వామి భాష్యంలో ఉద్బోధించారు (*జీవన్తః ఏవ జన్మబంధ వినిర్ముక్తాః సన్తః పదం పరమం విష్ణోః మోక్షాఖ్యం గచ్ఛన్తి*).

ఇది కేవలం జ్ఞానం వల్ల ప్రాప్తించేది. నువ్వు ముక్తుడవు అయ్యే ఉన్నావు. కనుకనే, జ్ఞానం మోక్షాన్ని ప్రసాదిస్తూ ఉంది. ఒకవేళ ఇప్పుడు ముక్తుడవు కాకపోతే, మోక్షం క్రొత్తగా వచ్చేది అయితే, ఒక కాలంలో వస్తుంది కనుక మరొక కాలంలో తప్పకుండా పోతుంది.

కనుక నీవు నిత్యముక్తుడవే. ఇదే శాస్త్ర తాత్పర్యం. నిత్య ముక్తుడవు కనుక బంధ మనేది లేనే లేదు. ఇప్పుడు లేదు. ఇంతకు పూర్వం లేదు. ఇక ముందు ఉండబోదు. బంధం లేనిదే. బంధం లేదు అని గుర్తించ నంత కాలం బంధం ఉంటుంది. లేకనే ఉన్నట్లు ఉంటుంది. కనుక లేని దానిని లేనట్లు, ఉన్న దానిని ఉన్నట్లు గుర్తించడమే జ్ఞానం.

జ్ఞానం వల్లనే మోక్షం ప్రాప్తిస్తుంది (*జ్ఞానాదేవతుకైవల్యం*). నిష్కామ కర్మయోగము యొక్క గమ్యస్థానము జ్ఞానమే. సమత్వబుద్ధి గల యోగి చిత్తశుద్ధిని పొంది, జ్ఞానప్రాప్తి ద్వారా మోక్షాన్ని పొందుతాడు. కనుక కర్మయోగము కూడా మోక్షహేతువే.

పల్లవి : **గోవిందా! గోవిందా! జన్మలన్నీ గోవింద!**
**జన్మలన్నీ గోవిందా! కర్మములన్నీ గోవింద!**

అనుపల్లవి : **శరణన్న వారికి గోవిందా! గోవిందా!**
**మరణము గోవింద! జననము గోవిందా!** *॥ గోవిందా ॥*

చరణములు : **(1) జన్మల బంధాలు గోవిందా గోవిందా**
**జీవుల సంబంధాలు గోవిందా గోవిందా**
**బాధలు గోవింద! బరువులు గోవింద!**
**కష్టాలు నష్టాలు గోవిందా! గోవిందా!** *॥ గోవిందా ॥*

**(2) లోకము గోవింద శోకము గోవింద**
**పాపము గోవింద పుణ్యము గోవింద**
**చేతి గీత గోవింద నొసటి రాత గోవింద**
**ఆశలు గోవింద పేరాశలు గోవిందా!** *॥ గోవిందా ॥*

అని గోవిందా - గోవిందా అంటూ సరిపెట్టుకుంది చైతన్యగీతం.

ఆత్మ తత్త్వాన్ని అచ్యుతుని నుండి ఆలకించాడు అదృష్టవంతుడైన అర్జునుడు. ఆత్మతత్త్వాన్ని పొందడానికి అనువైన అంతఃకరణ శుద్ధిని ప్రసాదించే కర్మయోగాన్ని కూడా దివ్యంగా ఆలకించాడు. ఈ కర్మయోగం ద్వారా కలిగే చిత్తశుద్ధి వలన ఏర్పడే సమత్వబుద్ధి తనకు ఎప్పుడు ప్రాప్తిస్తుందో, అనామయపదం ఎప్పుడు





సిద్ధిస్తుందో అనే జిజ్ఞాస అర్జునుని మనస్సులో కదులుతూ ఉందని పరమేశ్వరుడు గ్రహించాడేమో! ఆ విషయాన్ని కూడా తరువాత రెండు శ్లోకాలలో చెబుతున్నాడు.

**యదా తే మోహకలిలం బుద్ధి ర్వ్యతితరిష్యతి ।**
**తదా గన్తాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ ॥** 52

**యదా-తే-మోహకలిలం-బుద్ధిః-వ్యతితరిష్యతి**
**తదా-గంతాసి-నిర్వేదం-శ్రోతవ్యస్య-శ్రుతస్య-చ**

| | | | |
|---|---|---|---|
| యదా = ఎప్పుడు | | తదా = అప్పుడు | |
| తే = నీ యొక్క | | శ్రోతవ్యస్య = వినవలసిన దాని విషయంలో | |
| బుద్ధిః = బుద్ధి | | శ్రుతస్య చ = విన్న దాని విషయంలో | |
| మోహకలిలం = మోహ కాలుష్యమును | | నిర్వేదం = వైరాగ్యమును | |
| వ్యతి తరిష్యతి = దాటేస్తుందో | | గంతాసి = పొంద గలవు | |

**అర్జునా! నీ బుద్ధి మోహ కాలుష్యాన్ని దాటాలి. అప్పుడు వినదగిన విషయాల లోను, విన్న విషయాల లోను నీకు విరక్తి కలుగుతుంది.**

**వ్యాఖ్య**

వివేకము లేకపోవడమే 'మోహం' (*అవివేక రూపం*). 'కలిలం' అంటే కాలుష్యము. మాలిన్యము. 'మోహ కలిలం' అంటే, అవివేక రూపమైన మాలిన్యము అని అర్థం (*అవివేక రూపం కాలుష్యం*). వివేకం లేని బుద్ధికి ఎటు పోవాలో, ఎందుకు పోవాలో అర్థం కాదు. అవివేకం వల్ల ఉన్న దానిని లేనట్లు, లేని దానిని ఉన్నట్లు అర్థం చేసుకొనే ప్రమాదం కూడా ఉంటుంది. ఏది అర్థమైతే, దాని పైనే మనస్సులో ఆసక్తి కలుగుతుంది. దేనిపై ఆసక్తి ఉంటే, దాని వైపే బుద్ధి పరుగులు తీస్తుంది. మోహాత్మక మైన మనస్సుకు అనిత్య మైనదే నిత్యంగా కనిపిస్తుంది కనుక, అట్టి మనస్సు అనిత్యాల వైపే ప్రయాణం చేస్తూ ఉంటుంది. అంతేకాదు, నిత్యమైన దాని వైపు పోకుండా నిరోధిస్తూ ఉంటుంది కూడా. ఈ మోహం ఆత్మానాత్మ వివేక జ్ఞానాన్ని కలుషితం చేస్తుంది (*యేన ఆత్మానాత్మ వివేకబోధం కలుషీకృత్య*). మనస్సును విషయాల వైపు ప్రవర్తింప చేస్తుంది (*విషయం ప్రతి అంతఃకరణం ప్రవర్తతే*). ఈ మోహ కాలుష్యాన్ని బుద్ధి దాటి పోవాలి. అలా దాటి పోవడం అంటే, మోహ మాలిన్యాన్ని అతిక్రమించాలి. నిర్మలం కావాలి. శుద్ధి పడాలి (*తత్ తవ బుద్ధిః వ్యతితరిష్యతి, శుద్ధి భావమ్ ఆపత్స్యతే ఇత్యర్థః*). అప్పుడే యోగబుద్ధి సిద్ధిస్తుంది.

అవసరం లేనివి అవసరాలుగా తెలుస్తూ ఉంటే, జీవితంలో ఏది అవసరమో కూడా అర్థం కాకుండా పోతుంది. అనవసరమైన విషయాల పట్ల ఆసక్తి లేకపోవడం కూడా ప్రగతి సూచకమే. మనకు అవసరం లేనివి ఇతరులకు అవసరం కావచ్చు. వాళ్ళకు ఆసక్తి ఉన్న విషయాలపై మనకు ఆసక్తి ఉండ నవసరం లేదు. మనకు ఏది కావాలో అది క్షుణ్ణంగా తెలిసి ఉండాలి. దాని పైనే మనకు అనురక్తి ఉండాలి. ఇది వివేకం. అనవసరాలను ఆలింగనం చేసుకోవడం అవివేకం. అదే మోహం. దాని వల్ల ఏర్పడే అశుద్ధమే కాలుష్యం. ఇదే మోహ కాలుష్యం. ఇది తొలగితే, ఇంత వరకు వినిన విషయాల పట్ల (*శ్రుతం*), వినబోయే విషయాల పట్ల (*శ్రోతవ్యం*) నిర్వేదమును పొందుతావు అంటున్నాడు గీతాచార్యుడు.

**వినింది వికలం**

ఈ శ్లోకం సాధకులకు చాలా ఉపయుక్త మైంది. దారి తెలియక దగా పడే వారికి ఇదొక దారిదీపం

వంటిది. అక్షరాభ్యాసం నాడే అక్షర స్వరూపం తెలిసి రానట్లు ప్రారంభం లోనే అందరూ వివేకంతో ఎలా చరిస్తారు? ఆ మార్గంలో చరిస్తూ ఉంటే, క్రమేపి వివేకం ఉదయిస్తుంది. వివేకం ఉదయించే లోగా వ్యక్తిలో ఏదో జరిగి పోతుంది.

వ్యక్తిలో వివేకం ఉదయించ లేదని, అవివేకం చూస్తూ కూర్చుంటుందా? తన వ్యాపక మేదో తనకు ఉండనే ఉంటుంది. తన వ్యాపారము తాను సాగిస్తూనే ఉంటుంది. ఇది ఎంత వరకు ప్రాకి పోతుంది అంటే, వివేకం వచ్చినా ప్రవేశించడానికి వీలు లేనంతగా మనస్సులో నిండి పోతుంది. ప్రతి సాధకునికి ఇదొక కాళరాత్రి వంటిది.

వివేకం లేనివాడు కనుక ఎక్కడెక్కడో ఏదేదో వింటాడు. జ్ఞానం లేదు కనుక వినింది అంతా వాస్తవమే నని భ్రమిస్తాడు. అదే సత్యమని అతుక్కు పోతాడు. గమ్యం నిర్దిష్టంగా ఉండదు కనుక మార్గం కూడా నిర్ణీతంగా ఉండదు. ఎటు పోవాలో, ఏమి చేయాలో అర్థం కాదు. ఈ లోగా మరొకటి వింటాడు.

*అన్ని మార్గాలు ఒకే గమ్యం వైపు నడుస్తాయి. ఏ మార్గమైనా గమ్యం చేర్చేదే* అని ఎవరో బాకా ఊదుతూ ఉంటే అది వింటాడు. ఈ అస్తవ్యస్త వాక్యానికి రోమ్ నగరం ఒక ఉదాహరణ. అంతే, ఇక ఆ తరువాత ఎటు పడితే అటు పోవడమే. ఏది కనిపిస్తే అదే దారి. అదేమి టంటే, రోమ్ నగరం అంటాడు. ఇక ఆ నాలుకపై 'రోమ్' ఉంటుందే గాని, 'రామ్' ఉండదు.

వినివ వన్నీ విడ్డూరాలే. వివేకం లేనపుడు వినే వన్నీ విచిత్రాలే. ఈ విచిత్రాలు బుద్ధిని ఎంతగా వికలం చేస్తాయో ఇప్పుడు తెలియదు. బుద్ధిని శుద్ధి చేసుకోవడానికి శ్రీకారం చుట్టిన నాడు ఎంత చెత్త చేరి పోయిందో అర్థ మౌతుంది.

*- ఇలా చేస్తే మూడు నెలల్లో ముక్తి ముంగిట నిలుస్తుంది.*

*- ఈ మార్గంలో నడిస్తే బొందితో కైలాసం పోవచ్చు.*

*- ధ్యానం చేయకపోతే మోక్షం రాదు.*

*- టిక్కెట్టు లేకుండా సినిమా హాల్లోకి పోలేవు. శరీరంపై ఈ చిహ్నాలు లేకపోతే దైవసన్నిధి లోకి ప్రవేశించ లేవు.*

*- మానవసేవ లోనే మోక్షం లభిస్తుంది.*

*- భగవంతుడు ఆ లోకంలో ఉంటాడు. అలా ఉంటాడు. ఇలా ఉంటాడు.*

ఇలాంటి మహావాక్యాలు వందల్లో కాదు, వేలల్లో ఉన్నాయి. వెతికితే లక్షల్లో కూడా దొరుకుతాయి. ఎన్నని? ఎందరని? ఇంకెక్కడి వివేకం? బుద్ధే వికలమై పోయింది.

**వినబోయేది వైకల్యం**

*ఇది విన్నాను - అది వినాలి.*

*ఇది చదివాను - అది చదవాలి.*

*వీళ్ళు చెప్పింది ఆచరించాను - వాళ్ళు చెప్పింది ఆచరించాలి.*

*ఇక్కడికి పోయాను - అక్కడికి పోవాలి.*

*ఈ ధ్యానం చేశాను. ఆ ధ్యానం చేయాలి.*

*ఇందులో ఏదో దొరికింది - అందులో ఏం దొరుకుతుందో చూడాలి.*

ఇలా పలవరిస్తూ ఉంటారు. అంతా తిరుగుతూ ఉంటారు. అన్నీ కావాలి. ఎన్నెన్నో కావాలి. ఏదీ వదలరు. దేనినీ పట్టుకోరు. వారానికి ఒక ఆశ్రమం. రోజుకో గురువు. క్షణం చిత్తం. క్షణం మాయ. అంతా మాయే. మాయే మహిమ. ఇదంతా మోహ కాలుష్యం. వివేకం లోపించడం వల్ల ఏర్పడిన బుద్ధి దోషం.





మనిషే కాదు చీకటిలో
ఛాయ కూడా కనబడదు
మహిమే కాదు మోహములో
మాయ కూడా కనిపించదు
వెలుగుల లోనే విచారము
తానే వెలుగును వివేకము
రామ రామ జయ రాజారామ్
రామ రామ జయ సీతారామ్ - ఇదొక రామజోగి చిట్కా.

**అంతా మంచే - అన్నీ మంచివే**

జ్ఞానం ఎవరి నుండైనా రావచ్చు. దిక్కు లేని వారికి ఏ దిక్కు నుండైనా వినిపించ వచ్చు. ఎవరు చెప్పినా వినాలి. వినపడింది వినాలి (**శ్రోతం శ్రోతవ్యం**). కనపబడింది చూడాలి (**దృష్టం దృష్టవ్యమ్**). ఏ పుట్టలో ఏ పాముందో! ఏ పెట్టెలో ఏ తేలుందో! దూరపు కొండలు నునుపు - దగ్గర లొండలు మెరుపు . . . అదేమి టంటే, లొండ పరుగు కంచె వరకు అని మరొక విరుపు.

ఇలా విని విని ఎందరో పాడయ్యారు. వినాలి అనుకొని ముస్ముందు ఇంకెందరో పాడు కావటానికి సిద్ధంగా ఉన్నారు. ఇలా వినిన విషయాల పట్ల, వినబోయే విషయాల పట్ల ఎవరికి ఆసక్తి ఉండదో, పైగా వైరాగ్యం ఉంటుందో, అట్టి వారికి యోగబుద్ధి సిద్ధించింది అని అర్థం.

**నిరాశ కాదు - నిర్వేదం**

అవసరం లేని దాని విషయంలో ఆశ కదలకుండా ఉండటం నిరాశ కాదు. నిర్వేదం. వైరాగ్యం. రాగం లేని స్థితి. నిస్సారమైన విషయాల పట్ల అరుచి. వాస్తవానికి ఇదొక గొప్ప సంపద. వైరాగ్య సంపద. సాంఖ్య, యోగాలను క్షుణ్ణంగా అర్థం చేసుకున్న వారికి అనిత్యమైన విషయాల పట్ల కలిగే అనాసక్తి. నిర్వేదం. ఇంతవరకు వినినవి (**శ్రుతం**), ఇక మీదట వినబోయేవి (**శ్రోతవ్యం**) ఏవైనా నిష్ఫలమే అనే వివేకం. జ్ఞానం (**శ్రోతవ్యం శ్రుతం చ నిష్ఫలం ప్రతిపద్యతే ఇత్యభిప్రాయః**). అలం బుద్ధి లక్షణం. ఇది చాలు. చాలు. చాలు అనే తృప్తిలో యోగబుద్ధి సారించిన విలక్షణ దృక్పథం. వైరాగ్య దర్శనం.

ఇది వారికి ఎలా సాధ్యమైంది? అంతకు మించి పొంద దగింది లేదు కనుక. వేదాంత జ్ఞానమునకు మించిన సత్యం ఏముంది? యోగనిష్ఠలో ఉన్న వ్యక్తికి ఇహపర విషయాల యందు ఉన్న వైరాగ్యాన్ని కదిలించే శక్తి ఏ సిద్ధాంతానికి ఉంది?

ఈ ప్రపంచము దేని చేత ప్రకాశిస్తూ ఉందో (***యేన ప్రకాశతే విశ్వం***), దేని యందు లయించిపోతూ ఉందో (***యత్రైవ ప్రవిలీయతే***), అట్టి పరమశాంత స్వరూపమైన, శ్రేష్ఠపదమైన బ్రహ్మమును నేనే (**తద్బ్రహ్మ పరమం శాన్తం తద్బ్రహ్మాస్మి పరం పదమ్**). ఇది ఉపనిషత్తు ప్రసాదిస్తున్న ఆత్మజ్ఞానము. దీనికి మించి పొంద దగింది ఏముంది? ఇంతకు మించిన ఆకర్షణ ఎక్కడుంది? అందుచేత వేదాంత వన విహారం చేసే యోగయుక్తునికి, జ్ఞాననిష్ఠునికి ఈ ప్రపంచంలో వినిన విషయాల పట్ల, వినబోయే విషయాల పట్ల ఆసక్తి ఉండదు. అనురక్తి ఉండదు. అంతా నిర్వేదమే. వైరాగ్య విభూతి ప్రదర్శనమే. అంతా చిన్మయమే (**సర్వం సచ్చిన్మయం తతమ్**). ఇక నేను కోరుకో దగింది ఏముంది? (***కిం అన్యత్ అభివాంఛామి ?***) అని నిత్యతృప్తితో పరవశించి ప్రశ్నించాడు ఉపనిషత్తులో మహర్షి.

ప్రపంచంలో వివిధ సాధన సాధ్య విషయాలే గాక, వేదం లోని సాధ్య సాధనల విషయంలో కూడా యోగ బుద్ధి విలక్షణం గానే ఉంటుంది. వైరాగ్యం తోనే ఉంటుంది అంటున్నాడు.

శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా ।
సమాధావచలా బుద్ధి స్తదా యోగ మవాప్స్యసి ॥ 53

**శ్రుతివిప్రతిపన్నా-తే-యదా-స్థాస్యతి-నిశ్చలా**
**సమాధౌ-అచలా-బుద్ధిః-తదా-యోగం-అవాప్స్యసి**

శ్రుతివిప్రతిపన్నా = వేదవాదాలతో కలత చెందిన
తే = నీ యొక్క
బుద్ధిః = బుద్ధి
నిశ్చలా = చలింపనిదై
అచలా = స్థిరముగా
సమాధౌ = సమాధి యందు
యదా = ఎప్పుడు
స్థాస్యతి = నిలబడుతుందో
తదా = అప్పుడు
యోగం = యోగమును
అవాప్స్యసి = పొంద గలవు

**అనేక విషయాలను, వేద వాదాలను ఆలకించి విచలితమైన నీ బుద్ధి ఆత్మ యందు నిశ్చలంగా నిలవాలి. అప్పుడే యోగాన్ని పొంద గలవు.**

**వ్యాఖ్య**

ప్రతిచర్యలు లేని యోగము, ప్రతిబంధకాలు లేని జ్ఞానము - ఈ రెండూ చాలా ప్రధాన మైనవి. ఆత్మ ఉన్నదే. ఆత్మజ్ఞానమే ఇప్పుడు తన వద్ద లేనిది. కనుక ఆత్మజ్ఞానానికి సాధకుడు యత్నించాలి. ఉన్న దానికి సంబంధించిన జ్ఞానమే కనుక విచారము కొనసాగించాలి. ఇక్కడ భగవత్కృప ఆచార్యుని రూపంలో, ప్రమాణ రూపంలో ఉంటుంది. ప్రమాణ విచారం చక్కగా జరిగితే ప్రమ కలుగుతుంది. ప్రమ అంటే జ్ఞానము.

ఇలాంటి జ్ఞానము కలగాలి అంటే, మనస్సు శుద్ధిపడి ఉండాలి. అంటే, రాగద్వేషాల చేత అశుద్ధమైన మనస్సు, వాటి నుండి విడివడి విశుద్ధం, ప్రసన్నం కావాలి. అందుకు సహకరించేదే కర్మయోగము. కనుక యోగము జ్ఞాన సాధనము.

సాధారణంగా మనస్సు చలన స్వభావం కలిగి ఉంటుంది. అనేక విషయ సంపర్కం చేత బుద్ధి వికలమై ఉంటుంది. విషయ ప్రపంచం యొక్క అస్థిరత్వం అర్థమైతే వికలమైన బుద్ధి వైరాగ్యంతో శోభిస్తుంది. కలత చెందకుండా ఉంటుంది.

విషయ ప్రపంచంలో అనేక విషయాలను, సాధన సాధ్యాలను గూర్చి విని, చూచి, ఆలోచించి, విక్షిప్త మైన మనస్సు, ఈ మోహ కాలుష్యాన్ని దాటి నపుడు దేనికీ కలత చెందకుండా నిర్వేదంతో విలక్షణంగా ఉంటుంది అని యాభై రెండవ శ్లోకంలో చూశాం. ప్రపంచంతో మనస్సు ఎలాగైతే విక్షిప్త మైందో, అలాగే వేదం లోని కర్మకాండ వల్ల కూడా విక్షిప్త మయ్యే అవకాశం ఉంది.

శ్రుతులలో వేరు వేరు సాధనలు, వేరు వేరు ఉపాసనలు చెప్పబడ్డాయి. వేరు వేరు సాధనలకు వేరు వేరుగా సాధ్యాలు నిర్ణయింపబడి ఉన్నాయి. వీటిలో ఏది ఆచరణీయమో ఏది కాదో, ఏది అవసరమో, ఏది అనవసరమో అర్థం కానపుడు, మనస్సు విచలిత మవుతుంది. విక్షిప్త మవుతుంది.

మనకు ఏది కావాలో అది నిశ్చయంగా తెలిస్తే, ఆ తరువాత సాధ్యసాధనాలు ఎన్నున్నా అవి మనలను కలత పెట్టలేవు. వాటి ప్రభావం మన మీద ఉండదు. అవన్నీ ఉంటాయి. అయినా బుద్ధి వైరాగ్యంతో విలక్షణంగా





ఉంటుంది. సాధనసాధ్యాల విషయంలో నిశ్చయం లేక సందేహాలతో నిండి ఉన్న మనస్సునే శ్రవణాదులు కలత పెడతాయి. సంశయాలు లేని బుద్ధికి అవి విక్షేపాన్ని కలిగించ లేవు.

కళ్ళు లేని వ్యక్తిని ఏ రూపం కలత పెడుతుంది? వినికిడిని కోల్పోయిన వ్యక్తిని ఏ శబ్దం బాధిస్తుంది? అలాగే, నిశ్చయ జ్ఞానంతో సంశయ నివృత్తి జరిగి, పురుషార్థ నిశ్చయం స్థిరంగా ఉండి, సాంఖ్య, యోగాలకు సంబంధించిన అవగాహన స్థిరంగా ఉన్న వ్యక్తి మనస్సును వేదం లోని కర్మకాండ కూడా అస్థిర పరచ లేదు.

**సర్వే వేదాః యత్పద మామనన్తి** - సర్వ వేదాలు ఏ బ్రహ్మమును గూర్చి చెబుతున్నాయో, ఆ బ్రహ్మమే ఏకైక గమ్యముగా గల సాధకుని బుద్ధిని కర్మలు కలత పెట్టలేవు.

అర్జునా! శ్రుతుల లోని సాధ్యసాధన సంబంధము లైన విషయాలను శ్రవణం చేయడం చేత విప్రతిపన్న మైన, అంటే విక్షిప్త మైన (నిలకడను కోల్పోయిన) బుద్ధి, ఏ సమయంలో నిశ్చల మవుతుందో, స్థిర పడుతుందో, ***(యదా స్థాస్యతి నిశ్చలా, యదా యస్మిన్ కాలే, స్థాస్యతి స్థిరీభూతా భవిష్యతి, నిశ్చలా చలన వర్జితా సతి)*** సంశయాలు లేకుండా అచలమై ఉంటుందో ***(అచలా)*** అప్పుడు యోగాన్ని పొందుతావు ***( తదా యోగమ్ అవాప్స్యసి )*** అంటూ ఈ కర్మయోగ ప్రకరణాన్ని సమాప్తం చేస్తున్నాడు గీతాచార్యుడు.

ఈ శ్లోకంలో ఒక్క పదాన్ని జాగ్రత్తగా అర్థం చేసుకుంటే సరిపోతుంది. 'చిత్తం ఎక్కడ నిలకడగా ఉంటుందో' అంటున్నాడే, అది ఎక్కడ? అదే సమాధి అనే పదం. అంటే దేని మీద బుద్ధి నిశ్చలంగా ఉంటుందో అది సమాధి ***(సమాధా వచలా బుద్ధిః సమాధౌ - సమాధీయతే చిత్తం అస్మిన్ ఇతి సమాధిః ఆత్మా)***. ఇక్కడ సమాధి అంటే ఆత్మ అని అర్థము. ఏ విక్షేపాలు లేకుండా, వికల్పాలు లేకుండా ఆత్మ యందు బుద్ధి స్థిరంగా ఉండటమే సమాధి. ఆ సమయం లోనే యోగబుద్ధి స్థిరంగా ఉంది అని అర్థం ***(తస్మిన్ కాలే యోగం అవాప్స్యసి)***. చిత్తైకాగ్రత సిద్ధించింది అని భావం. బుద్ధి ఆత్మలో స్థిరపడి నపుడు యోగబుద్ధిని పొందినట్లు నిశ్చయం. దీనిని బుద్ధి అనకుండా ప్రజ్ఞ అని ప్రవచించారు భాష్యంలో ఆచార్యులు. వివేక ప్రజ్ఞను సమాధిగా అభివర్ణించారు ***(యోగమ్ అవాప్స్యసి, వివేక ప్రజ్ఞాం సమాధిం ప్రాప్స్యసి)***. సమాధిలో వివేక ప్రజ్ఞ యొక్క స్థిరత్వము గోచరిస్తుంది.

*ఇది వినగానే, స్ఫూర్తితో స్పందించిన అర్జునుడు, పార్థసారథిని ప్రశ్నించే అవకాశం లభించి నందుకు పొంగిపోతూ* ***( ప్రశ్న బీజం ప్రతిలభ్య )***, *వివేక ప్రజ్ఞను పొందిన, సమాధి స్థితుడైన, ఆత్మ యందు ప్రజ్ఞ స్థిరపడిన స్థితప్రజ్ఞుని లక్షణాలను వాసుదేవుని నుండి వినాలనే కుతూహలంతో ఇలా ప్రశ్నిస్తున్నాడు.*

**అర్జున ఉవాచ :**

స్థితప్రజ్ఞస్య కా భాషా సమాధిస్థస్య కేశవ ।
స్థితధీః కిం ప్రభాషేత కిమాసీత వ్రజేత కిమ్ ॥ 54

**స్థితప్రజ్ఞస్య-కా-భాషా-సమాధిస్థస్య-కేశవ**
**స్థితధీః-కిం-ప్రభాషేత-కిం-ఆసీత-వ్రజేత-కిం**

కేశవ = కృష్ణా!
సమాధిస్థస్య = సమాధి యందున్న
స్థితప్రజ్ఞస్య = స్థిరబుద్ధి గల వాని యొక్క
భాషా = భాషణము
కా = ఏది?
స్థితధీః = స్థితప్రజ్ఞుడు
కిం = ఏమి
ప్రభాషేత = భాషించును?
కిం = ఎట్లు
ఆసీత = కూర్చొనును
కిం = ఏ విధంగా
వ్రజేత = చరించును?

**అర్జునుడు అడుగుతున్నాడు :**

**కేశవా! ఆత్మ స్థితుడైన స్థిత ప్రజ్ఞుని లక్షణ మేమి? స్థితప్రజ్ఞుడు ఏమి మాట్లాడుతాడు? ఎలా కూర్చుంటాడు? ఎలా సంచరిస్తాడు?**

**వ్యాఖ్య**

**అసమాన అద్భుత దీప్తి**
**అరుదైన అపూర్వ కీర్తి**

ధర్మం అనేది లక్షణం. దానికి రూపం లేదు. బుద్ధిలో భాసిస్తుంది. రూపం లేని ధర్మం రూపాన్ని ధరిస్తే ఎలా ఉంటుంది అంటే ఏమి చెప్పగలం? 'శ్రీరాముడిలా ఉంటుంది' అని అనగలం. అంతే.

ప్రేమ అనేది కూడా లక్షణమే. ప్రేమకు కూడా రూపం లేదు. రూపం లేని ప్రేమ భావంలో చలిస్తుంది. హృదయంలో ఊరేగుతుంది. రూపం లేని ప్రేమ ఎలా ఉంటుంది అంటే సమాధానం ఏం చెప్పగలం? 'శ్రీకృష్ణ పరమాత్మలా ఉంటుంది' అని చెప్పగలం. అంతే.

మరి, జ్ఞానం? ఆత్మ లక్షణమైన అద్భుత జ్ఞానం ఎలా ఉంటుంది? అంటే, తిరిగి ఏం జవాబు చెప్పాలి? చెప్పడానికి మాటలు ఎక్కడ నుండి తెచ్చుకోవాలి? మరుగున పడిపోతున్న మనస్సుతో ఏమని ఊహించాలి? మేలుకొని మాట్లాడాలా? నిద్రించి కల కనాలా? మైమరచి నిద్ర పోవాలా? ఎక్కడ నుండి పలకాలి? ఏమని చెప్పాలి? ఏమీ చెప్పలేక రెండు చేతులు జోడించి, ఆచార్యదేవులు శ్రీ ఆదిశంకరుల వారి వైపు చూడాలి. చూడమని చెప్పాలి. అంతే.

గీతలో మనం అధ్యయనం చేస్తున్నది రెండవ అధ్యాయం. ఇది ద్వితీయం. అద్వితీయం. అధ్యాయం ఆరంభం లోనే శరణాగతిని చెప్పుకున్నాం. ఆ తరువాత ఆత్మజ్ఞానమైన సాంఖ్యాన్ని అధ్యయనం చేశాం. ఆ తరువాత ప్రాసంగిక విషయంగా ధర్మాన్ని గూర్చి విన్నాం. మళ్ళీ సాంఖ్యము నుండి లంకెను అంది పుచ్చుకొని పవిత్రమైన ప్రసాదం లాంటి కర్మయోగాన్ని విన్నాం. ఇక ఇప్పుడు స్థితప్రజ్ఞుని లక్షణాలను వినబోతున్నాం.

**స్థితా ప్రతిష్ఠితా అహమస్మి పరంబ్రహ్మ ఇతి ప్రజ్ఞా యస్య సః స్థితప్రజ్ఞః**

నేనే పరబ్రహ్మమును అని ఎవని ప్రజ్ఞ, లేదా జ్ఞానము స్థితమై, అంటే స్థిరమై నిలిచి ఉందో, అతడే స్థితప్రజ్ఞుడు. బ్రహ్మజ్ఞాని. జీవన్ముక్తుడు.

దేవుడు ఎలా ఉంటాడో అని ఆలోచించే వారు ఎవరిని దర్శించి ఇలా ఉంటాడా! అని తృప్తి చెందుతారో, అతడే స్థితప్రజ్ఞుడు.

తనపై ఎటువంటి ప్రభావం చూపలేని ప్రపంచాన్ని, సంకల్పం కూడా లేకుండా, కేవలం సన్నిధి అనుగ్రహం చేతనే విశేషంగా ప్రభావితం చేస్తాడు. యావద్విశ్వానికి నీడ నిచ్చే ఆ జ్ఞాన తరువు యొక్క వ్రేళ్ళు వేదంలో పాతుకొని ఉంటాయి. అతనిని మలిన పరచే వస్తువు లేదు. పాడు చేసే శక్తి లేదు.

ఏది వచ్చినా అతనికి ఆనందమే. అతడు ఆహ్వానం పలకడం తెలియని వాడు. ఏది దూరమైనా అతనికి ఆనందమే. అతడు వీడుకోలు చెప్పడం అర్థం కానివాడు. సర్వమూ ఆ వ్యక్తికి సంతతానంద సంధాయకమే. కారణం, అతడు వ్యక్తి కాడు, అద్భుత శక్తి.





సుఖాలు అతణ్ణి వరించి సమీపిస్తాయి. అయ్యో! సంతోష పరచలేక పోయామే అని దిగులుతో వెను దిరిగి పోతాయి.

మేము ఆవరిస్తే ఉక్కిరిబిక్కిరై ఊపిరి ఆడకుండా విలపించే వాళ్ళనే చూశాము. కలత చెందని వాణ్ణి, కన్నీళ్ళు ఒలికించని వాణ్ణి, దరహాసము చెదరని పూర్ణచంద్ర శోభతో ప్రకాశించే పవిత్రాత్ముణ్ణి ఇంత కాలానికి చూడగలిగా మని కష్టాలు పరవశిస్తాయి.

నదులొచ్చి పడుతున్నా పెరుగుదల లేని సముద్రం లాగా, ఏది వచ్చినా, ఎంత వచ్చినా పొంగని వాడు. జలాలు ఆవిరై పోతున్నా తరుగుదల అర్థం కాని సాగరం లాగా ఏది పోతున్నా, ఎవరు పోతున్నా క్రుంగని వాడు. నిర్వికార స్వరూపుడు.

ప్రాపంచిక పెనుగాలులు దారుణంగా వీస్తున్నా, ఏ మాత్రం కదలిక లేకుండా ప్రకాశించే జ్ఞాన ప్రదీపుడు. సర్వశక్తి స్వరూపుడు.

దేవాలయం కదలదు. దేవాలయంలో దేవుడు పలకడు. కదిలే దేవాలయంలో పలికే దేవుడే స్థితప్రజ్ఞుడు. ముముక్షువులు ప్రయత్నించి సంపాదించుకో వలసిన పవిత్ర సాధనలను సహజ లక్షణాలుగా పొందిన పావనాత్ముడు. కృతకృత్యుడు. ఆప్తకాముడు. అతడే స్థితప్రజ్ఞుడు. అరుదైన ఆరాధ్యమూర్తి. మానవాళికి అసమాన అద్భుత స్ఫూర్తి. లోక కళ్యాణ కీర్తి.

**పార్థుని ప్రశ్న**

కేశవా! ఆత్మస్థితుడైన స్థితప్రజ్ఞుని లక్షణ మేమిటి? అతడు ఏమి మాట్లాడుతాడు? ఎలా కూర్చుంటాడు? ఎలా చరిస్తాడు? ఇది అర్జునుని ప్రశ్న.

యోగబుద్ధినే ప్రజ్ఞ అనే పదంతో భాషించడం జరిగిందని మనం ముందే చెప్పుకున్నాం. ఆత్మవివేకం కలిగిన బుద్ధినే ప్రజ్ఞగా అర్థం చేసుకోవాలి. 'స్థిత' అంటే ప్రతిష్ఠితం కావడం. ఈ శ్లోకంలో **స్థితప్రజ్ఞః - స్థితధీః** అనే రెండు పదాలలో 'స్థిత' అనేది సామాన్యంగా ఉంది. ప్రజ్ఞః - ధీః అనే రెండు పదాలు ఒకే అర్థంతో వాడబడ్డాయి. ఎవరి ప్రజ్ఞ, లేదా బుద్ధి ఆత్మ యందు సుప్రతిష్ఠమై ఉందో అతడే స్థితప్రజ్ఞుడు.

స్థితప్రజ్ఞుడు ఆత్మజ్ఞాని. ఆత్మజ్ఞానికి ఉపనిషత్తులలో అనేక పేర్లు ఉన్నాయి. బ్రహ్మనిష్ఠుడు, బ్రహ్మజ్ఞాని, ఆప్తకాముడు, జీవన్ముక్తుడు - ఇలా అనేక పేర్లతో ఉపనిషత్తులు పిలిచాయి. కాని, ఈ సందర్భం లోనే, గీత లోని ఆత్మజ్ఞానికి స్థితప్రజ్ఞుడు అనే పేరును వింటున్నాము. ఇది పార్థుడు సృష్టించిన పదం.

యాభై మూడవ శ్లోకంలో ***యదా స్థాస్యతి నిశ్చలా, సమాధా వచలా బుద్ధిః*** అనే పదాలను పరమేశ్వరుడు పలికి నపుడు, అర్జునుడికి అందమైన ఆలోచన కదలి, సుందరమైన ఈ మాటను **(స్థితప్రజ్ఞ)** రూపొందించాడు. ఆ తరువాత, ఈ విశిష్ట నామం విశేష ప్రాచుర్యాన్ని పొందింది. ఆత్మ యందు **(సమాధిః)** నిశ్చలమైన **(స్థిత)** బుద్ధి **(ప్రజ్ఞ)** ఎవరికి ఉందో అతడే స్థితప్రజ్ఞుడు. పార్థుని ప్రశ్నకు సమాధానంగా స్థితప్రజ్ఞుని లక్షణాలను పద్దెనిమిది శ్లోకాలలో వర్ణించిన పార్థసారథి చివరగా, **ఏషా బ్రాహ్మీస్థితిః** అని సమాప్తం చేశాడు. ఆత్మ యందు బుద్ధి స్థిరపడటమే స్థితప్రజ్ఞత్వం కావడం వల్ల, ఇదే బ్రాహ్మీస్థితి అని సమాప్తి చేయడం జరిగింది.

పతంజలి మహర్షి బోధించిన యోగ ప్రక్రియలో ఎనిమిదవ అంగము సమాధి. ఆ సమాధికి రాకపోక లుంటాయి. అక్కడ యోగి అంతర్ముఖుడై నప్పుడే సమాధినిష్ఠుడు. బహిర్ముఖ మైనపుడు సమాధిలో లేడు అని అర్థం. కాని ఇక్కడ, **సమాధి** అనే పదాన్ని ఆత్మ గానే గ్రహించాలి. అష్టాంగ యోగ మార్గంలో వినిపించే సమాధిగా అర్థం చేసుకో కూడదు. ఇక్కడ నడిచేది జ్ఞాన ప్రకరణం.

***స్థితప్రజ్ఞస్య కా భాషా - సమాధిస్తస్య*** అని అర్జునుడు అన్నప్పుడు అది సమాధి స్థితుడైన వానికి సంబంధించిన విషయ మని, అలా సమాధి స్థితుడైన యోగి బహిర్ముఖమై ప్రపంచంలో చరించే టప్పుడు అతడు ఎలా ఉంటాడు? అనేది ***స్థితధీః కిం ప్రభాషేత కిమాసీత వ్రజేత కిమ్*** అనే రెండవ పాదము యొక్క అర్థమని చాలా మంది వ్యాఖ్యానిస్తూ ఉంటారు. చాలా మంది ఇలా ప్రవచించడం బాల్యంలో నేను కూడా విన్నాను. ఈ విధమైన వ్యాఖ్యానము గీతకు అన్వయించదు. గీత జ్ఞాన ప్రధానమైన మోక్షశాస్త్రము.

**అర్జునుని అంతరంగం**

అర్జునుని ప్రశ్న లోని ఆంతర్యం ఏమై ఉంటుంది? స్థితప్రజ్ఞుని లక్షణ మేమిటి? అతడు ఎలా మాట్లాడుతాడు? ***(కిం ప్రభాషేత?)*** ఎలా కూర్చుంటాడు? ***(కిమాసీత?)*** ఎలా చరిస్తాడు? ***(వ్రజేత కిమ్?)*** అని ప్రశ్నిస్తున్నాడు. ఇది విడ్డూరంగా లేదూ? ఒక వైపు ప్రశ్నిస్తూనే, మరొక వైపు వింటూనే, స్థితప్రజ్ఞుడు ఎలా మాట్లాడుతాడు? అని అడగట మేమిటి? అర్జునుడితో మాట్లాడుతున్న దెవరో అర్జునుడికి తెలియదా? ఠీవిగా కళ్ళెం చేత పట్టుకుని రథంలో ముందు కూర్చుని దివ్యంగా శోభిస్తున్న ముకుందుని తన ఏడుపుతో లేపి నిలబెట్టి, ఎలా కూర్చుంటాడు? అని ఇప్పుడు అడుగుతా డేమిటి? ఎలా సంచరిస్తాడో ఇన్ని సంవత్సరాలుగా చూడలేదా? అతడి సంచారాన్ని గురించి ప్రత్యేకించి ఇప్పుడు ప్రశ్నిస్తా డేమిటి? శ్రీకృష్ణుని కన్నా వేరుగా ఆత్మజ్ఞానిని, బ్రహ్మజ్ఞానిని చూడాలని కౌంతేయుడు ఉబలాట పడుతున్నాడా? కానే కాదు.

అర్జునుడు సర్వ మానవాళి ప్రతినిధి. ఆయన వేసే ప్రశ్న లన్నీ మన ప్రశ్నలే. ఆయన పొందే సమాధానా లన్నీ మన కోసమే. శ్రీకృష్ణు డెవరో, ఏమిటో తెలియకపోతే, ఈ శ్లోకంలో ***కేశవా!*** అని సంబోధిస్తాడా?

***కశ్చ అశ్చ ఈశశ్చ త్రిమూర్తయః కేశాః***
***తే యద్వశేన వర్తన్తే స కేశవః***

క+అ+ఈశ - ఈ మూడు కలసి 'కేశ' శబ్దం వస్తుంది. 'క' అంటే బ్రహ్మ, 'అ' అంటే విష్ణువు, 'ఈశ' అంటే ఈశ్వరుడు. 'కేశ' శబ్దంలో త్రిమూర్తులు ఒదిగి పోయారు. ఈ ముగ్గురు మూర్తులు ఎవరికి వశపడి ఉంటారో (వ), అతడే కేశవుడు. త్రిమూర్తులను శాసించేవాడు.

***స్థితప్రజ్ఞః*** అనడంలో కేశవుని కన్నా అన్యమైన విచిత్ర రూపాన్ని చూడాలని అర్జునుడు భావించడం లేదు. అలాగే ***ప్రభాషేత, ఆసీత, వ్రజేత*** అనే పదాలను ప్రయోగించి ప్రశ్నించడంలో స్థితప్రజ్ఞుని అసన సిద్ధిని దర్శించాలని అభిలషించడమూ లేదు. ఆత్మజ్ఞుడైన జ్ఞాని హర్ష శోకాలలో ఎలా ఉంటాడు? ఇంద్రియ మనస్సులను నియమిస్తాడా? ఎలా నియంత్రిస్తాడు? శబ్దాది విషయాలు అందరిని పురి కొల్పినట్లే స్థితప్రజ్ఞుని కూడా ప్రేరేపిస్తాయి కదా! వాటి విషయంలో ఎలా వ్యవహరిస్తాడు? ఇదంతా అర్జునుని అంతరంగం. అచ్యుతునికి హస్తామలకం. లేకపోతే, అంత అద్భుతంగా, గుటక మ్రింగకుండా పద్దెనిమిది శ్లోకాలను అనర్గళంగా పలికి ఆత్మజ్ఞాన వైభవాన్ని ఆవిష్కరిస్తాడా?

**అస్పష్ట అవగాహన**

మనం ముందుగానే చర్చించు కున్నట్లు, స్థితప్రజ్ఞత్వం అనే అద్భుత విషయాన్ని యోగ దృక్పథం నుండో, లేక మరొక కోణం నుండో దర్శించి, కేవలం పదాల యొక్క అర్థాన్నే యథాతథంగా గ్రహించి, కొందరు తదనుగుణంగా అభినయించడం మీరు కూడా చూసే ఉంటారు. వారి మాటల్లో, చేతల్లో, నడకలో ఒక విధమైన వింత ధోరణి అసహజంగా కనిపిస్తూ ఉంటుంది. వారి దృష్టిలో అదంతా స్థితప్రజ్ఞ వైభవం. అలాంటి విచిత్ర పోకడలు శ్రీకృష్ణునిలో, శ్రీ ఆదిశంకరాచార్యులలో కాగడా పెట్టి వెతికినా కనిపించవు. జ్ఞానం అనేది





బుద్ధికి సంబంధించిందే గాని, భౌతిక దృష్టిలో ప్రదర్శించే వేషభాషలు కాదు. వింత నడకలు కాదు. ఒయ్యారపు చూపులూ కాదు.

మాట్లాడుతూ, మాట్లాడుతూ మెల్లగా కళ్ళు మూస్తారు. అర్ధ నిమీలిత నేత్రాలతో అలా ఉండి పోతారు. మెల్లమెల్లగా కొద్ది కొద్దిగా మాట్లాడుతారు. మాటకి మాటకి మధ్య నిశ్శబ్దాన్ని పెంచుతుంటారు. అలా మాట్లాడాలి. అలాగే మాట్లాడాలి. లేకపోతే, స్థితప్రజ్ఞులం కాకుండా పోతామేమో అని వాళ్ళ భయం. వారి వెంట ఉండి మనం చూడాలే గాని, ఆకలి వేసినపుడు కాలు కాలిన పిల్లుల్లాగా తిరుగుతూ గగ్గోలు పెట్టేస్తారు. ఎందుకొచ్చిన బాధ ఇదంతా? బోధ అర్థం గాక స్వయంకృతంగా తగిలించుకొనే వ్యథ కాకపోతే!

ఇలా మాట్లాడితేనే స్థితప్రజ్ఞులం అవుతామేమో అనుకుంటే, మూగవాడు జ్ఞాని అయ్యే అవకాశం లేదా? ఇలా నడిస్తేనే స్థితప్రజ్ఞులం అవుతాము అనుకుంటే, కుంటివాడు ఆత్మజ్ఞానానికి అనర్హుడా? దండధారుడైన ప్రతి సన్యాసి స్థితప్రజ్ఞుడైతే, కర్ర చేతి కొచ్చిన వృద్ధు లందరూ ***(వృద్ధోయాతి గృహీత్వా దండం)*** స్థితప్రజ్ఞ లేగా? బరువుల్ని పెంచుకుంటూ పోతే బంధాలు తొలగవు. జ్ఞానం కలిగి నపుడే బ్రతుకులో అందాలు ఆరబోసు కుంటాయి. ఆనందాలు వెల్లివిరుస్తాయి.

**భావ సుమాలు**

ఒక పొదలో మల్లెలు విరబూస్తే, అవి మనకు కనిపించక పోయినా, వాటి సౌరభాన్ని మనం ఆఘ్రాణిస్తాము. బిడ్డల వచ్చీరాని పలుకులు స్పష్టంగా లేకపోయినా, వారి ఆలోచన లేమిటో మనం పసి కట్టేస్తాము. జ్ఞానం కలిగిన వారు స్థాలీపులాక న్యాయంగా సర్వాన్ని గ్రహించేస్తారు. మనోగతాన్ని చదివేస్తారు.

***ఉదీరితోఽర్థః పశునాఽపి గృహ్యతే***
***హయాశ్చ నాగాశ్చ వహన్తి నోదితాః***
***అనుక్తమ ప్యూహతి పండితో జనః***
***పరేంగిత జ్ఞాన ఫలాహి బుద్ధయః***

మనం ఏదన్నా పలికితే, లేదా చెబితే పశువుకు అర్థ మవుతుంది. గుర్రాలు, ఏనుగులు అర్థం చేసుకొని బరువుల్ని మోస్తాయి. కాని, చెప్పని విషయాన్ని కూడా ఎవడైతే ఊహిస్తాడో వాడే పండితుడు. ఎందుకంటే, పరుల అంతరంగాన్ని అర్థం చేసుకోవడానికి మనుషులకు బుద్ధుల్ని ప్రసాదించాడు భగవంతుడు.

ఎంత అందమైన శ్లోకం! శ్లోకాలన్నీ అందం గానే ఉంటాయి. భావాలు బుద్ధికి పడితేనే బ్రతుకులు అందంగా మారుతాయి. సామాన్య విషయాలు కూడా కొందరికి అర్థం కావు. చెప్పినా తలకు ఎక్కవు. మనసుకు పట్టవు. మీరు చెప్పింది నాకు ఇలా అర్థమైంది అంటూ ఉంటారు. పశువులకు చెప్పింది చెప్పినట్లు అర్థ మవుతుంది. చాలా మంది మనుషులకు వినింది మరొక విధంగా అర్థమవుతూ ఉంటుంది.

బుద్ధిలో గంభీరత ఉండాలి. అనుపేక్ష్యత ఉండాలి (విస్మరించని సంస్కారము). సౌమనస్యము ఉండాలి. ఏవైనా, ఎవరికైనా పుట్టుకతో రావు (ప్రత్యేకతలు చర్మాంశములు కావు). ప్రయత్నిస్తే, ప్రయత్నంలో దోషం లేకపోతే, ఈ ప్రపంచంలో, ముఖ్యంగా ఆధ్యాత్మిక జీవితంలో అసాధ్యాలు అంటూ ఉండవు.

అర్జునుడు ఎంత భావస్ఫూర్తితో అర్థించాడో! లేకపోతే, పరమేశ్వరుడు సారథి స్థానాన్ని అలంకరిస్తాడా? అర్జునుని అంతరంగాన్ని అర్థం చేసుకున్న అచ్యుతుడు ఎంత అద్భుతంగా ప్రవచిస్తాడో ఈ స్థితప్రజ్ఞ వైభవంలో మనం చూస్తాం.

సాధకుడు ప్రయత్న పూర్వకంగా ఏ సాధనలను ఆచరించాలో, అవే స్థితప్రజ్ఞునిలో సహజ లక్షణాలుగా

శోభిస్తూ ఉంటాయి. ఆధ్యాత్మిక గ్రంథాలలో ఇది చాలా సహజమైన విషయం అంటారు భాష్యంలో శ్రీశంకరులు
**( సర్వత్రైవ హి అధ్యాత్మ శాస్త్రే కృతార్థ లక్షణాని యాని తాన్యేవ సాధనాని ఉపదిశ్యన్తే యత్న సాధ్యత్వాత్ ).**

**శ్రీ భగవానువాచ :**

ప్రజహాతి యదా కామా న్సర్వా న్పార్థ మనోగతాన్ ।
ఆత్మన్యే వాత్మనా తుష్టః స్థితప్రజ్ఞ స్తదోచ్యతే ॥ 55

**ప్రజహాతి-యదా-కామాన్-సర్వాన్-పార్థ-మనోగతాన్**
**ఆత్మని-ఏవ-ఆత్మనా-తుష్టః-స్థితప్రజ్ఞః-తదా-ఉచ్యతే**

| | | | |
|---|---|---|---|
| పార్థ | = అర్జునా! | ఆత్మనా | = ఆత్మ చేత |
| యదా | = ఎప్పుడు | ఆత్మని ఏవ | = ఆత్మ యందే |
| మనోగతాన్ | = మనస్సులో ఉన్న | తుష్టః | = సంతోషించిన వాడై ఉండునో |
| సర్వాన్ | = సమస్తమైన | తదా | = అప్పుడు |
| కామాన్ | = కోరికలను | స్థితప్రజ్ఞః | = నిశ్చలబుద్ధి కలవాడని |
| ప్రజహాతి | = విడిచి పెడతాడో | ఉచ్యతే | = చెప్పబడుచున్నాడు |

**భగవంతుడు చెబుతున్నాడు :**

**పార్థా! మనస్సు లోని సమస్తములైన కోరికలను విడిచిపెట్టి ఉంటాడు. తన లోనే తనతో సంతోషిస్తూ ఉంటాడు. అతడే స్థితప్రజ్ఞుడు.**

**వ్యాఖ్య**

ముముక్షువుకు ఏవి మోక్ష సాధనలో అవి జీవన్ముక్తునికి లక్షణాలు. స్థితప్రజ్ఞుని లక్షణ మేమి? అని అర్జునుడు అడిగిన మొదటి ప్రశ్నకు గీతాచార్యుడు ఇలా సమాధానం చెబుతున్నాడు. మనస్సు లోని సమస్త కోరికలను సంపూర్ణముగా విడిచిపెట్టిన వాడు, తన ఆనందానికి తన మీదే ఆధారపడి ఉండేవాడు స్థితప్రజ్ఞుడు.

దేనిని ఈ ప్రపంచంలో మనం ఆశించినా, అది సుఖము అని కాదు మనం దానిని వెంబడించేది, సుఖ కారణమని. మనం సుఖకారణ మని భావించింది సుఖం కాదు అని తెలిసి నపుడు, ఆ క్షణం నుండే దానిని ఆశించడం మానేస్తాము.

సుఖం ఎక్కడ ఉంటుందో, అక్కడ సంతోషం ఉంటుంది. తృప్తి ఉంటుంది. సుఖాలు మనకు తెలియనివి కావు. మనం సంతోషంగా ఉన్న సమయాలు జీవితంలో లేక పోలేదు. తృప్తి చెందిన సందర్భాలూ లేక పోలేదు. కాని, అవే గనుక సుఖ సంతోషాలు అయితే, మనల్ని అవి సదా సుఖపెట్టి ఉండాలి. కాని, అలా జరగలేదు. అందుకనే, నిరంతరం మనం సుఖాన్వేషణలో ఉన్నాం. సంతోషానికై వెంపర్లాడుతున్నాం. తృప్తి చెందాలని శ్రమిస్తున్నాం.

ఆనందం అనేది ఒక వస్తువు కాదు. ఒక ప్రదేశం కాదు. కాలము కాదు. సన్నివేశమూ కాదు. వీటిలో ఏది మనకు నిత్యతృప్తిని ప్రసాదించినా, మనం నేడు అసంతృప్తితో ఉండేవాళ్ళం కాదు.

కాఫీ చేదుగా ఉంటుంది. పంచదారను కలిపితేనే అది తియ్యగా మారుతుంది. తీపి అనేది చక్కెర ధర్మము. తీపి లేని చక్కెర ఉండదు. కాని సుఖము అనేది వస్తువు యొక్క ధర్మము కాదు. సుఖం అనేది వస్తువే





అయితే, పంచదార కాఫీని మధురంగా మార్చినట్లు, వస్తువులు మనల్ని సుఖపెట్ట గలిగి ఉండాలి. ప్రపంచంలో వస్తువు లున్నాయి. కాని, సుఖవస్తువు లేదు. వ్యక్తులు ఉండొచ్చు. వారు మనల్ని సమీపించ వచ్చు. అంతమాత్రాన సుఖం సమీపిస్తుందని, తృప్తి లభిస్తుందని అనుకోలేము. వ్యక్తులు మనకు దూరం కావచ్చు. ఆ కారణంగా సుఖం దూర మవుతుందని, తృప్తి మాయ మవుతుందని కూడా చెప్పలేము.

ఉన్నవి సుఖానికి, తృప్తికి కారణమని కొందరు అభిప్రాయ పడుతున్నారు. అలా ఉన్నవి ఒక దశలో తృప్తిని పంచలే నపుడు, పైగా అసంతృప్తికి కారణ మైనపుడు, ఇవి తృప్తికి హేతువులు కావు అని తెలిసి వాటిని త్యజిస్తున్నారు. లేనివి ఆనంద హేతువు లని అభిప్రాయపడి వాటిని పొందటానికి మరికొందరు శ్రమిస్తున్నారు. శ్రమించి వాటిని సాధించుకున్నా, అవి ఉండి తృప్తిపరచలేక పోగా జీవితంలో అసౌకర్యంగా మారినపుడు అవి అభిలషణీయాలు కావని గ్రహించి, వాటిని ఇష్టం గానో, అయిష్టం గానో విడిచి పెట్టేస్తున్నారు.

తన ఆనందానికి తానే కారణమైన మహాత్ముడు స్థితప్రజ్ఞుడు. కనుక తాను ఉన్నాడు అంటే ఆనందంగా ఉన్నాడు అని అర్థము. తాను నిత్యానందుడు కనుక, ఏదైనా తనను సమీపించ వచ్చు. అంతమాత్రాన తన ఆనందం పెరిగే దంటూ ఉండదు. తన నుండి ఏదైనా దూరం కావచ్చు. అలాగని, తన తృప్తి దూరమయ్యేదీ ఉండదు. అతడే స్థితప్రజ్ఞుడు.

**కామము - కామి**

కోరికలు ఉండాలి. అలా ఉన్న కోరికలు తీరాలి. అప్పుడే మనకు సుఖం. ఇది సాధారణంగా అందరి అభిప్రాయం. ప్రస్తుతం మనం సుఖంగా లేము కనుక కోరికలను తీర్చుకొని తృప్తి చెందాలి అనుకుంటాం. అలాగే కోరికలను తీర్చుకుంటున్నాం. కోరిక లైతే తీరుతున్నాయి కాని, తృప్తి కలగడం లేదు.

స్థితప్రజ్ఞుడు సమస్తమైన కోరికలను విడిచి పెట్టేశాడు. కాని, తృప్తిగా ఉన్నాడు. ఆనందంగా ఉన్నాడు. దేనినీ ఆశించకుండా, దేనిపై ఆధార పడకుండా తనలో తాను తృప్తి చెంది ఉన్నాడు. ఇది స్థితప్రజ్ఞుని వైభవము.

కోరికలు మనస్సు నుండే కదుల్తాయి. మనస్సు ఉంటేనే కోరికలు ఉంటాయి. గాఢనిద్రలో మనస్సు లేదు. అందుకనే, కోరికలు కూడా లేవు. మరి, స్థితప్రజ్ఞుడు మనస్సు లోని సమస్తమైన కోరికలను చక్కగా విడిచి పెట్టేశాడు కదా! **( సర్వాన్ కామాన్ మనోగతాన్ ప్రజహాతి )**. మరి అతనికి మనస్సు ఉందా, లేదా?

స్థితప్రజ్ఞుడు కూడా జీవించి ఉన్నంత వరకు కర్మలను ఆచరిస్తూనే ఉంటాడు. స్నానం చేస్తాడు. భోజనం చేస్తాడు. నిద్ర పోతాడు. వెనుక శబ్దమైతే తిరిగి చూస్తాడు. ఇవన్నీ కర్మలే. మనస్సు లేకపోతే ఇవన్నీ ఎలా చేస్తాడు? మనస్సు ఉంది. కాకపోతే, కోరికలు లేని మనస్సు ఉంది.

అంటే, ఇక స్థితప్రజ్ఞుని మనస్సులో కోరికలు కదిలే అవకాశమే లేదా? ఎందుకు లేదు? స్థితప్రజ్ఞులైన వారిని బాగా పరిశీలించి అర్థం చేసుకుంటే, స్థితప్రజ్ఞత్వం సిద్ధించిన తరువాత కూడా వారిలో కోరికలు ఉన్నట్లు తెలుస్తూ ఉంది.

స్థితప్రజ్ఞత్వం సిద్ధించిన తరువాతే రమణమహర్షి 'ఉపదేశసారం' రచించారు. వ్రాయాలి అనే కోరిక లేకపోతే ఎలా వ్రాయగలిగారు? మొదట ఆ గ్రంథాన్ని తమిళంలో రచించారు. ఆ తరువాత, ఆయనే ఆ పుస్తకాన్ని తెలుగు లోకి, సంస్కృతం లోకి అనువాదం చేశారు. అభిలాషే లేకపోతే ఇవన్నీ ఎలా జరుగుతాయి?

చెప్పాలి అనే కోరిక లేకపోతే, శ్రీకృష్ణుడు గీతను బోధించే వాడా? వ్రాయాలి అనే వాంఛ లేకపోతే, శ్రీశంకరులు గీతాభాష్యం రచించే వారా? ఇవన్నీ చూస్తూ ఉంటే, స్థితప్రజ్ఞులైన వారు కోరికలను సమూలంగా విడిచి పెట్టినట్లు గోచరించడం లేదు.

సిద్ధిని పొందగానే కోరికలు పోవు. పోవలసిన అవసరం కూడా లేదు. ప్రజ్ఞ స్థిరంగా ఉన్నవాడు జ్ఞాని (స్థితప్రజ్ఞు). జ్ఞాని దేహంతో జీవించే ఉన్నాడు. ప్రారబ్ధాన్ని మోస్తూ దేహం కొనసాగుతూనే ఉంది. దేహ అవసరాలు తీరుతున్నాయి. మనస్సు లేకుండా అవసరాలు ఎలా తీరుతాయి? ఆలోచనలను కదిలించకుండా అవసరాలను తీర్చుకొనేది ఎలా? ఆలోచనలు కదిలే టప్పుడు కోరికలు తలెత్తవా? తప్పక తలెత్తుతాయి.

సాధకులకు కోరికలు మనస్సులో కదిలినట్లే, సిద్ధ పురుషులకు కూడా కోరికలు కదుల్తాయి. కదుల్తాయి కనుకనే, మనస్సులో పుట్టిన సమస్త కోరికలను విడిచి పెడుతున్నాడు అని చెప్పడం జరిగింది. కోరికలే లేకపోతే, విడిచిపెట్టే దేముంటుంది?

**బంధమా? అందమా?**

జ్ఞాని మనస్సులో కోరికలు పుడుతాయి. అది మనోధర్మము. మనస్సులో కలిగిన కోరికలను జ్ఞాని విడిచి పెడుతున్నాడు. ఈ కోరికలు మనోగతాలు. అంటే మనస్సులో ప్రవేశించినవి అని అర్థం. ఈ విషయాన్ని అవధానంతో అర్థం చేసుకోవాలి.

ఒక అందమైన వస్తువును జ్ఞానం లేనివాడు చూస్తాడు. అలాగే కళ్ళున్నాయి కనుక స్థితప్రజ్ఞుడు కూడా చూస్తాడు. అందమైనది కనుక, పొందాలనే అభిలాష కలగడం మనస్సుకు సహజం. ఇద్దరికీ మనస్సు ఉంది. అందమైనది కనుక ఇద్దరి మనస్సులలో అభిలాష పుడుతుంది. కోరిక కలుగుతుంది. అవివేకి దానిని పొందాలని, పొంది సుఖించాలని దాని వెంట పడతాడు. స్థితప్రజ్ఞుడు దానిని చూస్తాడు. మనస్సులో కోరిక కదుల్తుంది. ఆ అందము ఎలా అవాంఛనీయమో, ఎలా సుఖ హేతువు కాదో తనకు తెలుసు కనుక, చేయి జారిపోయి వస్తువు క్రింద పడిపోయినట్లు, స్థితప్రజ్ఞుని మనస్సు నుండి కోరిక జారి పోతుంది. ఇదే తేడా. చాలా పెద్ద తేడా.

స్థితప్రజ్ఞునికి కోరికలు కలగక పోవడం అనేది లేదు. మనస్సు లోకి విషయాలు ప్రవేశించినట్లే, కోరికలు కూడా ప్రవేశిస్తాయి. కనుకనే ఆచార్యుల వారు ***మనోగతాన్*** అనే మాటకు ***మనసి ప్రవిష్టాన్, హృది ప్రవిష్టాన్*** అని అర్థం చెప్పారు. అంటే, మనస్సులో ప్రవేశించిన కోరికలు, హృదయంలో ప్రవేశించిన కోరికలు అని అర్థం. కోరికలైతే ప్రవేశించడం జరుగుతూ ఉంది. ప్రవేశించిన కోరికలను గుర్తించి, వాటిని వెంటనే త్యజించడం కూడా జరుగుతూ ఉంది. అయితే ఆ విడిచిపెట్టడం కూడా మామూలుగా విడిచి పెట్టడం కాదు. పూర్తిగా విడిచి పెట్టడం అని అర్థము. అందుకనే గీతాచార్యుడు ***జహాతి*** అని సరిపెట్టకుండా, ఉపసర్గను చేర్చి, ***ప్రజహాతి*** అన్నాడు. ***ప్రకర్షేణ జహాతి, పరిత్యజతి***, అంటే పూర్తిగా విడిచి పెట్టడం అని అర్థం.

***జహాతి*** అంటే త్యజించడం. మనం అవసరం లేదని ఈ క్షణంలో త్యజించిన వాటిని రేపు మళ్ళీ అవసరాలుగా భావించి అభిలషిస్తూ ఉంటాం. అంటే విడిచి పెట్టినవి మళ్ళీ తిరిగి వస్తుంటాయి అని అర్థము. ***ప్రజహాతి*** అంటే, ఇక మళ్ళీ అగుపించవు అని అర్థం.

బంధ హేతువులైన కోరికలు మనస్సులో స్ఫురించ గానే స్థితప్రజ్ఞుడు వెంటనే వాటిని రాల్చేస్తాడు. బంధమును కలిగించనివి, లోక కళ్యాణానికి ఉపకరించేవి అయినపుడు వాటిని ఆదర్శంగా ఆచరిస్తాడు. కృతార్థుడైన వ్యక్తిని కర్మలు ఏం చేయగలవు? సంగత్వం లేని కర్మలలో బంధ మెక్కడుంది? అంతా అందమే. ఇది అర్థం కాకపోవడం చేత, జ్ఞానులను కూడా సమాజం గుర్తించలేక పోతోంది.

దేనిని బట్టి జ్ఞానిని గుర్తించాలి? జ్ఞానాన్ని బట్టే గుర్తించాలి. అంతేగాని, మరొక దానిని బట్టి కాదు. జ్ఞాని కర్మలు చెయ్యొచ్చు. చేయకుండా ఉండొచ్చు. సమాజానికి ఏదీ చేయడం లేదు కనుక అతడు జ్ఞాని కాదు అనడం అజ్ఞానానికి నిదర్శనం. జ్ఞాని సమాజాన్ని ఎలా ఆశీర్వదిస్తాడో అజ్ఞానికి అర్థం కాదు.





అలాగే, జ్ఞాని విశేషంగా కర్మలు చెయ్యొచ్చు. అంతమాత్రాన, అతని జ్ఞానాన్ని సంశయించ కూడదు. జ్ఞాని కర్మలు చేస్తే సమాజానికి అదృష్టం. జ్ఞాని ఏ కర్మలు చేయకుండా ఒకచోట కూర్చున్నా, అది సమాజానికి ఆశీర్వాదం.

ఆలయంలో భగవంతుడు మూలవిరాట్టుగా ప్రతిష్ఠింపబడి ఉంటాడు. ఆలయం లోని మూర్తి అచలం. ధ్రువం. ఆ భగవంతుడే ఉత్సవాల సమయంలో ఉత్సవమూర్తిగా ఊరేగుతూ వస్తాడు. ఆ రెండు మూర్తులలో భగవంతుడు కాని దెవరు? రెండు రూపాలు ఒక స్వరూపానివే. రెండు మూర్తులూ ఆరాధ్యములే. ఆలయం లోని మూర్తిని మనం వెళ్ళి దర్శించి అర్చిస్తాం. తానే మన వద్దకు ప్రేమతో కదిలి వచ్చిన ఉత్సవమూర్తిని ఆరాధించి ఆనందిస్తాం.

కదలకుండా ఉన్నా, కదిలి ఊరేగినా, రెండు మూర్తులలో దర్శన మిచ్చేది భగవంతుడే. కర్మలు ఆచరించినా, ఆచరించక పోయినా, స్థితప్రజ్ఞుడు జ్ఞానియే. చేసినా, చేయక పోయినా అతడు అకర్తే. కర్త ఉంటేనే కోరికలు బంధిస్తాయి. కర్త లేకుండా కదిలే కమనీయ కోరికలే స్థితప్రజ్ఞునిలో ఉంటాయి. బంధహేతువులైన కోరికలు ఆ పవిత్రాత్ముని అంతఃకరణలో కదలవు. ఎందుకని? అతడు ఆనంద స్వరూపుడు. నిత్య తృప్తిలో ఓలలాడే వాడు. తన స్వరూపమైన ఆనందంలో తానుగా ఆనందించే వాడు. కోరిక లన్నీ తీరిపోయిన ఆప్తకాముడు. ఆత్మవిదుడు.

**యో వేద నిహితం గుహాయాం పరమే వ్యోమన్ । సోఽ శ్నుతే సర్వాన్కామా న్సహ । బ్రహ్మణా విపశ్చితేతి ।**

ఎవడు బుద్ధిగుహ లోని శ్రేష్ఠమైన హృదయాకాశంలో నిగూఢంగా ఉన్న ఆత్మను తెలుసుకొను చున్నాడో, అట్టివాడు బ్రహ్మాత్మ స్వరూపముతో పాటు సమస్త మైన కోర్కెలను ఒకేసారి అనుభవించిన వాడు అగుచున్నాడు అని బ్రహ్మవిదుని పూర్ణత్వ శోభను దివ్యంగా వర్ణించింది తైత్తిరీయ శ్రుతి.

**ఆఖ్యాయిక**

యమునాతీరంలో ఆచార్యుడైన గురుగోవిందుడు ఆసీనుడై ఉన్నాడు. ప్రవహించే యమునా నది పరవళ్ళను తిలకిస్తూ, ఎగసిపడే అలల సౌందర్యాన్ని వీక్షిస్తూ కూర్చొని ఉన్నాడు. కోటీశ్వరుడైన రఘునాథు డనే శిష్యుడొకడు అక్కడికి వచ్చి గురువుకు నమస్కరించాడు.

గురుదేవా! నేడు నా పుట్టిన రోజు. మీ ఆశీస్సులను అర్థిస్తున్నాను. నా సమర్పణను స్వీకరించి అనుగ్రహించండి అని రెండు బంగారు కడియాలను గురుగోవిందునికి సమర్పించాడు.

గురుగోవిందుడు వాటిని స్వీకరించి, అందులో ఒక దానిని కుడిచేతి బొటన వ్రేలుకు తగిలించుకొని, సుదర్శన చక్రం లాగా త్రిప్పుతూ ఉన్నాడు. అది కాస్త పట్టు తప్పి, ప్రవహించే యమునా జలాలలో పడి పోయింది.

అయ్యో! పడిపోయిందా! ఫరవా లేదు, గురుదేవా! నాకు ఈతలో కూడా గొప్ప ప్రావీణ్య ముంది. కాకపోతే, మీ చేతి నుండి జారిపోయిన ఆ స్వర్ణ కంకణము నదిలో ఏ వైపు పడిందో నేను చూడలేదు. మీరు చూసి ఉంటారు. తమరు చెబితే, నేను నది లోకి దూకి, తిరిగి ఆ కంకణాన్ని తెచ్చిపెట్టగలను అన్నాడు.

ఆ మాటలు విని, శిష్యుడు రఘునాథుని ప్రియంగా వీక్షించి, తన చేతిలో ఉన్న రెండవ కడియాన్ని పట్టుకొని, 'అదిగో - అక్కడ' అని దానిని కూడా నీళ్ళ ల్లోకి విసిరేశాడు గురుగోవిందుడు. అంతే!

**సమీచీనత్వ బుద్ధి**

మనస్సులో కదిలే సమస్త మైన కోరికలను త్యజించిన వాడు, తన ఆనందానికి తానే కారణమైన మహాత్ముడు స్థితప్రజ్ఞుడు. నిత్యతృప్తుడు. నిరాశ్రయుడు. పరమార్థ దర్శనం అనే అమృత రసం ప్రాప్తించడం చేత, ఇది చాలు - అన్యములైనవి ఏవీ అవసరం లేదు అనే స్థిరమైన సంకల్పం కలవాడు స్థితప్రజ్ఞుడు. ***(పరమార్థ దర్శనామృత రసలాభేన అన్యస్మాత్ అలం ప్రత్యయవాన్ స్థితప్రజ్ఞః)***.

స్థితప్రజ్ఞుడు కోరికలను విడిచి పెట్టేశాడు. అలాగని కోరికలను విడిచి పెట్టేసిన ప్రతి వ్యక్తీ స్థితప్రజ్ఞుడు అవుతాడా? పూర్ణత్వం లేనివాడు కోరికలను కూడా పడేసుకుంటే, దుఃఖభాగుల కోవలో చేరుతాడేమో గాని స్థితప్రజ్ఞుడు కాలేడు. నిరాశ వేరు, నిర్వేదం వేరు అని ఇప్పటికే మనం తెలుసుకొని ఉన్నాం.

స్థితప్రజ్ఞుడు తృప్తి చెంది ఉన్నాడు కనుక దేనినీ వాంఛించడు ***(న కించిత్ వాంఛతి)***. అసంతృప్తితో అల్లాడే వ్యక్తి కోరికలను కూడా విడిచి పెడితే, ఇక తృప్తి చెందే ప్రయత్నం కూడా చేయకుండా, నిరాశావాదిగా, నిర్భాగ్యుడిగా నిలిచి పోతాడు.

తృప్తిగా భోంచేసిన వాడు, 'నేను తినలేనండి - నాకు వద్దండి' అని చెప్పడం వేరు. ఎవరి మీదనో అలిగి, లేదా మరెవరి మీదనో ద్వేషంతో 'నేను తినలేనండి - నాకు వద్దండి' అని అంటే, అలా అనిన వ్యక్తి తృప్తిగా ఉన్నాడని అర్థమా?

ముముక్షువులు కోరికలకు దూరం కాలేరు. అలాగని, కోరికల్ని ఆవిష్కరిస్తూ ఊరేగితే, చివరికి ఆవేదనే మిగుల్తుంది. కోరికలు సాధకులకు సహజం. బంధ హేతువులైన కోరికలు స్థితప్రజ్ఞుని మనస్సు నుండి పాదరసం లాగా జారిపోతే, సాధకులైన వారు ప్రయత్న పూర్వకంగా వాటిని దూరం చేసుకోవాలి. ప్రగతి హేతువులైన కోరికల్ని కదిలించుకుంటూ పోవాలి. పతన హేతువులైన వాటిని పరిత్యజించాలి. వాటి లోని దోషాలను దర్శించ గలిగితే అవి క్రమేపి దూరమై పోతాయి. కనుక, నిత్యానిత్య వస్తు వివేక జ్ఞానంతో సమీచీనత్వ బుద్ధిని సాధకులు తయారు చేసుకోవాలి.

'సమీచీనము' అంటే అర్హ మైనది, తగినది అని అర్థం. అట్టి దానిని గుర్తించే బుద్ధిని 'సమీచీనత్వ బుద్ధి' అంటారు. కోరిక కదలి నపుడు ఇది తగినదా, కాదా అనేది వివేకంతో విశదీకరించుకొని, ఆ తరువాత ***యోగః కర్మసు కౌశలమ్*** అని మనం చర్చించిన విషయాన్ని హృదయంలో ఉంచుకొని, అహంకారం లేకుండా ఈశ్వరార్పణ బుద్ధితో కర్మను ఆచరించాలి. అలా నైవేద్యంగా సమర్పించిన కర్మకు ఫలం వచ్చినపుడు, ***సమత్వం యోగ ఉచ్యతే*** అని మనం అర్థం చేసుకున్న విషయాన్ని స్మృతికి తెచ్చుకొని, ప్రసాద బుద్ధితో ఫలమును అందుకోవాలి.

ఈ విధమైన నిష్కామ కర్మయోగం వల్ల, బంధహేతువు లైన కర్మలు దూర మవుతాయి. బంధమును సృష్టించని సత్కర్మలు చిత్తశుద్ధికి తోడ్పడుతాయి. ఒక దశలో కోరికలు వాటంతటవే సమూలంగా దూరమై పోతాయి. ఆత్మానందము అనుభూతిగా భాసిస్తుంది. అంతవరకు ముముక్షువు కోరికలను సాంతం విడువ లేడు. విడువ కూడదు కూడా.

ఏ కోరికలు స్థితప్రజ్ఞునికి ఆభరణాలుగా, అలంకరణలుగా శోభిస్తున్నాయో, అట్టి సద్భావ జనిత కోరికలను ముముక్షువులు ప్రయత్న పూర్వకంగా కదిలించి సాధనలు ఆచరించాలి. సాధకుని స్థాయిలో కోరిక ఆశీర్వాదమే గాని, అవరోధం కాదు. కాకపోతే, అవి సకామమా, నిష్కామమా అనేది సాధకుడే బేరీజు వేసుకోవాలి. అంతేగాని, తొందరపడి కోరికలే ఉండ కూడదు అనే నిర్ణయానికి రాకూడదు.





**ఆఖ్యాయిక**

మహాభారతంలో ఒక చిన్న కథ. భీష్ముని వద్ద ధర్మరాజు ధర్మ ప్రసంగాన్ని ఆలకించాడు. ఆ తరువాత, ఒకనాడు తన చుట్టూ ఉన్న బంధువులను చూచి ఒక ప్రశ్నను సంధించాడు.

ప్రతి మనిషి ప్రయత్నంతో సాధించ వలసిన పురుషార్థములు నాలుగు ఉన్నాయి అని మనకు తెలుసు. అవే ధర్మార్థ కామ మోక్షాలు. అయితే, ఈ నాల్గింటిలో ఏది శ్రేష్ఠతమము? అని ప్రశ్నించాడు ధర్మరాజు.

దేనికైనా ధర్మమే ప్రధాన మైంది. విశ్వమంతా ధర్మము నందే ప్రతిష్ఠితమై ఉంది. ధర్మానికి దూరమై ఏ పురుషార్థము ఫలించదు. కనుక, ధర్మమే శ్రేష్ఠతమము అని సమాధానం చెప్పాడు విమల నీతిజ్ఞుడైన విదురుడు.

ధర్మమును ఆచరించాలన్నా, ధర్మ కార్యాలను నిర్వహించాలన్నా, ధనము ప్రధానమై ఉంది. ఈ జగత్తు ధనం మూలం గానే ప్రకాశిస్తూ ఉంది. జగద్వైభవానికి ధనమే ప్రధానము. కనుక, భద్రతను కలిగించే అర్థమే శ్రేష్ఠతమము అని ధనంజయుడు చెప్పాడు.

తన అభిప్రాయాన్ని కూడా సర్వులూ ఆశిస్తున్నారు కనుక ధర్మరాజు తన నిర్ణయం కూడా చెప్పాడు. సర్వ మానవాళికి అంతిమ గమ్యము మోక్షమే కనుక, జనన మరణ చక్రం నుండి విడిపించి, శాశ్వతానందాన్ని ప్రసాదించే మోక్షమే శ్రేష్ఠతమ మని తన అభిప్రాయాన్ని తెలియ జేశాడు.

కాని, అందరికీ విస్మయాన్ని కలిగిస్తూ, చతుర్విధ పురుషార్థాలలో కామమే పరమ శ్రేష్ఠమని భీముడు బల్ల గుద్ది మరీ చెప్పాడు. ఏ కర్మను ఆచరించాలన్నా, ముందుగా దానిని ఆచరించాలి అనే కోరిక ఉండాలి. ధర్మ మైనా, అర్థమైనా, మోక్షమైనా, కామించకుండా సాధించే అవకాశ ముందా? **కామి కాలేని వాడు మోక్షకామి అవుతాడా?** కనుక, ఏది సాధించాలన్నా, కామం ఉన్నపుడే సాధ్యం కాబట్టి, చతుర్విధ పురుషార్థాలలో కామమే సర్వ శ్రేష్ఠ మని పలికి, భీమసేనుడు గదను పైకెత్తి భుజంపై పెట్టుకున్నాడు. అందరూ భీముణ్ణే సమర్థించారు.

కనుక ముముక్షువులు కోరికలను విడిచి పెట్టడం కాకుండా, వడగట్టి వ్యవహరించడం అలవరచు కోవాలి. అలా సోపానక్రమంగా వృద్ధి చెంది, ఆ తరువాత సమస్త కోరికలను సంపూర్ణంగా త్యజించి, ఆత్మానంద స్వరూపులై స్థితప్రజ్ఞులై శోభించాలి.

*అర్జునుడు అడిగిన **కిం ప్రభాషేత?** అనే రెండవ ప్రశ్నకు సమాధానం చెబుతున్నాడు.*

దుఃఖే ష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః ।
వీతరాగభయక్రోధః స్థితధీ ర్ముని రుచ్యతే ॥ 56

దుఃఖేషు-అనుద్విగ్నమనాః-సుఖేషు-విగతస్పృహః
వీతరాగభయక్రోధః-స్థితధీః-మునిః-ఉచ్యతే

| | | | | | |
|---|---|---|---|---|---|
| దుఃఖేషు | = | దుఃఖాలలో | వీతరాగ భయక్రోధః | = | అనురాగము, భయము, క్రోధము లేనివాడు |
| అనుద్విగ్నమనాః | = | కలత చెందని మనస్సు కలవాడు | మునిః | = | మనన శీలుడు |
| సుఖేషు | = | సుఖాలలో | స్థితధీః | = | స్థితప్రజ్ఞు డని |
| విగత స్పృహః | = | ఆసక్తి లేనివాడు | ఉచ్యతే | = | చెప్పబడతాడు |

**అతని మనస్సు కష్టాలలో కలత పడదు. సుఖాలలో తృప్తి చెందదు. అనురాగము, భయము, క్రోధము లేనివాడు. అట్టి మననశీలుడే స్థితప్రజ్ఞుడు.**

### వ్యాఖ్య

స్థితప్రజ్ఞుడు ఎలా భాషిస్తాడు ( ***కిం ప్రభాషేత ?*** ) అనే రెండవ ప్రశ్నకు యాభై అరు, యాభై ఏడవ శ్లోకాలలో సమాధానం చెబుతున్నాడు. స్థితప్రజ్ఞుడు ప్రపంచంలో ప్రాప్తించే సుఖదుఃఖాల విషయంలో ఎలా వ్యవహరిస్తాడు అనేది ఈ ప్రశ్న లోని అంతరార్థం.

దుఃఖాలలో దిగులు చెందని వాడు, సుఖాల యందు ఆసక్తి లేనివాడు, రాగము, భయము, క్రోధము లేనివాడు, స్థిరమైన బుద్ధి గల మననశీలుడు స్థితప్రజ్ఞుడు అని అభిభాషించాడు అచ్యుతుడు.

### సుఖము - దుఃఖము

ప్రపంచం ఒక్కటే. కాని, ఆ ప్రపంచం అందరినీ ఒకే విధంగా ప్రభావితం చేయడం లేదు. నిన్న ఇష్టమైన వస్తువు నేడు అయిష్టంగా ఉంది. అంటే, నిన్న సుఖాన్ని పంచిన వస్తువు నేడు సుఖాన్ని పంచే స్థితిలో లేదు అని అర్థం. అలాగే, మొన్న అయిష్టంగా ఉన్నది నేడు ఇష్టంగా కనిపిస్తోంది. మళ్ళీ రేపు ఎలా ఉంటుందో తెలియదు. ఇష్టమైన వస్తువులో సుఖం కనిపిస్తుంది. అయిష్టమైన వస్తువు దుఃఖ కారణంగా తెలుస్తూ ఉంది.

ఇంతకీ వస్తువులో సుఖ ముందా? దుఃఖ ముందా? సుఖమే ఉంది అనుకుందాం. అదే వాస్తవ మైతే, మరొక కాలంలో ఆ వస్తువు నుండే దుఃఖం ఎందుకు కలుగుతుంది? పోనీ, దుఃఖమే ఉన్నట్లు అంగీకరిద్దా మంటే, అదే వస్తువు మరొక కాలంలో సుఖాన్ని ఎలా ఇవ్వ గలుగుతుంది? ఇంతకీ వస్తువులో ఏముంది? సుఖమైతే లేదు. ఎందుకని? దుఃఖాన్ని కూడా పంచుతూ ఉంది కనుక. అంటే, దుఃఖం ఉందా? దుఃఖం కూడా లేదు. ఎందుకని? సుఖాన్ని పంచుతూ ఉంది కనుక.

ఇలా విచారిస్తూ పోతే, సుఖం ఎక్కడుంది? అనే ప్రశ్న తలెత్తుతుంది. ప్రపంచంలో లేదు అనే సమాధానం వస్తుంది. అలాగే దుఃఖం ఎక్కడుంది అని ప్రశ్నిస్తే, ప్రపంచంలో లేదు అనే సమాధానమే వస్తుంది. సుఖదుః ఖాలు ప్రపంచంలో లేనపుడు, అవి ఎక్కడున్నాయి? సుఖదుఃఖాలు ఎప్పుడైతే ప్రపంచంలో లేవో, ఈ ప్రపంచం ఉంది అని ఎవరైతే తెలుసుకుంటున్నారో, వారి లోనే ఉన్నాయి అని నిర్ధారణ అవుతూ ఉంది. ప్రపంచం ఉంది అని తెలుసుకుంటున్నది నీవే.

ప్రపంచం ఉన్నట్లు నీకు తెలుస్తూ ఉంది. నువ్వు చూస్తేనే ప్రపంచం ఉంది. నువ్వు తెలుసుకొంటూ ఉన్నావు కనుకనే ప్రపంచం ఉన్నట్లు తెలుస్తూ ఉంది. ప్రపంచానికి స్వతంత్ర మనుగడ లేదు. ప్రపంచం నీ మీద ఆధారపడి ఉంది. నువ్వు మాత్రం ఎవరి మీద ఆధార పడకుండా ఉన్నావు. స్వతఃసిద్ధంగా ఉన్నావు. నీ మీద ఆధారపడి మనుగడను సాగించే ప్రపంచం సర్వ స్వతంత్రుడ వైన నీకు సుఖాన్ని గాని దుఃఖాన్ని గాని ఎలా కలిగిస్తుంది?

సుఖదుఃఖాలు అనేవి ప్రపంచానికి సంబంధించి లేవు. కనుక, సుఖదుఃఖాలకు సంబంధించిన మన సమస్య ప్రపంచంతో ముడిపడి లేదు. మనం సుఖపడట మనేది, లేదా దుఃఖపడట మనేది ప్రపంచం మీద ఆధారపడి ఉంటే మాత్రం, మన సుఖదుఃఖాలను నిర్ణయించేది ప్రపంచమే అవుతుంది.

ప్రపంచం పరిణామశీలం. నిరంతరం మార్పు చెందుతూ ఉంటుంది. కనుక, ప్రపంచం మనిషికి సమస్య కాదు. సమస్య అనేది ఏదైనా ఉంటే, అది మనిషి మీదనే కేంద్రీకృతమై ఉంది. అలా చూచి నపుడు, సుఖదుఃఖాల సమస్య మనిషికి లేనే లేదు. ***మనిషికి మనిషే సమస్య.***

ఇంతకీ, మనిషిలో ఏముంది? సుఖముందా? దుఃఖముందా? సుఖముంది. అయితే దుఃఖం ఎలా వచ్చింది? లేదు, లేదు. దుఃఖమే ఉంది. మరైతే సుఖ మెక్కడుంది? ప్రపంచాన్ని గూర్చి విచారించి నపుడు,





సుఖదుఃఖాలు ప్రపంచంలో లేవు అనేది ఎలాగైతే అర్థమైందో, అలాగే మనల్ని గూర్చి ఆలోచించి నపుడు, సుఖదుఃఖాలు మన స్వరూపం కూడా కావు అనేది అర్థ మవుతుంది. ఏది ఏమిటో అర్థం కాకపోవడం వల్లనే సుఖదుఃఖాల బరువుతో బ్రతుకు భారంగా మారుతూ ఉంది. స్థితప్రజ్ఞుడికి తానే ఆత్మ అనే ప్రజ్ఞ స్థిరంగా ఉంది. ఆత్మ ఆనంద స్వరూపము. సుఖదుఃఖాలు మనోగతాలు. ఈ సత్యాన్ని అర్థం చేసుకున్న వాడు కనుకనే దుఃఖం వస్తే ఉద్విగ్న మనస్కుడు కాడు. సుఖం వస్తే, దాని యొక్క స్పృహ లేకుండా ఉంటాడు ( ***దుఃఖేషు అనుద్విగ్నమనాః సుఖేషు విగత స్పృహః*** ). జీవన్ముక్తులు సుఖదుఃఖాలలో మునిగిపోరు అన్నది ఉపనిషత్తు ***(జీవన్ముక్తా నమజ్జన్తి సుఖదుఃఖ రసస్థితే)***.

### రాగ భయ క్రోధాదులు

సుఖాలు ఎవరిని ఉత్సాహ పరచలేవో దుఃఖాలు వారిని కలత పెట్ట లేవు. సుఖదుఃఖాలు రెండూ మనో వికారాలే. జ్ఞాని ఆత్మస్థితమైన ప్రజ్ఞ కలవాడు కనుక సుఖదుఃఖాలలో చలనం లేకుండా ఉంటాడు.

మనకు ఎన్నైనా ఉండొచ్చు. అవన్నీ మన మనస్సులో ఉండ నవసరం లేదు. మన చుట్టూ ఎందరైనా ఉండొచ్చు. వాళ్ళందరూ మన బుద్ధిలో ఉండ నవసరం లేదు. ఏ వస్తువులు, లేదా వ్యక్తులు మనకు దగ్గరగా ఉంటే మనకు సుఖంగా ఉంటుందో, వారిపై మనకు రాగం ఉందని అర్థం. ఏ వస్తువులు లేదా వ్యక్తులు దూరంగా పోతే మనం కలత పడతామో అవన్నీ రాగ సంబంధాలు. అనురాగ బంధాలు. ఇలాంటి రాగం స్థితప్రజ్ఞునికి ఉండదు.

రాగం ఉంటే ఏమి? దాని వల్ల ఏమిటి నష్టం? ఉంచుకోవచ్చు. రాగం మనస్సులో ఉంచుకోవడం తప్పు కాదు. రాగం ఉన్న వాటిని మనస్సులో నింపుకుంటే, రేపు అవి దూరమై నపుడు కష్టం. దూరమైన వాటిని మనస్సు నుండి దూరం చేసుకో గలమా? భౌతికంగా దూరమై, భావంలో దూరం కానివి బుద్ధికి భార మవుతాయి. బ్రతుకులో బరువును పెంచుతాయి.

ఉన్నవి బాధించవు. మనస్సులో ఉన్నవే బాధిస్తాయి. బాధించే వాటిని మనస్సులో పెట్టుకొని సుఖంగా బ్రతకలేము. బాధించకుండా ఉండేదే మనస్సులో ఉండాలి. అప్పుడే సుఖశాంతులతో జీవించ గలం.

ఉండి బాధించేవి అనిత్యాలు. పోయి బాధించేవి కూడా అనిత్యాలే. ఈ విషయంలో స్థితప్రజ్ఞునికి స్థిర మైన బుద్ధి ఉంది. కనుక తాను సదా రాగము నుండి విడిపడి ఉంటాడు.

రాగవృత్తి మనస్సులో ఉంటే, ఆ తరువాత ఏదో ఒక సమయంలో మనస్సులో క్రోధవృత్తి తప్పక వచ్చి చేరుతుంది. రాగవృత్తి విఫలమైతే, ఆ తరువాత ఉద్భవించేది క్రోధవృత్తే. రాగవృత్తి లేని మనస్సులో క్రోధవృత్తి చేరదు. కనుక మననశీలుడైన స్థితప్రజ్ఞుడు రాగక్రోధాల నుండి విడిపడి ఉన్నాడు.

దేహాత్మ భావమును త్యజించిన వాడు జ్ఞాని. దేహము తాను కానందున, దేహము యొక్క క్షయ నాశాదులు అతనికి భయ కారణాలు కాలేవు. దేహం తాను కానపుడు, ఇతర దేహాలతో సంబంధాలు మిథ్యే కనుక వాటి క్షయ నాశాదులు కూడా అతనికి భయాన్ని కలిగించ లేవు.

ఆత్మజ్ఞానంలో ద్వైతం లేదు. ద్వైతము లేనపుడు భయం ఎలా కలుగుతుంది? ఉన్నది ఒక్కటే అయినపుడు, నాశ మెవరికి? ఎవరి వలన నాశము? కనుక స్థితప్రజ్ఞుడు భయము నుండి విడిపడి అభయ రూపుడై శోభిస్తున్నాడు. అద్వయుడు కనుకనే అభయరూపుడు. జ్ఞాని యొక్క అద్వయానుభూతిని ఉపనిషత్తు అందంగా వర్ణించింది. ***సర్వ మాత్మైద మాత్రాహం కిం వాంఛామి త్యజామి కిమ్?*** ఈ సమస్తమూ ఆత్మయే. ఇక నేను దేనిని ఆశిస్తాను? దేనిని త్యజిస్తాను? - ఇది జ్ఞాని యొక్క అద్వైతానుభూతి.

దుఃఖము వచ్చి నపుడు కలత చెందని, సుఖము వచ్చినపుడు ఆసక్తి కలగని సమస్థితికి గతంలో సాధకుడుగా ప్రయత్నించిన వాడు నేడు స్థితప్రజ్ఞుడై ఆ సమస్థితిని లక్షణంగా పొంది శోభిస్తున్నాడు. రాగము, క్రోధము, భయము నుండి విడి పడాలని పూర్వం ప్రయత్నం చేసేవాడు. ఇప్పుడు వాటన్నిటి నుండి విడిపడి ఆనందరూపుడై అలరారు తున్నాడు. ముముక్షువులు అయిన వారు స్థితప్రజ్ఞుని లక్షణాలను సాధనలుగా స్వీకరించి, వాటిని సాధించడానికి తీవ్రంగా యత్నించాలి.

దుఃఖాలలో కలత చెందని వాడు స్థితప్రజ్ఞుడు. సాధకుడు ఈ లక్షణానికి ప్రయత్నించాలి. దుఃఖము ఒక్కటే. కాని, ఇక్కడ **దుఃఖేషు** అని బహువచనం వాడటం జరిగింది. దుఃఖము ఒక్కటే అయినా, దుఃఖ కారణాలు మూడు విధాలుగా ఉన్నందున, దుఃఖములు అనే బహువచనాన్ని ప్రయోగించాడు. అలాగే, **సుఖేషు** అనడం కూడా.

సుఖదుఃఖాలు మూడు విధాలుగా ఉంటాయి. (1) ఆధ్యాత్మికము (2) ఆధిభౌతికము (3) ఆధి దైవికము.

జ్వరము, తలనొప్పి మొదలైన దేహ సంబంధంగా కలిగే దుఃఖాలు ఆధ్యాత్మిక దుఃఖాలు. వ్యాఘ్ర వృశ్చిక సర్పాదుల వల్ల ఏర్పడే దుఃఖాలు ఆధిభౌతికాలు. పెనుగాలి, వర్షము, ఎండ, అగ్ని, పిడుగుపాటు మొదలైన వాటి వలన కలిగే దుఃఖాలు ఆధిదైవికాలు.

పాపపుణ్యాల కారణం గానే ఈ విధమైన సుఖదుఃఖాలు కలుగుతూ ఉంటాయి. దుఃఖానుభవంలో పాపం క్షీణిస్తూ ఉంటుంది. దుఃఖాన్ని ప్రసాదంగా స్వీకరిస్తూ, దుఃఖ హేతువైన పాపాన్ని ఆచరించకుండా సాధకుడు జాగ్రత్త వహించాలి.

అలాగే ఆనంద మనేది ఆత్మ యందే లభిస్తుంది కాని, విషయాల నుండి, వ్యక్తుల నుండి రాదు అని గ్రహించి, సాధకుడు వాటి యందు రాగము లేకుండా ఉండాలి. తాను దేహము కాదని, ఆత్మయే నని సదా సంభావిస్తూ భయము నుండి విడిపడాలి. క్రోధం అనేది మనోగతం. రాగం ఫలించ నపుడు క్రోధం పడగ విప్పుతుంది. క్రోధం వల్ల ఎంతో శక్తి వ్యర్థమై పోతుందని తెలిసి, ఆ శక్తిని సాధకుడు జప ధ్యానాదులకు వినియోగించు కోవాలి.

*అర్జునుడు అడిగిన రెండవ ప్రశ్నకు (**కిం ప్రభాషేత ?**) సమాధానమును యాభై ఏడవ శ్లోకంలో కూడా కొనసాగిస్తున్నాడు.*

**యః సర్వ త్రానభిస్నేహ స్తత్త త్ప్రాప్య శుభాశుభమ్ ।**
**నాభినన్దతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥** 57

***యః-సర్వత్ర-అనభిస్నేహః-తత్-తత్-ప్రాప్య-శుభాశుభం***
***న-అభినందతి-న-ద్వేష్టి-తస్య-ప్రజ్ఞా-ప్రతిష్ఠితా***

| | | | |
|---|---|---|---|
| యః | = ఎవడు | న అభినందతి | = సంతోషింపడో |
| సర్వత్ర | = అన్నిటి యందు | న ద్వేష్టి | = ద్వేషింపడో |
| అనభిస్నేహః | = అభిస్నేహము లేనివాడై | తస్య | = అట్టివాని యొక్క |
| తత్ తత్ | = ఆయా | ప్రజ్ఞా | = జ్ఞానము |
| శుభాశుభం | = శుభాశుభాలను | ప్రతిష్ఠితా | = స్థిరమైనది. |
| ప్రాప్య | = పొంది | | |





**అతడికి దేని తోనూ అనుబంధం లేదు. శుభాన్ని పొంది సంతోషించడు. అశుభాన్ని పొంది ద్వేషించడు. అతని జ్ఞానము స్థిరమైనది.**

**వ్యాఖ్య**

***కిం ప్రభాషేత?*** హర్ష విషాదాలలో స్థితప్రజ్ఞుడు ఎలా వ్యవహరిస్తాడు? అనే రెండవ ప్రశ్నకు యాభై ఆరవ శ్లోకంలో సమాధానం చెప్పడం ప్రారంభించిన పార్థసారథి, ఆ విషయాన్ని ఈ శ్లోకంలో కూడా కొనసాగిస్తున్నాడు. 'రాగ భయక్రోధాదుల నుండి విడిపడిన వాడు' అని పూర్వ శ్లోకంలో చెప్పిన విషయాన్ని కొనసాగిస్తూ అభిస్నేహం అవరోధ మంటూ ఈ శ్లోకాన్ని ప్రారంభిస్తున్నాడు.

రాగ భయ క్రోధాదులు ఎలా ప్రతిబంధకాలో చూశాం. రాగం అంటూ ఉండాలే గాని, ఎవరు ఎంత రాగం తీస్తారో చెప్పలేము. దేనిపై మనకు రాగం ఉంటుందో, అది ఎప్పుడూ దూరం కాకూడదని ఆలోచిస్తూ ఉంటాం. అలా ఆలోచించడం తప్పు కాదు. కాని, అది దూర మయ్యేది మాత్రం వాస్తవం. కనుక, దేని వైపు మన రాగం సాగుతూ ఉంటుందో, అది ఎప్పుడు దూర మవుతుందో అనే భయం మనస్సును పట్టి పీడిస్తూనే ఉంటుంది. ఎవరు ఎప్పుడు దూరమౌతారో అనే దిగులు అంటిపెట్టుకొనే ఉంటుంది. అలాంటి పరిస్థితులకు కారణమయ్యే వ్యక్తులపై క్రోధం పుడుతుంది. ఇవన్నీ జరగకుండా ఉండాలి అంటే అభిస్నేహం లేకుండా ఉండాలి. అలా సహజం గానే ఉండగలిగే వాడు ముని. ఆ స్థితిని ప్రయత్నంతో సాధించే వాడు ముముక్షువు.

**అభిస్నేహాలు అవరోధాలు**

స్నేహము అంటే చెలిమి. అభిస్నేహము అంటే గట్టి స్నేహము. స్నేహము ఎప్పుడూ లేతగా ఉండాలి. ముదర కూడదు. స్నేహము అంటే చమురు అని కూడా అర్థము. చమురు అంటుకుంటే చాలు, దానిని వదిలించుకోవడం కష్టం. అభిస్నేహం కూడా అలాంటిదే. ఇది జ్ఞానానికి ప్రతిబంధకము. అందుకనే ముని (మననశీలుడు) అభిస్నేహం లేకుండా ఉంటాడు (***అభిస్నేహ వర్జితః***). స్థితప్రజ్ఞుడు (***యః***) అన్ని విషయాల లోను (***సర్వత్ర***) అభిస్నేహము లేకుండా ఉంటాడు అంటున్నాడు అచ్యుతుడు. దేహము, జీవితము మొదలైన విషయాలలో కూడా అభిస్నేహం లేకుండా ఉండే వాడు ముని అని శ్రీ శంకరులు భాష్యంలో అభిప్రాయ పడ్డారు (***దేహ జీవితాదిషు అపి అనభిస్నేహః***).

పూలు విరబూస్తాయి. విరబూసిన పూలు వాడి పోతాయి. దేహాలు జన్మిస్తాయి. జన్మించిన దేహాలు నశిస్తాయి. ఈ ప్రపంచంలో ఎవరు మన వారు? మన దేహమే మనది కాదు. ఈ దేహం ఎంత కాలం ఉంటుందో మనకే తెలియదు. క్షణక్షణానికి చిల్లికుండలో నీరు కారి పోయినట్లు (***భిన్న కుంభోదకవత్***) ప్రతి క్షణం దేహం నశించిపోతూ ఉంది (***ప్రతి క్షణం వినాశీ***).

మన దేహమే మనది కాకుండా పోతుంది. అలాంటప్పుడు ఈ దేహంతో సంబంధాలు కలిగిన వారిపై అభిస్నేహాన్ని పెంచుకోవడం ఎంతవరకు సమంజసం? పోయే దేహాన్ని అతిగా ప్రేమించి సాధించేది ఏమీ ఉండదు. కనుకనే, జీవిత, దేహాదుల యందు అభిస్నేహము లేకుండా ఉంటాడు స్థితప్రజ్ఞుడు.

జీవితమే ఒక స్వప్నం లాంటిది అని మునికి తెలుసు. తాత్త్వికంగా విచారించి నపుడు, నిద్ర నుండి మేల్కొన్న వానికి కల లోని వ్యక్తులు లేనివారే అయినట్లు, మననశీలునికి దారాపుత్రాదులు, బంధుమిత్రాదులు ఉన్నప్పుడు కూడా వారు లేనివారే అని తెలుసు (***విచార్యమాణే తత్త్వ దృష్ట్యా దారా పుత్రాదయో న సన్తి***). అందుకే వారిపై అభిస్నేహం లేకుండా ఉంటాడు.

ఆకాశంలో మేఘాలు ఉంటాయి. అలాగని మేఘాలతో ఆకాశానికి సంబంధం లేదు. కొండపై మేఘాలు ఊరేగు తుంటాయి. అయినా, కొండకు, మేఘాలకు సంబంధం లేదు. కలిసినట్లే కనిపిస్తాయి. అలా కనిపించి నపుడు కూడా విడిపడే ఉంటాయి. స్థితప్రజ్ఞుడు అన్నిటితో ఉంటాడు. అన్నిటి నుండి విడిపడి ఉంటాడు. స్నేహంతో ఉంటాడు. అభిస్నేహం లేకుండా ఉంటాడు. స్నేహం బంధించదు. అభిస్నేహం బంధానికి కారణ మవుతుంది.

దేహం ఉంటే నష్టం లేదు. దేహాసక్తి ఉంటే లాభం లేదు. మితిమీరిన సంబంధాలు, అతి స్నేహాలు సంతాపాన్నే కలిగిస్తాయి. ఎండమావుల్ని చూస్తే తప్పు లేదు. వాటి వెంట పరుగు లెత్తితే సుఖం మిగలదు. ఇదంతా అభిస్నేహమే అనేది గీతాచార్యుని సందేశం.

స్నేహాలు సమీపించి నపుడే స్మృతికి వస్తాయి. అభిస్నేహాలు దూరంగా ఉన్నా కలత పెడతాయి. ఎవరిపై మనకు అభిస్నేహం ఉంటుందో, వారు దూర దేశాలలో ఉన్నా, వాస్తవానికి మన మనస్సు లోనే తిష్ఠ వేసి ఉంటారు. వారి సమస్య లన్నీ మన సమస్యలుగా మిగిలి ఉంటాయి. అభిస్నేహాలు లేకపోతే, వాటి వల్ల ప్రాప్తించే శుభాశుభాలు మనపై ప్రభావాన్ని చూపలేవు. స్థితప్రజ్ఞుడు అభిస్నేహము లేనివాడు కనుక, వాటి వల్ల కలిగే ఫలితాలకు కలత చెందడు. శుభం కలిగిందని సంతసించడు. అశుభం వాటిల్లిందని దుఃఖించడు. రాగద్వేషా లకు అతీతంగా ఉంటాడు.

**శుభాశుభాలు**

విశ్వానికి చీకటి వెలుగులు తప్పవు. వ్యక్తికి శుభాశుభాలు తప్పవు. శుభం కలిగి నపుడు వ్యక్తులు పొంగిపోతూ ఉంటారు. అశుభాన్ని ద్వేషిస్తూ ఉంటారు. శుభాశుభాలు తమ ప్రభావాన్ని మనస్సుపై ఇలా చూపుతూ ఉంటాయి.

శుభాశుభాలు కలిగి నపుడు స్థితప్రజ్ఞుడు సమబుద్ధితో వ్యవహరిస్తూ ఉంటాడు. వివేకం వలన ఏర్పడిన జ్ఞానం అతనిని హర్ష విషాదాలలో స్థిరంగా, సమంగా ఉండేటట్లు చేస్తుంది.

శుభములను సుఖ కారణాలుగా, అశుభములను దుఃఖ కారణాలుగా మానవులు భావిస్తూ ఉంటారు. వాస్తవానికి ప్రపంచంలో, లేదా జీవితంలో సన్నివేశాలు జరుగుతూ ఉంటాయి. అవి అలా జరగడం వెనుక నియతి ఉంది. ధర్మా లున్నాయి. జరగ కూడనివి ఎన్నడూ జరగవు. జరిగే వాటిని ఆపాలి అనుకున్నా అవి జరిగి తీరుతాయి. ఏవి ఎలా ఉంటాయో ముందే వివేకంతో గ్రహించ గలిగితే, శుభాశుభాలు, హర్ష విషాదాల మధ్య ఊగిసలాడే పరిస్థితి తల ఎత్తదు.

శుభమైనా, అశుభమైనా, ఏది ఎందుకు జరుగుతూ ఉందో మనకు తెలియక పోవచ్చు. మన ప్రమేయం లేకుండా మన జీవితంలోకి ఏవీ ప్రవేశించవు. తెలిసో, తెలియకో తెచ్చుకున్న వాటిని తరిమితే పోవు. పోయే క్షణం వచ్చినపుడు తురిమినా నిలవవు. అవి అలా జరగడం వెనుక ధర్మముంది. దైవ హస్త ముంది.

గృహ ప్రవేశము అనేది శుభ కార్యము. బంధుమిత్రాదుల మధ్య ఒక వ్యక్తి ఆ కార్యాన్ని ఎంతో ఆనందంగా జరుపుకుంటూ ఉంటాడు. పొంగిపోతూ ఉంటాడు. ఈ లోగా ఆ ఇంట్లో అగ్ని ప్రమాదము సంభవించి తీరని నష్టం వాటిల్లుతుంది.

గృహ ప్రవేశము, అగ్ని ప్రమాదము రెండూ సంఘటనలే. నిష్కారణంగా, నిర్హేతుకంగా ఏదీ జరగ లేదు. గృహప్రవేశ కార్యంలో సంతసించిన వ్యక్తి అగ్ని ప్రమాదం జరిగి నపుడు దుఃఖిస్తాడు. కారణాలను అన్వేషిస్తూ





ద్వేషాన్ని ప్రకటిస్తాడు. దుఃఖాన్ని కలిగించే సన్నివేశం వెనుక దాగి యున్న వాస్తవాన్ని చూడలేక పోవడమే, అర్థం చేసుకోలేక పోవడమే అతని ద్వేషానికి కారణ మవుతూ ఉంది.

సూర్యోదయంలో వెలుగులు విరబూస్తాయి. దానిని శుభోదయంగా మనిషి స్వీకరిస్తాడు. సూర్యాస్తమయంలో చీకట్లు ముసురు కుంటాయి. అది అశుభమా? సూర్యాస్తమయం లేకపోతే, సూర్యోదయం ఎలా జరుగుతుంది? అవగాహన లోపించిన వారికి చీకటి అశుభము. చీకటి అనేది రాదగిందే గాని, రాకూడనిది కాదు. ఈ వాస్తవాన్ని అంగీకరిస్తూ దీపాన్ని వెలిగించి, సంధ్యలో వందనం సమర్పించ మన్నారు మన పెద్దలు.

కొన్ని సంఘటనలు ప్రియంగా ఉంటాయి. కొన్ని అప్రియంగా ఉంటాయి. శుభమైనా, అశుభమైనా వాటిని సమంగా స్వీకరించాలి. ఆందోళన లేకుండా కర్మఫలాలను అందుకో గలగాలి (**సమత్వం యోగ ఉచ్యతే**). బాధ ఉండ కూడదు. ప్రతిచర్యలు లేకుండా ప్రవర్తించాలి. అప్పుడే సమత్వం ఉన్నట్లు. వివేక ప్రజ్ఞ గల మనిషిలో ఈ సమస్థితి సహజంగా శోభిస్తూ ఉంటుంది. ముముక్షువులు అవగాహనను పెంచుకొని, ఆందోళన లేకుండా జీవించడానికి ప్రయత్నించాలి. ప్రారంభంలో ఏదైనా కష్టం గానే ఉంటుంది. కాలంలో అన్నీ సౌలభ్యాలే ఉంటాయి.

పసిబిడ్డ తడబడే అడుగులతో నడిచేందుకు చేసే ప్రయత్నం చూస్తే మనకే ఆందోళనగా ఉంటుంది. అడుగడుగుకి బిడ్డ ఎంతగానో కష్ట పడుతూ ఉంటుంది. వయస్సు పెరిగే కొద్దీ, నిలబడటం, నడవటం, పరుగులు తీయటం అన్నీ సహజంగా జరిగి పోతూ ఉంటాయి. ఈ సహజత్వము ఎక్కడ నుండో ఊడి పడలేదు. బిడ్డ అభ్యాసం లోనే సమకూరింది. ముముక్షువు లైనవారు జ్ఞాన లక్షణాలను ప్రయత్నించి సాధించుకోవాలి. సిద్ధావస్థలో అవే సహజంగా కనిపిస్తాయి.

*అర్జునుడు అడిగిన మూడవ ప్రశ్న **కిం ఆసీత?** అంటే, ఎలా కూర్చుంటాడు? శ్రోత్రాది జ్ఞానేంద్రియాలను ఎలా నియమిస్తాడు? అని అర్థం. దానికి సమాధానమే యాభై ఎనిమిదవ శ్లోకం.*

**యదా సంహరతే చాయం కూర్మోఽఙ్గానీవ సర్వశః ।**
**ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥** 58

*యదా-సంహరతే-చ-అయం-కూర్మః-అంగాని-ఇవ-సర్వశః*
*ఇంద్రియాణి-ఇంద్రియార్థేభ్యః-తస్య-ప్రజ్ఞా-ప్రతిష్ఠితా*

| | | | |
|---|---|---|---|
| యదా | = ఎప్పుడు | సర్వశః | = అన్ని వైపుల నుండి |
| అయం | = ఇతడు | సంహరతే | = వెనుకకు మరల్చునో |
| కూర్మః | = తాబేలు | తస్య | = అతని |
| అంగానీవ | = అంగముల వలెనే | ప్రజ్ఞా | = జ్ఞానము |
| ఇంద్రియార్థేభ్యః | = శబ్దాది విషయముల నుండి | ప్రతిష్ఠితా | = స్థిరమైనది |
| ఇంద్రియాణి | = ఇంద్రియములను | | |

**తాబేలు తన అంగాలను లోనికి ముడుచుకుంటుంది కదా! అలాగే స్థితప్రజ్ఞుడు తన ఇంద్రియాలను విషయాల నుండి వెనక్కి లాగేసుకుంటాడు. అతని జ్ఞానము చలించనిది.**

**వ్యాఖ్య**

మనం నివసిస్తున్న ప్రపంచం ఎవరి సొత్తూ కాదు. ఏ ఒక్కరికీ సొంతం కాదు. ఇక్కడ ఎవరైనా, దేని

కోసమైనా ప్రయత్నించ వచ్చు. ప్రయత్నించిన ప్రతి ఒక్కనికీ ప్రతిదీ దొరుకుతుందని చెప్పలేము. దొరికినా స్థిరంగా నిలుస్తుందని చెప్పలేము. ఇప్పటి వరకు మన జీవితంలో ఎన్నెన్నో దొరక బుచ్చుకున్నాం. అలాగే వాటిని జారవిడుచుకున్నాం. ఎందుకని అలా జరుగుతుంది? ముందే చెప్పాము కదా, ఏదీ మన సొత్తు కాదని.

ఇంద్రియాలు మన దేహంలో ఉన్నాయి. ఇంద్రియ విషయాలు దేశంలో, అంటే బయట ఉన్నాయి. బాహ్యం లోని విషయాలను ఇంద్రియాలు గ్రహించి మనస్సు ముందు ఉంచుతాయి. తత్ఫలితంగా ఇంద్రియాల ద్వారా మనస్సు వెళ్ళి విషయ ప్రపంచంతో సంబంధాన్ని ఏర్పరచు కుంటుంది. ద్వంద్వాలను అనుభవిస్తూ ఉంటుంది.

మనస్సు అలా ఎందుకు విషయాల వైపు పరుగులు తీస్తుంది? ఏదో లాభం ఉంది కనుకనే పోతుంది. లాభం వస్తేట ట్లైతేనే ఎవరైనా, ఏ వ్యాపారం లోకి అయినా ప్రవేశిస్తారు. ఏదీ రాదని తెలిస్తే ఎవ్వరూ ఎక్కడికీ పోరు.

ఇంతకీ ఇంద్రియ విషయాల వల్ల మనస్సు పొందే లాభ మేమిటి? ఇక్కడ ఇంకా కొత్త లోతుగా ఆలోచించ వలసి ఉంటుంది. లాభము అనేది మళ్ళీ రెండు విధాలు. వాస్తవంగా లాభం ఉండి, లాభాన్ని పొందడము ఒకటి. లాభము లేకపోయినా, లాభము ఉన్నట్లు, లాభాన్ని పొందుతున్నట్లు ఊహించుకొని తృప్తి చెందడము మరొకటి. అంటే, ఈ రెండవ విషయంలో వాస్తవంగా జరిగేది ఒకటి. మనం భావించేది మరొకటి.

ఇంద్రియ విషయాలు సుఖ హేతువులు అని అందరి అభిప్రాయం. అందుకే అందరూ ఆ వైపు పరుగులు తీస్తూ ఉంటారు. వస్తువులలో సుఖాలు ఉన్నట్లయితే, సుఖ మనేది విషయాల స్వభావమైతే, ఒకర్ని ఆకర్షించిన విషయం, లేదా వస్తువు అందరినీ ఆకర్షించగలిగి ఉండాలి.

సీతమ్మ చూచింది బంగారు జింకే అయితే అది రామలక్ష్మణుల్ని కూడా ఆకర్షించి ఉండాలి. కాని, అలా జరగలేదు. సీతమ్మ కష్టాలకు బంగారు జింక కారణమా? అది బంగారు జింక కాదు అని గ్రహించలేని సీతమ్మ బుద్ధి కారణమా? అమ్మగారి బుద్ధే కారణం. అదలా ఉంచండి. అసలు బంగారు జింక అక్కడికి రాకుండా ఉన్నట్లైతే, సీతమ్మ ఆమాయక మనస్సు దానిని కోరేది కాదు కదా? బంగారు జింక ఉంటే ఉండ నివ్వండి. కళ్ళతో చూడబట్టే కదా ప్రమాదం వాటిల్లింది! కళ్ళు చూస్తే ఏమైంది? మనస్సు కోరుకోకుండా రామలక్ష్మణుల మనస్సుల లాగా కదలకుండా ఉండి ఉంటే ఈ ఇక్కట్లు వచ్చేవి కావు కదా? ఇలా ఎన్నో ప్రశ్నలు.

ఇంద్రియాలు ప్రదర్శించక పోతే, మనస్సు ప్రకోపించదు కదా? అని కొందరు. మనస్సు స్థిరంగా ఉండ గలిగితే కిటికీల వంటి ఇంద్రియాలు కలత పెట్టవు కదా? అని మరి కొందరు. నిజం చెప్పాలంటే, ఈ రెండూ కారణం కావు. మరో విధంగా చెబితే రెండూ కారణాలే. వివేకం లోపిస్తే ఏదైనా దుఃఖానికి మార్గాన్ని సుగమం చేస్తుంది. వివేకం ఉంటే, ఏదీ బాధించదు. ఇంద్రియాల విషయంలో ఉండ వలసిన అవగాహనను యాభై ఎనిమిదవ శ్లోకం లోను, మనస్సు విషయంలో ఉండ దగిన అవగాహనను యాభై తొమ్మిదవ శ్లోకం లోను అందిస్తున్నాడు భగవంతుడు.

పార్థా! తాబేలు తన అంగాలను లోనికి ముడుచు కొనునట్లు, స్థితప్రజ్ఞుడు ఇంద్రియాలను ఇంద్రియ విషయాల నుండి మరలించి అంతర్ముఖం చేస్తున్నాడు అంటున్నాడు పార్థసారథి.

### బంగితము లేని ఇంద్రియాలు

ఇంద్రియాలను జయించిన వాడే ఆత్మ సామ్రాజ్యానికి అధినేత అవుతాడని, ఇంద్రియాలను జయించ





లేని అసమర్థతే ఇక్కట్లకు కారణం అని సాధారణంగా జనుల అభిప్రాయం పడుతూ ఉంటారు. కనుక, ఇంద్రియ విషయాల నుండి ఇంద్రియాలను ఉపసంహరించే ప్రయత్నం చేస్తూ ఉంటారు.

కొందరు హఠ యోగాది ప్రక్రియలను అనుసరిస్తూ ఇంద్రియాలను బలవంతంగా లొంగదీస్తూ ఉంటారు. ఇలాంటి మానవ ప్రయత్నాలు ఫలితాల నివ్వవు. తాత్కాలికంగా నిగ్రహించబడి, మళ్ళీ బహుద్విగుణ మరల్పు అవకాశం కొరకు ఇంద్రియాలు నిరీక్షిస్తూ ఉంటాయి. అలా కాకుండా, ఇంద్రియ విషయాల లోని దోషాన్ని మనస్సుకు పట్టిస్తే, తెలిసి ఎవరూ గోతిలో పడరు కనుక, ఇంద్రియాలు సహజం గానే నిగ్రహింప బడుతాయి. దీనినే యోగశాస్త్రంలో 'ప్రత్యాహారము' అంటారు.

ప్రపంచంలో ఎన్నో విషయాలు ఉన్నాయి. మరెన్నో వస్తువులు ఉన్నాయి. వాటన్నిటిని గూర్చి మనం ఆలోచిస్తున్నామా? ఉన్న వన్నీ మనకు తెలియవు. తెలిసిన విషయాలలో కూడా అన్నీ మనం పట్టించుకోము. ఏవి మనకు అవసరమో, వేటిపై మనకు ఆసక్తి ఉందో, వాటినే పట్టించు కుంటాము.

ఇంద్రియాలు ఉన్న వాటిని తెలియ జేస్తాయి. అంతే. నేత్రేంద్రియము ఉంది కనుక రూపాలు, రంగులు కనిపిస్తున్నాయి. శ్రోత్రేంద్రియము ఉంది కనుక శబ్దాలు వినిపిస్తున్నాయి. కళ్ళు లేని వ్యక్తికి రూపాలు లేవు, రంగులూ లేవు. అలాగే పంచ జ్ఞానేంద్రియాలు లేకపోతే ప్రపంచమే లేదు.

ప్రపంచం ఒకటి ఉంది అని మనకు తెలియడానికి ఇంద్రియాలు ప్రధాన కారణాలుగా ఉన్నాయి. నడచిపోతూ దారిలో ఒకచోట గుడిగంటలు వింటాం. అంతే. దగ్గరలో గుడి ఉంది అని గ్రహించి అక్కడికి వెళ్ళి భగవంతునికి నమస్కరిస్తాం. గాఢనిద్రలో ఉన్నా, అలారం మ్రోగ గానే నిద్ర లేచి కార్యక్రమాలను నిర్వహిస్తూ ఉంటాం. ఇదంతా వినికిడి వల్ల కలిగే ప్రయోజనం.

టెలివిజన్ కార్యక్రమాల్ని చూస్తూ అదే పనిగా రిమోట్‌తో ఛానళ్ళను మారుస్తూ ఉంటాం. ఇలా మనం ఛానళ్ళు మార్చడానికి కళ్ళు కారణమా? టెలివిజన్ లోని కార్యక్రమాల్ని కళ్ళు చూపిస్తాయి. అంతే. ఏ కార్యక్రమాన్ని చూడాలి అనే విషయాన్ని నిర్ణయించేది మనస్సే గాని కళ్ళు కాదు. అవసరమైన కార్యక్రమాల్ని చూడటం మానేసి, అనవసరమైన, ఆసక్తికరమైన కార్యక్రమాల్నే మనం బుద్ధిలేనట్లు చూస్తూ ఉంటాము.

ఈ ప్రపంచంలో కోరుకోకుండా దేన్నిటినైనా చూడవచ్చు. ఆసక్తి కలిగి ఆశించి నప్పుడే ఇక్కట్లు మొదలవుతాయి. ఆశించేది మనస్సే కాని ఇంద్రియాలు కాదు. మనస్సు నిగ్రహంలో ఉంటే, ఇంద్రియాలు చేయగలిగేది కూడా ఏమీ ఉండదు. గాఢంగా నిద్రించే వ్యక్తికి అత్తరు రాసినట్లే ఉంటుంది.

మనస్సును నిగ్రహించడాన్ని శాస్త్రంలో 'శమము' అంటారు (మనో నిగ్రహః). శమము కుదిర నప్పుడు, ఇంద్రియాలను వస్తువుల నుండి దూరం చేయడము ఒక్కటే మార్గము. అదే బాహ్యేంద్రియ నిగ్రహము. దీనిని శాస్త్రంలో 'దమము' అంటారు. గీతలో మనం ముందుకు పోయే కొద్ది దీని ప్రస్తావన అనేక చోట్ల వస్తుంది. అప్పుడు విపులంగా చర్చించుకుందాం. ఇంద్రియాలను చక్కగా ఉపసంహరించ గలిగితే (సంహరతే, సమ్యక్ ఉపసంహరతే) తాత్కాలికంగా మనస్సు నియమింప బడుతుంది. ఇలా ఉపసంహరించడం స్థితప్రజ్ఞునికి సహజంగా ఉంటుంది. తాబేలు తన అవయవాలను లోనికి ముడుచు కున్నంత సులువుగా ఉంటుంది. అదే పనిని సాధకుడు ప్రయత్నంతో పరిశ్రమించి సాధించాలి.

### తాబేలు తార్కాణము

ఇంద్రియాలను బయటకు విడిచి పెట్టడం, మడచి లోపల పెట్టుకోవడం అనేది జ్ఞానికి తాబేలు లాగా సహజంగా ఉంటుందని సోదాహరణంగా వివరిస్తున్నాడు.

భారతీయ సాహిత్యం, ముఖ్యంగా తత్త్వశాస్త్రం పశుపక్ష్యాదుల్ని, మృగకీటకాదుల్ని నిశితంగా పరిశీలించి, మానవ జీవన విధానానికి సరిపడే అంశాలను వాటి నుండి గ్రహించి, వాటి ద్వారా నైతిక, ఆధ్యాత్మిక సత్యాలను విరివిగా మానవాళికి వితరణ చేసింది.

విశ్వాసము, క్రూరత్వము, మోసం, స్నేహం, ఇంద్రియ నిగ్రహం, త్యాగం - మొదలైన గుణాలను, స్వభావాలను విపులంగా వివరించ డానికి, ఆసక్తికరంగా బోధను శ్రోత గ్రహించ డానికి, నోరు లేని ప్రాణుల్ని ఎన్నుకొని నోరారా ప్రవచించింది.

ప్రస్తుతం జ్ఞాని తన ఇంద్రియాలను నియమించే పద్ధతిని వివరించ డానికి తార్కాణంగా కూర్మానికి కుర్చీ వేశాడు శ్రీకూర్ముడు.

తాబేలు వేగంగా చరించ లేదు. మెల్లగా చరిస్తూ ఉంటుంది. ఏదైనా శబ్దం విన్నా, లేదా ఏదైనా అపాయాన్ని శంకించినా, వెంటనే తన అంగాలను వాలముతో సహా లోనికి లాగేసు కుంటుంది. దృఢమైన, దుర్భేద్యమైన కవచం లాంటి చిప్పలో ఇమిడి పోతుంది. అపాయం నుండి తప్పించు కుంటుంది.

అంగాలను సులువుగా బయటకు వదలి పెడుతుంది. అలాగే, సులువుగా లోనికి ముడుచు కుంటుంది. అంటే, ఎప్పుడు బహిర్ముఖం కావాలో, ఎప్పుడు అంతర్ముఖం కావాలో తాబేలుకు తెలుసు. కూర్మానికి భగవత్ప్రసాదంగా ఆ జ్ఞానం లభించింది. అదే స్థితప్రజ్ఞునిలో వివేక ప్రజ్ఞ వల్ల ప్రాప్తించిన మనః ప్రసాదంగా శోభిస్తోంది.

*కూర్మ మఖిలావయవముల గుదియ ముడుచు*
*మాడ్కి నే యోగి యింద్రియ మానసములఁ*
*దనర మరలించు నింద్రియార్థముల వలన*
*నాతఁ డాత్మ స్థిత ప్రజ్ఞుఁడగు మహాత్మ।*

ఇది 'సీతారామాంజనేయ సంవాదము' అనే బృహద్గ్రంథము లోని పద్యము.

తాబేలు అవయవాలను సులువుగా బయటకు వదలి పెట్టి, తిరిగి సులభంగా వెనక్కి తీసేసుకుంటుంది. మానవులు కూడా శ్రోత్రాది ఇంద్రియాలను సులువుగా బహిర్ముఖం చేస్తారు. కాని ఎందుకనో, అంత సులువుగా వెనక్కి తీసుకోలేరు.

అభిమన్యుడు వీరావేశంతో పద్మవ్యూహంలో ప్రవేశించాడు. ప్రవేశించ గలిగాడే గాని తిరిగి నిష్క్రమించలేక పోయాడు. మృత్యువాత పడ్డాడు. విచ్చలవిడిగా ఇంద్రియాలు ఇంద్రియ విషయాలతో పెనుగు లాడితే, ఆ తరువాత జీవితంలో పెనుతుఫానే ముంచు కొస్తుంది. అందుచేత ఇంద్రియ నిగ్రహము చాలా అవశ్యంగా తెలుస్తోంది.

స్వామీ! మీకు ఏ ఆహారమంటే ఇష్టం అని ఒక సాధువును ప్రశ్నిస్తే, నాయనా! నాకు ప్రత్యాహారం అంటే చాలా ఇష్టం అని చెప్పాడట. ఇంద్రియాలను ఇంద్రియ విషయాల నుండి వెనుకకు త్రిప్పడమే ప్రత్యాహారం. ఆహారం లేకపోతే మనిషి జీవించ లేడు. ప్రత్యాహారం లేకుండా సాధకునికి ఆధ్యాత్మిక జీవితం ఉండదు.

ఇంద్రియాలను నియమించి తీరాలి. అన్ని వైపుల నుండి నియమించాలి. ఏ ఒక్క ఇంద్రియాన్నో నియమిస్తే సరిపోదు. ఒక ఇంద్రియం యొక్క ప్రభావం మరొక ఇంద్రియంపై పడే ప్రమాద ముంది. అందుచేత అన్ని వైపుల నుండి *(సర్వశః)* అని చెప్పడం జరిగింది.





ఇవి చూడ కూడనివి, అవి విన కూడనివి, ఇవి తిన కూడనివి అని మునికి తెలుసు. అవి ఎలా నిరుపయోగమో వివేక బుద్ధి ఫలితంగా స్థితప్రజ్ఞునికి తెలుసు కనుక అతని ఇంద్రియాలు సహజం గానే విషయాల నుండి వెను దిరుగుతాయి. ముముక్షువులు ఈ విషయంలో తీవ్రంగా ప్రయత్నించాలి. అప్పుడే ఇంద్రియ నిగ్రహాన్ని సాధించ గలుగుతారు. అవగాహన చాలినంతగా లేనపుడు విషయాల నుండి విరమించడం అలవరచు కోవాలి. ఇంద్రియాలను విషయాలకు దూరంగా ఉంచాలి.

*ఇంద్రియాలను ఇంద్రియ విషయాలకు దూరం చేస్తే సరిపోతుందా? అంతటితో ఇంద్రియ నిగ్రహం సాధించి నట్లేనా? కానే కాదు. అది కేవలం తాత్కాలిక ఉపశమనమే. ఉపసంహారమే. పట్టు సడలిస్తే మళ్లీ పరుగులే. మరి శాశ్వతంగా ఇంద్రియాలు ఎప్పుడు నిగ్రహింప బడుతాయి? అది కూడా విందాం.*

విషయా వినివర్తన్తే నిరాహారస్య దేహినః ।
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే ॥ 59

విషయాః-వినివర్తంతే-నిరాహారస్య-దేహినః
రసవర్జం-రసః-అపి-అస్య-పరం-దృష్ట్వా-నివర్తతే

| | | | | | |
|---|---|---|---|---|---|
| నిరాహారస్య | = | ఆహారం లేని, | పరం | = | పరమాత్మను |
| దేహినః | = | జీవుడికి | దృష్ట్వా | = | చూచి |
| రసవర్జం | = | రాగాన్ని విడిచి | అస్య | = | అతని యొక్క |
| విషయాః | = | విషయములు | రసః అపి | = | రాగము కూడా |
| వినివర్తంతే | = | నివర్తిస్తాయి | నివర్తతే | = | తొలగి పోతుంది |

**విషయాలను గ్రహించని జీవునికి విషయాలు దూర మవుతున్నాయే గాని, వాటి యందు రాగము నశించడం లేదు. పరమాత్మను దర్శించ గలిగితే విషయాలతో పాటు రాగము కూడా తొలగి పోతుంది.**

**వ్యాఖ్య**

దేహానికి ఆకలిదప్పులు ఉన్నట్లే, మనస్సుకు కూడా ఆకలిదప్పులు ఉన్నాయి. అదే రాగాసక్తి. ఇంద్రియాలను నిగ్రహిస్తే, విషయాలు దూర మవుతాయి. అంతేగాని మనస్సులో ఉండే విషయాసక్తి దూరం కాదు. కేవలం ఇంద్రియాలను నియమించినంత మాత్రాన, ఆ వ్యక్తి యొక్క బుద్ధి స్థిరంగా ఉంది (స్థితధీః) అని చెప్పలేము.

### ఉపవాసం

ఇంద్రియాలను జయించాలని, ఉద్రేకాలను నియంత్రించాలని అభిప్రాయపడి కొందరు సాధకులు ఉపవాస వ్రతం పాటిస్తూ ఉంటారు. నిరాహారంగా ఉంటే ఇంద్రియాలను అరికట్ట వచ్చు అనుకుంటారు. ఇది ఉపయుక్తం కాదని ఆ తరువాత అనుభవంలో గ్రహిస్తారు. ఆహారాన్ని దూరం చేసుకో గలమే గాని ఆహారం పట్ల ఆసక్తిని దూరం చేసుకోలేము అని తెలుసు కుంటారు.

ఆహారం తీసుకోకుండా ఉంటే ఆహారానికి భౌతికంగా దూర మవుతాము. మానసికంగా చాలా దగ్గరై ఉంటాము. ఏకాదశి నాడు కొందరు ఉపవాసం ఉంటారు. వారి దృష్టి, ధ్యానము అంతా ద్వాదశి మీదే ఉంటుంది. అంటే, ద్వాదశి పారాయణం మీద కాదు. పారాయణానంతరం స్వీకరించ బోయే ప్రసాదం మీద, భోజనం మీద ఉంటుంది. ఆ భోజనం ఎలా ఉండాలి? అనే విషయచర్చ తోనే కొందరు ఏకాదశిని గడిపేస్తారు.

ఉపవాసంలో దేహం బలహీన పడుతుంది. ఇంద్రియాలన్నీ శక్తిహీనంగా ఉంటాయి. అంటే, అన్ని

ఇంద్రియాలలో బలం లేకుండా ఉంటుంది. అయితే ఇంతవరకు ఇంద్రియాలలో ఉన్న బలం ఏమైనట్లు? అన్ని ఇంద్రియాలలో ఉన్న బలం వెళ్ళి నాలుకకు అంటుకుపోయింది అని అర్థం.

**ఇంద్రియాణి జయన్త్యాశు నిరాహారా మనీషిణః**
**వర్జయిత్వాతు రసన మనసా రస్యేహి వర్ధతే॥**

ఆహారాన్ని విడిచి పెట్టిన విద్వాంసులు అన్ని ఇంద్రియాలను జయించ గలుగుతారు, ఒక్క రసనేంద్రియమును తప్ప. ఎందుచేత నంటే, నాలుక స్వవిషయంలో ఆసక్తిని పెంచుకుంటూనే ఉంటుంది అన్నది భాగవతము.

జ్వరం వస్తే ఆహారం రుచించదు. రోగి ఆహారం తీసుకోవడం మానేస్తాడు. నీరసంతో ఉంటాడు. ఇంద్రియాలన్నీ బలహీనపడి ఉంటాయి. అంతమాత్రాన అతనిలో ఆసక్తి, అభిరుచి నశించవు. జ్వరం తగ్గగానే ఏవేవి తినాలి? అని ఊహించుకుంటూనే ఉంటాడు. జ్వరం వల్ల రసనేంద్రియము పదార్థాల జోలికి పోదు. కనుక ఆ వ్యక్తికి ఆహార పదార్థాలు దూర మవుతాయి. అంతే కాని ఆహారం మీద అభిరుచి దూరం కాదు. ఇదే విషయాసక్తి. ఇదే రాగాసక్తి. రసానుభవం.

**నీరసం రసహీనం కాదు**

నిరాహారంగా ఉంటే మనిషి నీరసిస్తాడు. దేహేంద్రియాలు నీరసానికి లోనవుతాయి. కాని, మనస్సు మాత్రం రసపూర్ణం గానే ఉంటుంది. మనస్సు నీరసించదు. విషయాలు దూరమైనంత మాత్రాన విషయరసం దూరం కాదు. మనస్సు నుండి కారిపోదు. పారిపోదు.

ఆహారము అంటే కేవలం నాలుక ద్వారా లోనికి వెళ్ళే పదార్థాలు మాత్రమే అని భావించ కూడదు. **ఆహ్రియతే ఇతి ఆహారః**. ఇంద్రియాల ద్వారా మనం గ్రహించే విషయాలన్నీ ఆహారమే. నోటికి పదార్థాలు ఆహారమైతే, కంటికి రూపాలు, రంగులు ఆహారము. చెవికి శబ్దము ఆహారము. ముక్కుకు వాసన ఆహారము. చర్మానికి స్పర్శ ఆహారము. ఇంద్రియాల ద్వారా లోనికి గ్రహింపబడే బాహ్య విషయాలన్నీ ఆహారమే.

విషయాల మీద మనకు ఉండే ఆసక్తే రాగం. ఆ రాగాన్నే రసం అంటారు. 'రస' శబ్దానికి ఆసక్తి, అభిరుచి, రాగం అనే అర్థాలు ప్రముఖంగా ఉన్నాయి (***రస శబ్దో రాగే ప్రసిద్ధః***). విషయ సంబంధమైన రాగమే రసము. విషయాలను నిరాకరిస్తే (***ఆహారం***) విషయాలు దూర మౌతాయే గాని, విషయ సంబంధమైన ఆసక్తి, రసం మనస్సులో ఊరుతూనే ఉంటుంది. నిరాహారం వల్ల దేహేంద్రియాలు నీరసించ వచ్చు నేమో గాని మనస్సు మాత్రం రసహీనం కాదు.

విషయాలను నివారించినా విషయాసక్తి మనస్సులో గాఢంగా ఉంటుంది కనుక, మళ్ళీ విషయానుభవం లోకి ప్రవేశించే అవకాశం ఉంటుంది. ఆహారాన్ని పునః విశేషంగా స్వీకరించే పరిస్థితిని ఎవ్వరూ కాదన లేరు.

దేహ బరువు తగ్గాలని నేడు చాలా మంది అనేక చికిత్సలను చేయించు కుంటున్నారు. పురాతన చికిత్సలతో పాటు అధునాతన సాంకేతిక చికిత్సలు కూడా వ్యవహారం లోకి వచ్చి ఉన్నాయి. చికిత్స సమయంలో ఆరు కిలోల బరువు తగ్గితే, చికిత్సానంతరం కొంత కాలానికి మళ్ళీ తొమ్మిది కిలోలు పెరిగి ఉంటారు. అభిరుచులు బరువును అధికం చేస్తాయి.

వృక్ష శాఖల్ని ఖండించి నంత మాత్రాన వృక్షం నశించదు. మూలం గాఢంగా లోతుకు చొచ్చుకు పోయి ఉంటుంది కనుక మళ్ళీ చెట్టు చిగురిస్తూనే ఉంటుంది. నూతనమైన శాఖలు పుట్టుకొస్తూనే ఉంటాయి. మూలాన్ని వ్రేళ్ళతో సహా పెకలించి వేస్తే, చెట్టు మళ్ళీ చిగురించదు. ఇంద్రియ నిగ్రహం కూడా అంతే.





విషయాలను దూరం చేస్తే ఉపయోగం ఉండదు. విషయాసక్తి మనస్సులో దూరం కావాలి. దేహేంద్రియ మనస్సులు అన్నీ నిగ్రహింప బడాలి.

నిరాహారంగా ఉండి, ఇంద్రియాలను విషయాలకు దూరంగా ఉంచడాన్ని 'నిగ్రహం' అంటారు. మనస్సులో రాగ రసం ఇంకిపోయి, మనస్సు స్వాధీన మైతే, దానిని 'సంయమనం' అంటారు. నిగ్రహము ఒక్కటే సరిపోదు. సంయమనం కూడా కావాలి. అప్పుడే బుద్ధి స్థిరంగా ఉంటుంది. అదెప్పుడు సాధ్యం? పరమాత్మ దర్శనం జరిగి నపుడే.

**పరధ్యానము - పరమాత్మ దర్శనం**

పరమాత్మ ఆనంద స్వరూపుడు (***రసోవైసః***). రస స్వరూపుడైన పరమాత్మ దర్శనం లభించే వరకు మనసులో రసం నివర్తించదు. రాగాసక్తి దూరం కాదు. విషయాభిలాష అదృశ్యం కాదు. పరతత్త్వాన్ని ఎప్పుడైతే దర్శించడం జరుగుతుందో, అప్పుడే విషయాలతో పాటు విషయ రసం కూడా లేకుండా పోతుంది.

ఒకడు పరధ్యానంలో ఉంటే, అతని ముందు ఏది ఉన్నా ఉన్నట్లు అతనికి తెలియదు. పిలిచినా అతనికి వినిపించదు. శబ్దం అతని చెవిలో పడుతుందే గాని మనస్సులో దూరదు. ఇంద్రియాలకు విషయాలు అందుతున్నా, పరధ్యానంలో ఉన్నవాడు ఆ విషయాల పట్ల స్పృహ లేకుండా ఉంటాడు. కారణం ఏమిటి? ఎదురుగానే ఉన్న వస్తువు కనిపించక పోవడానికి కారణము, అతని మనస్సులో మరేదో వస్తువు ఉండటమే. మనస్సులో గోచరించే వస్తువును చూడటంలో నిమగ్నమై ఉన్నాడు కనుక కళ్ళ ఎదుట ఉన్న వస్తువును గుర్తించ లేక పోతాడు.

ఆంతర్యంలో పరమాత్మను దర్శించే వాడు బాహ్య విషయాల యందు స్పృహ లేనివాడై ఉంటాడు. ఆసక్తి లేనివాడై ఉంటాడు. రస పిపాస లేనివాడై ఉంటాడు. బయట ఎన్నయినా ఉండనీ. ఉన్న వన్నీ లోనున్న దాని కన్నా వేరు కానపుడు, ప్రత్యేకించి దేని మీద ఆసక్తి ఉంటుంది? పరమాత్మ దర్శనం కలగనంత వరకే ప్రపంచంపై ఆసక్తి ఉంటుంది. పరమాత్మ దర్శనంతో విషయ పిపాసలు పండుటాకుల్లా రాలిపోతాయి. ఇదంతా పరమాత్మ దర్శన వైభవము.

అత్యవసరమైన పని మీద వెళ్తున్న తల్లి, బిడ్డను ఇంటిలో విడిచి పెట్టి జాగ్రత్తగా చూస్తూ ఉండమని కుటుంబీకులకు చెప్పి వెళ్తుంది. ఉదయం వెళ్ళిన తల్లి మధ్యాహ్నమైనా ఇంకా ఇంటికి రాలేదు. తల్లి కోసం బిడ్డ ఏడవడం మొదలు పెడుతుంది. పండ్లు, మిఠాయిలు బిడ్డ చేతిలో పెట్టి, అమ్మ వచ్చేస్తుందని ఓదార్చుతూనే ఉన్నారు కుటుంబము లోని వారు.

సాయంత్రం అయింది. అమ్మ ఇంకా రాలేదు. బిడ్డ ఏడుపు తారాస్థాయికి చేరుకుంది. బొమ్మలు కూడా కొనిపెడతారు. అవన్నీ బిడ్డ చేతిలో పట్టుకొని ఉంటుందే గాని, ఏడుపు మాత్రం మానదు. బొమ్మలు చేతి లోనే ఉంటాయి. కళ్ళల్లో నీళ్ళు కారుతూనే ఉంటాయి.

ఈ లోగా అమ్మ వచ్చేస్తుంది. తల్లిని చూడగానే బిడ్డ చేతి లోని బొమ్మల్ని పడేస్తుంది. చుట్టూ ఉన్న మిఠాయిలను, పండ్లను ప్రక్కకు నెట్టేస్తుంది. ఏడుపు ఆపేస్తుంది. ఒక్క ఉదుటన లేచి, అమ్మా! అంటూ ముందుకు ఉరికి అమ్మను పట్టేసుకుంటుంది. చుట్టేసుకుంటుంది. అంతే. ఆ క్షణంలో, బిడ్డకు తల్లి తప్ప మరేదీ కనిపించదు. వినిపించదు. తినాలని అనిపించదు. సమస్త విషయాలు మనస్సు నుండి అప్రయత్నంగా జారిపోతాయి (***పరం దృష్ట్వా. అస్య రసః అపి నివర్తతే***). పరమాత్మ జ్ఞానం కలిగి, పరమేశ్వరుని దర్శించిన మనస్సులో విషయాసక్తి ఇలాగే అదృశ్య మవుతుంది. రాగం ఆగుతుంది. రసం నీరసిస్తుంది.

పల్లవి : సత్యమైన నీ కథ విని
వినిపించింది మనసు మనవిని // సత్యమైన //
అనుపల్లవి : పోయిన పున్నమి వచ్చిందని
చేసిన పున్నెము తెచ్చిందని // సత్యమైన //
చరణము : చెప్పుటకేమి లేదని
చెప్పక మన సుండలేదని
మనసారా నీ కిచ్చిన మనసు
ఏనాటికి తిరిగి రాదని
నిన్నాదలి ఎన్నడు రాలేదని // సత్యమైన //

అని రాగాన్ని త్రుంచి పడేసింది చైతన్య గీతిక.

ఈ విధమైన పరమాత్మ దర్శనం, సమ్యగ్దర్శనం స్థితప్రజ్ఞునికి జరిగిపోయింది కనుక, ఆ మహాత్ముని స్థిరమైన వివేక బుద్ధిని ***( స్థితధీః )*** విషయాలు చేరలేవు. విషయాసక్తి చలింప చేయలేదు. ముముక్షువులైన సాధకులు మాత్రం అట్టి పరమార్థ దర్శన ప్రజ్ఞను సిద్ధం చేసుకోవాలి అని అభిభాషించారు భాష్యంలో ఆచార్యులు ***( తస్మాత్ సమ్యగ్దర్శనాత్మికాయాః ప్రజ్ఞాయాః స్థైర్యం కర్తవ్యమ్ ఇతి అభిప్రాయః ).***

*పరమాత్మ దర్శన రూపమైన ప్రజ్ఞను స్థిరంగా నిలబెట్టుకోవాలి. అలా భావించే వారు ముందుగా తమ ఇంద్రియాలను వశపరచుకోవాలి. శుద్ధి చేసుకోవాలి. ఇంద్రియాలు వశపడక పోతే మాత్రం, ఆ తరువాత పెనుతుఫాను చెలరేగే ప్రమాదం ఉంటుంది. ఎలాగంటే .....*

యతతో హ్యపి కౌన్తేయ పురుషస్య విపశ్చితః ।
ఇన్ద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః ॥ 60

***యతతః-హి-అపి-కౌంతేయ-పురుషస్య-విపశ్చితః***
***ఇంద్రియాణి-ప్రమాథీని-హరంతి-ప్రసభం-మనః***

| | | | |
|---|---|---|---|
| కౌంతేయ | = అర్జునా! | ప్రమాథీని | = ప్రమాదమును కలిగించు |
| యతతః అపి | = ప్రయత్నము చేయుచున్న | ఇంద్రియాణి | = ఇంద్రియములు |
| విపశ్చితః | = విద్వాంసుడైన | ప్రసభం | = బలాత్కారముగా |
| పురుషస్య | = పురుషుని యొక్క | హరంతి హి | = హరించు చున్నవి గదా! |
| మనః | = మనస్సును | | |

**కౌన్తేయా! విద్వాంసుడైన పురుషుడు తీవ్రంగా ప్రయత్నిస్తూనే ఉంటాడు. అయినా, క్షోభను కలిగించే ఇంద్రియాలు మనస్సును బలవంతంగా లాక్కొని పోతుంటాయి.**

### వ్యాఖ్య

స్థితప్రజ్ఞునికి ఇంద్రియ మనస్సులు లోబడి ఉంటాయి. ఆత్మయే తాను అనే జ్ఞానం ఉండటం చేత, తన ఆనందానికి మరొక దానిపై ఆధారపడి ఉండే ప్రసక్తి లేనందున, మననశీలుని బుద్ధి స్థిరంగా ఉంటుంది. గాలి లేని చోట దీపం లాగా నిశ్చలంగా, పవిత్రంగా ఉంటుంది. అతనికి ప్రపంచము విస్మృతప్రాయం.

వివేక ప్రజ్ఞ స్థిరంగా ఉండే దివ్యాత్ముడు స్థితప్రజ్ఞుడు. వివేకము లేని వాడు అవిపశ్చితుడు. అవివేకి. అట్టి





వానిని ఇంద్రియాలు కుదిపేస్తాయి. మనస్సు ముంచేస్తుంది. పెనుగాలికి ఊగే అరటిచెట్టు లాగా అతడు సుఖదుఃఖాల మధ్య ఊగిపోతూ ఉంటాడు.

అటు స్థితప్రజ్ఞుడు కాలేక, ఇటు అవివేకిగా ఉండలేక, స్థిరమైన వివేక బుద్ధి కొరకు ప్రయత్నించే సాధకుడు విపశ్చితుడు **(మేధావినః)**. వివేకము కలిగిన విద్వాంసుడు ఇంద్రియాలను నిగ్రహించి, మనస్సును నియమించి, స్థిరమైన వివేక ప్రజ్ఞ కొరకు ప్రయత్నిస్తూ ఉంటాడు. అట్టి విపశ్చితుడైన సాధకుని విషయం ఈ శ్లోకంలో చర్చింప బడుతూ ఉంది.

పండితుడైన సాధకుడు ఇంద్రియాలను నియమించడానికి తీవ్రంగా ప్రయత్నిస్తూ ఉంటాడు ***( యతతః ప్రయత్నం కుర్వతః )***. అయినా బాధించే స్వభావం కలిగిన ఇంద్రియాలు ***( ప్రమాథీని, ప్రమథన శీలాని )*** వివేకం కలిగి ప్రయత్నం చేయుచున్న సాధకుని మనస్సును క్షోభకు గురి చేస్తాయి ***( విక్షోభయన్తి, ఆకులీ కుర్వన్తి )***. తీవ్రంగా బాధించి క్షోభింప చేస్తాయి. వ్యాకులచిత్తుణ్ణి చేస్తాయి. అలా కలత చెందిన విద్వాంసుని మనస్సును క్షణాల్లో బలాత్కారంగా ***( ప్రసభం )*** హరించి వేస్తాయి ***( హరన్తి )***.

ఇంద్రియాలు చాలా బలం కలిగి ఉంటాయి. దేహాన్ని చలింప చేస్తాయి. మనస్సును చంచలంగా మారుస్తాయి. కొన్ని విషయాలలో మనస్సు మగతలో పడి ఉన్నా, ఇంద్రియాలు మనస్సును తట్టి లేపుతాయి. పట్టి ఊపుతాయి. అందుకనే, విద్వాంసుడు అయినప్పటికి ***( విపశ్చితః అపి )***, తీవ్రంగా ప్రయత్నం చేయుచున్నప్పటికి ***( యతతః అపి )***, ఇంద్రియాలు మనస్సును బలవంతంగా ఇంద్రియ విషయాల వైపు ఈడుస్తున్నాయి అంటున్నాడు.

### చిత్తం దుర్బలం - యత్నం విఫలం

దీపం లేని ఇంటి లోనే దొంగలు పడతారు. దీపం ఒక్కటే సరిపోదు. ధీరత్వం కూడా ఉండాలి. బాహ్యంలో ఏమి జరుగుతూ ఉందో తెలుసుకోవడానికి దీపం ఉండాలి. దేని నైనా ఎదుర్కొని సాధించే ధీశక్తి వ్యక్తి ఆంతర్యంలో ఉండాలి. అప్పుడే దొంగల్ని నివారించినట్లు ఇంద్రియాలను నిగ్రహించే అవకాశం ఉంటుంది.

ఇంద్రియ విషయాల లోని దోషాన్ని చూడటము వివేకము. అట్టి వివేకము కలవాడే విపశ్చితుడు. విద్వాంసుడు. కేవలం వివేకముతో ఆదమరచి ఉండటం లేదు. నిగ్రహించే ప్రయత్నము తీవ్రం గానే చేస్తున్నాడు. అయినప్పటికి ఇంద్రియాలు అతని బుద్ధిని హరించి వేస్తున్నాయి.

ప్రయత్నమే చేయకుండా కూర్చునే అవివేకి బుద్ధిని ఇంద్రియాలు సులభంగా ఈడ్చి పడేస్తాయి. ఇక్కడ విపశ్చితుడు తీవ్రంగా ప్రయత్నిస్తున్నాడు కనుక ఇంద్రియాలు బలప్రయోగంతో అతడిని లొంగదీసు కుంటున్నాయి ***( హరన్తి ప్రసభం )***.

బలవాన్ ఇంద్రియ గ్రామో విద్వాంసం అపికర్షతి

బలవంతుడైన విద్వాంసుని కూడా ఇంద్రియాల గుంపు లొంగదీసు కుంటుంది అన్నాడు వ్యాసమహర్షి.

ప్రయత్నశీలుడైన వివేకి యొక్క మనస్సును కూడా ఇంద్రియాలు బలవంతంగా హరించ డానికి కారణ మేమిటి? అనే ప్రశ్న ఎవరిలో నైనా ఉదయిస్తుంది. దానికి కారణం ఒక్కటే. అతడు విద్వాంసుడే కావచ్చు. ప్రయత్నశీలుడే కావచ్చు. అతడి మనస్సులో ఇంకా రాగాసక్తి మిగిలి ఉంది *(రసం)*. ఈ రసమే బుద్ధిని నీరసం చేస్తుంది. లేని శక్తిని ఇంద్రియాలకు చేకూర్చుతుంది.

చిన్న నిప్పురవ్వ అరణ్యాల్ని దహించే శక్తిని కలిగి ఉన్నట్లు, మనస్సు లోని విషయాసక్తి ఇంద్రియాలకు

మితిమీరిన బలాన్ని సమకూర్చుతుంది. ఇక్కడే చాలా మంది పండితులు పరాభవానికి లోనయ్యారు. మహాశక్తిమంతులు, మాననీయులైన వారు కూడా దారి తప్పి దగా పడ్డారు.

మహర్షి విశ్వామిత్రుడు ఎప్పుడు ఎక్కడ విఫలమైనా, ఆ దురదృష్టం వెనుక విషమించిన రసమే ఉండింది. మహాభారతంలో అయితే, మహాత్ములు, మహావీరులు అయిన భీష్మద్రోణాదులలో కూడా ఈ రాగం శ్రుతి తప్పినప్పుడే వారు ఆపదల పాలైనట్లు, ఆవేదనలకు లోనైనట్లు తెలుస్తుంది.

మనస్సులో విషయాసక్తి మిగిలి ఉంటే చాలు. ఇంద్రియాలు విజృంభించి మనస్సును లొంగదీసుకుంటాయి. బుద్ధి దుర్బల మైనపుడే సాధకుడి యత్నాలు విఫల మౌతాయి.

*మనస్సు ఇంద్రియాల వశం కాకుండా సాధకులు జాగ్రత్త పడాలి. మనస్సును నిగ్రహించి, వివేక ప్రజ్ఞను స్థిరపరచుకోవాలి అని భావించే ముముక్షువులు, ముందుగా ఇంద్రియాల విషయంలో జాగ్రత్త పడాలి. దానికి ఏమి చేయాలి?*

**తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః ।**
**వశే హి యస్యేన్ద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥** 61

*తాని-సర్వాణి-సంయమ్య-యుక్తః-ఆసీత-మత్పరః*
*వశే-హి-యస్య-ఇంద్రియాణి-తస్య-ప్రజ్ఞా-ప్రతిష్ఠితా*

| | | | |
|---|---|---|---|
| తాని సర్వాణి | = ఆ ఇంద్రియాల నన్నిటిని | ఇంద్రియాణి | = ఇంద్రియములు |
| సంయమ్య | = చక్కగా వశ పరచుకొని | వశే | = స్వాధీనము నందున్నవో |
| యుక్తః | = యోగయుక్తుడు | తస్య | = అతని యొక్క |
| మత్పరః | = నా యందు ప్రియము గలవాడై | ప్రజ్ఞా | = బుద్ధి |
| ఆసీత | = కూర్చోవాలి | ప్రతిష్ఠితా హి | = స్థిరమైనది కదా |
| యస్య | = ఎవని యొక్క | | |

**ఇంద్రియాల నన్నిటినీ నిగ్రహించాలి. ఏకాగ్ర బుద్ధి కలిగి ఉండాలి. నా యందే ఆసక్తి గలవాడై ఉండాలి. ఇంద్రియాలు ఎవరికి వశ పడతాయో వారి జ్ఞానమే సుస్థిర మైనది.**

### వ్యాఖ్య

ఇంద్రియాలను వశపరచుకో వలసిన అవసరం జీవితంలో ప్రధాన మైనది అని తెలియని వాడు పామరుడు. అవసరాన్ని గుర్తించడమే గాక, ఆ మార్గంలో నిరంతరం శ్రమించే వాడు పండితుడు. ఇంద్రియాలను సంపూర్ణంగా నియమించడమే గాక, ఇంద్రియ విషయ స్పృహ కూడా లేని పవిత్రాత్ముడు జ్ఞాని. అతడే స్థితప్రజ్ఞుడు. అతని వివేక బుద్ధి సదా స్థిరంగా ఉంటుంది.

సాధ్యం తెలియాలి. సాధన నడవాలి. అప్పుడే సిద్ధి. ఇంద్రియ విషయాలు దోషపూరితాలు. ఇంద్రియాలు మోసపూరితాలు. ఇవి బ్రతుకును పాడు చేసేందుకే ఉన్నాయి. చెడిపే వాటిని నమ్ముకోవడం, చెడిపోగానే దుఃఖించడం మనిషికి పరిపాటి అయింది.

ఇంద్రియ విషయాలు సుఖ హేతువులు కావు. ఇంద్రియ విషయాలలో ప్రతి సుఖం వెనుక దుఃఖమే దాగి ఉంటుంది. ఇది పూర్ణంగా అర్థమైతే, ఇక ఆ తరువాత, ఆ వైపుకు పొమ్మన్నా మనస్సు పోదు. రాగద్వేషాలు స్థిరమైనవి కావు. కనుక, వాటి కార్యాలైన సుఖదుఃఖాలు కూడా స్థిరమైనవి కావు. స్థిరం కానివి ఎప్పుడో ఒకప్పుడు





మనల్ని వదలి పోయేవే. వాటంతటవి మనల్ని విడిచిపెట్టి పోతే మనకు దుఃఖం కలుగుతుంది. వాటి లోని దోషాలను గుర్తించి మనమే వాటిని వదిలేస్తే, సుఖం దూరం కాకుండా ఉంటుంది.

మనస్సును నియమించాలి అంటే ఇంద్రియాలను నిగ్రహించి తీరాలి అని పూర్వ శ్లోకాల లోనే గ్రహించాము. కనుక, వివేక ప్రజ్ఞలో కూడుకున్న స్థితప్రజ్ఞుడు ఇంద్రియాల నన్నిటినీ వశపరచుకొని (**సంయమ్య వశీకరణం కృత్వా**) ఉంటాడు. 'మత్పరుడై కూర్చుని ఉంటాడు' (**ఆసీత మత్పరః**) అంటున్నాడు భగవంతుడు.

'మత్పరుడు' అంటే వాసుదేవుడే సర్వభూతాంతరాత్ము డని తెలిసి, తాను వాసుదేవుని కన్నా అన్యము కాదని భావించుట (**మత్పరః అహం వాసుదేవః సర్వ ప్రత్యగాత్మా పరః యస్య సః మత్పరః**) అని అర్థం. కూర్చుని ఉంటాడు అంటే నిర్వ్యాపారుడై ఉంటాడు అని అర్థం. అదే **ఆసీత** - 'కూర్చునుట' అనే పదానికి అర్థం (**న అన్యః తస్మాత్ ఇతి ఆసీత ఇత్యర్థః**). వాసుదేవుని కంటె తాను అన్యుడు కానట్లు భావించడం చేత, మననశీలుని ఇంద్రియాలు వశ పడతాయి. అప్పుడు అతని ప్రజ్ఞ స్థిరంగా ఉంటుంది (**అభ్యాస బలాత్ తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా**).

### కృషి ఉండాలి - కృప కావాలి

ఇంద్రియాలను నిగ్రహించడంలో మన కృషి పూర్ణంగా ఉండాలి. విషయాల యందు ఆసక్తి, పరమాత్మ యందు ఉదాసీనత ఉన్నంత కాలం మనం ఈ ప్రపంచంలో అశక్తులము గానే ఉంటాము. అశక్తతతో ఏమి సాధిస్తాము? కనుక, అలాంటి సమయాలలో దృష్టిని పరమాత్మ వైపు మళ్ళించాలి.

ఈ శ్లోకంలో ప్రధానంగా రెండే విషయాలు ప్రస్తావించ బడ్డాయి. ఒకటి సాధన దశ. రెండవది సాధ్య స్థితి. ఇంద్రియాల నన్నిటినీ సంయమనం చేయాలి అనేది సాధన. మత్పరుడై ఉండాలి అనేది సాధ్య సంబంధం. సాధన విషయంలో నిషేధాన్ని నిర్దేశించాడు. సాధ్య విషయంలో విధిని నిర్ణయించాడు.

దృశ్య నివారితము సాధన కాగా, మనస్సు ఆత్మ పరమై ఉండటం సాధ్య సంబంధ మవుతూ ఉంది. విషయాలన్నీ దృశ్యాలే. దృశ్యాల నుండి ఇంద్రియ మనస్సులను నిగ్రహించి, ప్రత్యగాత్మ రూపుడైన వాసుదేవుని యందు చిత్తమును స్థిరంగా ఉంచితే, అట్టి వాని వివేక ప్రజ్ఞ స్థిరంగా ఉంటుంది (**తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా**).

**దృశ్య వారితం చిత్త మాత్మనః**
**చిత్త్వ దర్శనం తత్త్వ దర్శనం ॥**

దృశ్య పదార్థముల నుండి వారింప బడిన చిత్తము ఆత్మ దర్శనము చేయడమే సత్య దర్శన మని శ్రీరమణ మహర్షి 'ఉపదేశసారం'లో రచించారు. దృశ్యము నుండి ప్రయత్న పూర్వకంగా విడిపడాలి. ఆ తరువాత పరమాత్మ యందు మనస్సును లగ్నం చేయాలి (**తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః**).

పతంజలి మహర్షి తన యోగ దర్శనములో మొదట **యోగః చిత్తవృత్తి నిరోధః** అని యోగాన్ని నిర్వచించారు. మనస్సు లోని ఆలోచనలను అరికట్ట మని ఆదేశించారు. మనస్సులో ఏ ఆలోచనలు ఉంటాయి? విషయాలకు సంబంధించిన ఆలోచనలే ఉంటాయి. కనుక దృశ్యము నుండి విడిపడ మని ప్రబోధించారు.

విషయాల నుండి విరమించిన ఇంద్రియ మనస్సులు, అలాగే ఖాళీగా ఉంటే, తిరిగి విషయాలలో దూరిపోయే ప్రమాదం ఉంటుంది కనుక, అలా నియమించిన ఇంద్రియ మనస్సులను స్వరూపంలో సంధానం చేయమన్నారు (**తదా ద్రష్టుః స్వరూపేఽవస్థానమ్**).

ఈ రెండూ సులభం కావు. విషయాల నుండి ఇంద్రియాలను నియమిస్తే గాని, మనస్సును ఆత్మ యందు లగ్నం చెయ్యలేము. మనస్సు ఆత్మ యందు లగ్నమైతే గాని రాగాసక్తి (రసం) ఉపశమించదు. ఏం చెయ్యాలి?

ఒక రాజు గారికి ఒక్కడే కుమారుడు. అతడికి వివాహం కావాలి. ఆ పిల్లవాడు ఉన్మాది. పిల్ల నివ్వమని ఎవరిని అడిగినా, 'పిచ్చి కుదిరితే పిల్లను ఇస్తాము' అంటారు. వైద్యుల్ని సంప్రదిస్తే, 'పెళ్ళి చేస్తేనే పిచ్చి కుదురుతుంది. ఇది ఒక విచిత్రమైన పిచ్చి' అంటారు. ఏం చేయాలి?

ప్రస్తుతం ఈ శ్లోకంలో మన పరిస్థితి కూడా అదే. ఇంద్రియాలను నిగ్రహించే ప్రయత్నా లన్నీ మనం చేయాలి. మన ప్రయత్నం విఫలమై నపుడు పరమేశ్వరుని వైపు మరలాలి. అనుగ్రహాన్ని అర్థించాలి. ప్రార్థించాలి.

ఇదేమిటి? సాంఖ్య ప్రకరణంలో స్థితప్రజ్ఞుడైన జ్ఞాని లక్షణాలను వర్ణిస్తూ, తటాలున భక్తికి తెర లేపడ మేమిటి? వ్యాఖ్యానాన్ని భక్తి పరంగా త్రిప్పడ మేమిటి? అని మీకు ఆశ్చర్యం కలగవచ్చు. ఇక్కడ, నేను పని కట్టుకొని వ్యాఖ్యను త్రిప్పడం లేదు. పరమేశ్వరుని వాక్యాల లోని మర్మాన్ని విప్పి చెప్పే ప్రయత్నం చేస్తున్నాను. అంతే.

ఇంద్రియాలను నియమించడంలో మన కృషి ఫలించ నపుడు పరమేశ్వరుని కృపను అర్థించడం తప్ప మరో గత్యంతరము లేదు. అందుకే గీతాచార్యుడు **మత్పరః** అన్నాడు. లేకపోతే **తత్పరః** అని ఉండేవా డేమో! జ్ఞానమార్గంలో స్థితుడైన స్థితప్రజ్ఞుడు ఎలాగూ ఆత్మపరుడై ఉంటాడు. అదే మార్గంలో చరించే సన్యాసులు కూడా ఆత్మపరం గానే ఆలోచిస్తారు. కాని, సాధకుడైన కర్మయోగికి సగుణబ్రహ్మను ఆశ్రయించడం కన్నా మరొక మార్గమే లేదు. పైగా, అదే సరియైన మార్గము కూడా. ఆచార్యుల భాష్యంలో కూడా ఈ సత్యం తొంగి చూస్తుంది.

అర్జునా! మత్పరుడవు కావాలి. అంటే, ఆత్మ పరాయణుడవు కావాలి. లేదా, భగవత్పరాయణుడ వైనా కావాలి. ఈశ్వరుడు పరబ్రహ్మము కన్నా వేరుగా లేడు కదా! **మత్పరః** అనే అంశాన్ని వ్యాఖ్యానించే టప్పుడు 'అందరిలో ప్రత్యగాత్మ రూపంగా ఉన్న వాసుదేవుడు' అని ఆచార్యులు ప్రసాదించిన వ్యాఖ్యానాన్ని మీకు అందించాను. ప్రత్యేకించి 'వాసుదేవ' శబ్దాన్ని ప్రయోగించడంలో ఆచార్యుల వారి అభిప్రాయం సుస్పష్టంగా ఉంది. భక్తి లేకుండా కర్మయోగం లేదు. ఈ భక్తియే పరిపక్వత చెంది నపుడు స్వస్వరూపాను సంధానం అవుతుంది.

సాధకుడు విద్వాంసుడు, ప్రయత్నశీలుడు అయినప్పటికీ, ప్రలోభ పెట్టే ఇంద్రియాలు అతని మనస్సును బలాత్కారంగా హరించుకొని పోతాయి అని పూర్వ శ్లోకం లోనే చూశాము కదా! హరించుకొని పోయేవారు, అపహరించుకొని పోయేవారు ఎవరు? చోరులు కాదా? మరి, అలాంటి దొంగల నుండి ఎలా తప్పించుకోవాలి? ప్రభువును ఆశ్రయించాలి. మరో మార్గం లేనే లేదు.

ప్రభువు మన వాడైతే చాలు. చోరుల్ని ఎదిరించడంలో మనం అశక్తులం అయినా, శక్తిమంతుడైన ప్రభువు మనకు అండగా ఉంటాడు కనుక తన అధికారాన్ని వినియోగించి చోరుల్ని శిక్షించగలడు. మనల్ని రక్షించగలడు.

మనం ప్రభువుకు సంబంధించిన వాళ్ళం అని తెలిస్తే, అసలు చోరులే మన చెంతకు రాక పోవచ్చు. ఏది ఎలా ఉన్నా, చోరుల బారి నుండి మనం బయట పడేది మాత్రం తథ్యం. అలాగే, పరమేశ్వరునికి మనం భక్తులం కాగలిగితే, ఏ మాలిన్యము మనల్ని అంటదు. ఏ అశుభమూ మనకు జరగదు.

**న వాసుదేవ భక్తానాం అశుభం విద్యతే క్వచిత్**

భగవంతుడైన వాసుదేవునికి భక్తులైన వారికి ఏ అశుభమూ జరగదు.





తరించే మార్గాలు ఎన్నో ఉన్నా, కొందరు దారి తప్పి అంతరించి పోతూ ఉంటారు. రాగాసక్తిని పోగొట్టుకోలేక పోవడం, ఇంద్రియ విషయాలలో చరించడం, రమించడం, తద్వారా బ్రతుకుని పాడు చేసుకోవడం - ఇలా ఎందరినో మనం చూస్తూ ఉంటాము. వారి పతనం ఎలా ప్రారంభ మవుతుందో, పర్యవసానం ఎలా ఉంటుందో, తరువాత రెండు శ్లోకాలలో సహేతుకంగా వివరిస్తున్నాడు.

ధ్యాయతో విషయా న్పుంసః సఙ్గస్తే షూపజాయతే ।
సఙ్గా త్సఞ్జాయతే కామః కామాత్క్రోధో௨భిజాయతే ॥ 62

*ధ్యాయతః-విషయాన్-పుంసః-సంగః-తేషు-ఉపజాయతే*

*సంగాత్-సంజాయతే-కామః-కామాత్-క్రోధః-అభిజాయతే*

| | | | | | |
|---|---|---|---|---|---|
| విషయాన్ | = | విషయములను | సంగాత్ | = | ఆసక్తి వలన |
| ధ్యాయతః | = | ధ్యానిస్తున్న | కామః | = | కోరిక |
| పుంసః | = | పురుషునకు | సంజాయతే | = | పుడుతుంది |
| తేషు | = | వాని యందు | కామాత్ | = | కోరిక వలన |
| సంగః | = | ఆసక్తి | క్రోధః | = | క్రోధము |
| ఉపజాయతే | = | పుడుతుంది | అభిజాయతే | = | పుడుతుంది |

విషయాలను అదే పనిగ చింతిస్తూ ఉంటే వాటి యందు మనిషికి ఆసక్తి ఏర్పడుతుంది. ఆసక్తి వల్ల కామం పుడుతుంది. కామం వల్ల క్రోధం జనిస్తుంది.

క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహా త్స్మృతివిభ్రమః ।
స్మృతిభ్రంశా ద్బుద్ధినాశో బుద్ధినాశా త్ప్రణశ్యతి ॥ 63

*క్రోధాత్-భవతి-సమ్మోహః-సమ్మోహాత్-స్మృతివిభ్రమః*

*స్మృతిభ్రంశాత్-బుద్ధినాశః-బుద్ధినాశాత్-ప్రణశ్యతి*

| | | | | | |
|---|---|---|---|---|---|
| క్రోధాత్ | = | క్రోధము వలన | స్మృతిభ్రంశాత్ | = | విస్మృతి వలన |
| సమ్మోహః | = | మోహము | బుద్ధి నాశః | = | బుద్ధినాశమును |
| భవతి | = | కలుగుతుంది | బుద్ధినాశాత్ | = | బుద్ధినాశము వలన |
| సమ్మోహాత్ | = | మోహము వలన | ప్రణశ్యతి | = | సర్వనాశన మగును |
| స్మృతివిభ్రమః | = | విస్మృతియు | | | |

క్రోధం వల్ల మోహము కలుగుతుంది. మోహము వల్ల స్మృతి నశిస్తుంది. స్మృతి నశించడం వల్ల బుద్ధి నశిస్తుంది. బుద్ధి నాశం వల్ల మనిషే నశించి పోతాడు.

### వ్యాఖ్య

ఎవరు ఎలా జీవించినా, జీవించాలి అనుకున్నా, ఈ ప్రపంచంలో అడ్డుచెప్పే వారు ఎవ్వరూ లేరు. ఎవరి స్వేచ్ఛ వారిది. ఎవరి జీవితం వారిది. కాని, ఎవరి బ్రతుకును వారే పాడు చేసుకొనుటకు సిద్ధపడితే మాత్రం బాగు చేసే శక్తి కూడా ఎవ్వరికీ లేదు.

జీవితంలో కొన్నిటిని మనం ఆశిస్తాం. అవి కావాలి అని గాఢంగా అభిలషిస్తాం. అలాగే కొందరిని ప్రేమిస్తాం. వాళ్ళు సదా మనతో కలిసి ఉండాలి అనుకుంటాం. ఇవన్నీ మన ఆశలు. కోరికలు.

మనం ఆశించే విషయాలన్నీ మనకు అర్థ మయ్యాయి అని కాదు. మనం ప్రేమించే వ్యక్తుల యొక్క స్వరూప స్వభావాలు మనకు అవగత మయ్యాయని కాదు. వాళ్ళ అంతర్యాలు మనకు అంతు పట్టాయనీ కాదు.

వాస్తవం చెప్పాలంటే, మనకు ఇతరులతో ఉండే సంబంధాలన్నీ వాళ్ళ స్వభావాలను మనం ఆపోశనం పట్టడం వల్ల ఏర్పడ్డవి కావు. వాళ్ళ విషయంలో మనకు ఉండే అభిప్రాయాలను బట్టి వారితో మన సంబంధాలు ముడిపడి ఉన్నాయి. విషయాలు కూడా అంతే.

అందుకనే, మనతో సంబంధం కలిగిన విషయాలు ఊహించని విధంగా వికృత రూపాన్ని దాల్చి నపుడు, 'ఇవి ఇలా అవుతాయని నేను అనుకోలేదు' అని వాపోతాం. అలాగే, మనం ప్రేమించే వ్యక్తులు, మనతో సంబంధాలు కలిగి ఉన్న మనుషులు మన అభిప్రాయాలకు భిన్నంగా ప్రవర్తించి నపుడు మనం బాధపడతాం. వ్యధ చెందుతాం. 'వీళ్ళు ఇలాంటి వాళ్ళని నేను ఊహించ లేదు' అంటూ క్రోధాన్ని వెళ్ళ గక్కుతాం. వాళ్ళు ఎలాంటి వాళ్ళో మనం అర్థం చేసుకోవాలి గాని, మనం ఊహించినట్లు వాళ్ళు ప్రవర్తించడం సాధ్యపడే విషయం కాదు. సత్యం ఏదో మనస్సుకు పట్టాలి గాని, మనస్సు లోని చెత్తంతా సత్యం అయ్యే అవకాశం లేదు.

ప్రపంచం లోని విషయాలలో సుఖాలను అన్వేషించడం ఎండమావులలో దప్పిక తీర్చుకొనే ప్రయత్నం వంటిదని ఇప్పటికే మనకు అర్థమైపోయింది. వ్యక్తుల సంబంధాల వల్ల బ్రతుకులో అందాలు, ఆనందాలు విలసిల్లుతా యని గాలిమేడలు కట్టుకోవడం, ఇసుక నుండి చమురును పిండే ప్రయత్నమే నని కూడా తేలిపోయింది. అయినా, కొందరు రాగాసక్తిని పెంచుకొంటూ, విషయ సంగత్వాన్ని సృష్టించుకుంటూ ఎలా పతన మౌతున్నారో అవరోహణ క్రమంలో ఈ రెండు శ్లోకాలలో వివరిస్తున్నారు.

**అష్టాంగ అయోగము**

సాధకుడు ప్రగతిని సాధించి, పరిపూర్ణతను పొందడానికి యోగమార్గంలో యమ నియమాది అష్టాంగ యోగాన్ని ఆరోహణ క్రమంలో పతంజలి మహర్షి బోధించాడు. విషయ ప్రపంచంలో రాగాసక్తితో జీవించి పతన మయ్యే వ్యక్తి యొక్క దుర్గతిని అవరోహణ క్రమంలో గీతాచార్యుడు వివరిస్తూ, అలా వినాశాన్ని పొంద వద్దని హెచ్చరిస్తున్నాడు. ఇది యోగమార్గం కాదు. అయోగ మార్గం. అందుకే దీనిని 'అష్టాంగ అయోగం'గా పిలుస్తోంది చైతన్య భగవద్గీత. అవి (1) విషయ ధ్యానము (2) సంగత్వము (3) కామం (4) క్రోధం (5) సమ్మోహము (6) స్మృతిభ్రంశము (7) బుద్ధినాశము (8) సర్వనాశము. ఇది అష్టాంగ అయోగంలో అవరోహణ క్రమం.

వీటిని గూర్చి తెలుసుకునే ముందు ఒక ప్రశ్నకు సమాధానం చెప్పుకొని ముందుకు పోదాం. హఠయోగాది సాధనల్ని ఆచరించే కొందరు ప్రశ్నిస్తూ ఉంటారు. 'ఏమండీ! ఇంద్రియాలను నిగ్రహిస్తే సరిపోతుంది కదా! మనస్సులో ఏముంటే ఏమైంది? ఇంద్రియాలను ఇంద్రియ విషయాల వైపు వెళ్ళకుండా హఠంతో నిరోధిస్తే సరిపోతుంది కదా!' అని.

ఆ ప్రయత్నమే గనుక ఫలరూప మైతే, కారాగారంలో మగ్గుతున్న ఖైదీ లందరూ యోగులే అవుతారు. ఇంద్రియాలు గ్రుడ్డివి. కళ్ళజోడు లాంటివి. చూడటానికి కళ్ళజోడు ఉపయోగ పడుతుందే గాని చూసేవి మాత్రం కళ్ళే. అలాగే, ఇంద్రియాలు విషయాలను మనస్సు ముందు ప్రదర్శిస్తాయి. అంత వరకే. ఇంద్రియాలు విజృంభించి విషయాల వైపు పరుగులు పెడుతున్నాయి అంటే, దానికి మనస్సు లోని విషయాసక్తే కారణం. విషయ చింతనమే ప్రబల కారణము. విషయ చింతనముతో ప్రారంభమై, వ్యక్తి వినాశానికి దారి తీసేది కేవలం రాగాసక్తే. అదెలాగో చూద్దాం.





**విషయ ధ్యానము**

బాహ్యం లోని విషయాలు ఇంద్రియాల ద్వారా అంతర్యం లోకి, అనగా మనస్సు లోకి ప్రవేశిస్తూ ఉంటాయి. సంతలో ఎన్నో వస్తువుల్ని మనం చూస్తాం. అవన్నీ మన సంచి లోకి రావాలి అనుకోము. అలాగే ఈ ప్రపంచం లోని విషయాలు ఎన్నో మన మనస్సు లోకి ప్రవేశిస్తూ ఉంటాయి. అవన్నీ కావాలని మన బుద్ధి కోరుకోదు.

ఎందుకనో కొన్ని మనకు నచ్చుతాయి. నచ్చిన వాటిని ఇష్టపడతాం. అయితే, ఒకరు ఇష్టపడింది మరొకరు ఇష్టపడాలి అనే నియమ మేమీ లేదు. రుచులు లోకంలో భిన్నంగా ఉంటాయి. అభిరుచులూ భిన్నం గానే ఉంటాయి.

ఏదైనా ఒకటి మనకు నచ్చింది అంటే, అందులో ఉన్నదంతా నచ్చిందని చెప్పలేము. మనం నచ్చింది అక్కడ ఉంది. అంతే. అరటిపండును మనం కోరుకున్నాము అంటే, అందులో మనకు కావలసింది పండే గాని తొక్క కాదు. అలాగే గులాబీ పువ్వు మనకు కావాలి. ముల్లు అవసరం లేదు. కాకపోతే, తొక్క లేకుండా అరటిపండు దొరకదు. ముల్లు లేకుండా గులాబి ఉండదు.

పెళ్ళిచూపులు లేకుండా ఎవరూ పెళ్ళి చేసుకోరు. చూపులు ఎన్నో జరుగుతాయి. నచ్చేది మాత్రం ఒక్కరినే. అలా నచ్చి పెళ్ళి చేసుకున్న వారికి నచ్చిం దేమిటి? అని ప్రశ్నిస్తే ఎవరి నుండీ సరైన సమాధానం రాదు. ఎందుకని? నచ్చింది ఏమిటో నచ్చిన వారికే తెలియదు. ఇక ఇతరులకు తెలిసే దేముంటుంది? కష్టం తప్ప!

ఇంతకీ నచ్చిం దేమిటి? దేహము యొక్క వర్ణమా? దేహము యొక్క పొడవా? దేహము లోని కోమలత్వమా? కట్టుకున్న దుస్తులా? పెట్టుకున్న నగలా? పెట్టబోయే కానుకలా? చదివిన చదువా? కంఠస్వరమా? మందహాసమా? మనస్సా? మాటతీరా? ఈ రోజుల్లో అయితే, నాకు నచ్చింది సింప్లిసిటీ అని విచిత్రంగా పలుకుతూ ఉంటారు. మంచిదే. నచ్చి ఉండొచ్చు. ఆ మాత్రం దానికి పెళ్ళి అవసరమా? అందుకే విదియ నాడు నచ్చుకోవడం, చవితి నాడు అదే పనిగ నొచ్చుకోవడం. విశ్లేషిస్తే, మన ఇష్టాలన్నీ ఇలాగే ఉంటాయి.

ఏది మనకు నచ్చుతుందో, దానిని మనస్సు ధ్యానిస్తూ ఉంటుంది. అదే విషయధ్యానం అంటే. సద్గతికి ఈశ్వర ధ్యానం. దుర్గతికి విషయ ధ్యానం. ఏ ధ్యానమైనా మానస వ్యాపారమే. బాహ్యంలో ఉండే విషయాలతో, లేదా వ్యక్తులతో మానసికంగా ఏర్పడే సంబంధమే ఇక్కడ ధ్యానం. విషయ ధ్యానం. 'అది ప్రాప్తిస్తే బాగుండును' అనే ఆలోచన. మనల్ని ఆకర్షించిన 'శోభన విషయం' గురించి తదేక చింతన.

**సంగబుద్ధి**

విషయ చింతనము ప్రారంభమై నపుడే కాస్త జాగ్రత్తపడి ఆత్మానాత్మ వివేకంతో సంగబుద్ధి ఏర్పడకుండా చూసుకోవాలి. లేదా, చింతనము సంగత్వాన్ని సృష్టిస్తుంది (*సంగః ఆసక్తిః ప్రీతి*). ఇక్కడే విషయాసక్తి మొదలవుతుంది. సంగత్వము ఏర్పడిన తరువాత సంకల్పా లన్నీ ఆ వైపే నడుస్తూ ఉంటాయి. ఇదే విషయ సంగత్వము. అలా కొంత కాలము సాగితే, సంగత్వ ప్రభావం చేత కోరిక పుడుతుంది. ఇదే కామము (*సంగాత్ ప్రీతేః సంజాయతే సముత్పద్యతే కామః తృష్ణా*). విషయాసక్తి కోరికను కదిలిస్తుంది. ఇక అది తీరని దాహాన్ని సృష్టిస్తుంది.

విషయ ధ్యానము, సంగత్వము అనే రెండు స్థాయిలలో విషయం కాస్త పలుచగానే ఉంటుంది. కామం దగ్గరకు వచ్చేసరికి విషయం గట్టి పడుతుంది. కోరిక దగ్గర విషయం గట్టి పడుతుంది.

**కామ వికారము**

'నేను ఆశిస్తున్నది ఆశించ దగిందే' అనే భావంతో ప్రారంభమై, 'ఎలాగైనా అది నాకు దక్కాలి' అనే

దృఢమైన కోరికగా మారుతుంది. ఆ కోరిక ఏదైనా కావచ్చు. ధనం కావచ్చు. గృహం కావచ్చు. పదవి కావచ్చు. కీర్తి కావచ్చు. కుక్క కావచ్చు. కోతి కావచ్చు, లేదా కోతి లాంటి మనిషి కావచ్చు.

విషయ ధ్యానము, సంగత్వము - ఈ రెండు స్థాయిలలో వివేకం బలహీనంగా ఉంటుంది. కామం స్థాయిలో మాత్రం వివేకానికి గ్రహణమే పడుతుంది. ఎవరు చెప్పినా, ఏమి చెప్పినా కామికి రుచించదు. ఈ స్థాయికి రాకుండా సాధకులు జాగ్రత్త పడాలి. ఈ స్థాయికి, అనగా కామం యొక్క స్థాయికి చేరిన తరువాత నిరోధించ గలిగే వాళ్ళు చాలా అరుదుగా ఉంటారు.

కొందరు కుక్క మీద ప్రేమను పెంచుకొని కుక్కను ప్రాణతుల్యంగా పెంచుకుంటూ ఉంటారు. దాని చూపుల్లో వాళ్ళకు చంద్ర దర్శనం అవుతుంది. అది తోక ఆడిస్తే వాళ్ళ మనస్సులు ఆనందంతో ఊగి పోతాయి. అది లేనిదే బ్రతకలేము అన్నవాళ్ళు ఉన్నారు. అది మరణిస్తే సమాధులు నిర్మించిన వాళ్ళు ఉన్నారు. మరీ ప్రేమ ముదిరి దానితో పాటు మరణించిన వాళ్ళూ ఉన్నారు.

ఈ శ్లోకంపై వ్యాఖ్యానాన్ని ప్రారంభించే టప్పుడే నేనొక విషయాన్ని ప్రస్తావించాను. ఎవరు ఎలా ఉండా లనుకుంటే అలా ఉండొచ్చు. అడ్డుచెప్పే వాళ్ళు ఎవ్వరూ ఉండరు. కాకపోతే, ఎవరి జీవితాలను వాళ్ళు మదింపు వేసుకోవాలి. జీవితాన్ని చేజేతులా ఎవరైనా పాడు చేసుకోవచ్చు. కాని, తిరిగి బాగు చేసుకోవాలి అనుకుంటే మాత్రం, అది పాడు చేసుకున్నంత సులభం కాదు.

కుక్కను పెంచుకోవచ్చు. తప్పు లేదు. అది మరణిస్తే దానితో పాటు మరణించాలి అనుకోవడం మాత్రం వివేకవంతుల లక్షణం కాదు. చనిపోయిన కుక్క మళ్ళీ పుడుతుంది. దానితో పాటుగా చనిపోయిన వాళ్ళు తిరిగి ఎలా పుట్టాలని? ఎక్కడ పుట్టాలని? మన విధికి మనమే కర్తలము అనే సత్యాన్ని ఎవ్వరూ మరచి పోకూడదు.

**ఆఖ్యాయిక**

ఋషభుని కుమారుడు భరతుడు. అజనాభము అనే దేశాన్ని పాలించిన రాజు. ఎన్నో యజ్ఞాలు చేశాడు. ప్రజలను పరమ వాత్సల్యంతో ప్రేమించాడు. పాలించాడు. మహాభక్తుడు. ఆయన వల్లనే మన దేశము భారత దేశము అనే పేరును పొందింది.

జింక చర్మాన్నే వస్త్రంగా ధరించేవాడు. ముక్తి మార్గంలో రాజ్యం కూడా ప్రతిబంధకమే నని, సమస్తాన్ని త్యజించి, కఠోర సాధనను కొనసాగించాలని పులహాశ్రమం చేరాడు. భోగాలు అనుభవించ వలసిన వయస్సులో సర్వమును త్యజించి, రాజ్యాన్ని బిడ్డలకు అప్పగించి సన్యసించాడు.

ఒకనాడు నదీ తీరమున ధ్యానమగ్నుడై ఉన్నాడు భరతుడు. అక్కడకు ఒక గర్భిణి అయిన లేడి వచ్చింది. ఈ లోగా ఆ వనం లోని సింహ మొకటి గర్జించింది. భీతి చెందిన హరిణి నదిని దాటేందుకు ఎగిరి దుమికింది. జింకపిల్లను ప్రసవించి తల్లి జింక మరణించింది.

భరతుడు చలించి పోయాడు. తల్లిని పోగొట్టుకున్న బిడ్డను ఆశ్రమానికి తెచ్చుకున్నాడు. ఆ హరిణ పోతమును పెంచుతూ దాని మీద ఎనలేని ప్రేమను పెంచు కున్నాడు. జపధ్యానాదులు దూర మయ్యాయి. హృదయంలో జింకపిల్లే నిండి పోయింది. దాని ధ్యాస లోనే బ్రతుకు గడిచి పోయింది. మరణ సమయంలో కూడా భరతుని మనస్సులో జింకపిల్లే ఉండి పోయింది. దాని ఫలితంగా మరణించిన భరతుడు మరుజన్మలో జింకగా పుట్టవలసి వచ్చింది. ఆ తరువాత తరించడానికి రెండు జన్మలు ఎత్తవలసి వచ్చింది.* ఇదే కామ వైపరీత్యము.



*స్వామీజీ రచించిన చైతన్య భాగవతము - పంచమ స్కంధములో వివరంగా పఠించవచ్చు.



కోరికల్ని వదలించే శక్తి మనిషి మనసుకు ఉంది. కోరిన ప్రతి దానిని సాధించుకొనే శక్తి మాత్రం మనిషికి లేదు. మనిషి సర్వాన్ని కోరుకోవచ్చు. కాని, దానిని పొందడానికి తనకు సర్వ శక్తిమత్వం లేదు అనేది మరచి పోకూడదు. సాధారణంగా కోరిన వన్నీ లభించవు. ప్రతి మనిషి జీవితంలో ఆశించేవి ఎక్కువ. అందుకొనేవి తక్కువ. ఆశించడానికి స్తోమత అవసరం లేదు. అందుకోవడానికే సామర్థ్యం కావాలి. కోరిన దానిని పొందే సామర్థ్యం లేక, పొందిన దానిని నిలబెట్టుకొనే శక్తి లేక బాల్యం నుండి వృద్ధాప్యం వరకు ప్రతి మనిషి అంతులేని నిరాశలో కూరుకుపోతూ ఉంటాడు.

చరణము : కోరిన దేదీ దొరకని బాల్యము
ఆశల ఊబిలో మునిగిన పరువము
సాగింది కాలము సడలింది దేహము
ఎపుడూ నిరాశే తోడు - మనసా
పల్లవి : చూడు ఇదే నీ లోకం - మనసా
మనసా - ఓ మనసా - నా మనసా
అనుపల్లవి : తిరిగి రాదు పోయిన సమయం
ఎటు పోతుందో పయనం - మనసా ॥ చూడు ఇదే నీ లోకం ॥

అని చైతన్య గీతిక మనస్సును జాగృతం చేసింది.

కోరింది లభ్యం కానపుడు మనిషి క్షోభకు గురి అవుతాడు. కలత చెందుతాడు. తన కోరిక ఫలించక పోవటానికి కారణ మేదో దానిపై క్రోధం పెంచు కుంటాడు. ప్రతిబంధకంపై ప్రకోపంతో రెచ్చి పోతాడు. ఇదే క్రోధం. కామం విఫలం కావడం వల్ల ఏర్పడిన పరిణామం. ప్రతిఫలం (**కామాత్ కుతశ్చిత్ ప్రతిహతాత్ క్రోధః అభిజాయతే**).

**క్రోధ ప్రకటనము**

కామం విఫలం కాగానే క్రోధం బుసలు కొడుతుంది. క్రోధానికి కామమే కారణము. కామం నుండే క్రోధం ఉద్భవిస్తుంది. కామానికి, కామ ఫలితానికి మధ్య అవాంతరాన్ని సృష్టించిన ప్రతిబంధకముపై క్రోధం జనిస్తుంది. ఈ దశలో నిగ్రహము అనేది కుందేటి కొమ్మే అవుతుంది.

క్రోధము మనస్సును క్రుంగ దీస్తుంది. బుద్ధిని వికలం చేస్తుంది. వివేకాన్ని హరించి వేస్తుంది. క్రోధంలో మనస్సు ఆలోచనా శక్తిని కోల్పోతుంది. బుద్ధి నిర్ణయించే శక్తిని జారవిడుచు కుంటుంది. వివేకం ఉండదు కనుక క్రోధి ఏదైనా చేస్తాడు. కోపిష్టి ఎలాగైనా మాట్లాడుతాడు.

పశువుకు వివేకం ఉండదు. మృగానికి వివేకం ఉండదు. వివేకం లోపించిన మనిషి అంతకన్నా విశిష్టంగా వ్యవహరించ లేడు. ఆ విషయాన్ని కోపిష్టి స్వయం గానే అంగీకరిస్తాడు. 'నాకు కోపం వస్తే నేను మనిషిని కాను - ఏం చేస్తానో నాకే తెలియదు' అంటూ ఉంటాడు. తాను మనిషి కాదని తానే అంగీకరిస్తున్నాడు. ఇక కోపిష్టిని గురించి వేరే ఏమి చెప్పాలి?

కోపం వచ్చిన వాడు ఎవ్వరినీ లెక్క చేయడు. జన్మ నిచ్చిన తల్లిదండ్రుల్ని కూడా దారుణంగా అవమానిస్తాడు. మన సంస్కృతిలో ఆచార్యుని ఆదిదేవునితో సమానంగా భావించి పూజిస్తాము. కాని, అట్టి గురుదేవుని కూడా కోపిష్టి నిందిస్తాడు అన్నారు భాష్యంలో శ్రీ శంకరాచార్యస్వామి (**క్రుద్ధః హి సంమూఢః సన్ గురుమ్ అపి ఆక్రోశతి**).

క్రోధం వచ్చి నపుడు వివేకం నశిస్తుంది కనుక కోపము వచ్చిన వాడు కోపాన్ని ఎలాగైనా ప్రకటించ వచ్చు. విధి నిషేధాలు ఆ వదరుబోతుకు వర్తించవు. నీళ్ళు చల్లగా లేవని గ్లాసును ముక్కలు చేయాలా? కోపం సరే వచ్చింది. అలాగని గరిటెలు ఏం చేశాయి? ఫైళ్ళు ఏం చేశాయి? కుర్చీలు ఏం చేశాయి? మరీ ఇంత బీభత్సమా? ఏళ్ళ తరబడి క్రికెట్ ఆడుతున్నా, నైపుణ్యాన్ని పెంచుకోలేని అసమర్థతకు చింతించ వలసింది పోయి, అవుటు కాగానే బ్యాట్‌ని నేలకేసి కొట్టే ప్రబుద్ధుల్ని క్రీడాకారులని స్తుతించాలా? లేక అప్రయోజకు లని గర్హించాలా? ఎందరో వీక్షిస్తున్నారు అనే ఇంగితము కూడా లేదు. అదే కోపమంటే! ప్రతిబంధకము ఏదో కూడా కోపంలో అర్థం కాదు. ప్రతిబంధకం అర్థం కానపుడు ఎదురుగా ఏది కనిపిస్తే దాని మీదే ప్రతాపం. ఎవరు కనిపిస్తే వారి మీదే ప్రకోపం. క్రోధం వల్ల మనస్సు స్థిమితాన్ని కోల్పోతుంది.

ఇక్కడ మరొక్క విషయాన్ని కూడా మనం సమన్వయించు కోవాలి. క్రోధంతో పాటు లోభాన్ని కూడా కలిపి అర్థం చేసుకోవాలి. కామం సఫలం కానపుడు క్రోధం కలుగుతుంది. ఒకవేళ కామం ఫలిస్తే ఏమవుతుంది? లోభం తయారవుతుంది. లోభం కూడా మనస్సుపై తీవ్ర ప్రభావాన్నే చూపుతుంది. అది రాలేదు - ఇది రాలేదు అని కామం గోల పెడుతూ ఉంటే, ఇది పోతుందేమో - అది పోతుందేమో అని లోభం గగ్గోలు పెడుతూ ఉంటుంది. రెండూ మనస్సును కలత పెట్టేవే. క్షోభను కలిగించేవే. ఈ రెండిటి మధ్య క్రోధం ఉంటుంది. కామక్రోధ లోభాలలో క్రోధం మధ్యలో ఉంటుంది. అటు కామం ఫలించక పోయినా, ఇటు లోభం విఫలమైనా, రెండిటి మధ్య ఉన్న క్రోధం మధ్యాహ్న మార్తాండుని వలె ప్రచండంగా చెలరేగి పోతుంది.

**మోహ జాలము**

క్రోధం వల్ల మనస్సులో సమ్మోహము ఏర్పడుతుంది. ఏది చేయాలి? ఏది చేయకూడదు? అనే వివేకం పూర్తిగా నశించడమే మోహము. సమ్మోహము. అవివేకానికి ఆకారము. ఆహార్యము ***( సంమోహః అవివేకః కార్యాకార్య విషయః ).*** ఉన్నది లేనట్లు, లేనిది ఉన్నట్లు అర్థం చేసుకొనే అయోమయ స్థితి మోహంలో ఉంటుంది. అందులో చిక్కినవాడు బయట పడలేడు. అందుకే దానిని మోహజాలము అన్నారు. ఈ మోహ ప్రభావం చేత వ్యక్తి జ్ఞాపకశక్తిని కోల్పోతాడు.

**స్మృతి విభ్రమము**

మోహం వల్ల కార్యాకార్య వివేకము పూర్తిగా క్షీణిస్తుంది కనుక స్మృతి జ్ఞానము నశిస్తుంది. స్మరణ శక్తి ఉండదు. సాధారణంగా జ్ఞాపకం పెట్టుకోవలసిన వాటిని జ్ఞాపకం పెట్టుకోవడము, మరచి పోవలసిన వాటిని మరచి పోవడము చిత్తము యొక్క సహజ లక్షణము.

స్మృతి విభ్రమము జరిగిన వాళ్ళు జ్ఞాపకం పెట్టుకో వలసిన వాటిని మరచి పోతూ ఉంటారు. మరేం చేస్తుంటారు? చేసేందుకు ఏమీ లేదు కనుక, మరచి పోవలసిన విషయాల్ని నెమరు వేసుకుంటూ ఉంటారు. అంటే, స్మృతి చెడిన వారికి అనవసరమైన వన్నీ అవసరాలుగా తెలుస్తూ ఉంటాయి అని అర్థం.

ఈ స్మృతి విభ్రమము విషయంలో శ్రీ శంకరాచార్య స్వామి అందమైన వ్యాఖ్యను అందించారు. 'స్మృతి కలగడానికి తగిన విధంగా కారణాలు ఉన్నా, స్మృతి కలగక పోవడం స్మృతి విభ్రమము' అని వ్యాఖ్యానించారు ***( స్మృత్యుత్పత్తి నిమిత్త ప్రాప్తౌ అనుత్పత్తిః ).*** స్మృతి కలగటానికి అనుకూలంగా నిమిత్తాలు ఉన్నా, స్మృతి కలగకుండా ఉంటుందా? ఆశ్చర్యంగా ఉంది కదూ! అదే స్మృతి విభ్రమము అంటే. ఉదాహరణకు ఒక వ్యక్తిని గూర్చి చెప్పుకుందాం.





**ఆఖ్యాయిక**

ఇద్దరు స్నేహితులు ఉండేవారు. ప్రతి రోజు వారు ఉభయులూ కలసి మాట్లాడుకోకుండా నిద్రపోరు. ఒకనాడు ఒకడు మరొకనితో, మిత్రమా! నువ్వు నా నుండి యోగవాసిష్ఠము అనే గ్రంథమును తీసికొనిపోయి ఆరు నెలలైంది. ఇంకా చదవలేదా? నువ్వు పూర్తి చేసి ఉంటే, అది నేను మళ్ళీ చదవాలి అనుకుంటున్నాను అన్నాడు.

అరెరె! ఈ రోజు కూడా అనుకున్నా, తెచ్చి ఇచ్చేద్దా మని. చదవడం పూర్తి అయి నెలరోజు లైంది. రోజూ తెద్దామని అనుకుంటూనే మరచిపోతున్నా. రేపు తప్పక తెచ్చి ఇస్తాను అన్నాడు. రోజూ అలాగే, అలాగే అంటూ వెళ్ళడం. మరునాడు అలాగే మరచిపోయి రావడం.

ఒకనాడు, మిత్రమా! నీకు మరపు కాస్త ఎక్కువలా ఉంది. రోజూ ఇలాగే మరచి పోతున్నావు. రేపు నువ్వు మరచి పోకుండా నే నొక పని చేస్తాను అని చెప్పి, మిత్రుడి ఉత్తరీయం కొంగు చివర ఒక చిన్న రాయిని ఉంచి ముడి వేశాడు పుస్తకం ఇచ్చిన మనిషి. 'చాలా బాగుంది. ఇక నేను మరచిపోయే ప్రసక్తే లేదు' అని చెప్పి వెళ్ళాడు ఆ మతిమరపు మనిషి.

మరునాడు ఇంటి నుండి బయలుదేరుతూ ఉత్తరీయాన్ని భుజాన వేసున్నాడు. కొంగు చివర నున్న రాయి భుజానికి తగిలింది. వెంటనే భార్యను పిలిచి, నా ఉత్తరీయంలో రాయి కట్టింది నువ్వేనా? దేని కోసం? అని అడిగాడు. నేను కాదండీ! నిన్న మీరు మీ స్నేహితుడి ఇంటికి వెళ్ళారు కదా! బహుశ అతడే మైనా కట్టాడేమో! అన్నది అర్ధాంగి.

అయితే, కావచ్చు అనుకుంటూ తొందర తొందరగా మిత్రుడి ఇంటికి వచ్చి, మిత్రమా! నా ఉత్తరీయంలో రాయి కట్టింది నువ్వేనా? అని అడిగాడు. ఆ మిత్రుడికి ఏం చెప్పాలో అర్థం కాలేదు.

ఇదే ఆచార్యుల వారు చెప్పింది. జ్ఞాపకానికి కారణాలు సుస్పష్టంగా ఉన్నా, ఏ మాత్రం జ్ఞాపకానికి నోచుకోక పోవడము స్మృతివిభ్రమ విలాసము. స్మృతి లేనపుడు ఇక బుద్ధి ఎక్కడ ఉంటుంది? అదే బుద్ధి నాశము అంటే.

**బుద్ధి లేదు**

స్మృతి ఎప్పుడైతే పోయిందో, ఏదీ జ్ఞాపకం ఉండదు. అంతా విస్మృతే. దాని వల్ల బుద్ధి నశించి పోతుంది. ఏది కార్యము? ఏది అకార్యము? అనే వివేకానికి బుద్ధి అయోగ్యమై పోతుంది. అదే బుద్ధినాశము **( కార్యాకార్య *విషయ వివేకా యోగ్యతా అంతఃకరణస్య బుద్ధేః నాశః ఉచ్యతే* )** అంటే.

బుద్ధినాశము అంటే బుద్ధి లేకుండా పోయిందని కాదు. 'బుద్ధి లేని మనిషి' అన్నప్పుడు ఆ మనిషికి బుద్ధి అసలే లేదు అని అర్థం కాదు. బుద్ధిని ప్రదర్శించడం వల్లే కదా బుద్ధి లేనివాడు అని అర్థమైంది? బుద్ధి లేదు అంటే, యోగ్యమైన బుద్ధి లేదు అని అర్థం. సద్బుద్ధి లేదు అని భావం. బుద్ధి మాత్రం ఉంటుంది. ఏం ప్రయోజనం? సద్బుద్ధిగా లేనిది ఏదో అది ఓనాడు దుర్బుద్ధిగా, దుష్టబుద్ధిగా మారుతుంది. ఇలా బుద్ధి నశించడం వల్ల, మనిషికి, పశువుకు మధ్య తేడా లేకుండా పోతుంది. కనుక మనిషే నశించి పోతాడు అంటే, పురుషార్థ ప్రాప్తికి యోగ్యతను కోల్పోతాడు అని అర్థం. దాని కన్నా మరణమే నయం **( పురుషార్థ అయోగ్యః భవతి ఇత్యర్థః ).**

**సర్వ నాశం**

ఇంకే ముంది? అంతా అయిపోయింది. సమస్త అనర్థాలకు విషయ ధ్యానమే మూలం అని తేలిపోయింది ***( సర్వ అనర్థస్య మూల ముక్తం విషయాభి ధ్యానమ్ ).***

విషయ ధ్యానము ఎలా అనర్థ దాయకమో ఇంతవరకు వివరించాడు. ఇక ఇప్పుడు మోక్షమును పొందే ఉపాయమును బోధిస్తున్నాడు. అర్జునుడు అడిగిన **వ్రజేత కిమ్?** అనే నాల్గవ ప్రశ్నకు సమాధానమే ఈ అరవై నాల్గవ శ్లోకము.

**రాగద్వేష వియుక్తై స్తు విషయా నింద్రియై శ్చరన్ ।**
**ఆత్మవశ్యై ర్విధేయాత్మా ప్రసాద మధిగచ్ఛతి ॥** 64

**రాగద్వేషవియుక్తైః-తు-విషయాన్-ఇంద్రియైః-చరన్**
**ఆత్మవశ్యైః-విధేయాత్మా-ప్రసాదం-అధిగచ్ఛతి**

| | | | |
|---|---|---|---|
| రాగ = రాగము చేత | | విషయాన్ = విషయములను | |
| ద్వేష = ద్వేషము చేత | | చరన్ తు = అనుభవించుచున్నవా డైతే | |
| వియుక్తైః = విడువబడి | | విధేయాత్మా = స్వాధీనమైన మనస్సు కలవాడై | |
| ఆత్మవశ్యైః = తనకు వశమైన | | ప్రసాదం = చిత్త నైర్మల్యాన్ని | |
| ఇంద్రియైః = ఇంద్రియముల చేత | | అధిగచ్ఛతి = పొందుతాడు | |

**రాగద్వేషాలు లేకుండా చూసుకోవాలి. ఇంద్రియాలను వశ పరచుకోవాలి. మనస్సును స్వాధీన పరచుకోవాలి. అలాంటి వాడు విషయాల మధ్య చరిస్తున్నా ప్రశాంతం గానే ఉంటాడు.**

**వ్యాఖ్య**

మనస్సులో దుఃఖ కారణం లేకుండా జీవించ గలిగితే, అంతకు మించిన భాగ్యం మనిషికి మరొకటి ఉండదు. మనలో మనం హాయిగా తృప్తి చెంది జీవించడం కంటే ఉత్తమమైన సుఖాలు, సంపదలు ఈ ప్రపంచంలో లేవు.

**వ్రజేత కిమ్?** 'శబ్దాది విషయాలలో స్థితప్రజ్ఞుడు ఎలా చరిస్తాడు?' అని అర్జునుడు అడిగిన నాల్గవ ప్రశ్నకు సమాధానమే ఈ శ్లోకము. పూర్వ శ్లోకంలో విషయాసక్తితో, విషయ ధ్యానంలో బ్రతుకును పాడు చేసుకుంటున్న అముముక్షువు విషయం వివరించిన వాసుదేవుడు, ఈ శ్లోకంలో మనస్సును నియమించిన ముముక్షువు యొక్క ప్రశాంత జీవనాన్ని వివరిస్తున్నాడు.

సాధకుడు వివేకి అయినప్పటికి, చక్కని ప్రయత్నము చేస్తున్న వాడై నప్పటికి, క్షోభను కలిగించే ఇంద్రియాలు అతని మనస్సును ఎలా పాడు చేస్తున్నాయో అరవైయవ శ్లోకంలో స్పష్టం చేశాడు. ఇంద్రియాలను నియమిస్తేనే వివేక ప్రజ్ఞ స్థిరంగా ఉంటుందని అరవై ఒకటవ శ్లోకంలో చెప్పాడు. ఇంద్రియాలను నిగ్రహించినా, మనస్సును నియమించకుండా విషయ ధ్యానం చేస్తూ పోతే వచ్చే ప్రమాదము ఏమిటో అరవై రెండు, అరవై మూడవ శ్లోకాలలో వివరించాడు. కాని, ఈ శ్లోకంలో విషయాన్ని మరొక మలుపు త్రిప్పుతూ, మనస్సును కనుక నిగ్రహించ గలిగితే, ఇంద్రియాలను విడిచి పెట్టినా వచ్చే ప్రమాదము ఏమీ ఉండదని నూతన చర్చకు తెర తీస్తూ ఉన్నాడు. ఇక్కడ ప్రసంగ విషయమే పూర్తిగా మారి పోయింది. విషయం అలా వేరు పడిందని చెప్పేందుకు శాస్త్రంలో **తు** అనే అవ్యయ పదమును వాడుతూ ఉంటారు.

విషయ చింతనము అనర్థదాయక మని గడచిన రెండు శ్లోకాలలో విన్నాం. అంటే విషయాలను స్మరించకుండా ఉండాలి అని అర్థం. మరి విషయాలను గూర్చి ఆలోచించకుండా, విషయ సంబంధమైన క్రియలు ఎలా నడుస్తాయి? ఒకవేళ నడిస్తే, అవి అనర్థ మనే కారణము యొక్క కార్యాలే కదా! కారణము





అనర్థ మైనపుడు కార్యాలు కూడా అనర్థాలే! మరి, అన్నపానాది కార్యాలు కూడా విషయ చింతనము అనే అనర్థ కారణము వల్ల ఏర్పడినవే కదా! అన్నపానాదులు లేకుండా జీవించే దెలా? అన్నపానాదులకు సంబంధించిన ఆలోచనలు కదలకుండా అన్నపానాదుల్ని స్వీకరించడం ఎలా జరుగుతుంది? శరీరయాత్ర ఎలా సాగుతుంది? ఈ విధమైన సందేహాలను నివారిస్తూ, ముముక్షువు రాగద్వేషాల నుండి విడిపడిన వాడై, వశ పడిన ఇంద్రియాలతో విహిత కర్మలను ఆచరిస్తూ, ప్రశాంతతను పొందుతున్నాడు అని బోధిస్తున్నాడు.

**రాగద్వేషాలు**

విషయాల యందు మనిషికి గల ఆసక్తియే రాగద్వేషాలకు కారణ మవుతూ ఉంది. ఇంద్రియ విషయాల లోని దోషాలను దర్శించడం చేత విషయాసక్తి అడుగంటి పోతుంది. విషయాసక్తి క్షీణించ గానే రాగద్వేషాలు అదృశ్య మవుతాయి. రాగద్వేషాలు నిర్వీర్యం కాగానే విషయాలు నిస్సార మవుతాయి, కర్మలు బంధ రహితంగా ఉంటాయి.

పాము వల్ల ఎవ్వరికీ హాని జరగదు. హాని జరిగింది అంటే, అది పాము కోరల లోని విషం వల్లనే. కోరల్ని తీసి వేస్తే పాము వల్ల ఏ అపాయము ఉండదు. రాగద్వేషాలు అనే కోరల్ని దూరం చేస్తే కర్మలు నిరపాయంగా ఉంటాయి.

రాగద్వేషాల నుండి విడిపడిన ముముక్షువు మనస్సును, ఇంద్రియాలను నియమించి ఉంటాడు కనుక, విషయాలలో చరించినా నిర్దోషం గానే ఉంటాడు. రాగద్వేషాల కోరల నుండి విడిపడిన మనస్సు నియమింప బడి ఉంటుంది కనుక **(విధేయాత్మా)** ఇంద్రియాలు మరొక మార్గం లేక మనస్సుకు వశపడి ఉంటాయి **(ఆత్మ వశ్యైః)**. ఇక్కడ ఆత్మ అంటే అంతఃకరణము అని అర్థము. కనుక ఇంద్రియాలు మనస్సుకు వశపడి ఉంటాయి అని అర్థం.

విషయ ధ్యానంలో ఉన్న లౌకికుడు ఏ ప్రపంచముతో సంబంధము పెట్టుకొని చరిస్తున్నాడో, ముముక్షువు కూడా అదే ప్రపంచంతో వ్యవహరిస్తున్నాడు. విషయ చింతనములో పడ్డవాడు రాగద్వేషముల చేత కలుషిత మైన మనస్సుతో విషయ ప్రపంచంలో చరించి పాడై పోతున్నాడు. రాగద్వేషముల నుండి విడిపడి, మనస్సును నియమించి, తనకు స్వాధీనములైన ఇంద్రియాల చేత అదే ప్రపంచంలో చరిస్తూ ముముక్షువు ప్రశాంతతను అనుభవిస్తున్నాడు. అతని శాంతి భగ్నం కావటం లేదు. దేహేంద్రియ మనస్సులు ప్రపంచంలో చరిస్తున్నా యోగయుక్తుడు స్థిరంగా ఉన్నాడు. అతని బుద్ధి పరినిష్ఠితమై ఉంది.

**ధర్మాధర్మాలు**

రాగద్వేషాలు ఎప్పుడైతే దూరమై పోయాయో **(రాగద్వేష వియుక్తైః)**. ఇక వివేక ప్రజ్ఞ కలవాడు ప్రపంచంలో చరించ డానికి ఆధార మేమిటి? అతనిలో కర్మకు కారణ మేమిటి? రాగద్వేషాలు తటస్థ పడ్డాయి కనుక, ఇక అతడిలో మిగిలి ఉన్నవి ధర్మాధర్మాలే. చేయదగింది ఏది, చేయ కూడనిది ఏది అనే విచక్షణతో, చేయవలసిన కార్యాలను ఫలాసక్తి లేకుండా, రాగద్వేషాల వలలో చిక్కకుండా తటస్థంగా ఆచరిస్తూ ఉంటాడు. అలాంటి వ్యక్తిని ఏ కర్మలూ బాధించ లేవు.

ధర్మాచరణములో సంగబుద్ధి లేకుండా ఎప్పుడైతే విషయాల మధ్య చరిస్తున్నాడో, అతడు ఎక్కడ చరించినా, ఎలా చరించినా ధర్మానికి దూరంగా పోడు. ధర్మము దైవానికి దూరంగా లేదు. ధర్మ రూపంలో ఉన్నది దైవమే. కనుక ప్రజ్ఞావంతుడు ఎక్కడ చరించినా, వాస్తవానికి పరమాత్మ స్పృహ తోనే ఉంటాడు.

**సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే**

అర్జునా! నా యందే మనస్సు నుంచిన యోగి ఏ విధంగా వ్యవహరిస్తూ ఉండినా, అతడు నా లోనే ఉంటాడు అని మున్ముందు గీతలో భగవానుడే చెబుతాడు.

అంతటా, అన్ని విధాల పరమేశ్వర స్పృహతో జీవించే వాడు ప్రత్యేకంగా దేనిపై రాగాన్ని ఉంచుతాడు? దేనిని పని కట్టుకొని ద్వేషిస్తాడు?

విషయాలలో చరిస్తూ ఉండినా తామరాకు మీద నీటిబొట్టు లాగా అంటకుండా ఉంటాడు. అదే పనిగా తిరుగుతూ ఉండినా, ఏ మాలిన్యము అంటని గాలి లాగా పవిత్రుడై ఉంటాడు. ప్రసన్నంగా ఉంటాడు. ప్రశాంతంగా ఉంటాడు. ప్రసాద బుద్ధితో నిర్మలంగా ఉంటాడు ***(ప్రసాదం అధి గచ్ఛతి)***. ప్రసాదము అనేది పదార్థం కాదు. భక్తితో స్వీకరించే పదార్థమే ప్రసాదం. కాని, ఇక్కడ ప్రసాదం అంటే ప్రసన్నత. స్వస్థతతో జీవించడం ***(ప్రసాదః ప్రసన్నతా స్వాస్థ్యమ్)***.

*మరి, ఈ ప్రసాదం యొక్క ఫల మేమిటి? ప్రసాదం ప్రాప్తిస్తే ఏం జరుగుతుంది? చెబుతున్నాడు.*

ప్రసాదే సర్వదుఃఖానాం హాని రస్యోపజాయతే ।
ప్రసన్నచేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతి ॥ 65

***ప్రసాదే-సర్వదుఃఖానాం-హానిః-అస్య-ఉపజాయతే***
***ప్రసన్న చేతసః-హి-ఆశు-బుద్ధిః-పర్యవతిష్ఠతి***

| | | | |
|---|---|---|---|
| అస్య | = అట్టి వానికి | ప్రసన్న చేతసః | = నిర్మలమైన మనస్సు గల వానికి |
| ప్రసాదే | = చిత్త నైర్మల్యము వలన | ఆశు | = శీఘ్రముగ |
| సర్వదుఃఖానాం | = సమస్త దుఃఖముల యొక్క | బుద్ధిః | = బుద్ధి |
| హానిః | = వినాశము | పర్యవతిష్ఠతి హి | = స్థిరపడు చున్నది |
| ఉపజాయతే | = కలుగు చున్నది | | |

**చిత్త ప్రసాదము లభించిన వానికి సమస్త దుఃఖాలు అంతరిస్తున్నాయి. నిర్మలమైన మనస్సు గల వాని బుద్ధి వెంటనే ప్రశాంతతను పొందుతుంది కదా!**

### వ్యాఖ్య

ఆలోచించ గలిగే మనస్సును అడగకుండానే భగవంతుడు మనకు ప్రసాదించాడు. భగవంతుడు అనుగ్రహించిన మనస్సుతో మనం ఆనందంగా జీవించడ మనేది మన ఆలోచనా విధానం మీద ఆధారపడి ఉంటుంది.

విశిష్టమైన అతిథిని మన ఇంటికి ఆహ్వానిస్తాం. అతడు అంగీకరిస్తే ఎంతగానో పొంగిపోతాం. ఇంటిని శుభ్రం చేసుకొని అలంకరించే కార్యంలో పూర్తిగా నిమగ్న మవుతాం. మరి ఆత్మారాముడు ప్రవేశించే ముందు మన బుద్ధిని ఎలా శుద్ధి చేసుకోవాలి? ఎంత పవిత్రంగా ఉంచుకోవాలి? అదే తపస్సు. అదే జ్ఞాన సాధన.

ధూళి ధూసరితమైన ఆసనంలో అతిథిని కూర్చోబెడతామా? కనుక ఆత్మారాముడు స్థితుడై ఉండా లంటే, మన అంతఃకరణ పరిశుద్ధమైన ఆలయంగా మారాలి. అందుకనే, ***దేవో భూత్వా దేవం యజేత.*** దేవుణ్ణి పూజించే ముందు నీవు దేవుడివి కావాలి అన్నది శాస్త్రం. అందుకే పూజకు ముందు స్నానం, తిలక ధారణం, శుద్ధ వస్త్ర ధారణం చేస్తాము. ముందు శుద్ధి, తరువాత సిద్ధి. సాధన సాధ్యాలు రెండూ బుద్ధి లోనే.





రాగద్వేషాల నుండి విడిపడి, ఇంద్రియ మనస్సులను వశ పరచుకొని, విషయాలలో చరిస్తూ ఉండినా, బుద్ధి ప్రసన్నం గానే ఉంటుంది అని గ్రహించాము. అలాంటి ప్రసాద బుద్ధియే వైకుంఠ ద్వారము. ఆ తరువాత వైకుంఠ ప్రవేశమే. విష్ణుదేవుని దర్శనమే.

**దుఃఖము - శాంతి**

ఆరోగ్యం ఉంది అంటే, అనారోగ్యం లేదు అని అర్థము. స్వస్థత ఉన్న చోట అస్వస్థత ఉండదు. అస్వస్థతకు కారణాలు అనేకం ఉండొచ్చు. స్వస్థతకు కారణం అవసరం లేదు. అది స్వభావం. అస్వస్థతకు గల కారణాలు తొలగిపోతే, అస్వస్థత ఉండదు. స్వస్థతే మిగుల్తుంది.

దుఃఖం ఉంది అంటే దుఃఖ కారణాలు ఉన్నాయి అని అర్థం. దుఃఖం మనందరి అనుభవంలో ఉంది. కాని, అందరి దుఃఖాలకు కారణాలు ఒకే విధంగా లేవు. కారణాలు భిన్నంగా ఉన్నా, దుఃఖం మాత్రం ఏకమే. దుఃఖము అందరిదీ ఒక్కటే. రాజు గారి దుఃఖము, సేవకుని దుఃఖము అని దుఃఖంలో విభజన లేదు. దుఃఖము ఎవరికి వచ్చినా, బుద్ధి బరు వెక్కుతుంది. గుండె భార మవుతుంది. మనసు మెలికలు తిరుగుతుంది. కళ్ళల్లో నీళ్ళు తిరుగుతాయి. ఇదంతా దుఃఖానుభవం.

దుఃఖం అందరికీ ఒక్కటే. దుఃఖ కారణాలు మాత్రం వ్యక్తికి వ్యక్తికి భిన్నంగా ఉంటాయి. ప్రియ మైనది దూరమైతే ఎవరికైనా దుఃఖం కలుగుతుంది. ప్రియమైనది ఏది? అనే ప్రశ్న పడితే మళ్ళీ సమాధానం ఒకే విధంగా ఉండదు. ఎవరికి దేని మీద, లేదా ఎవరి మీద ఆసక్తి ఉంటే, అది వారికి ప్రియం అవుతుంది.

నాయకుడు దుఃఖిస్తాడు. యాచకుడు దుఃఖిస్తాడు. పసి బాలుడూ దుఃఖిస్తాడు. అందరి కళ్ళల్లో నీళ్ళు తిరుగుతాయి. కారణాల లోకి వెళ్ళి, దుఃఖ హేతువు ఏమిటి? అని ఆ ముగ్గురిని ప్రశ్నిస్తే, పదవి చేజారి పోయింది అంటాడు నాయకుడు. అక్షయపాత్ర పోయింది అంటాడు యాచకుడు. ఆటబొమ్మ విరిగి పోయింది అంటాడు పిల్లవాడు.

ఎవరికి ఏది పోగొట్టు కోవడం వల్ల దుఃఖం కలిగిందో, వారికి అది తిరిగి లభిస్తేనే దుఃఖం పోతుంది. అంతేగాని, ఒకరి దుఃఖ కారణం తొలగడం వల్ల మరొకరి దుఃఖం దూరం కాదు. పదవి పోవడం వల్ల నాయకుడు దుఃఖిస్తున్నాడని, దుఃఖిస్తున్న బాలుడికి అదే పదవిని ఇస్తామని చెబితే, దుఃఖం పోదు సరిగదా, కాస్త పెరిగే అవకాశం కూడా ఉంది. అలాగే అక్షయపాత్రను కొనిపెడితే, యాచకుడికి దుఃఖం పోతుంది కాని, అదే అక్షయపాత్రను నాయకుడికి ఇస్తే దుఃఖం వెయ్యింత లవుతుంది.

ఎవరి దుఃఖ కారణాలు దూరమైతే, వారి దుఃఖం దూర మవుతుంది. దుఃఖం దూరం కాగానే ప్రశాంతత బుద్ధిలో చోటు చేసుకుంటుంది. ప్రశాంతత అందరికీ ఒక్కటే. దుఃఖం ఒక్కటే అయినా, దుఃఖ కారణాలు వేరుగా ఉన్నట్లు, ప్రశాంతత ఒక్కటే అయినా ప్రశాంతతకు కారణాలు వేరుగా ఉంటాయా? ఉండవు. ఎందుకని? ప్రశాంతత అనేది వ్యక్తి స్వభావం. అది అతని స్వరూపం. అశాంతికి కారణా లుంటాయి గాని, శాంతికి కారణాలు అవసరం లేదు. అశాంతికి గల కారణాలు అదృశ్య మైతే శాంతి పూర్ణమై భాసిస్తుంది. ఇది పూర్ణశాంతి. పరమాత్మ జ్ఞానం వల్ల ప్రాప్తించే పరమశాంతి.

**దూరమైన దుఃఖం**

స్థిరమైన ప్రజ్ఞ గలవాడు రాగద్వేషాలను తటస్థ పరచి ఉంటాడు కనుక అతనికి ఇష్టాయిష్టాలు ఉండవు. ఏదో పోవడం వల్ల దుఃఖం రాదు. ఏదో ఉండటం వల్ల సుఖం పోదు. విషయాసక్తి నశించడం వల్ల ఈ విధమైన రాగద్వేషాలు స్థితప్రజ్ఞుని బుద్ధిలో అదృశ్య మయ్యాయి. అతడు గతానికి వగచేది ఉండదు. అగతాన్ని వలచేది

ఉండదు. రాగద్వేషాలు ఈ విధంగా ఎవరిని చలింప చేయలేవో వారి బుద్ధి ప్రసన్నంగా ఉంటుంది. ఈ బుద్ధి ప్రసాదం కారణంగా సమస్త దుఃఖాలు నశించి పోతున్నాయి.

ఇది సాధ్యమేనా? ధన నష్టం జరిగితే దుఃఖం ఉండదా? ఉంటుంది. ఎవరికి? ధనం సుఖ కారణమని భ్రమించే వారికి, ధన నష్టం కారణంగా దుఃఖం కలుగుతుంది. ధనంపై ఆసక్తి లేని వారికి ధననష్టం దుఃఖాన్ని ఎలా కలిగిస్తుంది? ధనం మనకే కాదు, ఎందరికో ఉంది. మన కన్నా అధికంగా సంపదలున్న వారి ఐశ్వర్యాలే నిలవకుండా పోతున్నాయి. మనవి మాత్రం పోకుండా ఉంటాయా? ఎవరైనా, ఈ ప్రపంచం లోకి ధనంతో ప్రవేశించ లేదు. ఒంటరి గానే వచ్చారు. వచ్చిన తరువాతే ఈ ప్రపంచంలో వారి వద్దకు ధనం వచ్చి చేరింది. వచ్చింది ఏదైనా పోయేదే. పోవడం, ఉండటం అనేది అలా ప్రక్కన పెడితే, ఉన్న దాని మీద ఆసక్తి ఉన్నప్పుడే, ఆ ఉన్నది పోయి నపుడు బాధ కలుగుతూ ఉంటుంది. ఉన్నదాని మీద రాగం లేనపుడు, అది ఉండినా, పోయినా ఒరిగేది ఉండదు, తరిగేదీ ఉండదు. ధనాసక్తి లేని స్థితప్రజ్ఞుని బుద్ధిని, ధనం ఉండి సుఖపెట్టనూ లేదు. ధనం పోయి దుఃఖపెట్టనూ లేదు.

ధన నష్టమే కాదు, జన నష్టము కూడా అంతే. జనం సుఖ కారణం కాలేరు. అలాంటప్పుడు దుఃఖ కారణ మెలా అవుతారు? జీవులకు రాకపోకలు ఉంటాయి. వాటి ప్రభావం మాత్రం మననశీలునిపై ఉండదు.

పోయేవాళ్ళ కోసం ఏడ్చే ఉద్యోగం మన కెవరిచ్చారు? ఒకనాడు పోయేవాళ్ళే నేడు ప్రపంచంలో ఉన్నారు అనేది జ్ఞానం. చావు అనేది దుఃఖానికి కారణమా? అదే వాస్తవ మైతే, చచ్చిపోతున్న వాళ్ళందరి కోసం మనం ఏడవాలి. అలా ఎవ్వరూ ఏడవడం లేదు. కొందరు పోతేనే ఏడుస్తున్నారు. ఎందుకని? వాళ్ళు తమ వాళ్ళు కనుక. తమ కుటుంబీకులు కనుక. మరి, కుటుంబంలో చనిపోతున్న అందరి కొరకు ఒకే విధంగా ఏడుస్తున్నారా? పసివాళ్ళకు, ముసలివాళ్ళకు ఒకే స్వరమా? లేదు. మరి, ఈ భేదం ఎందుకు? మళ్ళీ సమాధానం మొదటికే వస్తుంది. రాగాసక్తియే ఇక్కడ ప్రధానం. పరమాత్మ దర్శనం చేత, ఈ రాగాసక్తి పూర్తిగా నశించింది కనుక *(శ్లోకం -59)* జన నష్టం కూడా ప్రజ్ఞావంతుని బుద్ధిని చలింప చేయలేదు. అంతే.

దుఃఖాలు ప్రపంచంలో ఉంటాయి. అలాగే దుఃఖ కారణాలు కూడా ఉంటాయి. కాని, అవేవీ స్థితప్రజ్ఞుని బుద్ధిని కదిలించ లేవు. అతనిలో దుఃఖాన్ని కలిగించ లేవు.

ప్రసాద బుద్ధి ప్రాప్తించడం చేత వివేక ప్రజ్ఞ గల మననశీలుని దుఃఖాలన్నీ నశించి పోతాయి ***(ప్రసాదేసర్వ దుఃఖానాం హానిః వినాశః అస్య యతేః ఉపజాయతే)***. ప్రసన్నత వల్ల దుఃఖాలు పోతాయా? ఈ విషయం ప్రామాణిక మేనా? దుఃఖ నివృత్తి ఇలా జరుగు తుందని శాస్త్రం అంగీకరిస్తుందా? దీనిని కాస్త సంక్షిప్తంగా విశ్లేషించుకుందాం.

సమస్త దుఃఖాలకు అధ్యాసే కారణం. కనుక అధ్యాస ***(అతస్మిన్ తద్బుద్ధిః - అది కాని దాని యందు అది అనే బుద్ధి)*** తొలగితేనే సమస్త దుఃఖాలు నశిస్తాయి. అధ్యాస తొలగాలి అంటే, దానికి కారణమైన అజ్ఞానం నివృత్తి కావాలి. మరి అజ్ఞానం ఎలా నివృత్తి అవుతుంది? జ్ఞానం వల్లనే అజ్ఞానం నశించాలి. ఇదీ క్రమం. జ్ఞాన మార్గంలో ఉండే కార్యక్రమం. మరి, జ్ఞానం వల్లనే సర్వ దుఃఖాలు నశిస్తాయి అని శాస్త్రం సాంప్రదాయకంగా, సహేతుకంగా బోధిస్తూ ఉంటే, దానికి భిన్నంగా, కేవలం బుద్ధి లోని ప్రశాంతత వల్లనే సర్వ దుఃఖాలు నశిస్తాయి అని గీతాచార్యుడు బోధించడం సశాస్త్రీయ మేనా? అదే వాస్తవ మైతే, శ్రోత్రియ బ్రహ్మనిష్ఠుడైన గురువును ఆశ్రయించి ఆత్మజ్ఞానాన్ని పొంద వలసిన అవసర మేమిటి? ఇలాంటి మీమాంస అనివార్యం.

నిజమే. కేవలం ప్రసన్నత ప్రాప్తించడం వల్లనే దుఃఖాలన్నీ దూరమై పోవు. దుఃఖాలు లేకుండా పోవడం





వేరు, దుఃఖాలు నశించడం వేరు. ప్రసాదబుద్ధి గల పవిత్రాత్మునిలో దుఃఖాలు లేవు అనేది వాస్తవమే. కాని, దుఃఖాలు సమూలంగా నశించడం అనేది ఆత్మజ్ఞానం వల్లనే జరుగుతుంది. కాకపోతే, ప్రసాద బుద్ధి కలిగిన ప్రజ్ఞావంతునికి జ్ఞానం ఎంతో దూరంలో లేదు అనేది వాస్తవం. ముందే నేను వివరించి నట్లుగా, ప్రసాద బుద్ధి వైకుంఠ ద్వార దర్శనం లాంటిది. ద్వార దర్శనమే దైవదర్శనం కాదు. కాని, ద్వార దర్శనం చేసుకున్న వ్యక్తికి దైవ దర్శనం ఎంతో దూరం లేదు. అందుకు ఎంతో సమయమూ పట్టదు. అందుచేతనే ప్రసన్న చిత్తము కలవారికి స్థిర జ్ఞానం ప్రాప్తించడం శీఘ్రం గానే **(ఆశు)** జరిగి పోతుంది అన్నాడు ఈ శ్లోకంలో గీతాచార్యుడు.

ప్రసన్న చేతస్కుడైన వాని బుద్ధి స్థిరంగా ఉంటుంది. ఆకాశం లాగా నిశ్చలంగా ఉంటుంది. ఆత్మ స్వరూపం లాగా అచలంగా ఉంటుంది అని అర్థం ***(ఆకాశ మివ పరి సమన్తాత్, అవతిష్ఠతే ఆత్మస్వరూపేణైవ నిశ్చలీ భవతి ఇత్యర్థః)***.

వివేక ప్రజ్ఞ గల వాని ప్రసాద బుద్ధి ఆకాశం లాగా నిశ్చలంగా ఉంటుంది అని ఆచార్యుల వారి భాష్యం. ఈ సందర్భంలో ఇదొక అందమైన, అద్భుతమైన ఉపమానం.

పంచభూతాలలో చలనము లేనిది ఆకాశ మొక్కటే. వాయువు చలిస్తుంది. అగ్ని చలిస్తుంది. జలము చలిస్తుంది. భూమి అదే పనిగా తిరుగుతూ ఉంది. ఆకాశం మాత్రం అచలంగా ఉంది. అందుచేతనే ఆత్మను మరొక దానితో పోల్చవలసి వచ్చినప్పుడు, మరొక మార్గం లేక ఆకాశం తోనే పోలుస్తూ ఉంటాము. **ఆకాశవత్, వ్యోమవత్** అని చెబుతూ ఉంటాము. విష్ణుమూర్తిని *గగన సదృశం* అని కీర్తిస్తాము. పైగా, ఆకాశము ఆత్మస్వరూపానికి అతి సన్నిహితంగా ఉంది. పంచభూతాలలో ముందుగా ఆకాశమే వచ్చింది ***(తతః ఆకాశః సంభూతః)***. ఈ విధంగా స్థిరమైన ప్రజ్ఞ కలవాడు కృతకృత్యుడు అవుతాడు అన్నారు భాష్యంలో ఆచార్యులు కూడా **( ఏవం ప్రసన్న చేతసః అవస్థిత బుద్ధేః కృతకృత్యతా )**. అంటే, అంతటా బ్రహ్మమునే దర్శించే ప్రజ్ఞ **(బుద్ధిః)** ప్రతిష్ఠిత మవుతూ ఉంది **( పర్యవతిష్ఠతి )** అని అర్థం.

అంటే, ప్రసాదబుద్ధి వలన ఏర్పడిన నిర్మలత్వము, ఆత్మజ్ఞానము వలన ఏర్పడే నిర్మలత్వము వంటిదని అర్థము ('గగన సదృశం' లాగా). ఇంతవరకు దుఃఖాలు ఆశ్రయించిన అంతఃకరణమును ఇప్పుడు నిర్మల మైన ప్రసాదము ఆక్రమిస్తుంది. ఇక, శీఘ్రంగా ఆ బుద్ధిలో పవిత్రమైన జ్ఞానం ప్రవేశిస్తుంది. పతంజలి మహర్షి కూడా తమ యోగదర్శనంలో ఈ విషయాన్ని విస్పష్టం చేశాడు.

**సూత్రము : సత్త్వ పురుషయోః శుద్ధి సామ్యే కైవల్య మితి ॥**

'సత్త్వము' అంటే బుద్ధి. శుద్ధమైన బుద్ధి. ప్రశాంత మైన బుద్ధి. 'పురుషుడు' అంటే ఆత్మ. చైతన్య రూపుడు. వీరిద్దరికి శుద్ధిలో, అనగా నిర్మలత్వములో పోలిక ఉంది. సామ్యము ఉంది. ఈ సామ్యము స్థిరపడితే కైవల్యము సిద్ధించినట్లే అని 'యోగ దర్శనము' - విభూతి పాదము, యాభై ఐదవ సూత్రంలో యోగసూత్రకారుడు మహర్షి పతంజలి ప్రస్ఫుటం చేశాడు (సత్త్వ పురుషయోః =బుద్ధి పురుషుల యొక్క, శుద్ధి సామ్యే =శుద్ధి యందు సామ్యము కలుగ గానే, కైవల్యమ్ ఇతి = కైవల్యము సిద్ధిస్తుంది).

కనుక ఇట్టి స్థిరమైన ప్రశాంత ప్రజ్ఞను అభిలషించు వాడు రాగద్వేషాలను తటస్థ పరచాలి. మనస్సును సంయమనం చేసి, శాస్త్ర విహిత కర్మలను, ధర్మబద్ధంగా ఇంద్రియాలతో ఆచరిస్తూ, పారవశ్యం చెందకుండా ప్రవర్తిస్తూ ఉండాలి. అప్పుడే పవిత్రమైన ప్రసాద బుద్ధి ఏర్పడుతుంది. ఈ స్థితి స్థితప్రజ్ఞునిలో సహజంగా భూషణం లాగా ప్రకాశిస్తూ ఉంటుంది.

*వివేక ప్రజ్ఞ గల యోగయుక్తుని వైభవాన్ని ఇంతవరకు వర్ణించిన గీతాచార్యుడు, ఇప్పుడు, అయుక్తుడు*

వివేక ప్రజ్ఞ లేకుండా ఉంటాడు కనుక, అతనికి ప్రసాదబుద్ధి ఉండదు, శాంతి ఉండదు అని అంటున్నాడు. ఈ విషయాన్నే రాబోయే అరవై ఆరు, అరవై ఏడు శ్లోకాలలో చెబుతున్నాడు. కాకపోతే, ఈ సందర్భంలో పూర్వోత్తర శ్లోకాలను కలిపే అవతారికలో శ్రీ శంకరాచార్య స్వామి, **సేయం ప్రసన్నతా స్తూయతే** - అంటే, ఈ ప్రసాద బుద్ధి స్తుతింపబడుతూ ఉంది అన్నారు. అప్రసన్నతను గర్హించడములో ప్రసన్నతను స్తుతించడం అంతర్వాహినిగా ఉండనే ఉంటుంది. ఎలాగో చూద్దాం!

**నాస్తి బుద్ధి రయుక్తస్య న చాయుక్తస్య భావనా ।**
**న చాభావయతః శాన్తి రశాన్తస్య కుతః సుఖమ్ ॥** 66

*న-అస్తి-బుద్ధిః-అయుక్తస్య-న-చ-అయుక్తస్య-భావనా*
*న-చ-అభావయతః-శాంతిః-అశాంతస్య-కుతః-సుఖం*

| | | | | | |
|---|---|---|---|---|---|
| అయుక్తస్య | = | యోగయుక్తుడు కాని వానికి | అభావయతః | = | భావ శూన్యునకు |
| బుద్ధిః | = | బుద్ధి | శాంతిః | = | శాంతి |
| న అస్తి | = | ఉండదు | న చ | = | ఉండదు |
| అయుక్తస్య | = | యోగయుక్తుడు కాని వానికి | అశాంతస్య | = | శాంతి లేని వానికి |
| భావనా చ | = | భావనయు | సుఖం | = | సుఖము |
| న | = | కలుగదు | కుతః | = | ఎలా కలుగును? |

**నిగ్రహ యుక్తి లేని వానికి బుద్ధి ఉండదు. సంయమ శక్తి లేని వానికి ఆత్మనిష్ఠ ఉండదు. ఆత్మ భావన లేని వానికి శాంతి మిగలదు. శాంతి లేని వానికి సుఖము ఎలా కలుగుతుంది?**

**వ్యాఖ్య**

వేడి నుండి విడిపడాలి అని నిప్పు ఎప్పుడూ భావించదు. కారణం, వేడి వల్ల నిప్పుకు ఎప్పుడూ బాధ లేదు. వేడిగా ఉండటం నిప్పు యొక్క స్వభావం. స్వభావము ఎప్పుడూ బాధించదు. శాంతికి దూరంగా పోవాలని ఏ వ్యక్తీ భావించడు. శాంతి వల్ల జీవికి ఎన్నడూ అస్వస్థత ఉండదు. శాంతి అనేది ప్రతి జీవి లక్షణం. స్వభావం. స్వరూపం. స్వభావ స్వరూపాలు ఎప్పుడూ బాధించవు.

నిప్పు వల్ల నీటికి బాధ ఉంది. అందుకే వేడి చేస్తే నీరు సలసల కాగుతుంది. వేడి నుండి విడిపడాలి అని నీరు భావిస్తుంది. అందుకే నీటిని కాచి ప్రక్కన పెట్టినా, కొంత సేపటికి వేడిని తొలగించుకొని నీరు చల్లబడుతుంది. అశాంతి నుండి విడి పడాలని ప్రతి వ్యక్తి కోరుకుంటాడు. అశాంతి వల్ల జీవి అస్వస్థతను అనుభవిస్తాడు. అందుకే అశాంతి కలిగి నపుడు దానికి కారణాలను అన్వేషించి, వాటిని తొలగించుకొని తిరిగి శాంతిని పొందాలని ప్రయత్నిస్తూ ఉంటాడు. శాంతి లేనివాడు సుఖం లేనివాడే.

సుఖపడాలి అంటే శాంతి ఉండాలి. శాంతి ఉండాలి అంటే, ఆత్మభావన ఉండాలి. ఆత్మభావన ఉండాలి అంటే, ప్రసన్న చిత్తము ఉండాలి. ప్రసన్న చిత్తము ఉండాలి అంటే ఇంద్రియ నిగ్రహము ఉండాలి.

ఈ శ్లోకంలో ప్రధానంగా నాలుగు కార్యాలు ఉన్నాయి. ఈ నాలుగు కార్యాలకు నాలుగు కారణాలు ఉన్నాయి. **కారణా భావే కార్యాభావః** 'కారణాన్ని తొలగిస్తే కార్యం మిగలదు' అనే న్యాయాన్ని అనుసరించి, ఒక్కొక్క అయుక్త కార్యానికి గల అయుక్త కారణాన్ని తొలగిస్తూ, చివరగా నిత్య సుఖానికి, నిత్య శాంతికి మార్గాన్ని సుగమం చేస్తున్నాడు.





**ప్రసాద బుద్ధి**

'అయుక్తుడు' అంటే ప్రసాద బుద్ధి లేనివాడు. సమాహిత చిత్తము లేనివాడు. అట్టి వానికి ఆత్మ విషయానికి సంబంధించిన బుద్ధి ఉండదు (**నాస్తి బుద్ధిః అయుక్తస్య**). ఆత్మను తెలుసుకొనుటకు అనువైన అంతఃకరణమే 'ఆత్మబుద్ధి'.

ఆత్మబుద్ధి లేదు అంటే ఇంద్రియ నిగ్రహము, చిత్త సంయమనము లేవు అని అర్థము. అలాంటి అంతఃకరణము ఆత్మ చింతనకు పనికి రాదు. స్వచ్ఛమైన, నిస్తరంగంగా ఉండే జలము లోనే ప్రతిబింబము గోచరిస్తుంది. జలచరాల వల్ల గాని, క్రొత్తగా వచ్చి పడే జలాల వల్ల గాని, నీరు కనుక చలిస్తూ ఉంటే, ప్రతిబింబము గోచరించదు. ఒకవేళ కనిపించినా, గుర్తు పట్టలేని విధంగా ఛిన్నాభిన్నమై ఉంటుంది. ఇక బురద నీరు, బుడగల నీరు అయితే చెప్ప నవసరం లేదు. ప్రతిబింబము కనిపించే అవకాశమే ఉండదు.

విషయాసక్తి గల మనస్సు బురద నీరు వంటిది. సంయమనం లేని చిత్తము అలలతో చలించే జలము వంటిది. సమాహిత చిత్తము నిర్మల జలము వంటిది. నిస్తరంగ జలము వంటిది. అలాంటి సమాహిత చిత్తమే ఆత్మ చైతన్యమును ప్రస్ఫుటంగా ప్రతిఫలింప చేస్తుంది. ఆ సమాహిత చిత్తమే ప్రసాద బుద్ధి. అయుక్తునకు ఇది లభించదు (**నాస్తి న విద్యతే, బుద్ధిః ఆత్మ స్వరూప విషయా, అయుక్తస్య అసమాహిత అంతఃకరణస్య**).

**ఆత్మ భావన**

ఆత్మభావన అంటే, ఆత్మజ్ఞానము యొక్క విషయంలో అభినివేశం. అంటే, పట్టుదల. ప్రసాద బుద్ధి లేని అయోగ్యునికి, లేదా అయుక్తునికి ఆత్మజ్ఞానం విషయంలో పట్టుదల ఉండదు. అంటే, విషయ ధ్యానం ఉంది అని అర్థం. విషయ ధ్యానం సాగుతూ ఉంది అంటే రాగద్వేషాలు పుష్కలంగా ఉన్నాయి అని అర్థం. అలాంటి వాని బుద్ధి దృశ్యముల వైపు పరుగులు తీస్తుందే గాని, ద్రష్ట వైపు తిరగదు.

ఆత్మభావన లేని వ్యక్తిలో విషయ వాంఛానివృత్తి జరగదు. రాగద్వేషాలతో నిండి పోయిన మనస్సులో ఏకమై పోయిన వ్యక్తికి ఆత్మభావన ఎలా ఉంటుంది? వాంఛా నివృత్తి చేసుకోవాలి అని ఎందుకు అనిపిస్తుంది? తనకు ఆత్మ భావన ఏర్పడక పోవడమే గాక, మరెవరైనా హితోపదేశం చేసినా క్రోధం కలుగుతుందే గాని, వాంఛా నివృత్తికై ప్రయత్నం సాగదు.

ఒకే కుర్చీలో ఇద్దరు వ్యక్తులు కూర్చోలేరు. ఒకరు లేచిన తరువాతే మరొకరు కూర్చోగలరు. విషయాసక్తిని ఆశ్రయించిన బుద్ధిలో ఆత్మభావన ఉండదు. ఆత్మభావన ఉండాలి అంటే ప్రసాద బుద్ధి ఏర్పడి ఉండాలి. ప్రసాద బుద్ధి ఉండాలి అంటే విషయాసక్తి లేకుండా ఉండాలి. కనుక, అయుక్తు డైన వానికి ఆత్మభావన ఉండదు (**న చ అస్తి అయుక్తస్య భావనా ఆత్మజ్ఞానాభినివేశః**).

**శాంతి జీవనం**

ఆత్మానందమును పొందాలి అని భావిస్తున్న వ్యక్తి చిత్తము నిర్మలంగా ఉండాలి. ప్రశాంతంగా ఉండాలి. అలాంటి మనస్సే ఆత్మభావన చేయ గలుగుతుంది. ఆత్మభావన లేని వానికి శాంతి ఉండదు (**న చ అస్తి అభావయతః శాన్తిః**).

అయుక్తుడైన వాడు ఆత్మభావన చేయ లేడు. అశుద్ధమైన బుద్ధికి ఆత్మచింతన అలవడదు. ఇక అభినివేశం, అంటే పట్టుదల ఎలా వస్తుంది? శ్రవణ మననాదులు అట్టి వాని బుద్ధిలో జరగవు. అది బుద్ధి కాదు. సంశయాల పుట్ట. అందుచేత ఆత్మభావన సాగదు. ఉపశమము ఉండదు (**న చ అస్తి అభావయతః ఆత్మజ్ఞాన అభినివేశమ్ అకుర్వతః శాన్తిః ఉపశమః**).

**సుఖప్రాప్తి**

ఇక్కడ సుఖము అంటే నిత్యసుఖము అని అర్థం. నిరతిశయ సుఖము అని భావం. అదే ఆత్మసుఖం. ఉపశమం లేని వానికి, అంటే శాంతి లేని వానికి నిరతిశయ సుఖం ఎలా కలుగుతుంది? (**అశాంతస్య కుతః సుఖమ్**).

చిత్త సంయమనం ద్వారా విషయాల నుండి ఇంద్రియాలను మరల్చడం వల్ల ఏర్పడే ఆంతరంగిక సుఖమే ఇక్కడ కేంద్ర విషయము. అంతేగాని విషయ తృష్ణ వల్ల ఏర్పడే సుఖం కానే కాదు (**న విషయ విషయా తృష్ణా**). అలాంటి సుఖం వాస్తవానికి దుఃఖమే (**దుఃఖ మేవ హి సా**) అని శ్రీ శంకర భాష్యము.

అలాంటి విషయ తృష్ణ ఎంత వరకు ఉంటుందో, అంతవరకు జీవికి సుఖం లభించదు. చిత్తము ఉపశమిస్తేనే సుఖం ప్రాప్తిస్తుంది. అందుకనే, శాంతి లేని వానికి సుఖ మెలా కలుగుతుంది? అని ప్రశ్నించాడు గీతాచార్యుడు.

*అయుక్తుడైన వానికి ఎందుకని ఆత్మబుద్ధి ఉండదు? అంటే, దానికి సమాధానమే తరువాత శ్లోకం.*

ఇన్ద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే ।
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావ మివామ్భసి ॥ 67

*ఇంద్రియాణాం-హి-చరతాం-యత్-మనః-అను-విధీయతే*
*తత్-అస్య-హరతి-ప్రజ్ఞాం-వాయుః-నావం-ఇవ-అంభసి*

| | | | |
|---|---|---|---|
| చరతాం | = చరించుచున్న | ప్రజ్ఞాం | = బుద్ధిని |
| ఇంద్రియాణాం | = ఇంద్రియములకు | అంభసి | = నీటి యందు |
| యత్ మనః | = ఏ మనస్సు | నావం | = ఓడను |
| అనువిధీయతే | = అనుసరించి ప్రవర్తిస్తున్నదో | వాయుః ఇవ | = గాలి వలె |
| తత్ | = అట్టి మనస్సు | హరతి హి | = హరిస్తున్నది గదా! |
| అస్య | = ఈ మనుజుని యొక్క | | |

**ఇంద్రియాలు ఇంద్రియ విషయాల వైపు పరుగు లెత్తుతూ ఉంటే, వాటి వెంటబడి తిరిగే మనస్సు మానవుని వివేకాన్ని హరించి వేస్తుంది. ఎలాగో తెలుసా? నీటిలో పయనించే నావను గాలి పెడదారి పట్టించినట్లు.**

**వ్యాఖ్య**

ఈ జీవితం లోని అనుభవాలు, ఈ జన్మ లోనివే కాకుండా గత జన్మల లోనివి కూడా, ఎన్నో, ఎన్నెన్నో కలిపి మనల్ని ఈనాటి జీవన స్థితికి నెట్టాయి. ఏ బాధకు ఏది ప్రధాన కారణమో తెలియక పోయినా, కారణం లేకుండా మాత్రం ఏ కార్యము జరగదని మనకు తెలుసు.

బాధలతో బ్రతుకును ఈడ్చుకుంటూ పోవడము ఎవ్వరికీ ఇష్టం ఉండదు. కాని, బాధల నుండి విడి పడటం కూడా ఎవ్వరికీ సాధ్యం కావడం లేదు. అందుకే ప్రతి ఒక్కరికి బ్రతుకు బాధలమయం అనిపిస్తూ ఉంటుంది.

అవసరం లేని వాటిని మనస్సు నుండి తొలగిస్తేనే ఈశ్వర జ్ఞానం మనస్సులో నిలుస్తుంది. మనస్సు నిండా ప్రపంచాన్ని నింపుకొని, ఆత్మజ్ఞానం కావాలి, ఈశ్వర ధ్యానం సాగాలి అంటే అది సాధ్యపడే విషయం కాదు.





ఏ విషయంలో ఎవరికి ఆసక్తి ఉందో, ఎవరి విషయంలో ఎవరికి అనురక్తి ఉందో తెలియదు గాని, ఎవరి విషయంలో వారికి ఆసక్తి ఉండి తీరాలి. మనల్ని మనమే పట్టించుకోక పోతే, మనల్ని పట్టించుకో వలసిన అవసరం ఎవరికి ఉంటుంది? మన విషయంలో మనమే జాగ్రత్త పడాలి. మనకు హాని చేయడంలో మనను మించిన వారు ఎవరో ఉంటా రనేది అవాస్తవం. ఇంతవరకు జన్మాదిగా మనల్ని మనమే పాడు చేసుకుంటూ వచ్చాము. కాబట్టి మనల్ని మనమే బాగు చేసుకోవాలి. మనల్ని మనం పాడు చేసుకో కూడదు. మనల్ని పాడు చేసే అవకాశాన్ని మరొకరికి ఇవ్వ కూడదు. ఆ విషయంలో ఇంద్రియ మనస్సులు కూడా విలక్షణం కావు.

బాహ్య దృష్టితో విరించి విశ్వరచన చేశాడు. అందుచేత సృష్టిలో అన్నీ బాహ్య వ్యాపారాలే కనిపిస్తాయి. చెట్లు ప్రాణవాయువును విడుస్తూ ఉంటాయి. సాగరజలాలు ఆవిరిని విడిచి విడిచి మేఘాల్ని తయారు చేస్తూ ఉంటాయి. భూమి లోపల విత్తనాన్ని నాటినా, అది భూమిని పెల్లగించుకొని బాహ్యానికి దూసుకొస్తుంది. అన్నీ బాహ్యం లోకి పరుగులు పెట్టేవే. ఈ విషయంలో ఇంద్రియాలు ప్రత్యేకం కావు. మనస్సు విశేషం కాదు.

చలించే లక్షణం గల ఇంద్రియాలు విచ్చల విడిగా బాహ్య ప్రపంచంలో చరిస్తూ ఉంటాయి. అది వాటి స్వభావం. ఇంద్రియాలు తమ తమ విషయాలలో చరిస్తూ ఉంటాయి. ప్రవర్తిస్తూ ఉంటాయి (**ఇంద్రియాణాం చరతాం స్వస్వ విషయేషు ప్రవర్తమానానాం**). అవి అలా చరిస్తూ ఉంటే, మనస్సు వాటిని అనుసరించి ప్రవర్తిస్తూ ఉంటుంది (**మనః అను విధీయతే, అను ప్రవర్తతే**).

ఇంద్రియాలు ఇంద్రియ విషయాల వైపు పరుగులు తీస్తే వచ్చే నష్టమేమీ లేదు. ఇంద్రియాలు విషయాలతో సంయోగం చెందకుండా ఉండ లేవు. కన్ను ఇంద్రియము. రూపము, లేదా రంగు ఇంద్రియ విషయము. కన్ను పని చేస్తూ ఉంది అంటే, రూపాలు కనిపించకుండా ఎలా ఉంటాయి? చెవి ఉంది కనుక శబ్దం వినిపిస్తుంది. దానిని ఎవరు ఆపగలరు? విషయాలు ఉంటే నష్టం లేదు. ఇంద్రియాలు వాటితో ఏకమైనా వచ్చే కష్ట మేమీ ఉండదు. మనస్సు వెళ్ళి ఇంద్రియాలతో ఏకమై నపుడే సమస్యలు తలెత్తు తున్నాయి.

కనిపించే ప్రతి వస్తువును కళ్ళు చూస్తాయి. కళ్ళు చూచే వస్తువు లన్నీ మనస్సుకు అవసరం లేదు. మనస్సుకు ఏది అవసరమో దానినే మనస్సు కోరుకుంటుంది. శబ్దాలైనా, వాసనలైనా, రుచులైనా, స్పర్శ లైనా ఏవైనా అంతే. ఇలా ఇంద్రియాలు విషయాలలో వ్యవహరిస్తూ ఉంటే, ఏ మనస్సైతే వాటిని అనుసరించి తిరుగుతూ ఉంటుందో, ఆ మనస్సు యోగయుక్తుని బుద్ధిని హరిస్తుంది (**తత్ అస్య ప్రజ్ఞాం హరతి**).

ఇక్కడ ప్రజ్ఞ అంటే 'ఆత్మానాత్మ వివేకము వలన కలిగిన జ్ఞానము' అని అర్థం (**ఆత్మానాత్మ వివేక జాం**). అట్టి జ్ఞానాన్ని మనస్సు హరిస్తుంది. నశింప చేస్తుంది (**నాశయతి**). ఆత్మానాత్మ వివేకము నశించడం వల్ల ఇంద్రియ మనస్సులు విషయ సుఖాల వెంట బడి పరుగులు తీస్తాయి. జీవిని వెతలలో పడదోస్తాయి.

తే॥ జ్ఞాన విజ్ఞాన యుతుఁడయ్యు సంతతంబు
నాత్మ భావన లేకున్న యతని యింద్రి
యంబులు మనంబు తమకు వశంబుఁ జేసి
విషయ సుఖముల చవిఁజూపి వెతలఁ బెట్టు

అని సీతారామాంజనేయ సంవాదము.

ఇంద్రియాల వెంట బడి విషయాల వైపు పరుగులు పెట్టే మనస్సు యోగయుక్తుని ఆత్మానాత్మ వివేక జ్ఞానాన్ని హరిస్తుంది అన్నాడు గీతాచార్యుడు. అది ఎలా? (**కథం?**). నీటి లోని పడవను గాలి ఎలాగో అలాగ అంటున్నాడు (**వాయుః నావమ్ ఇవ, అంభసి ఉదకే**).

నీటిలో ప్రయాణం చేసే వాళ్ళు ఓడలలో పయనిస్తూ ఉంటారు. ఓడలు వారు చేరాలకున్న గమ్యము వైపు ఒక నిర్దిష్టమైన మార్గంలో నడుస్తూ ఉంటాయి. ఈ లోగా పెనుగాలి వీస్తుంది. అలా వీచిన గాలి ఓడను పెడత్రోవ పట్టిస్తుంది. మరొక దిశకు లాక్కొని పోతుంది. సుడిలో పడదోసినా ఆశ్చర్యం లేదు.

అలాగే, యోగయుక్తుని ప్రజ్ఞ ఆత్మ వైపు సాగిపోతూ ఉంటే, మనస్సు పెనుగాలి లాగా అతని ప్రజ్ఞను దారి మళ్ళించి, విషయాల వైపు త్రిప్పుతుంది. విషయ సుడిగుండంలో పడ దోస్తుంది.

కనుక మనస్సు బుద్ధితో చేరి ఆత్మప్రాప్తి కొరకు యత్నించాలే గాని, ఇంద్రియాలతో చేరి విషయ సుఖాల వైపు పరుగు పెట్ట కూడదు.

*రాగద్వేషాలను తటస్థ పరచి, ఇంద్రియాలను నిగ్రహించడమే స్థిరమైన ప్రజ్ఞకు హేతువు అని బోధిస్తూ, ఇంద్రియ నిగ్రహ ప్రకరణాన్ని తరువాత శ్లోకంలో సమాప్తి చేస్తున్నాడు.*

తస్మా ద్యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః । 68
ఇన్ద్రియా ణీన్ద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥

**తస్మాత్-యస్య-మహాబాహో-నిగృహీతాని-సర్వశః**
**ఇంద్రియాణి-ఇంద్రియార్థేభ్యః-తస్య-ప్రజ్ఞా-ప్రతిష్ఠితా**

| | | | |
|---|---|---|---|
| మహాబాహో = | అర్జునా! | ఇంద్రియాణి = | ఇంద్రియములు |
| తస్మాత్ = | అందువలన | నిగృహీతాని = | నిగ్రహింప బడినవో |
| ఇంద్రియార్థేభ్యః = | ఇంద్రియ విషయముల నుండి | తస్య = | వాని యొక్క |
| సర్వశః = | అన్ని విధముల | ప్రజ్ఞా = | బుద్ధి |
| యస్య = | ఎవని యొక్క | ప్రతిష్ఠితా = | స్థిరమై ఉంది |

**అర్జునా! కాబట్టి, ఇంద్రియాలు ఇంద్రియ విషయాల నుండి అన్ని విధాలా నిగ్రహింప బడాలి. అలాంటి వాని జ్ఞానమే సుస్థిరంగా ఉంటుంది.**

**వ్యాఖ్య**

**నిగ్రహమే నిర్ణయం**

మనస్సు నిరంతరం చలిస్తూ ఉంటుంది. మనస్సు చలించ డానికి, చరించ డానికి దారులు రెండే ఉన్నాయి. మనస్సు ఇంద్రియాల ద్వారా అధోముఖంగా పయనించి, ఇంద్రియ విషయాలలో రమిస్తూ, అనిత్యమైన సంసారాన్ని తయారు చేసుకోవచ్చు. లేదా, బుద్ధి ద్వారా ఊర్ధ్వంగా పయనించి ఆత్మానందాన్ని పొందవచ్చు. మనస్సు అధోముఖంగా నడక సాగిస్తే కలిగే దుర్గతిని, ఊర్ధ్వంగా పయనిస్తే ప్రాప్తించే సద్గతిని తెలియ చేసిన తరువాత, ***తస్మాత్*** - అందుచేత, బుద్ధి ద్వారా ఆత్మప్రాప్తి కొరకే యత్నించ మని, దానికి ఇంద్రియాలను నిగ్రహించడమే ప్రధానమైన సాధన మని తెలియ చేస్తూ, ఈ శ్లోకంతో ఇంద్రియనిగ్రహ ప్రకరణాన్ని సమాప్తి చేస్తున్నాడు భగవంతుడు.

వివేకవంతుడు శుద్ధ మనస్సును తయారు చేసుకోవాలి. ఇంద్రియాలు మనస్సుకు లోబడి చరించాలి. శుద్ధ బుద్ధి సూచించినట్లు విహిత కర్మల యందే ఇంద్రియాలు చరిస్తూ ఉండాలి. విషయాల లోకి వెళ్ళమని మనస్సు ఆజ్ఞాపించి నపుడే ఇంద్రియాలు ముందుకు సాగాలి. తిరిగి రమ్మని చెప్పగానే తల వంచి తిరిగి వచ్చే లాగా ఉండాలి.





బండిని గుఱ్ఱాలు లాగుతూ ఉంటాయి. కళ్ళెము మాత్రం సారథి చేతి లోనే ఉంటుంది. కళ్ళెముల యొక్క పట్టు విడుపులను బట్టి గుఱ్ఱాలు పరుగెత్తుతూ ఉండాలి. కళ్ళెమును గట్టిగా పట్టి లాగ గానే గుఱ్ఱాలు ఆగి పోవాలి. ఆగిపోతాయి కూడా.

బ్రతుకు బండిని ఐదు గుఱ్ఱాలు లాగుతూ ఉంటాయి. మనస్సు కళ్ళెము, బుద్ధి సారథి. బుద్ధి అనే సారథి ఆజ్ఞలను పాటిస్తూ మనస్సు అనే కళ్ళెము, ఇంద్రియములు అనే గుఱ్ఱములు ప్రవర్తిస్తూ ఉండాలి. అప్పుడే గమ్యము సుగమ మవుతుంది.

**ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవ తు**
**బుద్ధిం తు సారథిం విద్ధి మనః ప్రగ్రహ ఏవ చ**
**ఇంద్రియాణి హయా నాహుః విషయాం స్తేషు గోచరాన్**

ఆత్మ రథము యొక్క యజమాని. శరీరమే రథము. బుద్ధియే సారథి. మనస్సు కళ్ళెము. ఇంద్రియాలే గుఱ్ఱములు. ఇంద్రియ విషయాలే మార్గములు అని అద్భుతంగా ప్రవచించింది కఠోపనిషత్తు.

ఇంద్రియాలు ఇంద్రియ విషయాల నుండి అన్ని విధాల నిగ్రహింప బడాలి ( **ఇంద్రియాణి సర్వశః ఇంద్రియార్థేభ్యః నిగృహీతాని** ). ఏదో ఒక్క ఇంద్రియాన్ని మాత్రం నిగ్రహిస్తే సరిపోదు. సర్వేంద్రియములు నిగ్రహింప బడాలి. అది కూడా సంపూర్ణంగా నిగ్రహింప బడాలి. త్రికరణ శుద్ధిగా నియమింప బడాలి ( **సర్వశః సర్వ ప్రకారైః మానసాది భేదైః** ). ఒక వైపు విషయాలు ప్రేరేపిస్తున్నా, ఇంద్రియాలు నిగ్రహంతో ఉండాలి. మనస్సు సంయమనంతో ఉండాలి.

మనస్సును నిగ్రహించే ప్రయత్నం చేయడమే కాదు, అది చక్కగా నిగ్రహింప బడిందో లేదో వీక్షిస్తూ ఉండాలి. సాధారణంగా అందరూ గమ్యాన్ని చేరాలి అనే కోరుకుంటారు గాని, మార్గాన్ని విస్మరిస్తూ ఉంటారు. మార్గాన్ని బట్టే గమ్యం ఉంటుంది. మార్గం విషయంలో శ్రద్ధ వహించే వారు గమ్యాన్ని తప్పక చేరుతారు.

స్థిత ప్రజ్ఞత్వం కావాలి అని అందరూ ఆశిస్తారు. మనస్సు ఏ వైపు పోతుందో పట్టించుకోరు. ప్రేయో మార్గంలో చరించే బుద్ధికి వివేక ప్రజ్ఞ కుదరదు. శ్రేయో మార్గంలో చరించే బుద్ధికే స్థిరత్వం ఉంటుంది. మన మనస్సు ఎటు నడుస్తూ ఉందో అనుక్షణం గమనిస్తూ ఉండాలి. అట్టివారే స్థితప్రజ్ఞులై శోభిస్తారు.

**కోరుకొమ్మంటివి రెండు వరాలు నన్ను**
**కోరుకొంటిని చేతులు రెండు కలిపి**
**ఒకటి జగతి మరపు వేరొకటి శివుని వలపు**
**నీ అడుగుల కడ పడి ఉండు నీలకంఠా!**

నీలకంఠ శతకంలో ఇదొక విబూది పండు.

ఈ శ్లోకంలో అర్జునుణ్ణి **మహాబాహో!** అని సంబోధించాడు పరమేశ్వరుడు. అంటే గొప్ప బాహువులు కలవాడా! అని అర్థం. గొప్ప శక్తిసామర్థ్యాలు కలవాడు అని భావం. తన బాహుబలం చేత సమర రంగంలో శత్రువులను తుద ముట్టించగల సామర్థ్యం కలవాడు సవ్యసాచి. శత్రువులను నిలువరించి గొప్ప బాహువులు కలవాడు అనే ఖ్యాతిని సాధించినట్లే, ఇంద్రియాలను నిగ్రహించి, మనస్సును నియమించి, మహా బుద్ధిమంతుడు, స్థితప్రజ్ఞుడు అనే యశస్సును కూడా సాధించ మని ప్రోత్సహించడమే **మహాబాహో!** అనే సంబోధన లోని అంతర్భావం.

స్థితప్రజ్ఞ వైభవాన్ని యాభై ఐదవ శ్లోకం నుండి ప్రవచించడం ప్రారంభించిన పార్థసారథి, యాభై ఎనిమిదవ

శ్లోకంలో ఈ ఇంద్రియ నిగ్రహ ప్రకరణాన్ని ప్రారంభించి, అరవై ఎనిమిదవ శ్లోకంలో సమాప్తి చేశాడు. యాభై ఎనిమిదవ శ్లోకం లోని రెండవ పాదము, అలాగే అరవై ఎనిమిదవ శ్లోకం లోని రెండవ పాదము అక్షరం కూడా మార్పు లేకుండా ఒకే విధంగా ఉన్నాయి. **ఇంద్రియాణీన్ద్రియార్థేభ్యః తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా** అంటూ నిగ్రహ ప్రకరణాన్ని ఆద్యంతాలలో ఒకే విధంగా పలికి, ఇంద్రియ నిగ్రహము యొక్క ఆవశ్యకతను నొక్కి వక్కాణించాడు భగవంతుడు.

తరువాత శ్లోకం నుండి విషయం మరొక మలుపు తిరుగుతూ ఉంది. స్థితప్రజ్ఞుని వైభవాన్ని తరువాత మూడు శ్లోకాలలో వివరిస్తున్నాడు గీతాచార్యుడు.

**యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ । 69**
**యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః ॥**

యా-నిశా-సర్వభూతానాం-తస్యాం-జాగర్తి-సంయమీ
యస్యాం-జాగ్రతి-భూతాని-సా-నిశా-పశ్యతః-మునేః

| | | | | | |
|---|---|---|---|---|---|
| సర్వభూతానాం | = | సమస్త ప్రాణులకు | భూతాని | = | భూతములు |
| యా | = | ఏది | జాగ్రతి | = | మేల్కొని ఉంటాయో |
| నిశా | = | రాత్రియో | సా | = | అది |
| తస్యాం | = | దాని యందు | పశ్యతః | = | పరమార్థ తత్త్వాన్ని చూస్తున్న |
| సంయమీ | = | యోగి | మునేః | = | మునికి |
| జాగర్తి | = | మేల్కొని ఉంటాడు | నిశా | = | రాత్రి |
| యస్యాం | = | దేని యందు | | | |

**ఏది సర్వ ప్రాణులకు రాత్రియో, దాని యందు జితేంద్రియుడైన యోగి మేల్కొని ఉంటాడు. దేని యందు సర్వ ప్రాణులు మేల్కొని ఉంటాయో అది పరమార్థమును వీక్షిస్తున్న మునికి రాత్రి.**

**వ్యాఖ్య**

జ్ఞానం వల్ల మోక్షం వస్తుందా? అదే వాస్తవ మైతే, మోక్షానికి నిమిత్తం ఉంది అని చెప్పవలసి వస్తుంది. అప్పుడు మోక్షంలో ప్రాప్తించేది నిరతి శయానందము కాకుండా పోతుంది. మోక్షం కూడా నైమిత్తిక సుఖంగా మిగిలి పోతుంది. జ్ఞానం వల్ల మోక్షము వచ్చేట ట్లయితే, జ్ఞానం లేక ముందు మోక్షం లేనిదే అవుతుంది. అలాంటిది ఎలాంటి మోక్షమో తెలియదు గాని, నిత్యమోక్షం మాత్రం కాలేదు. ఒకప్పుడు లేకుండా మరొకప్పుడు కలిగేది ఏదయినా కాల పరిధి లోకే వస్తుంది. కాలపరిధిలో ఉన్నది ఏదీ నిత్యం కాదు.

మోక్షం సదా ఉన్నదే. జ్ఞానం వల్ల మోక్షం కలుగుతుంది అనేది వాస్తవం కాదు. మోక్షమే జ్ఞానరూపంలో ఉంది అనేది సత్యం. జ్ఞానం వల్ల అజ్ఞానం తొలగుతుంది. అంతే. మోక్షము అనేది దేని యొక్క ఫలమూ కాదు. అది కేవలం స్వరూప వైభవము. సత్య జ్ఞానానంద స్థితి. ఈ స్థితిలో దివ్యంగా ప్రకాశించే వాడే స్థితప్రజ్ఞుడు. ఆత్మవిదుడైన స్థితప్రజ్ఞుని వైభవాన్ని అద్భుతంగా వర్ణిస్తూ ఉంది ప్రస్తుత శ్లోకం.

ఇది ఆలంకారిక భాషలో చెప్పబడిన గ్రంథి శ్లోకం. 'గ్రంథి' అంటే సంస్కృతములో ముడి అని ఒక అర్థం. దారం ముడి పడుతుంది. ఒకొక్కసారి చిక్కుముడి పడుతుంది. దానిని జాగ్రత్తగా విప్పాలి. లేదా, మొదటికే మోసం వచ్చి, మరీ బిగుసుకు పోతుంది. శాస్త్రంలో అక్కడక్కడ ఇలాంటి గ్రంథి శ్లోకాలు అగుపిస్తూ





ఉంటాయి. వాటిని జాగ్రత్తగా అర్థం చేసుకుంటే దివ్యమైన మణులు లభ్య మవుతాయి. తొందరపడి అస్తవ్యస్తంగా అర్థం చేసుకుంటే, విషయం మరీ జటిల మవుతుంది.

సమస్త ప్రాణులకు ఏది రాత్రి సమయమో అది స్థితప్రజ్ఞానికి పగలు. సర్వ ప్రాణులకు ఏది పగలో అది జ్ఞానికి రాత్రి. ఇది శ్లోకం యొక్క భావం.

ఇలాంటి శ్లోకాల విషయంలో కేవలం అక్షరార్థం, వాక్యార్థం గ్రహిస్తే సరిపోదు. లక్ష్యార్థాన్ని గ్రహించాలి. ఏ అంతర్భావం ఇందులో ఇమిడి ఉందో, దాగి ఉందో దానిని సశాస్త్రీయంగా అర్థం చేసుకునే ప్రయత్నం చేయాలి.

కేవలం వాక్యార్థాన్ని గ్రహిస్తే మాత్రం అంతా అయోమయంగా ఉంటుంది. అందరూ నిద్రపోయే రాత్రి సమయాన జ్ఞాని మేల్కొని ఉంటాడు అని చెబితే, ఆ తరువాత రాత్రి పూట కాపలా కాచే వాళ్ళు, రాత్రి ఉద్యోగాలు చేసే వాళ్ళు, దొంగలు అందరూ అదృష్టవశాత్తు జ్ఞానులై కూర్చుంటారు.

**దివారాత్రములు**

రాత్రి పూట చీకటి దట్టంగా అలుముకొని ఉంటుంది. తదేకంగా చూచినా చీకటిలో ఏదీ కనిపించదు. ఏది ఏమిటో అర్థం కాదు. పగటి పూట వెలుగు ఉంటుంది కనుక చూస్తే కనిపిస్తుంది. ఈ సందర్భంలో, అందరికీ ఏది రాత్రి సమయమో, అది సంయమ శీలుడైన స్థితప్రజ్ఞానికి పగలు అంటున్నాడు. అంటే, అందరూ ఎక్కడైతే చూడలేని స్థితిలో ఉన్నారో, అక్కడ స్థితప్రజ్ఞుడు చూస్తున్నాడు అని అర్థము. అలాగే ఏది సర్వులకు పగలో, అది జ్ఞానికి రాత్రి అంటున్నాడు. అంటే, అందరూ చూచే దానిని జ్ఞాని చూడలేక పోతున్నాడు అని అర్థం.

లౌకికులకు ప్రపంచం సత్యము. జ్ఞానికి పరమాత్మ సత్యము. ప్రపంచము ప్రపంచముగా సామాన్యులకు గోచరిస్తుంది. ప్రపంచము పరమాత్మగా యతివరేణ్యునికి అగుపిస్తుంది. అందరూ చూచేది ఆత్మవిదునికి అగుపించదు. ఆత్మజ్ఞాని చూచే దానిని సర్వులూ వీక్షించ లేరు. ఏది అతనికి వెలుగో, అది అన్యులకు చీకటి. ఏది సర్వులకు ప్రకాశమో, అది జ్ఞానికి తిమిరము.

ఇంద్రియ విషయానుభవములో సామాన్యులు సదా మేల్కొని ఉంటారు. అక్కడ జ్ఞాని నిద్రించిన వాడే. ఆత్మానందములో జ్ఞాని రమిస్తూ ఉంటాడు. అక్కడ లౌకికులు నిద్రించిన వారే.

వ్యావహారిక ప్రపంచములో లౌకికులు మేల్కొని ఉంటారు. అక్కడ ముని నిద్రిస్తూ ఉంటాడు. అంటే, ఎరుక లేకుండా ఉంటాడు. పారమార్థిక స్ఫురణతో స్థితప్రజ్ఞుడు శోభిస్తూ ఉంటాడు (**పరమార్థ తత్త్వం స్థితప్రజ్ఞస్య విషయః**). అక్కడ సామాన్యులు నిద్రిస్తూ ఉంటారు.

**ఆనందానుభూతి**

స్థితప్రజ్ఞుని వైభవాన్ని వర్ణించడం ప్రారంభిస్తూ, స్థితప్రజ్ఞుని లక్షణాన్ని (**కా భాషా ?**) వివరించే యాభై ఐదవ శ్లోకంలో, మనస్సు లోని కోరికలను సంపూర్ణంగా విడిచిపెట్టి, తన ఆత్మ యందే ఆత్మానందమును పొందువాడు స్థితప్రజ్ఞుడు అని నిర్వచించడం జరిగింది.

కోరికల్ని పట్టుకొని వ్రేలాడే వారు సాధారణ మానవులు. అది వారికి పగలు. సమస్త కోరికల్ని త్యజించిన యతికి కోరికల స్పృహ లేనందున అది అతనికి రాత్రి.

ఆత్మ యందు ఆత్మానందమును అనుభవించే వాడు జ్ఞాని. కనుక, అది అతనికి పగలు. ఆత్మానందము అనేది ఒకటి ఉందని కూడా తెలియని సామాన్యులకు ఆ స్థితి చీకటి కాలమే. రాత్రి సమయమే.

సామాన్యుల సుఖం అనిత్యం. స్థితప్రజ్ఞుని ఆనందం నిత్యం. సామాన్యుల సుఖానికి కారణాలు ఉన్నాయి. అందుచేత వారు అనుభవించేది నైమిత్తిక సుఖం. స్థితప్రజ్ఞుని ఆనందం మరొక నిమిత్తం ద్వారా ప్రాప్తించింది కాదు. అందుచేత అతడు అనుభవించేది నిర్నిమిత్త సుఖం.

ఈ విధంగా విద్యావిద్యల తారతమ్యం తెలుస్తూ ఉంది. జ్ఞానాజ్ఞానాల వ్యత్యాసం అర్థమవుతూ ఉంది. జ్ఞానికీ అజ్ఞానికీ భేదం అనేది వ్యవహారంలో కనిపించేది కాదు. భావంలో ప్రస్ఫుట మయ్యేది. ఇదొక ఆశ్చర్యకరమైన విషయం. కాకి గూబల అనుభవం లాగా విచిత్ర మైనది.

*కాకోలూక నిశేవాఽయం సంసారోఽజ్ఞాత్మ వేదినోః*

వివేకము గల జ్ఞానుల, అవివేకము గల అజ్ఞానుల యొక్క ఈ సంసారము కాకి గూబల రాత్రి వంటిది అన్నది శాస్త్రము.

రాత్రి చీకటి గల కాకికి ఏది పగలో, పగలు చీకటి గల గూబకు అది రాత్రి. రాత్రి యందు చూపు గల గూబకు ఏది పగలో, పగలు చూపు గల కాకికి అది రాత్రి. వ్యాఖ్యను కూడా గ్రంథి వాక్యాలలో చెప్పుకొని ఆనందించాలని అలా వ్రాశాను. అంతే.

భానుని వెలుగు గువ్వకు పిలుపు
తెలియని గూబకు దివి నలుపు
బ్రహ్మమయము విశ్వము సర్వము
తెలియని వానికి భ్రమమయము
గలగల పారును నదిలో జలము
గతుకుట మానదు శునకము
రామ రామ జయ రాజారామ్
రామ రామ జయ సీతారామ్

అని ఒక రామజోగి చిట్కా.

అజ్ఞానులైన వారికి పరమార్థ తత్త్వం రాత్రి లాంటి రాత్రి (*అజ్ఞానినాం సర్వ భూతానాం నిశా ఇవ నిశా పరమార్థ తత్త్వమ్*). అవిద్యా నిద్ర నుండి మేల్కొన్న సంయమి, జితేంద్రియుడు అయిన యోగి, పరమార్థ తత్త్వ రూపమైన దాని యందు మేల్కొని యున్నాడు (*తస్యాం పరమార్థ తత్త్వ లక్షణాయాం అజ్ఞాన నిద్రాయాః ప్రబుద్ధః సంయమీ జితేంద్రియః యోగీ ఇత్యర్థః*) అని ఆచార్యుల వారి భాష్యము.

**జ్ఞానోదయం**

జ్ఞాని అద్వైతానుభూతిలో శోభిస్తున్నాడు. ద్వైతము అనేది అతనికి రాత్రి. అవిద్యావస్థలో ఉన్న వారికి ద్వైత ప్రపంచము సత్యమే అనిపించ వచ్చు. కారణం, గ్రాహ్య గ్రాహక సంబంధం ఉండటమే. 'గ్రాహ్యము' అంటే గ్రహింప బడునది. 'గ్రాహకము' అంటే గ్రహించునది.

ఈ విధమైన గ్రాహ్య గ్రాహకములు స్వప్నంలో కూడా ఉన్నాయి కదా! స్వప్నము అవిద్యా రూపమే కదా! అలాగే, గ్రాహ్య గ్రాహక సంబంధం ఉన్న జాగ్రదవస్థ కూడా అవిద్యా రూపమే కనుక జ్ఞానికి జాగ్రత్ప్రపంచం కూడా రాత్రి వంటిదే.

జ్ఞాతృ - జ్ఞాన - జ్ఞేయములు అనే త్రిపుటి స్వప్నంలో తెలుస్తూ ఉండినా, నిద్ర నుండి మేలుకోగానే ఆ మూడూ లేనివే అవుతున్నాయి. కనుక జ్ఞానికి ద్వైతమే రాత్రి. అద్వైతమే పగలు.





మరి, ప్రమాణమైన శాస్త్రం విషయం ఏమిటి? వేదము ప్రమాణము. స్వప్నము నందు, ప్రపంచము నందు గ్రాహ్య గ్రాహకములు ఎలా తెలుస్తున్నాయో, అలాగే వేదము యొక్క పూర్వార్థ మంతా కూడా ఈ గ్రాహ్య గ్రాహకముల తోనే నిండి ఉంది. కర్మ ప్రవృత్తే గోచరిస్తూ ఉంది. సాధ్య సాధనాలను గూర్చి ప్రసంగిస్తూ వేదము కూడా కర్మను ప్రవేశ పెడుతూనే ఉంది. ఇదంతా రాత్రి లాంటి అవిద్య అని తెలుసుకున్న జ్ఞాని కర్మల నుండి విడిపడు తున్నాడు. ఆత్మజ్ఞానం కలిగే వరకే ప్రమాణము యొక్క ప్రమాణత్వం ఉంటుంది. ఆత్మజ్ఞానం కలిగిన తరువాత, తానే అద్వితీయాత్మగా ప్రకాశిస్తూ ఉన్నందున, ప్రమాణ ప్రమేయాలకు అవకాశం ఎక్కడుంది? తెలిపేది, తెలియబడేది అనే ద్వైతానికి అవకాశ మెక్కడుంది?

తెలియదగింది ప్రమేయము. తెలుసుకొనే వాడు ప్రమాత. ప్రమేయం ఉంటేనే ప్రమాత ఉంటాడు. ప్రమేయం ఉండటం వల్ల ప్రమాతకు ప్రమాతృత్వం ఉంటుంది. ప్రమాతే ప్రమేయము అనే అద్వయ జ్ఞానం కలిగి నపుడు, అంతవరకు ఉన్న ప్రమాతృత్వం కూడా తొలగిపోతూ ఉంది. అంత్య ప్రమాణమైన శాస్త్రం ఆత్మ యొక్క ప్రమాతృత్వాన్ని కూడా నివర్తింప చేస్తుంది. ఎప్పుడైతే, ప్రమాతృత్వాన్ని నివర్తింప చేస్తుందో, అప్పుడు స్వప్నం లోని ప్రమాణాలు మేలుకున్న తరువాత అప్రమాణ మైనట్లు, ప్రమాణమైన శాస్త్రం కూడా ఈ అఖండానంద స్థితిలో అప్రమాణ మవుతుంది (*నివర్తయదేవ చ అప్రమాణీ భవతి స్వప్న కాల ప్రమాణ మివ ప్రబోధే*). ఇదే జ్ఞాని వైభవము. ఆత్మజ్ఞాన వైభవము. ఈ వైభవమే తానైన వాడు స్థితప్రజ్ఞుడు. దీనికి భిన్నంగా ఇంద్రియ విషయాలను వెంబడించి చరించువాడు హతప్రజ్ఞుడు, లేదా గతప్రజ్ఞుడు.

*ఉత్పన్న శక్తిబోధస్య త్యక్త నిశ్శేష కర్మణః*
*యోగినః సహజావస్థా స్వయ మేవ ప్రకాశతే ॥*

జ్ఞానశక్తిని పొందిన వాడు, కర్మలను సంపూర్ణంగా త్యజించిన వాడు అయిన యోగికి సమాధి స్థితి స్వయంగా, సహజంగా కలుగుతూ ఉంది అన్నది ఉపనిషత్తు.

విషయాసక్తిని విడిచి, రాగద్వేషాలను తటస్థ పరచి, స్థితప్రజ్ఞుడైన మహాత్మునికే మాత్రమే మోక్షం ప్రాప్తిస్తుంది గాని, విషయాలను కోరే వాడికి కాదు అనే సత్యాన్ని సోదాహరణంగా ప్రతిపాదిస్తున్నాడు.

**ఆపూర్యమాణ మచల ప్రతిష్ఠం సముద్ర మాపః ప్రవిశన్తి యద్వత్ ।**
**తద్వత్కామా యం ప్రవిశన్తి సర్వే స శాన్తి మాప్నోతి న కామకామీ ॥** 70

*ఆపూర్యమాణం-అచల-ప్రతిష్ఠం-సముద్రం-ఆపః-ప్రవిశంతి-యద్వత్*
*తద్వత్-కామాః-యం-ప్రవిశంతి-సర్వే-సః-శాంతిం-ఆప్నోతి-న-కామకామీ*

| | | | |
|---|---|---|---|
| ఆపూర్యమాణం | = నింపబడుతూ ఉన్నా | సర్వే | = అన్నియును |
| అచలప్రతిష్ఠం | = మార్పు లేని స్థితి గల | యం | = ఎవనిని |
| సముద్రం | = సముద్రమును | ప్రవిశంతి | = చేరుతున్నాయో |
| యద్వత్ | = ఏ విధముగ | సః | = అతడు |
| ఆపః | = జలములు | శాంతిం | = శాంతిని |
| ప్రవిశంతి | = ప్రవేశిస్తాయో | ఆప్నోతి | = పొందుతాడు |
| తద్వత్ | = ఆ విధంగా | కామకామీ | = కామములు కోరేవాడు |
| కామాః | = కామములు | న | = పొందడు |

**ఎంతగా నిండుతున్నా, హద్దు మీరకుండా స్థిరంగా ఉండే సముద్రములో నదీ జలాలు ప్రవేశిస్తూనే ఉంటాయి.**

అలాగే సమస్తమైన భోగ్య విషయాలు ఏ వికారాన్ని కలిగించకుండా ఎవనిలో ప్రవేశిస్తున్నాయో, అతడే శాంతిని పొందుతాడు. కోరికలు కోరేవాడు పొంద లేడు.

**వ్యాఖ్య**

అందరూ పూర్ణత్వాన్ని వాంఛిస్తారు. పూర్ణత్వము అనేది లేనిదే అయితే దానిని పొందాలి అనే ఆశ ఎలా ఉదయిస్తుంది? పూర్ణత్వము అనేది ఉన్నదే అయితే, ఉన్న పూర్ణంలో నువ్వు వేరుగా ఎలా ఉండ గలవు? పూర్ణము ఉంది. ఏదైనా ఉన్నది అంటే, దానికి సంబంధించిన జ్ఞానము కూడా ఉంటుంది. పూర్ణము ఉంది కనుక పూర్ణానికి సంబంధించిన జ్ఞానము కూడా ఉండాలి. ఆ జ్ఞానము కలిగితే పూర్ణము ఏమిటో తెలుస్తుంది. ఏమని తెలుస్తుంది? నీ కన్నా వేరుగా పూర్ణము అనేది ఒకటి ఉంది అని కాదు, నీవే పూర్ణమని. శూన్యము తెలియని పూర్ణమని. కోరిక కదలని పూర్ణమని. కొరత తెలియని పూర్ణమని.

వ్యవహారంలో కూడా పూర్ణం అనే పదాన్ని మనం వాడుతూ ఉంటాము. చెరువు పూర్ణంగా నిండింది అంటాము. కడుపు పూర్ణంగా నిండింది అంటాము. కాని, కాల వ్యవధిలో చెరువు పూర్ణంగా లేదని తెలుస్తుంది. కొన్ని గంటల తరువాత మళ్ళీ కడుపు ఖాళీగా ఉంది అని అర్థ మవుతుంది. కనుక ఇవన్నీ పూర్ణాలే అయినా, కారే అవకాశాన్ని, కూరే అవసరాన్ని త్రోసి పుచ్చలేవు. ఆ మామిడిపండు రసపూర్ణంగా ఉంది అంటాము. అంటే, అందులో పూర్ణంగా రసమే ఉందా? తొక్క, పిక్క లేవా? ఇలాగే ఉంటాయి వ్యవహారంలో పూర్ణాలు. తొలగించేవి, తగిలించేవి లేకుండా స్వతః పూర్ణంగా ఉండే జ్ఞానమే పూర్ణజ్ఞానము. అదే ఆత్మజ్ఞానము. బ్రహ్మజ్ఞానము. స్థితప్రజ్ఞుని నిశ్చలమైన జ్ఞానము.

**స్వతః పూర్ణః పరాత్మా బ్రహ్మ శబ్దేన వర్ణితః**

స్వయంగా పూర్ణ రూపమైన పరమాత్మ స్వరూపమే బ్రహ్మ శబ్దము చేత వర్ణింప బడింది అన్నది వేదాంతము. ఈ పూర్ణాత్మలో వెలుగే గాని వెలితి తెలియదు. ఇది పెరిగేది కాదు. తరిగేది కాదు. సాగర సదృశ మైనది.

**అచల ప్రతిష్ఠం**

నదులు సముద్రం లోకి ప్రవేశిస్తూ ఉంటాయి. ఇలా కొన్ని వేల సంవత్సరాలుగా నదీ జలాలు వాటంతట అవే తోసుకొంటూ వచ్చి సముద్రంలో పడుతున్నాయి. నదులను తనలో ప్రవేశించ మని సముద్రం కోరినట్లు ఎక్కడా దాఖలాలు లేవు.

నదీజలాలు అదే పనిగా వచ్చి పడుతున్నా, మేఘ జలాలు నిలిచి కురుస్తున్నా, అన్ని వైపుల నుండి జలాలు సముద్రాన్ని నింపుతున్నా **(ఆపూర్యమాణమ్ అబ్ధిః)**, జలాలన్నీ సాగరంలో లయిస్తున్నాయే గాని సాగరం యొక్క నీటి మట్టము పెరగడం లేదు. అలాగే తరగడమూ లేదు. సముద్రము సదా పూర్ణం గానే ఉంటుంది. తన పూర్ణత్వానికి మరొక దానిపై ఆధార పడటం లేదు. నదుల వలె ఒక చోట నుండి మరొక చోటికి చలించడం లేదు **(అచలమ్)**. అంతే కాదు, జలాలు ఎన్ని వచ్చి పడినా తన హద్దును దాటడం లేదు. స్థిరంగా ఉంది **(ప్రతిష్ఠమ్)**.

స్థితప్రజ్ఞుడు కూడా సాగర సదృశంగా శోభిస్తున్నాడు. తాను పూర్ణుడై ఉన్నాడు. తన పూర్ణత్వము మరొక దానిపై ఆధారపడి లేదు. జలాలు వచ్చి సాగరంలో పడుతున్నట్లు, సమస్త విషయాలు **(సర్వే కామాః)** అన్ని వైపుల నుండి వచ్చి ఆ పూర్ణ పురుషునిలో ప్రవేశిస్తూ ఉన్నాయి **(ప్రవిశన్తి)**. సాగరంలో ప్రవేశించిన జలాలు సాగర రూపాన్ని పొందినట్లు, బ్రహ్మజ్ఞానిలో ప్రవేశిస్తున్న విషయాలు ఆ దివ్య స్వరూపునిలో విలీనమై పోతున్నాయి.





పొంగుట తెలియని, కృంగుట అర్థం గాని పూర్ణ సాగర సదృశుడు స్థితప్రజ్ఞుడు.

నీళ్ళు సముద్రం లోనే కాదు, బావుల్లో, నదుల్లో, చెరువుల్లో కూడా ఉన్నాయి. బావినీరు వర్షపు జలం మీద, భూగర్భ జలాల మీద ఆధారపడి ఉంది. వర్షం పడకపోయినా, భూగర్భ జలాల మట్టం తగ్గినా, బావి ఎండిపోతుంది.

వర్షాల వల్ల, వాగులు, కాలువలు వచ్చి కలవడం వల్ల నదులు పొంగి ప్రవహిస్తాయి. వాగులు ప్రవహించడం ఆగిపోయినా, వర్షాలు పడకపోయినా నదులు ఇంకి పోవడం చూస్తూ ఉంటాము.

నదీజలాలు, వాగులు, వంకలు వచ్చి కలవడం చేత, వర్షపు నీరు వచ్చి పడటం చేత చెరువులు నిండుతాయి. గ్రీష్మంలో జలం ఆవిరై నీటి మట్టం తగ్గిపోతూ ఉంటుంది.

ఈ విధమైన పొంగుక్రుంగులు సముద్రంలో చూడలేము. సామాన్య జను లందరూ బావులు, చెరువులు, నదుల లాంటి బుద్ధులు కలిగి ఉంటారు. వారి బుద్ధులు స్థిరంగా ఉండవు. పొంగుతూ క్రుంగుతూ ఉంటాయి. వారి సుఖశాంతులు విషయాలపై ఆధారపడి ఉంటాయి. అలా ఆధారపడి జీవించే వాళ్ళే **కామ కామి** అంటున్నాడు గీతాచార్యుడు.

కామములు అంటే ఇక్కడ కోరబడేవి అని అర్థము. అంటే ఇంద్రియ విషయాలు అని అర్థం. వాటిని కోరేవాడు కామకామి. సాగర సదృశంగా ఎవరి వివేక ప్రజ్ఞ స్థిరంగా ఉంటుందో, అట్టి స్థితప్రజ్ఞుడు శాంతిని పొందుతాడు **(సః శాంతిం ఆప్నోతి)**. విషయాలను వాంఛించే వాడు శాంతిని పొందలేడు **(న కామ కామీ)**.

తనలో వచ్చిపడే జలరాశు లన్నీ తన కన్నా అన్యమైనవి కావని తెలుసు కనుక సాగరము పూర్ణంగా ఉంటుంది. తనను చేరే విషయాలన్నీ తన కన్నా అన్యమైనవి కావని స్థితప్రజ్ఞునికి తెలుసు కనుక అతడూ పూర్ణ రూపుడై శోభిస్తాడు. తాను కోరేవి తన కన్నా అన్యమైనవి అని భావించడం చేత కామి పూర్ణత్వం అర్థం కానివాడై ఉంటాడు.

**అవికార్య స్వరూపం**

సాగరాన్ని చేరే నదీ జలాలు నానా వర్ణ రసగంధ భేద విశేషాలతో నిండి ఉంటాయి. గంగాజలము తెల్లగా ఉంటుంది. కృష్ణాజలము నల్లగా ఉంటుంది. ఈ విధంగా సాగరంలో వచ్చి పడే జలరాశులు, శుక్ల నీల రక్త పీతాది వర్ణ విశేషాలతో కనిపిస్తూ ఉంటాయి. ఇవన్నీ వచ్చి సాగరాన్ని కలిసి తమ విశేషాలను పోగొట్టుకొని విలీనమై పోతాయి. సముద్రం మాత్రం ఈ విశేషాలు ఏవీ లేకుండా సహజం గానే శోభిస్తూ ఉంటుంది.

నదీ జలాలలో వర్ణ భేదమే కాకుండా రసభేదం కూడా ఉంటుంది. కొన్ని నదీ జలాలు తియ్యగా ఉంటాయి. మరి కొన్ని ఉప్పగాను, వగరు గాను ఉంటాయి. మధురామ్ల తిక్త కషాయాది రస విశేషాలతో ఉంటాయి. అంతేకాదు, పరిమళ దుర్గంధాది వాసనా విశేషాలు కూడా ఉంటాయి. కొన్ని జలాలు పలుచగా ఉంటే, మరి కొన్ని చిక్కగా ఉంటాయి. ఈ విధమైన లఘుత్వాది గుణ విశేషాలతో కూడా ఉంటాయి. సాగరంలో ప్రవేశించిన తరువాత ఇవన్నీ అదృశ్యమై పోతాయి. సాగరంలో మచ్చుకైనా కనిపించవు. తనలో వచ్చి పడుతున్న జలాల విశేషాలను తనలో ప్రదర్శించ కుండా సాగరం సహజంగా, గంభీరంగా శోభిస్తూ ఉంటుంది.

స్థితప్రజ్ఞుని బుద్ధి కూడా సాగరం లాగా నిశ్చలంగా, అవికార్యంగా భాసిస్తూ ఉంటుంది. అనేక భోగ్య విషయాలు పూర్ణ పురుషునిలో ప్రవేశిస్తూ ఉంటాయి. సూపా పూప రస అన్నాదులు స్వీకరింప బడుతూ ఉంటాయి. సూపా పూప రసాన్నాదులు అంటే, పప్పు, పిండివంటలు, రసము, అన్నము మొదలైనవి అని అర్థము. ఇవన్నీ ప్రారబ్ధ ఫలంగా, అప్రార్థితంగా జ్ఞానికి అందుతూ ఉంటాయి. నామ, రూప, రస, పరిమళ, పాక సంస్కారాది

విశేషాలతో అందుతూ ఉంటాయి. అయినా సాగర సదృశమైన ఆ దివ్యాత్ముని బుద్ధిలో ఏ విధమైన వికారము గోచరించదు. అది చలించ కుండా స్థిరంగా ఉంటుంది *(స్థితధీః అచల ప్రతిష్ఠమ్)*.

కామి (కోరేవాడు) భోగ్య విషయాలలో వికారం చెందుతూ ఉంటాడు. విషయాలలో రాగ రమ్యాది విశేషాలను చూస్తూ, అహంకార మమకారాలను రంగరించుకొని, నేను భోక్తను అనే అభినివేశంతో భేద దృష్టిని కలిగి, బద్ధుడై ఉంటాడు. అందుచేత అశాంతితో అలమటిస్తూ మనుగడను సాగిస్తూ ఉంటాడు.

జలరాశులు వచ్చి పడుతున్నా, తనలో ఏ విధమైన మార్పు లేకుండా, గంభీరంగా, ప్రశాంతంగా, పూర్ణంగా శోభిస్తూ ఉంటుంది సాగరము. అలాగే, భోగ్య విషయాలు ఎన్ని వచ్చి తన బుద్ధిలో ప్రవేశిస్తూ ఉండినా, ఏ మాత్రం చలనం లేకుండా, ఏ విధమైన వికారం చెందకుండా, పూర్ణ శోభతో, శాంతరూపుడై ప్రకాశిస్తూ ఉంటాడు స్థితప్రజ్ఞుడు. ఈ విధమైన పూర్ణశోభ భోగ్య విషయాలను కోరే కామికి లభించదు.

సముద్రం తన పూర్ణత్వానికి వచ్చిపడే జలాలపై ఆధారపడి లేదు. జ్ఞాని తన పూర్ణానందానికి విషయాలపై ఆధారపడి లేడు. తనలో ప్రవేశించే జలరాశిని సముద్రం నిరోధించడం లేదు. తనను చేరే విషయాలను స్థితప్రజ్ఞుడు నిరాకరించడం లేదు. ***అహం అకర్తా - అహం అభోక్తా*** అనే భావన తోనే ప్రపంచంలో చరిస్తూ ఉంటాడు. పుణ్య పాపాలకు అతీతుడు. శుభాశుభాలకు విలక్షణుడు. అసంగ రూపుడు. ఆనంద స్వరూపుడు.

స్థితప్రజ్ఞుని వైభవ మంతా అతని బుద్ధి లోనే ఉంది. అది ఆంతరంగిక సౌందర్యము. జ్ఞాని దేహం ఇలా ఉండాలి అనే నియమ మేమీ లేదు. అష్ట వక్రాలు ఉన్నా మహర్షి ప్రజ్ఞ స్థితమే గాని గతం కాదు. జ్ఞాని వైభవము దేహ సంబంధ మైంది కాదు. జ్ఞానం కలిగింది కదా అని అరవై వయస్సు గల దేహం ఇరవై లోకి జారి పోయేదీ ఉండదు. జ్ఞానము అనేది ఇంద్రియ సంబంధ మైనది కాదు. ఒక అంధుడికి జ్ఞానం కలిగితే, దాని ప్రభావం వల్ల దేహానికి ఉన్న అంధత్వం పోదు. బుద్ధి లోని అజ్ఞానం పోతుంది. అంతే. ప్రజ్ఞ మార్పు చెందదు. మార్పును వాంఛించదు. అందుకే ఆ ప్రజ్ఞ స్థితం. స్థితప్రజ్ఞ. స్థితప్రజ్ఞ కలవాడు స్థితప్రజ్ఞుడు. అతడే జీవన్ముక్తుడు.

*యస్య స్థితా భవేత్ప్రజ్ఞా యస్యానందో నిరంతరః*
*ప్రపంచో విస్మృత ప్రాయః స జీవన్ముక్త ఇష్యతే ॥*

ఎవరి ప్రజ్ఞ స్థిరంగా నిలిచి ఉంటుందో *(స్థితప్రజ్ఞః)*, ఎవరి ఆనందము నిరంతరం ప్రవాహ రూపంలో ఉంటుందో, ఎవరికి ప్రపంచం స్మృతిలో ఉండదో అతడే జీవన్ముక్తుడు అన్నారు 'వివేక చూడామణి' గ్రంథంలో శ్రీ శంకరాచార్యస్వామి.

ఈ అద్భుత అద్వైత జ్ఞాన ప్రసాదాన్ని సర్వులకూ వితరణ చేయా లనే గీతామాత ఐదు వేల సంవత్స రాలుగా ఈ ప్రపంచంలో నిలిచి ఉంది. సర్వులూ స్థితప్రజ్ఞులు కావాలి అనేదే భగవద్గీత ఏకైక ఆశయము. అందుకొనే వారు ధన్యులు *(తే ధన్యాః)*.

పల్లవి : కడలి అలల వోలె మనసాయే
అంబర మంతాయె నా హృదయం ॥ కడలి ॥

చరణములు : 1. కవుల ఊహలు పాపల నవ్వులు
హరివిల్లు రంగులు నను చేరే
కోకిల రవములు కుసుమ బాలలు
కదిలించే మదిని స్పృశియించే ॥ కడలి ॥





2. తలుపులు లేని నీ గుడిలో
నీ రాకను ఆపే వారెవరు?
తలపులు ఆగిన నా హృదిలో
తడబడతా వేమి రావేమి? ॥ కడలి ॥

అంటూ ఆత్మానంద సాగరంలో లేచిన ఒక చైతన్య తరంగం.

స్థితప్రజ్ఞ ప్రకరణాన్ని సమాప్తి చేస్తూ, సింహావలోకనంగా పునః సారభూతమైన విషయాన్ని తరువాత శ్లోకంలో అందిస్తున్నాడు.

**విహాయ కామాన్య స్సర్వా న్పుమాం శ్చరతి నిఃస్పృహః ।**
**నిర్మమో నిరహంకారః స శాన్తి మధిగచ్ఛతి ॥** 71

విహాయ-కామాన్-యః-సర్వాన్-పుమాన్-చరతి-నిఃస్పృహః
నిర్మమః-నిరహంకారః-సః-శాంతిం-అధిగచ్ఛతి

| | | | | | |
|---|---|---|---|---|---|
| యః | = | ఏ | నిర్మమః | = | మమకారము లేనివాడై |
| పుమాన్ | = | పురుషుడు | నిరహంకారః | = | అహంకారము లేనివాడై |
| సర్వాన్ | = | సమస్తములైన | చరతి | = | చరిస్తాడో |
| కామాన్ | = | కోరికలను | సః | = | అట్టివాడు |
| విహాయ | = | విడిచి | శాంతిం | = | శాంతిని |
| నిఃస్పృహః | = | స్పృహ లేనివాడై | అధిగచ్ఛతి | = | పొందుతాడు |

**సమస్తమైన కోరికలను విడిచి పెట్టిన వాడు. వాటి యందు స్పృహ లేకుండా ఉన్నవాడు. మమకారము లేనివాడు. అహంకారము తెలియని వాడు. అలా చరించే వాడే శాంతిని పొందుతాడు.**

**వ్యాఖ్య**

బుద్ధిలో వివేక ప్రజ్ఞ ఉండాలే గాని, మనల్ని ఆకర్షించే శక్తి ఈ ప్రపంచంలో దేనికీ ఉండదు. ఎవ్వరికీ ఉండదు. ఏముంది ఈ ప్రపంచంలో ఆకర్షణ? ఎక్కడుంది ఈ జగతిలో ఆనందము? ఆడంబరాల మధ్య ఊరేగినా, అష్టైశ్వర్యాలతో తులతూగినా, అందల మెక్కి సర్వాధికారం సాగించినా, సుందర మందిరాలలో ఆదమరచి నిద్రించినా, ఏదో ఒకనాడు, ఎక్కడో ఒక్కచోట మానవ దేహం కూలి పోయేదే. ఎవరి దేహమైనా నేల రాలి పోయేదే. కాలి బూదిగా మారి పోయేదే.

దేహము ఒక మట్టికుండ. ఏనాడైనా పగిలేదే. ఇక మనసా? అదొక దారపు ఉండ. ఎంత జాగ్రత్త పడినా చిక్కు పడుతూనే ఉంటుంది. చిక్కుల్లో పడుతూనే ఉంటుంది. చచ్చే దేహము - చంపే మనసు, ఈ రెండిటి తోనే బ్రతుకులు కాలి పోతున్నాయి. మనుగడ మసై పోతూ ఉంది. ఎన్ని జన్మలు ఇలా వృథా కావాలి? ఎంత కాలం ఈ బాధలు అనుభవించాలి? ఎలాగూ దగా పడ్డాం. ఇకనైనా నిఘా పెంచుకుందాం. అంతరించే అడ్డదారుల్ని వదలి, తరించే దొడ్డదారిని వెతుక్కుందాం.

దీన శుభము లేదు దివ్య కీర్తియు లేదు
జగతిఁ బుట్టి బుట్టి చచ్చి చచ్చి
పొరల నేల మనకు పుట్టని చావని
త్రోవ వెదకి కొనుట దొడ్డబుద్ధి ॥

అని చిన్న వయస్సు లోనే దొడ్డ విషయాన్ని బోధించాడు ప్రహ్లాదుడు. ఇదే నిజమైన త్రోవ. ఇదే జ్ఞాన మార్గము. ధన్యమైన మార్గము. ఈ త్రోవలో నడచే వారందరూ ధన్యులే.

*తే ధన్యాః భువి పరమార్థ నిశ్చితే హాః*
*శేషాఽ స్తు భ్రమనిలయే పరిభ్రమన్తః*

అట్టి జ్ఞానాన్ని పొందేందుకు యత్నించువారు ధన్యులు. మిగిలిన వారు మాయలో పరిభ్రమిస్తున్నారు. భ్రమలో చరిస్తున్నారు అన్నారు 'ధన్యాష్టకం'లో శ్రీ శంకరాచార్యస్వామి.

స్థితప్రజ్ఞుని లక్షణాన్ని యాభై ఐదవ శ్లోకంలో ***ప్రజహాతి యదా కామాన్ సర్వాన్*** - 'సమస్తమైన కోరికలను విడిచి పెట్టిన వాడు' అంటూ కామనా త్యాగంతో ప్రారంభించాడు శ్రీకృష్ణుడు. ఈ శ్లోకంలో ***విహాయ కామాన్ యః సర్వాన్*** - 'సమస్తములైన కోర్కెలను విడిచి పెట్టిన వాడు' అంటూ అదే వాక్యంతో స్థితప్రజ్ఞుని వైభవాన్ని సమాప్తి చేస్తున్నాడు. కామజయమే రామజయం. శ్రీరామ జయం. కామాన్ని జయించిన వాడే ఆత్మారాముడు అవుతున్నాడు. ఎవడు సమస్త కోరికలను త్యజించి చరిస్తూ ఉంటాడో, అట్టి పురుషుడే స్థితప్రజ్ఞుడు. అతడే శాంతిని పొందుతాడు. బంధాన్ని కలిగించే కోరికలను త్యజించిన వివేకవంతుడు కేవలం ప్రారబ్ధానుభవము కొరకే ప్రపంచంలో చరిస్తూ ఉంటాడు (***చరతి***). ఇక్కడ చరించడము అంటే, జీవితంపై ఆసక్తి ఉండి అని అర్థం కాదు. ప్రారబ్ధ వశాత్తు దేహం ఉంది కనుక, జీవనము కొరకే వ్యవహరిస్తూ చరించేవాడు అని అర్థము (***చరతి, జీవనమాత్ర చేష్టా శేషః పర్యటతి ఇత్యర్థః***).

కోరిక లన్నీ విడిచి పెట్టేశాడు, సరే. కనీసం, బ్రతకాలి అనే ఆశైనా లేకుండా ఉంటాడా? అది కూడా లేదు అనే సత్యాన్ని వివరిస్తూ ఉంది ***నిస్పృహః*** అనే పదం. శరీరం జీవించి ఉండాలి అనే స్పృహ కూడా లేనివాడు (***శరీర జీవన మాత్రేఽ పి నిర్గతా స్పృహా యస్య సః నిస్పృహః సన్***).

ప్రారబ్ధాధీనమై చరిస్తున్న దేహానికి ఏది ప్రాప్తించినా, దాని యందు కూడా **మమ** 'నాది' అనేది లేనివాడు. ఎందుకని? ***అహం*** 'నేను' అనేదే లేకుండా పోయింది కనుక. 'నేను' అనేది ఉంటేనే, 'నాది' అనేది ఉంటుంది. 'నేను' అనేది బ్రహ్మమే, పూర్ణబ్రహ్మమే అనే ప్రజ్ఞ గల ఆత్మవిదుడు, తన కన్నా అన్యంగా ఎవ రున్నారని వారి నుండి వేరు పడటానికి 'నేను' అనాలి? అంతా తానే అయి నపుడు అతనిది కానిది ఏముందని 'నాది' అని ప్రత్యేకంగా పలకాలి? ఇలా అహంకార మమకారముల నుండి విడిపడిన వాడు స్థితప్రజ్ఞుడు. అతడే శాంతిని పొందుతున్నాడు. అతడి స్థితియే మోక్షము. అదే నిర్వాణము.

ఈ ప్రపంచంలో ఏది పొందినా, ఎన్ని పొందినా శాంతి మాత్రము రాదు. ఒక్క జ్ఞానమే శాంతిని ప్రసాదిస్తుంది. ఆత్మజ్ఞానమే పూర్ణశాంతిని హృదయంలో నింపుతుంది.

సాగరాన్ని చేరే వరకు నది ప్రవహిస్తూనే ఉండాలి. పండయ్యే వరకు కాయ చెట్టును అంటి పెట్టుకొనే ఉండాలి. శాంతి లభించే వరకు మనం ఈ ప్రపంచంలో కర్మలు ఆచరిస్తూనే ఉండాలి.

కర్మల ఫలితంగా ఏది లభించినా, సుఖం వస్తుందేమో గాని శాంతి రాదు. సుఖాలకు రాకపోక లున్నాయి. సుఖం రావచ్చు. వచ్చిన సుఖం పోవచ్చు. కాని శాంతి మన స్వరూపం. అది లభ్యమైతే మళ్ళీ పోయేదంటూ ఉండదు.

సుఖ మున్న చోట దుఃఖం లేక పోవచ్చు. అలాగని, శాంతి ఉంటుంది అని చెప్పలేము. ఈ కారణం చేతనే, సుఖాలు ఉన్నవారు కూడా ఈ ప్రపంచంలో కర్మలు ఆచరిస్తూనే ఉన్నారు.

దుఃఖము ఉన్నచోట సుఖము ఉండదు, శాంతి ఉండదు. సుఖమున్న చోట దుఃఖం ఉండదు, శాంతి





కూడా ఉండదు. మరి శాంతి లేని వానికి సుఖ మెక్కడుంటుంది? ***అశాంతస్య కుతః సుఖమ్?*** శాంతి లేని వానికి సుఖ మెలా వస్తుంది? అని ప్రశ్నించాడు గీతాచార్యుడు ఈ అధ్యాయం లోనే.

శాంతి ఉంటేనే సుఖం ఉంటుంది. ఏది పొందినా శాంతి రాదు. జ్ఞానం వల్లనే శాంతి వస్తుంది. పరమాత్మ జ్ఞానం వల్లనే శాంతి ప్రాప్తిస్తుంది. అదే మోక్షం. స్థితప్రజ్ఞుడు పొందే అక్షయధనం ఇదే (***సః ఏవం స్థితప్రజ్ఞః బ్రహ్మవిత్, శాంతిం నిర్వాణాఖ్యామ్ అధిగచ్ఛతి ప్రాప్నోతి బ్రహ్మభూతో భవతి ఇత్యర్థః***).

*అధ్యాయమును పరిసమాప్తి గావిస్తూ ఫలశ్రుతిని అందిస్తున్నాడు గోవిందుడు.*

**ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి ।**
**స్థిత్వాస్యా మన్తకాలేఽపి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి ॥** 72

**ఏషా-బ్రాహ్మీ-స్థితిః-పార్థ-న-ఏనాం-ప్రాప్య-విముహ్యతి**
**స్థిత్వా-అస్యాం-అంతకాలే-అపి-బ్రహ్మనిర్వాణం-ఋుచ్ఛతి**

| | | | |
|---|---|---|---|
| పార్థ | = అర్జునా! | అంతకాలే అపి | = మరణ కాలంలో అయినా |
| ఏషా | = ఇది | అస్యాం | = బ్రహ్మస్థితి యందు |
| బ్రాహ్మీస్థితిః | = బ్రహ్మజ్ఞాని స్థితి | స్థిత్వా | = నిలిచి |
| ఏనాం | = దీనిని | బ్రహ్మనిర్వాణం | = బ్రహ్మప్రాప్తిని |
| ప్రాప్య | = పొంది | ఋుచ్ఛతి | = పొందుతున్నాడు. |
| న విముహ్యతి | = మోహము చెందదు | | |

**అర్జునా! ఇదే బ్రహ్మరూప స్థితి. దీనిని పొందినవాడు తిరిగి మోహమును పొందడు. మరణ సమయంలో కూడా ఈ బ్రాహ్మీస్థితిలో నిలిచి బ్రహ్మానందమును పొందుతాడు.**

**వ్యాఖ్య**

అద్వితీయమైన ద్వితీయ అధ్యాయాన్ని సమాప్తం చేస్తూ, ఆత్మజ్ఞాన వైభవమును స్తుతిస్తున్నాడు (***ఏషా జ్ఞాన నిష్ఠా స్తూయతే***). అర్జునా! ఇదే బ్రాహ్మీస్థితి. స్థితి అంటే నిష్ఠ. ఇదే బ్రహ్మనిష్ఠ (***ఏషా బ్రాహ్మీ స్థితిః***).

ఆత్మతత్త్వ విజ్ఞానమే సాంఖ్యం. ఈ అధ్యాయంలో ఆత్మజ్ఞానమే ప్రధానంగా చర్చింప బడింది. ఆత్మజ్ఞానాన్ని పొందడానికి అర్హతను సాధించడం కోసం కర్మయోగం చెప్ప బడింది. స్థితప్రజ్ఞుని గూర్చి అర్జునుడు ప్రశ్నించడం వల్ల జ్ఞాన మార్గంలో సాధ్య సాధనాలను కూడా బోధించడం జరిగింది. వేదాంత విజ్ఞాన మంతా ఈ సాంఖ్యం లోనే ఆవిష్కరింప బడింది. ఇదే బ్రాహ్మీస్థితి అంటూ ఈ అధ్యాయాన్ని ముగిస్తున్నాడు అనంతానంద స్వరూపుడైన గీతాచార్యుడు.

ఇదే బ్రాహ్మీస్థితి. దేశకాలాదులు తెలిసి రాని అనంతానుభూతి. అద్వయానుభూతి. వ్యక్తిత్వము అర్థం గాని అవ్యక్తానుభూతి. ఈ స్థితిలో మనం ఒక చోట ఉండే వాళ్ళము కాము. బ్రహ్మము ఎక్కడో లేనిది కాదు. ఎక్కడో ఉండేదీ కాదు. ఎక్కడైనా ఉండేదే. ఎక్కడ, ఎప్పుడు అనే భావాలకు చిక్కేది కాదు. అలాంటి ఆలోచనలకు తాను ఆధారమే అయినా, వాటికి తనలో అవకాశ మివ్వని అఖండస్థితి.

నీవు - నేను, అది - ఇది అనేవి తెలియని, అర్థం గాని అద్వైత స్థితి. ఏది ఎక్కడ ఉంది? అని ఊహించలేని స్థితి. అన్నీ అంతటా ఉన్నాయనే జ్ఞాన మొక్కటే అఖండంగా వెలిగే ఆనంద ప్రదీప స్థితి. ఇదే బ్రాహ్మీస్థితి. ఇది ప్రత్యేక అనుభవం కాదు. సమస్త అనుభవాలు సమరసమైన అఖండైక రసానుభూతి. నది సాగర రూపమై తానే

సాగర మనే అనుభూతిలో స్థిరపడి నట్లు, ఈ ఆత్మయే బ్రహ్మ అనే బ్రహ్మాత్మైక్య జ్ఞానము స్థితమైన, స్థిరమైన అవ్యయానంద స్థితి. *అహమేవ - అహమేవ*. 'నేనే - నేను నేనే' అనే ఆత్మజ్ఞాన తరంగ వలయాలు ఆత్మానంద సాగరంలో చలిస్తున్న అనిర్వచనీయ స్థితి.

*తదేవ నిష్కలం బ్రహ్మ నిర్వికల్పం నిరంజనం*
*చైతన్య మేకం బ్రహ్మతః ప్రజ్ఞానం బ్రహ్మ మయ్యపి ॥*

ఆ బ్రహ్మము విభాగములు లేనిది. వికల్పములు లేనిది. మలినము అంటనిది. చిద్రూప మైనది. అద్వయ మైనది. ఈ కారణం చేత (*అతః*), నా యందున్న ప్రజ్ఞానము కూడా (*మయ్యపి ప్రజ్ఞానం*) బ్రహ్మమే (*బ్రహ్మైవ*) అని అమృతబిందూపనిషత్తు గొంతు విప్పింది. త్రిపుర తాపిన్యుపనిషత్తు వంత పాడింది.

**తిరుగు లేని తిరిగి రాని స్థితి**

దివ్యమైన ఈ బ్రాహ్మీస్థితిని పొందిన వాడు (*ఏనాం ప్రాప్య*) ఏ విధమైన మోహానికి గురి కాడు (*న విముహ్యతి*). మేలుకున్న వ్యక్తిని స్వప్నం లోని విషయాలు చలింప చేయలేవు. బ్రహ్మనిష్ఠుడైన వానిని భ్రమలు ముట్టలేవు. పట్టలేవు. సూర్యోదయమైన తరువాత చీకట్లు ఎలా ఉంటాయి? కాయ పండుగా మారిన తరువాత పూలరేకులు ఎక్కడ మిగిలి ఉంటాయి? అన్నిటికీ తెరపడి పోయింది. అజ్ఞానం తెర మరుగైంది. నిత్య మోక్షంలో మోహ మనేది అనూహ్యం. మోహం కదిలితే ఇక మోక్ష మెక్కడిది? మోహం నశిస్తేనే మోక్షం. మోహం తిరిగి వస్తే మోక్షం నశించినట్లే కదా! నశించేది మోక్షం ఎలా అవుతుంది? కనుక మోహము తిరిగి రాదు. మోక్షము ఎక్కడికీ పోదు. ఉన్నది ఉన్నట్లు తెలియడమే జ్ఞానం. ప్రజ్ఞానం.

**మోక్షము కూడా క్షరమైతే**
**దానిని పొంది ఫలమేమి?**
**అక్షరమై అది స్థిరమైతే**
**పొందే యత్నం ఎందుకని?**
**పోయేది లేదు - వచ్చేది కాదు**
**ఉన్నది ఉన్నట్లు తెలియాలి**
**రామ రామ జయ రాజారామ్**
**రామ రామ జయ సీతారామ్**

ఇది రామజోగి చిట్కా.

**కాలం కాదు కొలమానం**

దివ్యమైన ఈ బ్రాహ్మీస్థితి కాలంలో కలిగేది కాదు, కాలంలో కరిగేదీ కాదు అని తెలుసుకున్నాం. కనుక ఎప్పుడూ ఉన్న బ్రహ్మమునకు సంబంధించిన జ్ఞానము ఎప్పుడైనా కలగవచ్చు. ఎప్పుడు ఎవరికి కలిగినా, ఆ కలిగిన వ్యక్తి వ్యక్తిగా మిగిలి ఉండడు. బ్రహ్మముగా వెలిగి పోతాడు. ఈ స్థితి మరణ సమయంలో నైనా కలగవచ్చు. కలగడము అంటే కడతేరి పోవడమే కనుక అది ఎప్పుడైనా సంభవించ వచ్చు. జ్ఞానము ఆ వయస్సులో అసంభవము, ఈ వయస్సులో అసంగతము అనేది లేనే లేదు.

జ్ఞానానికి కావలసింది మనస్సే గాని వయస్సు కాదు. సానుకూలమైన సమబుద్ధే గాని సమయం కాదు. చచ్చే వ్యక్తి కూడా పొందవచ్చు. కాకపోతే, జిజ్ఞాస చావ కుండా ఉండాలి. వివేక వైరాగ్యాదులు అంతరించ కుండా ఉండాలి. శ్రద్ధ మొద్దు బారి పోకూడదు. అంతే. కనుకనే, మరణ సమయంలో నైనా (*అన్తకాలేఽపి*) ఈ బ్రాహ్మీస్థితిలో (*అస్యాం*) స్థిరంగా నిలిచి (*స్థిత్వా*) బ్రహ్మరూపమైన మోక్షాన్ని పొందవచ్చు (*బ్రహ్మ నిర్వాణమ్*





*ఋచ్ఛతి*). చివరి సమయంలో కూడా శ్రద్ధ గలవాడు గురువు నుండి జ్ఞానాన్ని పొందుతాడు. మోక్షాన్ని పొందుతాడు.

**అత్యాశ కాదు - అనంతాశ**

నా వయస్సు మళ్ళింది. మనస్సు మరిగి పోయింది. దేహం సడలి పోయింది. ఏదీ చెయ్యలేని పరిస్థితి దాపురించింది. ఇక నేను ఏమి సాధిస్తాను? అని వృద్ధులు చింతిస్తూ ఉంటారు. మరణ సమయంలో ఉండే వారికి కూడా మోక్షం ప్రాప్తించే అవకాశం ఉందని సాక్షాత్తు భగవంతుడే చెబుతూ ఉంటే, నేను ముసలివాణ్ణి, మునిగి పోతానేమో అని దుఃఖించడం జ్ఞానం అనిపించుకోదు.

వయస్సు మళ్ళిన వారి మనస్సులు పలికే ఈ అప్రస్తుత ప్రసంగాలు యువతకు చెడు సంకేతాన్ని చేర వేస్తాయి. ఇంతకాలం జీవించిన వ్యక్తే తరించడం సాధ్యం కాదని ఇలా తపించి పోతున్నాడు; ఇక మనకిది సాధ్యమేనా? అని నిరాశలో యువత కూరుకు పోయే ప్రమాదం ఉంది.

ఎక్కువ కాలం జీవించిన వారికి అనుభవాలు కూడా ఎక్కువ గానే ఉంటాయి. తమ అనుభవాల ద్వారా అనుభవం లేని వారిలో ఆసక్తిని, ఉత్సాహాన్ని, ఆనందాన్ని నింపే కర్తవ్యం పెద్దలదై ఉండాలి. నిరాశల్ని, నిస్పృహల్ని పెనవేసుకొని, తాము కలత పడటమే గాక, యువతను కలవర పెట్టడం పెరిగిన వయస్సుకే కళంకము.

మనిషి ఆశావహ దృక్పథంతో జీవించాలి. మనిషిలో ఉత్సాహం ఉండాలి. ఉద్యమ స్ఫూర్తి ఉండాలి. అదే యోగ లక్షణం. నిరాశలు, నిస్పృహలు రోగ లక్షణాలు.

వయస్సు మళ్ళినంత మాత్రాన జ్ఞానం మరలి పోయిందని, వెనుదిరిగి పోయిందని ఎవరు చెప్పారు? వయస్సు పోయినా వినికిడి ఉంటే చాలు. ఆరోగ్యం పోయినా, ఆసక్తి ఉంటే జ్ఞానాన్ని రాకుండా ఎవ్వరూ ఆపలేరు.

**ఆఖ్యాయిక**

ఖట్వాంగుడు చక్రవర్తి. రాజ్యాన్ని పాలిస్తూ ఉన్నాడు. దేవ దానవ సంగ్రామంలో మహా శక్తివంతుడైన ఖట్వాంగుడు దేవతల వైపు నిలబడి రాక్షసులతో పోరాడాడు. విజయాన్ని సాధించిన దేవతలు ఖట్వాంగుని ప్రశంసించారు. ఏదైనా వరాన్ని కోరుకొమ్మని ఆజ్ఞాపించారు.

ఖట్వాంగుడు ఆలోచించి, తన మరణ కాలము ఎప్పుడో తెలియచేయ వలసిందిగా దేవతల్ని ప్రార్థించాడు. దేవతలు దివ్యదృష్టితో చూచి, ఇక కేవలం ముహూర్త కాలమే ఉంది అని నిప్పు లాంటి నిజాన్ని వినిపించారు. అంటే, కేవలం నలభై ఐదు నిముషాలు మాత్రమే ఖట్వాంగునికి జీవించే అవకాశం ఉంది. ఖట్వాంగుడు సమస్తాన్ని త్యజించాడు. మనస్సు బ్రహ్మము నందు నిలిపి, ఆ ముహూర్త కాలంలో తరించి పోయాడు.

**ఖట్వాంగో నామ రాజర్షిః ముహూర్తే ముక్తి మేయివాన్**
**విజ్ఞాయ చరమావస్థాం దేవతాభ్యో నృపోత్తమః ॥**

తాను కేవలం ముహూర్త కాలము మాత్రమే జీవించే అవకాశం ఉందని దేవతల ద్వారా, జ్ఞానుల ద్వారా తెలుసు కొనిన రాజర్షి ఖట్వాంగుడు ప్రయత్నించి ముక్తిని సాధించాడు. నలభై ఐదు నిముషాల కాలంలో మృత్యు ముఖంలో ప్రవేశించ బోయే ఖట్వాంగుడు తరించి నపుడు, మేము ముసలివాళ్ళ మయ్యాం, తరిస్తామో లేదో! అని వృద్ధులు చింతించడం హాస్యాస్పదం కాదా?

ఏది కనిపిస్తే దాని వెంట పరుగు లెత్తకుండా, ఏది వినిపిస్తే దాని కొరకు వెంపర్లాడ కుండా, ఆశా పిశాచాన్ని మనస్సు నుండి దూరం చేసుకొని, ధన జన మమకార వ్యామోహాల నుండి బయటపడి, దృఢమైన

మనస్సుతో, ఆచార్యదేవుని అడుగుజాడలలో అకుంఠిత విశ్వాసంతో చరించే వారు జ్ఞానాన్ని పొంది తరించడానికి వయస్సు అవరోధం కాదు. అనారోగ్యం ప్రతిబంధకమూ కాదు. వివేక విచారాలకు నోచుకోని మనస్సు, సందేహాలకు నిలయమైన బుద్ధి, విశ్వాసం లేని చిత్తము, శ్రేష్ఠులను అర్థం చేసుకోలేని అహంకారము - ఇవే జ్ఞానానికి అడ్డుగోడలు. అవరోధాలు.

వేదము ఒక మహారణ్యము. అందులో ఏది ఎక్కడుందో నిరంతరము అందులో నిమగ్నమై ఉన్న వారికే అర్థం కాదు. అలాంటి వేద విజ్ఞానాన్ని కాచి, వడబోసి, సారాన్ని తీసి గీతామృతంగా భగవంతుడు మానవాళికి ప్రసాదించాడు. మరణకాలంలో అయినా జ్ఞానాన్ని పొందే అవకాశం ఉందని, ప్రతి మానవ హృదయంలో కొండంత విశ్వాసాన్ని నింపి సాంఖ్యాన్ని ముగిస్తున్నాడు గీతాచార్యుడు.

మరణానికి ఎవ్వరూ భీతి చెందాల్సిన అవసరం లేదు. గీతామృతం మన వద్ద ఉంది. ఇక మరణ మెక్కడుంది? భగవంతుడు అందరినీ కనికరిస్తాడు. జ్ఞానము అందరినీ ఆశీర్వదిస్తుంది.

**వికారి నైనా బికారి నైనా**
**ఈసడించదు దర్పణము**
**పేదనైనా పామరునైనా**
**పారద్రోలదు దైవము**
**జ్ఞానమె మనిషికి శరణము**
**తెలియని నాడే మరణము**
**రామ రామ జయ రాజారామ్**
**రామ రామ జయ సీతారామ్**

ముముక్షువులకు మోక్ష మార్గంలో దారి బత్తెంగా ఇదొక రామజోగి చిట్కా.

జ్ఞానమే ప్రధానం కనుక మరణశయ్యపై ఉన్న వారు కూడా తరిస్తారు. వృద్ధులైనా తరిస్తారు. రోగులైనా తరిస్తారు. జ్ఞానము బుద్ధికి అందేదే కనుక, ఏ జాతి వారైనా తరిస్తారు. ఏ మతం వారైనా తరిస్తారు. లింగభేదం లేదు. వర్ణభేదం లేదు. శ్రద్ధ ఒక్కటి ఉంటే చాలు. అంతా అభేదమే. అద్వైత జ్ఞానమే.

ఈ సందర్భంలో రెండవ అధ్యాయానికి భాష్యాన్ని సమాప్తం చేస్తూ, చివరి వాక్యాన్ని అద్భుతంగా పలికి ఆశీర్వదిస్తారు పూజ్యపాదులు శ్రీ శంకరాచార్యస్వామి.

**కిము వక్తవ్యం బ్రహ్మచర్యాదేవ సంన్యస్య యావజ్జీవం యో బ్రహ్మణి ఏవ అవతిష్ఠతే స బ్రహ్మనిర్వాణం ఋచ్ఛతీతి?**

మరణ సమయంలో ఉన్నవాడే తరించే టప్పుడు బ్రహ్మచర్యాశ్రమము నుండే సన్యాసమును స్వీకరించి, జీవిత మంతా బ్రహ్మ విచారము నందే ఉన్నవాడు మోక్షాన్ని తప్పక పొందుతాడు అని ప్రత్యేకంగా చెప్పాలా? అని చివరి మాట పలికారు. మహాత్ముల మాటే శ్రీరామరక్ష.

***జై జై శ్రీ శంకర గురుదేవ!***

**ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే సాంఖ్యయోగో నామ ద్వితీయోఽధ్యాయః**

**ఈ విధంగా ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య, యోగశాస్త్రము, శ్రీకృష్ణార్జున సంవాదము అయిన భగవద్గీత యందు సాంఖ్యయోగము అనే రెండవ అధ్యాయము.**



# చైతన్య భగవద్గీత

## అథ తృతీయోఽధ్యాయః - మూడవ అధ్యాయము

## కర్మయోగః - కర్మయోగము

కొండ అద్దమందు కొంచెమై ఉండదా? అట్లాగే, వేదాంత సారమంతా, ముఖ్యంగా భగవద్గీత కేంద్ర విషయ మంతా రెండవ అధ్యాయం - సాంఖ్యయోగంలో అద్భుతంగా ప్రవచింప బడింది. గీతాచార్యుడు ప్రబోధించిన ఆత్మ తత్త్వం అర్జునుడికి ఎంతో తృప్తి నిచ్చింది. ఊరట నిచ్చింది. ఆనందాన్ని పంచింది. కాని కర్మ విషయమే కాస్త ఇబ్బంది పెడుతోంది.

ఏది శ్రేయస్సో దానిని నిశ్చయించి చెప్పమని అర్థించాడు అర్జునుడు. తనకు కావలసింది మోక్షమే అనే విషయం కూడా సుస్పష్టం అయింది. మోక్షము అనేది ఉన్నదే కనుక, దానికి సంబంధించిన జ్ఞానం కలగాలి. అంతే. అదే ఆత్మజ్ఞానం. అదే సాంఖ్యం (***శుద్ధాత్మ తత్త్వ విజ్ఞానం సాంఖ్య మిత్యభిధీయతే***).

ఆత్మ సత్యము. ఆత్మ జ్ఞానము. ఆత్మ అనంతము. అట్టి ఆత్మకు సంబంధించిన జ్ఞానమే ఆత్మ జ్ఞానము. ఆత్మ జ్ఞానము కలిగిన వాడు తానే ఆత్మ అని తెలుసు కుంటాడు. ఆత్మయే బ్రహ్మము అని గ్రహిస్తాడు. ఇదే మోక్షము. కనుక జ్ఞానము వల్లనే మోక్షము సిద్ధిస్తుంది అనేది వేదాంత తాత్పర్యము. భగవద్గీత కూడా ఈ విషయాన్నే ధ్రువ పరచింది (***తస్మాత్ కేవలాదేవ జ్ఞానాత్ మోక్షః ఇతి ఏషః అర్థః నిశ్చితో గీతాసు సర్వోపనిషత్సు చ***).

ఆత్మతత్త్వాన్ని రెండవ అధ్యాయం పదకొండవ శ్లోకం నుండి ముప్పైయవ శ్లోకం వరకు అద్భుతంగా ప్రవచించాడు గీతాచార్యుడు. అర్జునుని ప్రశ్నను ఆధారం చేసుకొని ఆత్మవిదుని వైభవాన్ని కూడా స్థితప్రజ్ఞ లక్షణాలలో వివరించాడు. ఇదంతా అర్జునుడికి చాలా ఓదార్పును, సంతృప్తిని కలిగించింది.

తనకు కావలసింది మోక్షం. మోక్షం జ్ఞానరూపంలో ఉంది. జ్ఞానం కలగాలి అంటే శ్రవణం చేయాలి. ***సన్న్యస్య శ్రవణం కుర్యాత్.*** సన్యసించి శ్రవణం చేయాలి అనే విషయం కూడా ప్రసిద్ధమే. మరి, సన్యాసాన్ని ప్రోత్సహించకుండా, అర్జునా! నువ్వు యుద్ధం చెయ్యి అని, జ్ఞాన బోధానంతరం కూడా శ్రీకృష్ణుడు చెప్పడం అర్జునుడికి మింగుడు పడని విషయంగా తయారైంది.

***మాతే సంగోఽస్త్వ కర్మణి*** - అర్జునా! కర్మను మానేయాలి అనుకోకు ( 2 - 47 ).

***యోగస్థః కురు కర్మాణి*** - యోగస్థుడవై కర్మలను ఆచరించు ( 2 - 48 ).

***ఉత్తిష్ఠ కౌన్తేయ యుద్ధాయ కృతనిశ్చయః*** - అర్జునా! లే! యుద్ధానికి సిద్ధపడు ( 2 - 37 ).

***యోగాయ యుజ్యస్వ*** - కర్మయోగానికి ప్రయత్నం చెయ్యి ( 2 - 50 ).

### సవ్యసాచి సందేహం

ఇంతకీ గీతాచార్యుడు ప్రబోధించేది జ్ఞానమా? లేక కర్మాచరణమా? జ్ఞాన మార్గంలో చరిస్తే మోక్షం సిద్ధిస్తుంది. కర్మ చేస్తే కర్మఫలం వస్తుంది. అంతేగాని మోక్షం రాదు. మోక్ష మనేది కర్మఫలం కాదు. ఇకపోతే, శ్రీకృష్ణుడు బోధించిన కర్మయోగము కూడా అంతఃకరణ శుద్ధిని కలిగిస్తుందే గాని మోక్షాన్ని ప్రసాదించ లేదు. అలాంటప్పుడు, రాజమార్గం లాగా జ్ఞానమార్గం ఉండగా, మోక్షాన్ని ప్రసాదించ లేని కర్మాచరణ వైపు తనను